# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సంపుటి : 9 సంచిక : 10 హైదరాబాద్ 123 అక్టోబర్ 2011 పేజీలు : 68 రు. 15


* ఫోకస్ : అవినీతి వ్యతిరేక ఉద్యమాలు
* ఆంధ్రప్రదేశ్‌కు ప్రపంచ బ్యాంక్ అప్పు
* మారుతి సుజుకి కార్మికుల పోరాటం
* ఉరిశిక్షలు రద్దు కావాలి!
* మల్కన్‌గిరిలో ఏం జరుగుతోంది?
* ఎరువుల కోసం ఎవుసం పాట్లు
* ఛిద్రమవుతున్న ఆహార భద్రత

123

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

సమతా పబ్లికేషన్స్, సెంటర్ ఫర్ డాక్యుమెంటేషన్, రిసర్చ్ అండ్ కమ్యూనికేషన్ ప్రచురణ

అక్టోబర్ 2011
సంపుటి : 9
సంచిక : 10

వ్యవస్థాపక సంపాదకులు : **వి. హనుమంతరావు**
సంపాదకులు : **ఎన్. వేణుగోపాల్**
సహాయ సంపాదకులు : **డి.వి.రామకృష్ణారావు**
కరస్పాండెంట్ / సర్క్యులేషన్ మేనేజర్ : **వై. రామచంద్రం**
ఆఫీస్ అసిస్టెంట్ : **ఎస్. వెంకటేష్**

## లోపలి పేజీల్లో...

**ఫోకస్ : అవినీతి వ్యతిరేక ఉద్యమాలు**


- ❖ హజారే ఉద్యమం - ప్రత్యామ్నాయం - ఎస్. శేషయ్య 28
- ❖ అవినీతి నియంత్రణ పౌర సమాజానికి సాధ్యమా? - వాసిరెడ్డి భాస్కరరావు 30
- ❖ అవినీతి సమస్య - మార్క్సిస్ట్ అవగాహన - లోకే రాజ్‌పవన్ 35

- ❖ పాఠకుల వీక్షణం 4
- ❖ సంపాదకీయం ❖ ప్రజల సమస్యలు పట్టని బధిరాంధ పాలకులు 5
- ❖ సంపాదకీయ వ్యాఖ్యలు ❖ నరహంతకుడే భావి భారత ప్రధాని! ❖ అధికారికంగా సామ్రాజ్యవాద సంక్షోభ వార్తలు 6
- ❖ కొత్త పుస్తకాలు / సి.డి.లు 7
- ❖ ఈ నెల 8
- ❖ ప్రాంతీయం ఆంధ్రప్రదేశ్ - ప్రపంచబ్యాంక్ అప్పు - ప్రొ. జి. హరగోపాల్ 9
- ❖ దేశీయం మారుతి సుజుకి కార్మికుల పోరాటం - పి.వి. రమణ 12
- ❖ దేశీయం ఉరిశిక్షలు రద్దు కావాలి - డి.వి. రామకృష్ణారావు 16
- ❖ దేశీయం మల్కన్‌గిరిలో ఏం జరుగుతోంది? - శ్రీరాముల శ్రీనివాస్ 19
- ❖ విధానవిమర్శ దేశ ఆర్థిక పరిస్థితిపై కారుమబ్బులు - వి. హనుమంతరావు 22
- ❖ విధానవిమర్శ ఎరువుల కోసం ఎవుసం పాట్లు - ఎన్. భగవాన్ రెడ్డి 24
- ❖ విధానవిమర్శ ఛిద్రమవుతున్న ఆహార భద్రత! - విద్యాభూషణ్ 26
- ❖ అవగాహన వ్యవసాయ సంబంధాల సిద్ధాంతం దిశగా.. - 3 - ఆర్.ఎస్. రావు 39
- ❖ చర్చ భారతదేశంలో భూస్వామ్య విధానం ఉందా? - రమేష్ పట్నాయక్ 44
- ❖ ప్రకృతి పర్యావరణ విధ్వంసం మానవ మనుగడకు చేటు - ఎ. నరసింహారెడ్డి 47
- ❖ చరిత్ర ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన - 8 - ఎస్. సరళా వందనం 51
- ❖ సంస్మరణ నండూరి రామమోహనరావు 53
- ❖ చర్చ సామ్రాజ్యవాద పెట్టుబడి - ఐక్య ప్రజాపోరాట వేదిక - బి.ఎస్. రాజు 55
- ❖ చర్చ మంచి తీర్పు - చెడు ఫలితాలు - చెరుకూరి సత్యనారాయణ 58
- ❖ శాస్త్రవిజ్ఞానం అణు బాంబుల ప్రయోగాలు - డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్ 60
- ❖ వర్తమానం ఆలోచనల గూటికి పుల్లా పుడకా 62
- ❖ ఇరుగు పొరుగు 64
- ❖ భూగోళం 65
- ❖ అసహజ మరణాల సూచి - రాంకి, వై. రామచంద్రం 66




ప్రింటర్స్
**డక్కన్ ప్రెస్ / చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్
ఫోన్ : 040 - 27678411

డిస్ట్రిబ్యూటర్స్
**ఆనంద్ ఏజెన్సీస్**
హైదరాబాద్
ఫోన్ : 98484 28516
92468 26191

‘వీక్షణం’ పేరిట ఎం.ఓ.లు, చెక్కులు, డి.డి లు పంపాల్సిన చిరునామా

**వీక్షణం**
మైత్రీ రెసిడెన్సీ, 3-6-394,
స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029.
ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | – |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | – |

వీక్షణం అకౌంట్ నెంబర్ – **013911011002175**
ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్

## పరిశోధక విద్యార్థులకూ, రచయితలకూ, అధ్యాపకులకూ శుభవార్త

గత నెల నుంచి వీక్షణంకు ఇంటర్నేషనల్ స్టాండర్డ్ సీరియల్ నంబర్ (ఐ.ఎస్.ఎస్.ఎన్.) వచ్చింది. ISSN 2231-6892 అనే ఈ నంబర్‌ను పరిశోధక విద్యార్థులూ, రచయితలూ, అధ్యాపకులూ వీక్షణంలో అచ్చయిన తమ రచనలతో ఉదహరించడం వారి విద్యాపరమైన అవకాశాలను ఇనుమడిస్తుంది. ఈ నంబర్ ప్రపంచవ్యాప్తంగా ప్రతిష్టాత్మకమైన పరిశోధక పత్రికలకు ఇచ్చేదిగా ఎక్కడైనా గుర్తింపు పొందుతుంది. ప్రత్యేకించి 2009లో చట్టంగా రూపొందిన యు.జి.సి. రెగ్యులేషన్స్ ఆన్ మినిమమ్ క్వాలిఫికేషన్స్ ఫర్ అపాయింట్మెంట్ ఆఫ్ టీచర్స్ అండ్ అదర్ అకడమిక్ స్టాఫ్ ఇన్ యూనివర్సిటీస్ అండ్ కాలేజస్ అండ్ మెజర్స్ ఫర్ ద మెయింటెనెన్స్ ఆఫ్ స్టాండర్డ్స్ ఇన్ హయ్యర్ ఎడ్యుకేషన్ ప్రకారం ఐ.ఎస్.ఎస్.ఎన్. ఉన్న పత్రికలలో వ్యాసం అచ్చయితే అభ్యర్థికి ఉన్నత విద్యలో కానీ, పదవులలో కానీ, పదోన్నతులలో కానీ వేరు వేరు స్థాయిలలో పది మార్కుల నుంచి ఇరవై ఐదు మార్కుల వరకు వస్తాయి. ఈ సౌకర్యాన్ని పరిశోధకులూ, అధ్యపకులూ విరివిగా ఉపయోగించుకోవలసిందిగా కోరుతున్నాం. – సం.

వెనుకబడిన ప్రాంతాలకు సైతం సమాజాన్ని గురించి పూర్వం సమాచారంతో, గ్రామీణ ప్రాంత ప్రజలకు సామాన్య ప్రజలకు కూడా అర్థమయ్యే సరళిలో వ్యాసాలను ప్రచురిస్తూ, వారిని రాజకీయంగా, సామాజికంగా చైతన్యపరుస్తన్న వీక్షణంకు నా అభినందనలు. సెప్టెంబర్ 2011 వీక్షణం సంచికలో బి. మల్లయ్య రాసిన 'కాపీ ఆధారిత పరీక్షలు – ప్రభావం' అనే వ్యాసం చాలా ఆలోచనాత్మకంగా ఉంది. ప్రస్తుత విద్యా వ్యవస్థలో ఉన్న పరిస్థితులను కళ్లకు కట్టినట్లుగా చూపించింది. అర్హత, అనుభవం కలిగి, నిష్ణాతులైని బోధనా సిబ్బంది కలిగి ఉన్న ప్రభుత్వ పాఠశాలల కంటే నామ మాత్రపు అనుభవం, పరిజ్ఞానం కలిగిన బోధనా సిబ్బంది ఉన్న ప్రైవేట్ పాఠశాలలు రాష్ట్రస్థాయి ర్యాంకులు కైవసం చేసుకుంటున్నాయని రచయిత తెలియజేశారు. దీనికి కారణం కేవలం ప్రభుత్వ అధికారులు ప్రైవేట్ పాఠశాలల యాజమానాలతో కుమ్మక్కై విద్యార్థులతో కాపీలు రాయించి, వారి నైతిక విలువలు దెబ్బతినేలాగ చేస్తున్నారని, తల్లిదండ్రులను, పాఠశాలల యజమాన్యాలను ఆలోచింపజేసేలాగా వ్యాసాన్ని రాశారు. ఆనాడు ఉపాధ్యాయులు, విద్యార్థులు ఎంత అన్యోన్యంగా ఉండేవారో గాంధీని ఉదాహరణగా తెలియజేస్తూ, ప్రస్తుత పరిస్థితుల్లో ఉన్న గురు – శిష్యుల బంధాలు అంతకు పూర్తిగా వ్యతిరేకంగా ఉన్నాయనీ, ఈ పద్ధతులపై మార్పు తేవాల్సిన అవసరం ఎంతైనా ఉందనీ, ఒక ఉపాధ్యాయుడిగా తన ఆవేదనను తెలియజేసిన బి. మల్లయ్యకి హృదయపూర్వక నమస్కారాలు.

***– పులుగుజ్జు గురువర్మ***
చిన్న ఓబినేపెల్లి, ప్రకాశం

ప్రపంచీకరణపై వెలువడిన నాలుగు వ్యాసాలు ఆలోచింప దగినవే. గత ఇరవై సంవత్సరాల ప్రపంచీకరణ నేపథ్యం, అనుభవాలు సామాజిక, ఆర్థిక స్థితిగతులు అందరు తప్పనిసరిగా అధ్యయనం చేయాలి. సామ్రాజ్యవాదం మరో ముఖం ప్రపంచీకరణ. వర్గ దృష్టితో దీనిని పరిశీలించాలి, విశ్లేషించాలి. అంతే కాని, తప్పదన్న సాకుతో కొన్ని అనుకూల అంశాలున్నాయని, ప్రతికూలమైనదప్పటికీ గతిలేక ఆమోదించాలని, దేశాన్ని ప్రగతి పథంలో నడపాలంటే ప్రపంచీకరణ అవసరమని వస్తున్న వాదనలు సామ్రాజ్యవాద అనుకూలమైనవే. కొద్దిమంది బడా కోటీశ్వరుల అభివృద్ధిని దేశ ప్రజల అభివృద్ధిగా పరిగణించరాదు. 1991 నూతన ఆర్థిక విధానం పేరుతో వచ్చిన సామాజిక వాద ప్రపంచీకరణ అమెరికా నుండి దిగుమతయ్యింది. 'ప్రపంచీకరణ ఇవాల్టి స్థితి' వ్యాసం అనేక అంశాలను మన ముందుంచింది. దేశ వనరులను సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థలు దోచుకుపోతున్నాయి. అభివృద్ధి పేరుతో విధ్వంసకర విధానాలు అమలవుతున్నాయి. అడవి, భూమి, నీరు బహుళజాతి సంస్థల గుత్తసొత్తుగా మారుతున్నది. స్థానిక పాలక వర్గాలను, సామ్రాజ్యవాద శక్తులను ఓడించడానికి విశాల ప్రజారాశుల ఐక్య పోరాటమే మార్గం. లేకపోతే శ్రామికవర్గ మనుగడకు ముప్పు.

***– తుంపాల శ్రీరామమూర్తి***
గాజువాక, విశాఖపట్నం

'సామ్రాజ్యవాద ప్రపంచీకరణ – కొన్ని వ్యక్తీకరణలు' ఈ వ్యాసం మొట్టమొదటి వాక్యంలోనే అర్థమవుతున్నది ఈ వ్యాసం ప్రత్యేకత ఏమిటో? ఈ వ్యాసం చాలా బాగుంది అనవచ్చు గాని ఇది చాలదని నా అభిప్రాయం. ఎందుకనగా మొత్తం నేటి భారతదేశ సమాజాన్ని అర్థం చేసుకోవడానికి గాని, ఈ దేశం ఎటువైపు కొట్టుకుపోతోందో తెలుసుకోవడానికి గాని, ఇదే విధంగా కొనసాగితే అడ్డూ అదుపూ లేకుండా ఏ స్థాయికి చేరుకుంటుందో తెలుసుకోవడానికి గాని, ఈ దేశ పాలకవర్గాలు సామ్రాజ్యవాద ఉచ్చులో ఇరుక్కొని దేశాన్ని ఏ విధంగా పరాధీనం చేస్తారో, విప్లవ శక్తులు, ప్రజాస్వామిక వాదులు అడ్డుకోలేకపోతే దేశం అంధకారంబందరంలో చిక్కుకొని ప్రజలు ఎంతటి మూల్యం చెల్లించాల్సి వస్తుందో తెలుసుకోవడానికి వివరంగా రాశారు ఈ రచయిత. నేటికి ఈ దేశ స్వరూపాన్ని తెలుసుకోవడమే కాకుండా భవిష్యత్తులో కూడా ఊహించకోగలిగేటట్లుగా రాశారు. చదువరులకు ఎంతో అవగాహన కలిగిస్తుందని భావిస్తున్నాను. కాని రాజకీయ అవగాహన కల్గి మార్క్సిజాన్ని గురించి ప్రాథమిక పరిజ్ఞానం కలిగిన వారే సులభంగా అర్థం చేసుకోగలరేమోగాని. సాధారణ ప్రజలు అర్థం చేసుకోలేరేమోనని నా సంశయం. వారికి చదివి వినిపించి కొంత వివరణ ఇస్తే బాగానే అర్థం చేసుకోగలరని. ఆ పని నిర్వహించడం కూడా ఎంతో అవసరమని, విద్యావంతుల కన్న సామాన్య ప్రజలే బాగా తెలుసుకోవాల్సిన సమయం ఆసన్నమైందని భావిస్తున్నాను. ఇంత బాగా రాసిన వరవరరావుకి అభినందనలు. దీన్ని బట్టి రాబోయే రోజులలో మావోయిస్టు పార్టీ మీద దేశ భవిష్యత్తు ఎంతో ఆధారపడి ఉందని సులభంగా అర్థం చేసుకోవచ్చు. 'కాపీ ఆధారిత పరీక్షలు – ప్రభావం' రాజకీయ అభిప్రాయలేమైనా గావచ్చు, వారి వారి సిద్ధాంతాలు ఏమైనా గావచ్చు ప్రతి ఒక్కరూ ఈ వ్యాసాన్ని చదివి అర్థం చేసుకోంటే వారి పిల్లలు బాగుపడతారు. ఆ తరువాత సమాజం గూడా కుళ్లిపోకుండా కాపాడుకోవచ్చు. 'ఆలోచనల గూటికి పుల్లా పుడకా' – ఈ శీర్షికను కొత్తగా పెట్టినందుకు ఎంతో సంతోషంగా ఉంది. దీన్ని కొనసాగిస్తారని ఆశిస్తున్నాను. సమాజాన్ని యాథార్థంగా తెలుసుకోవడం వలన ప్రజలు ఎంతో విజ్ఞానవంతులవులు అవుతారు. ఆ మేరకు అప్పుడా వార్తలకు, ప్రచారానికి దూరం కాగలరు. ఆ మేరకు ఇది ఎంతగానో ఉపయోగపడతుంది. అన్ని వ్యాసాల మీద రాయాలని ఆసక్తి ఉంది గాని రాసే ఓపిక లేక ఇంత వరకూ పరిమితమవుతున్నాను. అన్ని వ్యాసాలు కూడా ప్రజల్ని చైతన్యవంతుల్ని చేసేవిగా ఉన్నాయి. ఇదే పరపతితో పత్రిక కొనసాగుతుందని ఆశిస్తున్నాను.

***– కడియాల సుబ్బనాచారి***
దుత్తలూరు, నెల్లూరు

శ్రీలంక వ్యవహారంపై 'వీక్షణం' సంపాదకీయాన్ని (జూలై 2011), దానిపై కృష్ణమూర్తి విమర్శను (ఆగస్ట్ 2011) మరోసారి చదివాను. దినపత్రికలో వలే కాక, సమస్యపై లోతైన అవగాహనకు ఈ చర్చ తోడ్పడింది. అరపేజీ సంపాదకీయంపై రెండున్నర పేజీల విమర్శ – వివరణలను ప్రచురించిన సంపాదకులకు ప్రత్యేక అభినందనలు. పత్రిక కనపరిచిన ఉత్తమ, సీరియస్ జర్నలిస్టు విలువలకు ఇది నిదర్శనంగా ఉంది. 'ఇంటర్నేషనల్' గుర్తింపు (ఐ.ఎస్.ఎస్.ఎన్.) పొందిన అరుదైన తెలుగు పత్రికగా 'వీక్షణం' హోదాకు తగిన రీతిలో ఈ చర్చ సాగింది. విమర్శ నిశితంగా, సూటిగా, సరైన వాస్తవాల ఆధారంగా ఉంది. 'వీక్షణం'లో విదేశీ వ్యవహారాలపై వచ్చే రచనలు కొద్దిగానే. అందులో భారత ప్రభుత్వ విదేశాంగ, రక్షణ వ్యవహారాలపై ఇంకా తక్కువ. పత్రికలో ఇప్పటికే సాగుతున్న ఆర్థిక, రాజకీయ విధానాలపై చర్చకు ఇది అదనంగా వచ్చి చేరింది. ఇది పత్రిక స్థాయిని పెంచి, సీరియస్ పాఠకులకు తోడ్పడుతుందనడంలో సందేహం లేదు. ఈ సరళిని కొనసాగించి, పెంపొందిస్తారని ఆశిస్తున్నాను. సెప్టెంబర్ సంచికలో ఈ చర్చపై పి. జాన్సన్‌గారి లేఖను చదివాక, సంపాదకీయాన్ని, దానిపై విమర్శనూ మరోసారి చదివిన మీదట ఈ లేఖ రాస్తున్నాను. ఈ చర్చను 'పాండిత్య ప్రకర్ష'గా భావించడం పత్రిక ప్రమాణాల పెంపుకి తోడ్పడే అంశం కాదు. విమర్శలో ఎత్తిచూపిన విషయాలు ముఖ్యమైనవి, లోతైనవి. విమర్శలో సెన్స్ ఆఫ్ ప్రపోర్షన్, సెన్స్ ఆఫ్

*(మిగతా 63వ పేజీలో...)*

# ప్రజల సమస్యలు పట్టని బధిరాంధ పాలకులు

*ఈ సంపాదకీయం రాసే సమయానికి రాష్ట్రం అట్టుడికి పోతున్నది. ఒకవైపు గిట్టుబాటు ధరలు, అవసరమైన ప్రభుత్వ సహాయం లేక పంటలకు విరామం ప్రకటిస్తామని కొన్ని జిల్లాల రైతాంగం హెచ్చరించి ఉండగా, ఆ సమస్యలను పరిష్కరించకుండా, ప్రభుత్వం కమిటీల ఏర్పాటుతో తాత్సారం చేస్తున్నది. మరొకవైపు అంతకన్న తీవ్రమైన తెలంగాణ సకల జనుల సమ్మె పట్ల ప్రభుత్వం క్షమించడానికి వీలులేని నిర్లక్ష్యాన్ని ప్రదర్శిస్తున్నది. తాత్సారంతో, అణచివేతతో ప్రజా ఉద్యమాన్ని మాయం చేయగలనని భ్రమ పడుతున్నది. ఈ రెండు సందర్భాలలోనూ బయటపడుతున్న కఠోర వాస్తవం ఒకటే. ఈ ప్రభుత్వం ఎవరిదయినా కావచ్చు గాని ప్రజలది మాత్రం కాదు. ప్రజల సమస్యల పట్ల, ఆకాంక్షల పట్ల శ్రద్ధాసక్తులు ఉన్నది కాదు. ప్రజలు తమ నిత్య జీవిత సమస్యల మీద జరుపుతున్న శాంతియుత, ప్రజాస్వామిక ఆందోళనలను కూడ పట్టించుకోలేని, పరిష్కరించలేని దుర్మార్గమైన అలసత్వంలో పాలకులు ఏడు నిలువుల లోతున కూరుకు పోయి ఉన్నారు. పంటల విరామం భూమిపట్టా ఉన్న రైతులది మాత్రమేనా, నిజమైన సాగుదార్లుగా ఉన్న కౌలుదార్లకు, వ్యవసాయకూలీలకు ఏం జరుగుతుంది, మొత్తంగా వ్యవసాయ ఆర్థిక వ్యవస్థకు ఏం జరుగుతుంది లాంటి తప్పనిసరిగా చర్చించవలసిన ప్రశ్నలెన్ని ఉన్నా, ఈ రాష్ట్రంలో చెప్పుకోదగిన జిల్లాలలో ఖరీఫ్ వ్యవసాయ పనులు జరగలేదనేది ఒక వాస్తవం. దానివల్ల భూస్వాములకు నష్టం లేకపోవచ్చు గాని, కౌలుదార్లకు, చిన్నరైతులకు, వ్యవసాయ కూలీలకు, మొత్తంగా ఆహార భద్రతకు, వ్యవసాయోత్పత్తుల దిగుబడికి, ధరలకు చాల నష్టం జరుగుతుంది. ఈ ప్రతికూలతలను అరికట్టడం, తగ్గించడం ప్రభుత్వ బాధ్యత. కాని మహాఘనత వహించిన రాష్ట్ర ప్రభుత్వం ఒక విచారణ తతంగం జరిపితే సరిపోతుందని చేతులు దులుపుకుంది. పంటల విరామం కొనసాగుతున్నా ఏమీ పట్టనట్టు ప్రవరిస్తున్నది. కొన్ని జిల్లాలలో, కొంతమంది రైతులు లేవనెత్తుతున్న సమస్యనే పరిష్కరించలేని ప్రభుత్వం, ఒక ప్రాంత ప్రజలు, రాష్ట్ర జనాభాలో 42 శాతం, మొత్తంగా ప్రకటించిన సకల జనుల సమ్మెను పరిష్కరించ గలుగుతుందని అనుకోవడం అత్యాశే. ఇప్పటికి రెండు వారాలుగా జరుగుతున్న సకల జనుల సమ్మె తెలంగాణ ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్ష ఎంత విస్తృతమైనదో, మొత్తం తెలంగాణ ప్రజానీకం ఆ ఆకాంక్షను ఎంత బలంగా ప్రకటిస్తున్నారో చూపుతున్నది. ఇంతకాలం తెలంగాణ రాష్ట్ర ఆకాంక్ష ప్రజల్లో లేదని, అది కేవలం రాజకీయ నాయకుల సృష్టేనని, ఆ రాజకీయ నాయకుల చిత్తశుద్ధి అనుమానాస్పదమనీ, అది అబద్ధాల మీద ఆధారపడి ఉందనీ, అది కేవలం భావోద్వేగమేనని వగైరా వగైరా వాదనలతో తెలంగాణ ప్రజా ఆకాంక్షను విస్మరించడానికి ప్రయత్నించిన వారి కళ్లు తెరుచుకునేలా ఇది ఎంత సార్వజనీనమైన, దృఢమైన ఆకాంక్షో సకల జనుల సమ్మె స్పష్టం చేస్తున్నది. ఈ సమ్మెలో అన్ని వర్గాల ప్రజలూ తమకు వీలయిన రీతిలో పాల్గొంటున్నారు. ఉద్యోగ, ఉపాధ్యాయ, కార్మిక, తదితర ప్రజా సమూహాలు రాష్ట్రంలో ప్రభుత్వాన్ని స్తంభింపజేశాయి. ప్రజాజీవనం అతలాకుతలమవుతున్నది. అయినా ప్రభుత్వానికి చీమ కుట్టినట్టు కూడ లేదంటే ఈ ప్రభుత్వానికి ప్రజా జీవనంతో ఎంతమాత్రం సంబంధం లేదని మరొకసారి రుజువవుతున్నది. ఇంతకీ సకల జనుల సమ్మె కోరుతున్నది తమ వనరుల మీద తమకే అధికారం ఉండాలనే ప్రజాస్వామిక ఆకాంక్షను తీర్చమని మాత్రమే. రెండు ప్రాంతాలు ఒకే రాష్ట్రంలో విలీనమైననాడు ఒక ప్రాంత ప్రజల భయసందేహాలను తీరుస్తామని, న్యాయమైన ఆకాంక్షలను నెరవేరుస్తామని లిఖిత పూర్వక వాగ్దానం జరిగింది. ఆ వాగ్దానం అడుగడుగునా ఉల్లంఘనకు గురయిన తర్వాత పదమూడు సంవత్సరాలకు "ఆ రక్షణలైనా నెరవేర్చండి, లేదా విలీనాన్ని రద్దుచేసి మమ్మల్ని ప్రత్యేక రాష్ట్రంగా మార్చండి" అని ఆందోళన మొదలైంది. కొత్త వాగ్దానాలు ఇచ్చి, ఆ ఆందోళనను నెత్తురుటేర్లలో ముంచి అణచివేసినా, కొత్త వాగ్దానాలు కూడ బుట్టదాఖలు కావడం వల్ల ప్రత్యేక రాష్ట్ర ఆకాంక్ష చెక్కుచెదరలేదు సరిగదా విస్తరిస్తూ వచ్చింది. ఆ ఆకాంక్షకు నాయకత్వం వహిస్తున్నవారు పాలకవర్గ తానులోని ముక్కలే కావచ్చు, ప్రజాద్రోహం చేయవచ్చు. కాని ఆ కారణం వల్ల ఆ ఆకాంక్షలు అన్యాయమైనవి కావు, తీర్చడానికి వీలులేనివయిపోవు. ఆ ఆకాంక్షలు బలపడడం ఒకవైపునా, పాలకవర్గ రాజకీయ క్రీడలు మరొకవైపునా కలిసి 2009 డిసెంబర్ 9న రాష్ట్ర ఏర్పాటు ప్రక్రియ ప్రారంభమవుతున్నదని కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. అంతకు రెండు రోజుల ముందు రాష్ట్రంలోని రాజకీయ పార్టీలన్నీ అందుకు అంగీకరించిన తర్వాతనే ఆ ప్రకటన వచ్చింది గనుక ఆ ప్రకటనను కాదనే నైతిక హక్కు ఏ ఒక్క పార్టీకీ లేదు. కాని అన్ని రాజకీయ పార్టీలూ ఆడుతున్న దొంగాట వల్ల ఆ ప్రకటన వెనక్కిపోయింది. ఇవాళ తెలంగాణ ప్రజలు అడుగుతున్నది ఆ ప్రకటనను అమలు చేయమని మాత్రమే. ఆ కోరికతో ఇరవై రెండు నెలలుగా తెలంగాణ ప్రజలు ఎక్కని వేదిక లేదు, తట్టని తలుపు లేదు, చేపట్టని నిరసన రూపం లేదు. నిలదీయని రాజకీయ నాయకుడు లేడు. ఇది ప్రజాస్వామ్యమే అయితే, కేంద్ర ప్రభుత్వానికి విశ్వసనీయతే ఉంటే, రాజకీయ నాయకత్వానికి కనీస సిగ్గు ఉంటే డిసెంబర్ 9 ప్రకటన ఈ పాటికి అమలయి ఉండేది. సకల జనుల సమ్మె అవసరమే వచ్చేది కాదు. ప్రజా జీవనం అస్తవ్యస్తమై పోయిందని మొసలి కన్నీరు కారుస్తున్నవారు ఈ మౌలిక వాస్తవాన్ని గుర్తించాలి. సమ్మెతో రాష్ట్ర అభివృద్ధి వెనక్కి పోయిందని అంటున్న వారు ఆ అభివృద్ధిలో మా వాటా మాకు రానప్పుడు ఆ అభివృద్ధి జరిగితే ఎంత, జరక్కపోతే ఎంత అని ఒక ప్రాంతం అడుగుతున్న ప్రశ్నకు జవాబు చెప్పాలి. ప్రభుత్వాలు, పాలకవర్గాలు ఎట్లాగూ ప్రజల సమస్యల పట్ల, నిరసనల పట్ల ఔదాసీన్యం వహిస్తాయి. కాని మేధావులు, ప్రజాస్వామిక ఆకాంక్షలను గౌరవించే, స్వార్థ ప్రయోజనం లేని ఇతర ప్రాంతాల ప్రజలు బేషరతుగా తెలంగాణ ప్రజలతో సంఘీభావం ప్రకటించవలసిన సందర్భం ఇది. పాలకులకూ, పాలకవిధానాలకూ వ్యతిరేకంగా తెలంగాణ ప్రజలు జరుపుతున్న ఉద్యమం వారికీ మరొక ప్రాంత ప్రజలకూ మధ్య విద్వేషంగా మారగూడదు. ఆలస్యం, ఔదాసీన్యం, నిర్లక్ష్యం, అణచివేత తప్పనిసరిగా అటువంటి అవాంఛనీయ ధోరణులకు దారితీయవచ్చు. అది జరిగిన తర్వాత ఇక ఎవరయినా చేయగలిగినదేమీ ఉండదు. అన్ని ప్రాంతాల బుద్ధిజీవులు తమ బాధ్యతను గుర్తెరగవలసిన సమయమిదే.*

వీ

# నరహంతకుడే భావి భారత ప్రధాని!

గుజరాత్ ముఖ్యమంత్రి, భారతీయ జనతా పార్టీ నాయకుడు నరేంద్ర మోడీ భావి భారత ప్రధాని కావాలని, కాక తప్పదని, అవుతాడని, అతను తప్ప మరొక అర్హమైన, సమర్థుడైన నేత లేడని గత కొద్ది రోజులుగా ప్రచార సాధనాలలో జరుగుతున్న ప్రచారం చూస్తుంటే భయమూ జుగుప్సా కలుగుతున్నాయి. పాలకవర్గాల దివాళాకోరుతనం ఎంత నీచ స్థాయికి దిగజారిందో చూసి అసహ్యం కలుగుతున్నది. వేలాది మంది ముస్లింలను ఊచకోత కోసిన, మరెన్నో వేల మందిని నిరాశ్రితులను చేసిన గుజరాత్ మారణకాండ రూపశిల్పి, ప్రోత్సాహకుడు నరేంద్ర మోడీ. అభివృద్ధి మంత్రజపంతో, పెట్టుబడిదారీ శక్తుల, ప్రపంచీకరణ శక్తుల అండతో, సామ్రాజ్యవాద-భూస్వామ్య మిలాఖత్తుకు నిలువెత్తు నిదర్శనంగా హింసా రాజకీయాలతో, ప్రత్యర్థులను బెదరగొట్టి రెండుసార్లు అధికారంలోకి వచ్చి ఉంటే ఉండవచ్చు. ఎన్నికల్లో గెలవడమే, అధికారానికి రావడమే ప్రజా సమ్మతికి చిహ్నం అయితే హిట్లర్ కు, ముస్సోలినీకి, జార్జి బుష్ కు, ఇందిరాగాంధీకి కూడ అటువంటి ప్రజాసమ్మతి ఉండింది. అలాంటి ప్రజాసమ్మతిని, సామ్రాజ్యవాద పెట్టుబడిదారీ శక్తుల మద్దతు ద్వారా ప్రవహించిన విదేశీ పెట్టుబడులనూ చూపి నరేంద్రమోడీని అర్హమైన నేతగా ప్రచారం చేస్తున్నారు. యుపిఎ ప్రభుత్వం భయంకరమైన అవినీతి కుంభకోణాలలో కూరుకుపోయి ప్రత్యామ్నాయం తప్పదని అనిపిస్తున్న స్థితి, 2014 ఎన్నికలలో ఎన్‌డిఎ కూటమి అధికారంలోకి వస్తుందన్న ఆశలు, దేశవ్యాప్తంగా సంఘ పరివారానికి అనుకూలంగా మారుతున్న వాతావరణం, చివరికి ఒకప్పుడు వీసా నిరాకరించిన అమెరికన్ పాలకులు కూడ నరేంద్ర మోడీయే భావి భారత ప్రధాని కాగల అవకాశముందని కితాబు ఇవ్వడం – సంఘ పరివారానికి కొత్త ఆశలు నింపుతున్నాయి. వాజపేయి వంటి "మర్యాదస్తుని" ముఖంతో అమలు చేయలేకపోయిన మత విద్వేష ఎజెండా ఇప్పుడు మళ్లీ బయటికి వస్తున్నది. వయసు వల్ల, రాజకీయ ఎత్తుగడగా లౌకికవాదాన్ని ప్రకటించక తప్పదని జిన్నాను ప్రశంసించిన అద్వానీని కూడ పక్కనపెట్టి మోడీని ప్రధాని అభ్యర్థిగా ప్రతిపాదిస్తున్నారు. అహ్మదాబాద్ తలారి అమెరికా దళారి కావడానికి అన్ని ఏర్పాట్లూ జరిగిపోతున్నాయి. ప్రపంచమంతా ఇస్లాం వ్యతిరేకతను పెంచి పోషిస్తున్న అమెరికా-యూరప్ – నాటో సామ్రాజ్యవాద కూటమికి భారతదేశంలో కూడ కరడుగట్టిన ముస్లిం వ్యతిరేక పాలకుడు కావాలి. సుప్రీంకోర్టు ఉత్తర్వు అనే సిగ్గుబిళ్లను అడ్డుపెట్టుకుని ఆ హంతకుడు నగ్నంగా ఇవాళ సద్భావనాయాత్రకు దిగాడు. నిజానికి ఒక పార్లమెంటు సభ్యుడు ముస్లిం అయిన పాపానికి ఆయననూ, ఆయన దగ్గర ఆశ్రయం తీసుకున్న వారినీ మోడీ సైనికులు నరికి చంపుతుంటే, ఆయన స్వయంగా రక్షణకోసం నరేంద్ర మోడీకి ఫోన్ల మీద ఫోన్లు చేస్తే రక్షణ కల్పించకపోగా ఆ హత్యాకాండకు పురికొల్పిన నేరం మోడీది. ఆ నేరంలో మోడీ నిర్దోషి అని సుప్రీంకోర్టు గాని, మరెవరు గాని తేల్చలేదు. ఆ నేర విచారణ జరగవలసింది కింది కోర్టులోనని మాత్రమే సుప్రీం కోర్టు అనింది. ఎట్లాగూ కింది కోర్టులూ రాష్ట్ర హైకోర్టూ కూడ తనకు వ్యతిరేకంగా తీర్పు చెప్పవు గనుక సుప్రీం కోర్టు ఆదేశమే తన నిర్దోషిత్వపు రుజువుగా చెప్పుకుంటూ సద్భావనా దీక్ష ప్రారంభించాడు. "మెజారిటీ లేదు, మైనారిటీ లేదు, కావలసింది అభివృద్ధి" అని "గజం లేదు, పలాయనం లేదు, ఉన్నది మోక్షం మాత్రమే" అని హిందుత్వ భావజాలానికి ఆధునిక అర్థం చెపుతున్నాడు. వైవిధ్యాన్ని సహించని, అభివృద్ధి మాయాజాలం చాటున నరహంతక భావజాలం అమలుచేసే ఈ దుర్మార్గ ప్రతిపాదనను తిరస్కరించాలి. అటు రాహుల్ ను తేదలచిన యుపిఎనూ మూడో ప్రత్యామ్నాయపు అవకాశవాద పాలకవర్గ ముఠానూ కూడ తిరస్కరించి ప్రజా ప్రత్యామ్నాయం దిశగా సాగడమే భారత సమాజం ముందున్న కర్తవ్యం. వీ

# అధికారికంగా సామ్రాజ్యవాద సంక్షోభ వార్తలు

సామ్రాజ్యవాదం సంక్షోభంలో ఉన్నదనేది ఊహ కాదు, అభిలాష కాదు, సైద్ధాంతిక అవగాహన కాదు. కళ్ల ఎదుట కనబడుతున్న వాస్తవం. అరబ్ దేశాల ప్రజాందోళనలు సామ్రాజ్యవాదుల దళారీలకు వణుకు పుట్టించిన తర్వాత, లిబియాలో ప్రజాందోళనలు సామ్రాజ్యవాద రథచక్రాలకు కావలసిన చమురు అందుతుందా లేదా అని అనుమానాలు పెంచిన తర్వాత, స్పెయిన్, గ్రీస్, బ్రిటన్, ఫ్రాన్స్, బెల్జియం, ఐస్ లాండ్ ఒక్కొక్క దేశమూ సంక్షోభ సూచనలు ప్రకటిస్తున్నాయి. ప్రజాఉద్యమాలు చెలరేగుతున్నాయి. చివరికి ప్రపంచ పెట్టుబడి కేంద్రమయిన న్యూయార్క్ నగరంలోని వాల్ స్ట్రీట్ ను ఆక్రమించాలని ప్రపంచీకరణ వ్యతిరేక శక్తులు పిలుపునిచ్చాయి. సెప్టెంబర్ 17న మొదలయిన ఈ ఉద్యమం ఇది రాసే సమయానికి తొమ్మిది రోజులుగా కొనసాగుతోంది. ఈ వాల్ స్ట్రీట్ ముట్టడి 1969లో వియత్నాం యుద్ధ వ్యతిరేక ప్రదర్శనలతో పోల్చదగినట్టుగా ఉందని పరిశీలకులు అంటున్నారు. సాధారణ పౌరులను బలి చేస్తూ, ధనికులకూ ఆధిపత్య శక్తులకూ అనుకూలంగా పనిచేస్తున్న ద్రవ్య వ్యవస్థ కేంద్ర స్థానమైన వాల్ స్ట్రీట్ ను స్తంభింపజేయడమే తమ లక్ష్యమని ఈ ఆందోళనకారులు అంటున్నారు. "వాల్ స్ట్రీట్ ను ఆక్రమించండి అనేది నాయకత్వం లేని ప్రతిఘటన ఉద్యమం. ఇందులో అన్ని రంగుల ప్రజలూ ఉన్నారు. ఇందులో పాల్గొనేవారికి స్త్రీపురుష భేదం లేదు. ఈ ఆందోళకారులలో అన్ని రాజకీయ విశ్వాసాల వారూ ఉన్నారు. మా అందరికీ ఉమ్మడిగా ఉన్న అంశమేమంటే మేం 99 శాతం జనం. మేం ఇంకెంత మాత్రమూ ఒక్క శాతం మనుషుల దురాశనూ అవినీతినీ సహించదలచుకోలేదు" అని ఈ ఆందోళనకారులు ప్రకటిస్తున్నారు. అరెస్టులనూ ఆంక్షలనూ అధిగమిస్తూ వందలాది మంది ప్రదర్శకులతో తొమ్మిది రోజులుగా ఈ ముట్టడి కొనసాగుతోంది. ఇతర పట్టణాలలోనూ, దేశాలలోనూ ఈ పెట్టుబడి వ్యతిరేక ప్రదర్శనకు సంఘీభావ ప్రదర్శనలు జరుగుతున్నాయి. ఇది ఇలా ఉండగా సెప్టెంబర్ 24న వాషింగ్టన్ లో జరిగిన ఐఎంఎఫ్, ప్రపంచ బ్యాంకు వార్షిక సమావేశాల్లో పాల్గొన్న వివిధ దేశాల ఆర్థిక మంత్రులు, ద్రవ్య సంస్థల అధిపతులు, అర్థశాస్త్రవేత్తలు అంతర్జాతీయ ఆర్థిక సంక్షోభం విస్తరిస్తున్నదని, ఇది పూర్తిస్థాయి మాంద్యంగా మారనున్నదని భయాలు వ్యక్తం చేశారు. అంతకు రెండు రోజుల ముందే ప్రపంచవ్యాప్తంగా స్టాక్ మార్కెట్లు కుప్పకూలిపోయాయి. అంతర్జాతీయ వాణిజ్య పత్రికలన్నీ సంక్షోభం గురించి గగ్గోలు ప్రారంభించాయి. ఈ సమయంలోనే విడుదల చేసిన ప్రపంచ ఆర్థిక భవిష్యత్తు నివేదికలో ఐఎంఎఫ్ తాను గతంలో వేసిన పెరుగుదల అంచనాలు నిజం కాకపోవచ్చుననీ, అందువల్ల ఆ అంచనాలను తగ్గిస్తున్నాననీ ప్రకటించింది. అమెరికా, యూరప్ లలో వృద్ధి రేటు రెండు శాతం కన్న తక్కువ ఉండవచ్చునని కొత్త అంచనాను ప్రకటించింది. "ప్రపంచ ఆర్థిక వ్యవస్థ ఒక కొత్త భయానకమైన దశలో ఉంది. ప్రపంచ కార్యకలాపాలు బలహీనపడ్డాయి. ఎక్కువ అసమానంగా మారాయి. ఆర్థిక వ్యవస్థమీద విశ్వాసం ఇటీవలి కాలంలో బాగా సన్నగిల్లింది. ప్రమాద సూచికలు పెరుగుతున్నాయి" అని ఐఎంఎఫ్ ప్రకటించింది. ప్రపంచ వాణిజ్య సంస్థ కూడ ఇదేరకమైన ప్రమాద సూచికలను ప్రకటించింది. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ రెండంచెల మాంద్యం నుంచి తప్పుకోవచ్చునని తనకు నమ్మకం ఉందనీ, కాని ఆ నమ్మకం రోజురోజుకూ తరిగిపోతున్నదనీ ప్రపంచబ్యాంకు అధ్యక్షుడు అన్నాడు. ఈ అవకాశాన్ని వినియోగించుకోగల స్థితిలో ప్రపంచ వ్యాపిత సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాశక్తులు ఉంటే ఎంత బాగుండును! వీ












- **అజేయుడు –** ది కౌంట్ ఆఫ్ మొంటే క్రిస్టో – మూలం : అలెగ్జాండర్ డ్యుమా – అనువాదం : సూరంపూడి సీతారాం – హైదరాబాద్ బుక్ ట్రస్ట్ ప్రచురణలు – 404 పేజీలు, 1/8 డెమీ, రు : 160, ప్రతులకు: హైదరాబాద్ బుక్ ట్రస్ట్, ఫ్లాట్ నెం. 85, బాలాజీనగర్, గుడిమల్కాపూర్, హైదరాబాద్ – 500 067. ఫోన్ : 23521849, www.hyderabadbooktrust.blogspot.com
- **జయశంకరా! –** యాదిమరువని పాటలు – తెలంగాణ రచయితల వేదిక ప్రచురణలు – 92 పేజీలు, 1/8 డెమీ, రు : 40
- **తండ్లాట –** కవిత్వం – కాంచనపల్లి – తెలంగాణ రచయితల వేదిక ప్రచురణలు – 72 పేజీలు, 1/8 డెమీ, రు : 20

పై రెండు ప్రతులకు : జూలూరు గౌరీశంకర్, ఇ.నెం. 1–8–702/33/20ఎ, పద్మాకాలనీ, నల్లకుంట, హైదరాబాద్ – 500 044; రాష్ట్రంలోని అన్ని పెద్ద పుస్తకాల షాపుల్లో; అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలలో

- **మానుకోట –** మే 28, 2010 – సంపాదక వర్గం : మల్లెపల్లి లక్ష్మయ్య, పిట్టల రవీందర్, కె. గోవర్ధన్ – తెలంగాణ రచయితల వేదిక ప్రచురణలు – 61 పేజీలు, 1/4 క్రౌన్, రు : 40, ప్రతులకు : అన్ని ప్రముఖ పుస్తక విక్రయ కేంద్రాలలో
- **సీమాంధ్ర రాజకీయ నాయకుల కుట్ర ఉరఫ్ '14–ఎఫ్' –**(ప్రముఖుల వ్యాసాలు, అభిప్రాయాలు) రచయితల వేదిక ప్రచురణలు – 32 పేజీలు, 1/4 క్రౌన్, రు : 10, ప్రతులకు : తెలంగాణ రిసోర్స్ సెంటర్, 'చంద్రం' 490, స్ట్రీట్ నెం. 11, హిమాయత్‌నగర్, హైదరాబాద్, సెల్: 9030626288; ఇమెయిల్ : telanganaresource@gmail.com
- **జడి –** కె.ఎస్. రమణ – మంజులా పబ్లికేషన్స్, 168 పేజీలు, 1/4 డెమీ, రు : 100, ప్రతులకు : మంజులా పబ్లికేషన్స్, 6–3–598/7/5, ఫ్లాట్ నెం. 301, సంతి అపార్ట్‌మెంట్స్, ఆనంద్‌నగర్ కాలనీ, ఖైరతాబాద్, హైదరాబాద్ – 500 004, సెల్: 040 23327910; విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ అన్ని బ్రాంచీలు, అనుపమ ప్రింటర్స్, మాసబ్ ట్యాంక్, హైదరాబాద్
- **మహమ్మారి మద్యం –** రాజకీయాల అవినీతితో చెట్టపట్టాల్ – సంకలనం : గడ్డిపాటి కోటేశ్వరరావు, నవయుగ ప్రచురణ, 134 పేజీలు, 1/4 డెమీ, రు : 20, ప్రతులకు : నవయుగ ప్రచురణలు, గడ్డిపాటి కళ్యాణ మండపం, రైల్వే ఓవర్ బ్రిడ్జి దగ్గర, మంగళగిరి రోడ్డు, గుంటూరు; ప్రజాశక్తి బుక్ హౌస్, ప్రముఖ పుస్తక కేంద్రాలలో
- **మనసు గుర్రమురోరి మనిషీ! –** నాయుని కృష్ణమూర్తి – వియన్నార్ బుక్ వరల్డ్, 140 పేజీలు, 1/4 డెమీ, రు : 50, ప్రతులకు : వియన్నార్ బుక్ వరల్డ్, చౌడేపల్లె, చిత్తూరు – 517 257
- **బి.ఎస్. రాములు 'బతుకు పయనం' కథలు – పరిశీలన –** మొయిలి మోహనరావు – విశాల సాహిత్య అకాడమీ ప్రచురణ, 152 పేజీలు, 1/4 డెమీ, రు : 90, ప్రతులకు : మొయిలి మోహనరావు, కాజీపేట (గ్రామం), అరసవల్లి (పోస్ట్), శ్రీకాకుళం – 532401, ఫోన్ : 9951488146; విశాల సాహిత్య అకాడమీ, 2–2–186/53/5, రామకృష్ణనగర్, బాగ్ అంబర్‌పేట్, హైదరాబాద్ – 500013; ఫోన్ : 9391036987
- **బి.సి. కథలు –** ఒక పరిశీలన 2000–2010 – బి.ఎస్. రాములు – విశాల సాహిత్య అకాడమీ ప్రచురణ, 168 పేజీలు, 1/4 డెమీ, రు : 110, ప్రతులకు : బి.ఎస్. రాములు, 2–2–647/ఎ/57, సాయిబాబా నగర్, శివంరోడ్, హైదరాబాద్ – 500013; ఫోన్ : 9391036987; విశాల సాహిత్య అకాడమీ, 2–2–186/53/5, రామకృష్ణనగర్, బాగ్ అంబర్‌పేట్, హైదరాబాద్ – 500013;











## రాజన్‌బాబు ఇక లేరు

ఛాయాచిత్రకారుడు ఫొటోగ్రఫీ రంగంలో తనదైన ముద్ర వేసిన బండి రాజన్‌బాబు మరి లేరు. అనారోగ్యంతో కొద్దిరోజులుగా హైదరాబాద్‌లోని కేర్ ఆస్పత్రిలో చికిత్స పొందుతున్న ఆయన బుధవారం రాత్రి తుదిశ్వాస విడిచారు. ఆయన 1939 ఫిబ్రవరి 9న కరీంనగర్ జిల్లా కోరుట్ల గ్రామంలో జన్మించారు. గిరిజనుల జీవితాలతో మొదలుపెట్టి పారిశ్రామికవాడల్లో రాజన్ లెన్స్ కష్టజీవుల శ్రమ జీవనానికి అద్దంలా మారింది. తనలాంటి అభిరుచి ఉన్న ఔత్సాహికులకు వెలుగునీడల ఛాయాచిత్రకళలోని మెళకువలు నేర్పాలన్న కోరికను ఆయన 'రాజన్ స్కూల్ ఆఫ్ ఫోటోగ్రఫీ' స్థాపించి నెరవేర్చుకున్నారు.

## ఏజెన్సీలో తీవ్ర విషజ్వరాలు

రాష్ట్రంలోని ఏజెన్సీ ప్రాంతాల్లో తీవ్రంగా విషజ్వరాలు ప్రబలుతున్నాయని జాతీయ గిరిజన కమిషన్ చైర్మన్ డా. రమేశ్వర్ ఓరాన్ ఆందోళన వ్యక్తం చేశారు. వారికి సరైన వైద్యసదుపాయాలు అందుబాటులో లేవన్నారు.

## సంక్షేమ నిధుల మళ్లింపూ అవినీతే

దళితులు, ఆదివాసీల సంక్షేమానికి కేటాయించిన నిధులను దారి మళ్లించడం కూడా పక్కా అవినీతి చర్యగానే పరిగణించాలని సీపీఐ నేత డి.రాజా పేర్కొన్నారు. దళితుల నిధులను మళ్లించడం అంటే వారి ప్రయోజనాలను దెబ్బతీసినట్లేన ని, ఈ చర్య అవినీతి ఎందుకు కాదో సర్కారు సమాధానం చెప్పాలని ఆయన డిమాండ్ చేశారు. ఆగస్టు 28న హైదరాబాద్ లోని ఒక హోటల్‌లో దళిత, గిరిజన ఉప ప్రణాళికల అమలుపై సెంటర్ ఫర్ దళిత స్టడీస్ ఏర్పాటు చేసిన సమావేశంలో డి. రాజా ముఖ్య అతిథిగా పాల్గొన్నారు.

## ముళ్లపూడి హరిశ్చంద్ర ప్రసాద్ మృతి

రాష్ట్రంలో తొలితరం పారిశ్రామికవేత్త, పరిశ్రమల పితామహుడిగా పేరొందిన ఆంధ్రా షుగర్స్ అధినేత ముళ్లపూడి హరిశ్చంద్రప్రసాద్ (91) కన్నుమూశారు. గత కొద్దికాలంగా తీవ్ర అస్వస్థతతో బాధపడుతున్న ఆయన.. హైదరాబాద్‌లోని కేర్ ఆస్పత్రిలో చికిత్స పొందుతూ సెప్టెంబర్ 3న మధ్యాహ్నం మరణించారు. 1921 జూలై 28న ఆయన ఒక వ్యవసాయ కుటుంబంలో జన్మించారు. ఎస్ఎస్ఎల్‌సీ వరకూ మాత్రమే చదువుకున్నారు. 1947లో ఆంధ్ర షుగర్స్‌ను స్థాపించింది మొదలు అనేక పరిశ్రమలను స్థాపించారు.

## లక్ష ప్రభుత్వ ఉద్యోగాలు

ఏడాదిన్నరలోగా నోటిఫికేషన్లు ఇచ్చి లక్ష పోస్టులను నింపనున్నట్లు ముఖ్యమంత్రి ఒక ప్రకటనలో సెప్టెంబర్ 6న తెలియజేశారు. హోం శాఖలో 41 వేలు కానిస్టేబుల్, టీచర్ పోస్టులు 35 వేలు, రెవెన్యూలో 7200 పోస్టులు ఇంధన శాఖలో 4000, వైద్య శాఖలో 3000, ఇంజనీరింగ్ 3000, ఇతర శాఖల నుంచి 6800 పోస్టులు నింపనున్నట్లు తెలియజేశారు.

## బాలల చలన చిత్రోత్సవం

17వ ప్రపంచ బాలల చిత్రోత్సవాన్ని నవంబర్ 14 నుంచి 20 వరకు హైదరాబాద్‌లో నిర్వహిస్తున్నట్లు ఆ సంస్థ చైర్‌పర్సన్ నందితా దాస్ వెల్లడించారు. సచివాలయంలో సీఎం కిరణ్, సినిమాటోగ్రఫీ మంత్రి డీకే. అరుణలతో ఆమె కార్యక్రమం నిర్వహణపై చర్చించారు. ప్రతి రెండేళ్లకొకసారి నిర్వహించే ఈ చిత్రోత్సవాన్ని ఈ సారి హైదరాబాద్‌లో నిర్వహించనున్నట్లు తెలిపారు. వారం రోజులపాటు జరిగే ఈ ప్రదర్శనలో 40 దేశాల్లో అవార్డులు సాధించిన చిన్నపిల్లల సినిమాలు 100కు పైగా ప్రదర్శిస్తామని చెప్పారు.

## ఉపాధి హామీలో అవకతవకలు

రాష్ట్రంలో ఉపాధిహామీ పథకం ప్రారంభం సమయంలో కూలీలకు దాదాపు 1.20 కోట్లకు పైగా జాబ్‌కార్డులు మంజూరు చేశారు. ఇందులో అప్పట్లోనే అనేక అవకతవకలు చోటుచేసుకున్నాయి. ఉద్యోగులకు, రాజకీయ నాయకులకు, ఉద్యోగరీత్యా విదేశాల్లో స్థిరపడినవారికి, పాఠశాల విద్యార్థులకు జాబ్‌కార్డులు మంజూరు చేసి ఆ శాఖ అనేక విమర్శలు మూటగట్టుకుంది. కార్డు మంజూరైన వారిలో ఎక్కువమంది పనులకు వెళ్లేవారు కాకపోవడంతో వారిపేరుతో పనులు చేసినట్లు మస్టర్లు రాసుకుని నిధులు తినేసిన సంఘటనలు కోకొల్లలు. రాష్ట్రంలోని 22 జిల్లాల్లో ఇప్పటి వరకు 1,21,89,755 జాబ్‌కార్డులు మంజూరు చేయగా, ఒక్కరోజు కూడా పనిచేయని 27,83,913 మంది జాబ్ కార్డులు ఇక తెరమరుగు కానున్నాయి.

## జాషువా సాహిత్య అకాడమీ ప్రారంభం

డా. గుర్రం జాషువా సాహిత్య అకాడమిని ప్రారంభించడానికి ప్రభుత్వం సెప్టెంబర్ 13న ఉత్తర్వులు జారీ చేసింది. దీని కోసం ఓ కమిటీని నియమించింది. ఇందుకోసం రూ. 35 లక్షల గ్రాంట్‌ను విడుదల చేయడానికి సుముఖత వ్యక్తం చేసింది. ఉన్నత విద్యాశాఖ ముఖ్యకార్యదర్శి, తెలుగు అకాడమి వైస్ చైర్మన్ దీనికి చైర్మన్‌గా వ్యవహరిస్తారు. సభ్యులుగా ఆచార్య కోవెల సుప్రసన్నాచార్య, ఆచార్య ఎండ్లూరి సుధాకర్(తెలుగు యూనివర్సిటీ), డాక్టర్ బోయ జంగయ్య(రచయిత), కన్వీనర్/మెంబర్‌గా తెలుగు అకాడమి డైరెక్టర్ ఉంటారు. దీన్ని తెలుగు అకాడమి నిర్వహించనుంది.

## మళ్లీ పెరిగిన పెట్రోల్ ధరలు

కేంద్ర ప్రభుత్వం లీటరు పెట్రోలు పై రు. 3.14 చొప్పున పెంచ్చింది. సెప్టెంబర్ 15న అర్ధరాత్రి నుంచే పెంచిన ధరలు అమలులోకి వచ్చేశాయి. దీంతో రాష్ట్ర రాజధాని హైదరాబాద్‌లో పెట్రోలు ధర లీటరు రు. 74.50కు చేరుకుంది. ఈ పెంపు వల్ల మన రాష్ట్ర ప్రజలపై నెలకు రు. 33.81 కోట్ల అదనపు భారం పడనుంది. అంతర్జాతీయంగా ముడి చమురు ధరలు పెరగడం, దీనికి తోడు డాలర్‌తో పోల్చితే రూపాయి మారకం విలువ పడిపోవడం కారణాలుగా చెపుతున్నారు.

## అక్రమాల్లో ఆంధ్రప్రదేశ్ అగ్రస్థానం

మైనింగ్ అక్రమాల్లో ఆంధ్రప్రదేశ్‌ది దేశంలోనే మొదటి స్థానం. గత ఐదేళ్లుగా కేసుల్లో కొత్త రికార్డులు నమోదవుతున్నాయి. 2006లో 5385 అక్రమ మైనింగ్ కేసులు నమోదు కాగా, 2007 నాటికి ఇది 9216కి పెరిగింది. 2008, 2009లలోనూ కేసుల సంఖ్య అంతకంతకు పెరిగి... ఈ సంఖ్య 2010లో 17,882కు చేరింది. 2011 తొలి మూడు నెలల్లోనే 4594 కేసులు నమోదు అయినట్లు తెలుస్తోంది.

## ఉధృతంగా సాగుతున్న సకల జనుల సమ్మె

తెలంగాణ ప్రత్యేక రాష్ట్రాన్ని వెంటనే ఏర్పాటు చేయాలని అని కోరుతూ తెలంగాణ అంతటా సెప్టెంబర్ 13 నుంచి సకల జనుల సమ్మె ప్రారంభమైంది. సమ్మెలో సింగరేణి కార్మికులు, ఆర్.టి.సి. కార్మికులు, ప్రభుత్వ ఉద్యోగులు, వివిధ రాజకీయ పార్టీలు, లాయర్లు, వైద్యులు, ఉపాధ్యాయులు, మహిళలు, విద్యార్థులు, వివిధ సేవారంగ కార్మికులు, ఎక్కడికక్కడ ప్రజలు పెద్దఎత్తున పాల్గొని తమ ఆకాంక్షను వెలిబుచ్చు తున్నారు. బంద్‌లు, ధర్నాలు, రాస్తారోకోలు, సభలు, సమావేశాలు, ఆటా- పాటా-మాటలతో, నిరసలతో తెలంగాణ ప్రాంతమంతా హోరెత్తి పోతోంది. వీ

*మన రాష్ట్రానికి ప్రపంచ బ్యాంక్ సంస్కరణల పేరిట ఇచ్చిన అప్పు, దాని వెనుక ఉన్న ఉద్దేశాలను ఇటీవల ప్రపంచబ్యాంక్ విడుదల చేసిన నివేదిక నేపథ్యంలో వివరిస్తున్నారు* **ప్రొ. జి. హరగోపాల్**

# ఆంధ్రప్రదేశ్ - ప్రపంచబ్యాంక్ అప్పు

ప్రపంచబ్యాంక్ రాష్ట్రంలో ప్రవేశపెట్టిన ఆర్థిక సంస్కరణలను వాళ్లు విధించిన నిబంధనలను, చేసిన మార్పులను సమీక్షించి ఈ మధ్యే వాళ్లు తయారుచేసిన డాక్యుమెంట్‌లో ఇక ముందు అప్పు కొనసాగదనే నిర్ణయాన్ని ప్రకటించారు. ఈ డాక్యుమెంట్ చదివిన వారికి చాలా కనువిప్పుగానే ఉంది. ఇంతకాలంగా రాష్ట్రంలో ప్రజాస్వామ్యవాదులు చేసిన విశ్లేషణలు, భయాలు, ఆందోళనలు ఎంత నిజమో ఆలోచిస్తే ఆనందం కలుగుతుంది. ఆందోళనా కలుగుతుంది. ప్రజలకు సరియైన సమయంలో వాస్తవాలు చెప్ప గలిగామనే ఆనందం, మన రాష్ట్ర ఆర్థిక వ్యవస్థను, దానితోపాటు భిన్న జీవనరంగాలలోకి ఒక 'అప్పి'చ్చు సంస్థ ఎంత దూసుకు పోయింది, దానిని ఈ పరిపాలనా వ్యవస్థ ఇంత కూరుకపోవడానికి ఎంత దోహదపడిందో గమనిస్తే, ప్రజాస్వామ్యం, ఎన్నికలు ప్రజల ప్రయోజనాలను రాజకీయంగా ఎంత వికృతంగా మారాయో అర్థమవుతుంటే ఆందోళన కలుగుతుంది. వ్యవస్థ బలహీన వర్గాలలో పాలనా సంస్థల దిగజారుడు, రాజకీయాల అవకాశవాదం చూస్తే భవిష్యత్తుపట్ల భయం కలుగుతుంది. ప్రపంచబ్యాంక్ ప్రేరేపిత మార్పులను 'సంస్కరణలు' అని నామకరణం చేశారు. సంస్కరణలు అనేపదానికి మనలాంటి దేశాలలో మంచి అర్థమే ఉంది. కాని ప్రపంచ బ్యాంక్ భాషను తలకిందులుగా ఉపయోగిస్తుంది. దీనర్థం ఆర్థిక 'సంస్కరణలు' అంటే సరిపోతుంది. పలు విధ్వంస కార్యక్రమాలకు భాషా శాస్త్రవేత్తల సహాయంతో ఒక కొత్త నిఘంటువును ప్రపంచబ్యాంక్ తయారుచేసింది. ఈ భాషా ప్రయోగాలు పైకి సమాజాన్ని ముందుకు తీసుకుపోతున్నట్లుగా ధ్వనించి, అంతర్గతంగా విలువలను ధ్వంసం చేస్తుంటాయి. అంటే రూపంలో 'ప్రజాస్వామ్యం'గా సారంలో విధ్వంసంగా ఉండే ఈ ప్రపంచబ్యాంక్ భాష మీద కూడ లోతైన చర్చ జరగవలసి ఉంది.

ఇప్పుడు బయటికి వచ్చిన నివేదికను 'ఆంధ్రప్రదేశ్ మూడవ అప్పు, రుణ సంబంధిత ఆర్థిక సంస్కరణలు' అన్నారు. ఇందులో అప్పు (లోన్) అంటే కొంత మెరుగు అని, రుణం (క్రెడిట్) అంటే ఎక్కువ భారమని భావించబడింది. రుణం తగ్గించుకోవడానికి అప్పు చేయడ మనేది ఒక ఆశించదగ్గ మార్పు అనికూడా బ్యాంక్ భావిస్తుంది. నివేదిక పేర్లు ఏమున్నా ఇందులో ప్రపంచ బ్యాంక్ తాను కోరిన ఎనిమిది రంగాల్లో 'సంస్కరణలు' ఎలా జరిగాయి, ఎంత మేరకు రాష్ట్ర ప్రభుత్వం ఆ లక్ష్యాలను నెరవేర్చింది అనే సమీక్ష చేసింది. ఈ ఎనిమిది రంగాలు – పేదరిక తగ్గింపు, పెట్టుబడులకు తగిన వాతావరణ కల్పన, ఆర్థిక వనరుల నిర్వహణ, పబ్లిక్‌రంగ సంస్థలలో సంస్కరణలు, పాలనా సామర్థ్య మెరుగుదల, విద్యుత్, విద్యా, ఆరోగ్య రంగాలలో ప్రవేశపెట్టిన సంస్కరణలు. అంటే అప్పిచ్చినవాడు సాధారణంగా అప్పు మీద వడ్డీ, లాభాల గురించి పట్టించుకోవాలే, కానీ, ఒకదేశ మౌలిక విధానాలలో మార్పులకు ఒత్తిడి పెట్టడం, ఇన్ని రంగాలను ప్రభావితం చేయాలను కోవడం, ఈ మొత్తం అప్పు వెనక లేదా అప్పు లోపలి చిదంబర రహస్యం. నిజానికి ప్రపంచబ్యాంక్ అప్పు ఇచ్చిన తొలిదశలోనే బిర్లా ప్లానెటోరియం సమావేశ స్థలంలో అప్పు ప్రమాదకరమని, ఇది అన్ని అప్పుల్లాగా కాదని, ఇది ఒక రాష్ట్ర విధానాలను ప్రభావితం చేస్తుందని, ప్రజాస్వామ్య పాలన మీద ఇది చాలా 'బరువును' మోపుతుందని ఏ మొహమాటం లేకుండా మాట్లాడినప్పుడు ప్రపంచబ్యాంక్ ప్రతినిధి, ఇది కేవలం అప్పేనని అలాంటి ఒత్తిడులు ప్రపంచబ్యాంక్ పెట్టదని ఒక అపరాధ భావనతోనే అన్నాడు. ఈ నివేదికలో ఆయన ఎంత పెద్ద అబద్ధమాడాడో స్పష్టంగా బయటపడింది.

ప్రపంచబ్యాంక్ అన్ని రంగాల గురించి స్థూలంగా సమీక్షిస్తూ ఒక వెనకబడిన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ప్రపంచబ్యాంక్ అప్పుల వలన దేశంలోనే ఐదు అభివృద్ధి చెందిన రాష్ట్రాల స్థాయికి ఎదగగలిగిందని తనను తాను అభినందించుకొన్నది. కాని ఇది ఎంత అబద్ధమో దేశ ఆర్థిక వ్యవస్థ గురించి కొంచెం తెలిసిన వాళ్లెవరికైనా తెలుసు. ప్రపంచ బ్యాంక్ మన రాష్ట్రానికి వెనకబడిన రాష్ట్రమని, రాష్ట్రాన్ని ఉద్ధరిద్దామని రాలేదు, అలా వెళ్లాలంటే నిజానికి అతి వెనకబడిన బీహార్, ఒడిశా రాష్ట్రాలకు ముందుగా వెళ్లవలసింది. ఇక్కడ ఆర్థిక వ్యవస్థ కొంత అభివృద్ధి చెందిందని, తనకు కావలసిన మార్కెట్ ఇక్కడ ఉన్నదని భావిస్తూ, ప్రజా ఉద్యమాలు ముఖ్యంగా నక్సలైట్ ఉద్యమమున్న రాష్ట్రంలో ఎక్కువ పెట్టుబడి ద్వారా ఇలాంటి ఉద్యమాలని అదుపు చేయగలమా అనే ప్రయోగం కొరకే వచ్చారని మాలాంటి వాళ్ల అభిప్రాయం. ఇప్పుడు తాము రాష్ట్రాన్ని అభివృద్ధి చేసే లక్ష్యాన్ని సాధించామని, ఇక తాము మరింత వెనకబడిన రాష్ట్రాలకు వెళ్లాలి కాబట్టి, ఇక ఆంధ్రప్రదేశ్‌లో తమ ప్రయోగం ముగిసినట్టేనని ప్రకటించారు! ఈ ప్రకటనలో చెప్పిన కారణాలు పూర్తిగా అబద్ధం. బ్యాంక్ అప్పు ఆపడానికి నిజమైన కారణాలు నివేదికలో వేరే ఉన్నాయి.

భిన్న రంగాలను సమీక్షిస్తూ, పేదరిక నిర్మూలనలో రాష్ట్రం సరియైన విధానాలను అనుసరించిందని, పేదరిక తగ్గింపుకు కొన్ని ప్రత్యక్ష కార్యక్రమాలు తీసుకోవడమే కాక, భూమిలేని పేదలకు భూ పంపిణీ చేపట్టిందని ప్రశంసించారు. భూసంస్కరణ అంశంలో పదిలక్షల

నలభై వేల ఎకరాల భూమిని పంపిణీ చేయడం వలన దాదాపు పదిలక్షల మంది పేదలు ముఖ్యంగా ఎస్.సి., ఎస్.టి. వర్గాలు లాభపడ్డాయని పేర్కొన్నారు. అలాగే భూమి గురించి సర్వే చేయడానికి అరవై వేల మంది యువకులను నియమించి వాళ్లందరికి పని కల్పించారని కూడా పేర్కొన్నారు. రాష్ట్రంలో శాంతిచర్చల సందర్భంగా భూ సంస్కరణ మీద జరిగిన చర్చ ఫలితంగా నియమించిన కోనేరు రంగారావు కమిటీ సిఫారసుల బుట్టదాఖలు సంగతి అందరికీ తెలుసు. ఈ విషయం గురించి ప్రపంచబ్యాంక్ నివేదిక మాట వరుసకైనా ప్రస్తావించలేదు.

అలాగే బలహీన వర్గాలకు పెన్షన్ పథకాన్ని బాగా అమలు చేసారని పేర్కొన్నారు. పెట్టుబడులకు తగిన వాతావరణాన్ని సృష్టించడం లో కొంతవరకు సఫలీకృతులయ్యారని, వ్యవసాయ మార్కెట్ (హోల్‌సేల్ మార్కెట్)లో రాష్ట్ర మోనోపాలి నుండి తప్పించి ప్రైవేటీకరణకు కావలసిన విధానాలను రూపొందిచారని, అలాగే లేబర్ మార్కెట్‌కు సంబంధించిన కఠిన విధానాలను 'సరళీకృతం' చేసారని, అలాగే ప్రత్యేక ఆర్థిక మండలాలకు అనువుగా 2005 చట్టాన్ని రూపొందించి, పెట్టుబడులను ప్రోత్సహించడానికి కావలసిన పరిస్థితులు కల్పించారని ప్రశంసించారు.

ఇక ఆర్థిక జవాబుదారీకి సంబంధించి తాము కోరిన విధంగా బడ్జెట్‌ను మెరుగుపరచారని, ప్రభుత్వం తన ఖర్చును తగ్గించే దిశగా చర్యలను ప్రారంభించిందని, ప్రభుత్వ ఖర్చు నిర్వహణలో మరింత పారదర్శకత పాటించారని పేర్కొన్నారు. 2006-07లో ప్రభుత్వానికి సంబంధించిన ఆర్థిక లావాదేవీలను మరింత పారదర్శకంగా మలిచారని అన్నారు. జవాబుదారీ, పారదర్శకత ప్రపంచబ్యాంక్ పరిభాషలో చాలా తరచుగా ఉపయోగించే పదాలు. ఇది ఎవరికి జవాబుదారీతనం, ఎందుకు పారదర్శకత అంటే ఇది రాష్ట్ర ప్రభుత్వాలకు కాదు, ఇదంతా బ్యాంక్ కొరకు. ప్రభుత్వం ఖర్చు తగ్గించుకోవాలనడంలో అది కొన్ని బాధ్యతల నుండి తప్పుకోవాలి అని ఒత్తిడి ఉంది. ఈ ఒత్తిడి వలన పాటించిన పారదర్శకత వల్ల ఆర్థిక వ్యవస్థను సునిశితంగా పరిశీలిస్తున్న ఆర్థిక శాస్త్రవేత్తలకు కొంత అదనపు సమాచారం దొరికితే దొరికుండ వచ్చు. ఒక్క మాటలో ఇది ప్రజాస్వామ్య ప్రక్రియగా కనిపించినా ప్రపంచబ్యాంక్ నియంత్రణ ఇందులోని సారాంశం. ఈ విషయంలో మరొక అడుగు ముందుకు వేసి తాము 2004 జూన్‌లో చేసిన రెండవ సమీక్ష మేరకు, అంతకు ముందే చేసుకున్న ఒప్పందం ప్రకారం చర్యలు తీసుకున్నారని వ్యాఖ్యానించారు.

ఇక పబ్లిక్‌రంగ సంస్థల విషయంలో బ్యాంక్‌లో చేసుకున్న ఒప్పందం మేరకు 71 పబ్లిక్‌రంగ సంస్థలలో బ్యాంక్ ఆదేశించిన మార్పు లను క్రమేణ అమలు పరుస్తూ కొంత సంతృప్తికలిగించేలా ఉన్నాయని అంటూ, విద్యుత్ సంస్కరణల విషయంలో గాడి తప్పాయని తప్పు పట్టారు. మొత్తంగా పబ్లిక్‌రంగ సంస్థల విషయంలో బ్యాంక్ ఆశించిన రీతిలో ప్రభుత్వం తగిన మార్పులను ప్రవేశపెట్టలేక పోయిందని, ఈ విషయంలో జాప్యం జరిగిందని, 2006లో ప్రభుత్వరంగ సంస్థలను వేగంగా మారుస్తామని ప్రభుత్వం వాగ్దానం చేసినా దానిని నిలబెట్టలేక పోవడమే కాక దాదాపు ఈ సంస్కరణలను రద్దు చేసుకున్నారని 'బాధ' పడ్డారు. నిజానికి 1999లో చాలా ఆశాజనకంగా ప్రారంభమైన సంస్కరణలు మొదటి ఏడు, ఎనిమిది సంవత్సరాలలో (అంటే చంద్రబాబు హయాంలో) వేగవంతంగా జరిగినా అవి దారి తప్పడానికి మొదటి కారణం ప్రభుత్వం రాష్ట్ర సహకార సంస్థ, ఎస్.సి., ఎస్.టి. కార్పొరేషన్, సివిల్ సప్లైస్ కార్పొరేషన్, ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణ సంస్థ, సింగరేణి కాలరీస్‌లను ప్రైవేటీకరించడంలో వెనకంజ వేయడం అంటూ ఈ సంస్థలకు సామాజిక ప్రయోజనమున్నదన్న 'మిష' మీద ప్రభుత్వం వెనుకడుగు వేసిందని పేర్కొన్నారు. అంతేకాక ఇది రాజకీయంగా దెబ్బతీస్తుందని ప్రభుత్వం భావించడం వలన కూడా ఈ నిర్ణయాలను తీసుకునే సాహసం చేయలేకపోయారని నివేదిక పేర్కొంది. అయితే ప్రభుత్వరంగ సంస్థలలో ఉద్యోగులను తొలగించడంలో ప్రశంసనీయంగానే ప్రవర్తించారని మెచ్చుకున్నారు. ఈ విధానంలో స్వచ్ఛంద పదవీ విరమణను చాలా బాగా రూపొందిం చారని, అలాగే తొలగించిన కొందరు ఉద్యోగులను శిక్షణ ద్వారా మారుతున్న లేబర్ మార్కెట్ డిమాండ్ మేరకు మానవ వనరులను సంసిద్ధం చేయడంలో రాష్ట్రం బాగానే పనిచేసిందని రాశారు.

ప్రభుత్వ సబ్సిడీలను తగ్గించకపోవడంపై ప్రపంచబ్యాంక్ రాష్ట్ర ప్రభుత్వాన్ని క్షమించలేకపోయింది. ఇది రెండు విధానాలలో జరిగింది. ఒకటి, ఆహార భద్రత విషయంలో ముఖ్యంగా పౌరసరఫరాలో ఇంకా స్పష్టంగా చెప్పాలంటే రెండు రూపాయల కిలో బియ్యం పథకం విషయంలో, అలాగే వ్యవసాయదారులకు విద్యుత్ మీద ఇచ్చే సబ్సిడీల విషయంలో ఉదారంగా ప్రవర్తించడమే కాక ప్రపంచబ్యాంక్ ఆదేశాలను ఖాతరు చేయలేదనే భావన నివేదికలో స్పష్టంగా ఉంది. ఈ రెండు కార్యక్రమాలకు 2005-06లో 19.8 శాతం ఉండే సబ్సిడీ 2009-10 వరకు 29.2 శాతం పెరగడం, ముఖ్యంగా ఆహార సరఫరాలో రాష్ట్ర స్థూల ఆదాయంలో 0.3 శాతం నుండి 0.6 కు పెరిగి రెండింతలు కావడాన్ని బ్యాంక్ చాలా తప్పుపట్టింది. ఆహార ధాన్యాల సేకరణను ప్రైవేటీకరించడంలో తగినచర్యలు తీసుకుని ప్రైవేట్‌రంగంను ప్రోత్సహిం చడంపై కొంత సంతృప్తిని తెలిపింది. అయితే రాష్ట్ర ప్రభుత్వం ఆహార ధాన్యాల సేకరణ చట్టాన్ని 3 మార్చ్, 1990లో అసెంబ్లీలో ప్రవేశపెట్టినా, రాజశేఖరరెడ్డి మరణంతో అది మూలబడి పోయిందని, ఇప్పుడు అది ప్రభుత్వానికి ఒక సవాలుగా నిలిచిందని బ్యాంక్ భావిస్తోంది.

ఇక వైద్య, విద్యారంగాల్లో వచ్చిన లేదా తెచ్చిన మార్పులను బ్యాంక్ మెచ్చుకున్నది. వైద్యంలో 108 అంబులెన్స్ ద్వారా రోగులను త్వరగా ఆస్పత్రులకు చేరుస్తున్నారని, దీని కొరకు 752 అంబులెన్స్ ఉపయోగిస్తున్నారని నివేదికలో ప్రస్తావించింది. ఈ అంబులేన్సులతో గ్రామీణ ప్రాంతాల్లో 21 నిమిషాల్లో, పట్టణ ప్రాంతాలలో 14 నిమిషాలలో రోగుల దగ్గరకు చేరగలుగుతున్నారని ప్రస్తావించారు. ఇంకా రాష్ట్రంలో 800 ప్రాథమిక వైద్యశాలలు 24 గంటలూ పనిచేస్తున్నాయని, అలాగే ఆరోగ్యశ్రీ పథకం ద్వారా 942 రకాల అనారోగ్యాలను ఎదుర్కోగలుగుతున్నారని, అలాగే ఆరోగ్య బీమా పథకాన్ని అమలు పరచడంలో రాష్ట్రం కృతకృత్యమైందని పేర్కొన్నారు. విద్యారంగం విషయంలో కొంత మంచి జరిగినా విద్య మీద పెడుతున్న ఖర్చు సరిపోదని పేర్కొంది. ఇంకా పిల్లలు బడికి రాకపోవడం, మధ్యలోనే ఆపివేయడం తగ్గవలసినంతగా తగ్గలేదని అన్నారు. ఈ విషయంలో సర్వ శిక్ష అభియాన్ పథకం బాగానే అమలుపరచారని అంటూ స్కూళ్ల నిర్వహణను పేరెంట్స్‌కు అప్ప చెప్పే విషయంలో, అలాగే ఉపాధ్యాయుల నియామకం విషయంలో బ్యాంక్ చేసిన సూచనల మేరకు తగిన చర్యలు

తీసుకోలేదని తప్పు పట్టారు. ముఖ్యంగా ఉపాధ్యాయుల నియామకం స్కూళ్ల స్థాయిలోనే జరగాలని బ్యాంక్ ప్రతిపాదించినా, దాని గురించి ఏమాత్రం చర్యలు తీసుకోలేదని నివేదిక పేర్కొంది.

స్థూలంగా పేదరిక నిర్మూలన, పెట్టుబడులకు ప్రోత్సాహం, ద్రవ్య వ్యవహారాలలో, ప్రజాధన నిర్వహణలో, ఆహార ధాన్యాల సేకరణలో తప్పించి మిగతా విధాన సంస్కరణల విషయాలలో రాష్ట్రం ప్రపంచబ్యాంక్ నిబంధనలకు అనుగుణంగా సంతృప్తికరమైన మార్పులు చేపట్టిందని, విద్యారంగ విషయంలో లక్ష్యాలను అంత సంతృప్తికరంగా అమలు చేయలేదని, విద్యుత్ రంగం ప్రభుత్వ రంగ సంస్కరణల విషయంలో బ్యాంక్ విధించిన లక్ష్యాల సాధనలో విఫలం చెందారని ప్రస్తావిస్తూ, మొత్తంగా ఇక రాష్ట్రానికి అప్పు కొనసాగించ లేమని స్పష్టంగానే నివేదిక పేర్కొంది.

ఈ నివేదికలో చెప్పిన అంశాల మీద ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సంజాయిషీ ఇచ్చుకుంటూ అప్పు కొనసాగించవలసిందిగా ప్రపంచ బ్యాంక్‌ను కోరింది. ఈ సంజాయిషీలో ప్రధానంగా బ్యాంక్ అప్పు సహాయంతో రాష్ట్రం తన రుణభారాన్ని తగ్గించుకోగలిగింది అని, అలాగే అప్పుని విద్య, ఆరోగ్య రంగాల మీద ఖర్చు చేసామని, ద్రవ్య విధానంలో, బడ్జెట్ రూపకల్పనలో, పారదర్శకత పాటించామని చెపుతూ విద్యుత్ రంగంలో విద్యుత్ పంపిణీ పద్ధతులను మెరుగు పరచామని అంటూ, విద్యుత్ సబ్సిడీ వలన ఆహార ఉత్పత్తిలో పెరుగుదల సాధించామని, ఇపుడు ఈ విద్యుత్ సబ్సిడీకి ప్రత్యామ్నాయ పద్ధతులను అన్వేషిస్తున్నామని తమ సంజాయిషీలో చెప్పింది. పబ్లిక్ రంగ సంస్థల సంస్కరణల రంగంలో ప్రతి సంస్థ సంస్కరణలను వేరు వేరుగా చూడాలి. ఈ సంస్కరణలు ఆయా సంస్థ ప్రతిపాదించ వలసి ఉంటుంది. భవిష్యత్తులో ఈ కోణం నుండే సంస్కరణలను ప్రవేశపెడతామని ఒక అస్పష్టమైన అభిప్రాయాన్ని రాష్ట్ర ప్రభుత్వం తీసుకుంది. ఇక ఆరోగ్య రంగంలో చాలా మార్పులు చేశామని దేశంలో ప్రప్రథమంగా 108 అంబులెన్స్ సేవలను ప్రవేశ పెట్టామని తమను తాము అభినందించుకొన్నది. భూసంస్కరణలను కూడా చేపట్టామని అలాగే గ్రామీణ ఉపాధిహామీ పథకాన్ని చేపట్టి పేదరిక నిర్మూలనకు కృషి చేశామని రాసారు. వేగవంతమైన ఆర్థిక అభివృద్ధి కోసం ప్రత్యేక ఆర్థిక మండలాల విధానాన్ని అమలు చేసామని రాసారు.

ప్రపంచబ్యాంక్ నివేదికను రాష్ట్ర ప్రభుత్వ విజ్ఞప్తిని చూస్తే ఇది ఒక అప్పిచ్చు సంస్థకు ఒక ప్రజాస్వామ్య సార్వభౌమ ప్రభుత్వానికి మధ్య సంబంధంగా కనిపించదు. ఇది ఒక యజమాని బానిస సంబంధాలుగా మారింది. ప్రపంచబ్యాంక్ అప్పు అది అప్పు కాదని అది మొత్తం దేశానికే ముప్పు అని గత రెండు దశాబ్దాలుగా మన రాష్ట్రంలో మొదటి నుండే మాట్లాడిన చాలామంది ఉన్నారు. అప్పిచ్చిన వాడు ఇలా ఎదమీద కూచుని నేను చెప్పింది వింటావో చస్తావో అని అడిగినట్లుంది. ఇది ఏం అప్పు, ఇది ఎందుకు తెచ్చినట్లు, ఇంత దాసోహం అనడమెందుకు పాలకులు ప్రజల స్వేచ్ఛను ఎందుకు తాకట్టు పెట్టినట్లు అనే ప్రశ్నలు అడగక తప్పదు. ప్రపంచబ్యాంక్ ముప్పు నుండి తెలుగు ప్రజలు, ప్రజా పోరాటాలు, తెలంగాణ ఉద్యమం రాష్ట్రాన్ని తప్పించ గలిగాయి. బ్యాంక్ చంద్రబాబు హయాంను చాలా మెచ్చుకుంది. చంద్రబాబు ఎందుకు ఓడిపోయాడు అనే ప్రశ్న ఎక్కడ అడగలేదు. దీని నుంచి 'ప్రభుత్వం మారినందుకు' అనే ఒక క్యాజువల్ రిమార్క్ చేసారు. సబ్సిడీలు వద్దని చెప్పడానికి వీళ్లు ఎవరు? రైతులు ఇంత పెద్ద ఎత్తున ఆత్మహత్యలు చేసుకున్నారని కాని, విద్యుత్ అప్పుల మాఫీ, విద్యుత్ సబ్సిడీ కొన్ని ప్రాణాలను రక్షించిందని బ్యాంక్ గుర్తించడానికి నిరాకరించింది. ఒకవైపు పేదరిక నిర్మూలన అంటూనే, మరోవైపు ఆహార ధాన్యాల సేకరణ గురించి, ఆహార ధాన్యాల మీద ఇచ్చే సబ్సిడీకి అభ్యంతరం చెప్పింది. ఇది రైతులకు, పేదలకు ఎంత శతృ సంస్థో గమనించవలసిన అవసరం ఏర్పడింది.

మన రాష్ట్రంలో నాగార్జునసాగర్ ప్రాజెక్ట్ నిర్మాణం మొదలు ఇప్పటి జలయజ్ఞం దాకా ప్రజాధనం కొల్లగొట్టి అతి సంపన్నులైన కాంట్రాక్టరు వర్గం ఒకటి ఉంది. ఈ వర్గం ఇంతింతై వటుడింతై అన్నట్లు వీళ్లు ప్రపంచ బ్యాంక్ పేర్కొన్న ఎనిమిది రంగాలను దోచుకునే వాళ్లలో ఉన్నారు. వీళ్లే చాలామంది మీడియా మీద పట్టు సాధించారు. ప్రపంచబ్యాంక్ కనుసన్నల్లో మెదలిన చంద్రబాబుకు విపరీతమైన జాతీయ, అంతర్జాతీయ ప్రచారాన్ని కల్పించారు. ఈ నివేదికలో కూడ ఈ రాష్ట్రం ఆర్థిక సంస్కరణలలో అగ్రభాగాన (లీడ్) ఉన్నదని అభినందించారు. అలాగే హైదరాబాద్ దేశంలోనే పెట్టుబడులకు రెండవ మహానగరంగా ఎదిగింది అని అన్నారు. ఆ సంస్కరణల వలన, ఈ మహానగర అభివృద్ధి వలన ఎవరికి ఏం మేలు జరిగింది అని అడగలేదు. ఇవ్వాళ హైదరాబాద్ నగరం ఇంత వివాదాస్పదంగా మారడానికి ప్రపంచ బ్యాంక్ విధానాలు ఒక ప్రధాన కారణం. మేలు జరిగిన వారు ప్రపంచబ్యాంక్‌ను బ్యాంక్ విధానాలను సంపూర్ణంగా అంగీకరించారు.

తెలంగాణ ఉద్యమం ఈ సంస్కరణల హవాకు ఒక అడ్డు కట్టవేసింది. ఈ ఉద్యమానికి భిన్న కారణాలతో బాటు ప్రపంచబ్యాంక్ విధానాలు కూడా ఒక ప్రధాన కారణం. ప్రాంతీయ సమానతలు, పట్టణ-గ్రామీణ అభివృద్ధిలో సమతౌల్యం, పట్టణాలలో పేదల పరిస్థితులు, శ్రామికులకు, రైతాంగానికి ఆర్థిక అభివృద్ధిలో న్యాయమైన వాటా లాంటి విలువలు ఏవీ ప్రపంచబ్యాంక్ ఆలోచనా విధానంలో మచ్చుకు కూడా లేవు. ఈ రెండు దశాబ్దాల ఆర్థిక సంస్కరణల పర్యవసానంగా గ్రామీణ ప్రాంతాల్లో వ్యవసాయం విధ్వంసం కావడమే కాక, భిన్న చేతి వృత్తుల్లో జీవించేవారి వృత్తులు ధ్వంసమై, ఏ ప్రత్యామ్నాయం లేకుండా మారడంతో జీవితం విచ్ఛిన్నమైపోయింది. ఈ అంశాన్ని చేనేత కార్మికుల ఆత్మహత్యల్లో చూసాం. దీనితో ప్రాంతీయ ఉద్యమంలోకి ఎన్నడూ చూడని స్థాయిలో భిన్న వృత్తుల వాళ్లు ఉద్యమానికి మద్దతు ఇస్తున్నారు. ప్రభుత్వ ఉద్యోగుల సంఖ్యను తగ్గించమని ప్రపంచబ్యాంక్ ఖరాఖండిగా చెప్పింది. లేని ఉద్యోగాల కొరకు రెండు ప్రాంత విద్యార్థులు పోటీ పడుతున్నాయి. దళితులలోని రెండు ఉపకులాలు పోటీ పడుతున్నారు. పోటీ పడడం సహజమే, కాని కారణాలను వెతకడం చాలా అవసరం. లేని ఉద్యోగాల కొరకు ఉద్యమించడం కంటే, ఉద్యోగాలను తగ్గించమని ఆదేశించిన దుర్మార్గ విధానాల గురించి చర్చ జరగడం లేదు.

రాష్ట్రంలోని రెండు ప్రాంతాలు, ముఖ్యంగా తెలంగాణ ప్రాంతం ఈ సమస్యను తీవ్రంగా పట్టించుకోవాలి. తెలంగాణ రాష్ట్రం ఏర్పడి ప్రపంచబ్యాంక్ విధానాలు కొనసాగించినా, ప్రపంచీకరణను అంగీకరించినా, దేని కొరకు రైతులు, చేతి వృత్తుల వాళ్లు, యువత

*మారుతి కార్ల ఉత్పత్తి వెనుక చిందుతున్న కార్మికుల చెమటా, రక్తం గురించీ, యాజమాన్యాల దుర్మార్గాలకు వ్యతిరేకంగా జరుగుతున్న కార్మిక పోరాటాల గురించీ వివరిస్తున్నారు* **పి.వి. రమణ**

# మారుతి సుజుకి కార్మికుల పోరాటం

హర్యానాలో మారుతి సుజుకి ఇండస్ట్రీస్ లిమిటెడ్ (ఎంఎస్ఐఎల్) కార్ల కంపెనీ 'మానెసర్' ప్లాంట్ నెం. 2లో జూన్ 2011 నుండి జరుగుతున్న కార్మికుల పోరాటం, భారతదేశ కార్మిక వర్గానికి స్ఫూర్తినిచ్చే దిశలో కొనసాగుతోంది.

గుర్‌గాంవ్ ప్లాంట్ నెం. 1లో మేనేజ్‌మెంట్‌కు అనుకూలంగా ఉన్న 'మారుతి ఉద్యోగ్ కామ్‌గర్' యూనియన్ (ఎం.యు.కె.యు.)కు వ్యతిరేకంగా మానెసర్ ప్లాంట్ నెం. 2లో రెండు వేల మంది రెగ్యులర్, క్యాజువల్ కార్మికులు 'మారుతి సుజుకి ఎంప్లాయిస్ యూనియన్' (ఎం.ఎస్.ఇ.యు.) గా ఏర్పడి జూన్ 3న రిజిస్ట్రేషన్ కోసం లేబర్ డిపార్ట్‌మెంట్‌కు సంబంధిత పత్రాలు సమర్పించారు. ఈలోపున మేనేజ్‌మెంట్ తమ తొత్తు యూనియన్ అయిన ఎం.యు.కె.యు. కు అనుకూలంగా బలవంతపు సంతకాలు సేకరణ మొదలుపెట్టింది. ఖాళీ పేపర్ల మీద సంతకాలు పెట్టకపోతే తీవ్ర పరిణామాలు ఎదుర్కోవాలని, ఉద్యోగాలు పోతాయని బెదిరించారు. దీంతో కార్మికులు జూన్ 4 నుంచి 'టూల్ డౌన్' సమ్మె ప్రారంభించారు. జూన్ 6న మేనేజ్‌మెంట్ పదకొండు మంది యూనియన్ కార్యకర్తలని డిస్మిస్ చేసింది. 10న హర్యానా ప్రభుత్వం, సమ్మెను నిషేధిస్తూ, పరిసరాల్లో నిషేదాజ్ఞలు విధించి, సమ్మెను చట్టవిరుద్ధమని ప్రకటించింది.

జూన్ 4న ప్రారంభమై 17 వరకు, 14 రోజులు సాగిన సమ్మె కాలమంతా కార్మికులు ఫ్యాక్టరీలోపలే ఉండి ఆందోళన కొనసాగించారు. పోలీసులు, కంపెనీ గూండాలు క్యాంటీనుల్లో మకాం వేసారు. మేనేజ్‌మెంట్ కార్మికులకు బయట నుండి సహాయం అందకుండా గేట్లన్నింటినీ మూసివేసింది. మీడియాతో కలవకుండా కట్టడి చేసారు. ఆహారం, నీరు, కరెంటు సప్లై, టాయ్‌లెట్ సదుపాయాల్ని పరిమితం చేసింది. (రెండు వేల మందికి ఒక టాయ్‌లెట్). జూన్ 6న కార్మికుల ప్రదర్శన తర్వాత వాటన్నింటినీ పునరుద్ధరించింది. పరిసరాల్లో ఉన్న ఇతర కంపెనీల యూనియన్లు ఎ.ఐ.టి.యు.సి., సి.ఐ.టి.యు., ఎచ్.ఎం.ఎస్., ఐ.ఎన్.టి.యు.సి., యు.టి.యు.సి.లు సమ్మెకు మద్దతుగా 'ఐక్య కార్యాచరణ కమిటీ'గా ఏర్పడ్డాయి. జూన్ 9న గుర్‌గాంవ్ చుట్టుపక్కల ఉన్న అరవై కంపెనీల కార్మికులతో నిరసన ప్రదర్శన జరిగింది. ఈ సందర్భంగా రెండు ట్రక్కులలో వచ్చిన పోలీసులు ఫ్యాక్టరీ ఆవరణలో మకాం వేశారు.

జూన్ 12న మేనేజ్‌మెంట్ డిస్మిస్ చేసిన పదకొండు మందిలో ఐదుగురిని తిరిగి తీసుకొంటామని ఆఫర్ చేసినా యూనియన్ నాయకత్వం ఒప్పుకోలేదు. కార్మికుల ఐక్యతను, చైతన్యాన్ని చూసిన ఎ.ఐ.టి.యు.సి. జాతీయ నాయకుడు గురుదాస్ గుప్తా 'ఇలాంటి కార్మికుల ఐక్యత అపూర్వం. వారి మనోస్థైర్యం చాలా పై స్థాయిలో ఉంది. అందుకే గుర్‌గాంవ్‌లో ఉన్న కార్మిక సంఘాలన్నీ మద్దతు నిస్తున్నాయ'ని అన్నారు.

మేనేజ్‌మెంట్‌కు హెచ్చరికగా జూన్ 14న గుర్‌గాంవ్ చుట్టుపక్కల ఉన్న అరవై ఫ్యాక్టరీల్లో కార్మికులు 'టూల్ డౌన్ సమ్మె'ను ప్రకటించి ముఖ్యమంత్రి, లేబర్ కమిషనర్లు సమస్యను పరిష్కరిస్తామని, ఒక్కరోజు సమయం కావాలని కోరినందుకు తమ నిరసనను వాయిదా వేసుకొన్నారు. జూన్ 15న, బైగుల్ మజ్దూర్ దస్తా' సంఘ్ కార్యకర్తలు

---

పోరాడుతున్నారో వాటికి పరిష్కారాలు దొరకవు. ఒక ఉధృత ఉద్యమంలో పాల్గొని జీవితాలు బాగుపడతాయని కాంక్షించి, రాజీ లేకుండా పోరాడిన వాళ్లు, మా ఖర్మ ఇంతే అని ఊరుకోరు. వేరు తెలంగాణ పోరు తెలంగాణగా మారితే ఎవ్వరూ ఆపలేరు. ప్రజలు పోరాడడం మొదలు పెడితే దేనికి పోరాడాలన్నది ముందు నాయకత్వాలు చెపుతాయి, తర్వాత ప్రజలే నిర్ణయించుకుంటారు.

ప్రపంచ బ్యాంక్ కూడా మన రాష్ట్రంలో చేసిన ప్రయోగం నుండి సరియైన పాఠాలు నేర్చుకుంటే (నేర్చుకోరు, అది వేరే విషయం) అప్పుల వాడు ప్రవర్తించే పద్ధతిలోనే ప్రవర్తించాలి తప్ప, ప్రపంచ నియంతగా, సామ్రాజ్యవాద ఏజెంటుగా స్థానిక సమస్యలు విస్మరించి, ప్రజా ప్రయోజనాలను కాదని ఒక విధ్వంస నమూనాను ప్రాంతాల మీద, దేశాల మీద మోపడం వలన వచ్చే పర్యవసనాన్ని సరిగ్గా అంచనా వేసుకోవాలి. ప్రజల సమస్యలకు కేవలం వృద్ధిని ప్రోత్సహించే పెట్టుబడి పరిష్కారం కాదు అనే సత్యాన్ని ఈ రాష్ట్ర ప్రయోగం స్పష్టంగానే బయటకు తీసుకువచ్చింది. రాష్ట్రంలోని రాజకీయ పార్టీలు, ముఖ్యంగా తెలుగుదేశం పార్టీ ఇంతవరకు సరియైన పాఠం నేర్చుకున్నట్లుగా అగుపించడం లేదు. ఒక మాఫియా వర్గం బలీయంగా ఉన్న ప్రాంతంలో పాఠాలు నేర్పడం గాని, నేర్చుకోవడం గాని సాధ్యం కాదు. కాని ప్రపంచబ్యాంక్ నివేదిక ప్రజలకు కనువిప్పుగా ఉన్నందుకు కళ్లు తెరచి చూడడం మనం నేర్చుకోవాలి. ఈ నివేదిక మీద చర్చ తెలంగాణ ఉద్యమంలో ఒక భాగంగా జరగాలి.

*(రచయిత ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం రాష్ట్ర నాయకులు)* వీ

పోరాటానికి మద్దతుగా బహిరంగ సభ ఏర్పాటు చేసి మాట్లాడుతుండగా కంపెనీ గూండాలు దాడిచేసి గాయపర్చారు. ఢిల్లీ కామ్‌గార్ యూనియన్, జాయింట్ వర్కర్స్ స్ట్రగుల్ ఫ్రంట్, గోరఖ్‌పూర్‌లు కార్మికులకు మద్దతునిచ్చాయి.

చివరకు జూన్ 17న మేనేజ్‌మెంట్ దిగివచ్చి, తీసేసిన పదకొండు మంది కార్మిక నాయకుల్ని తిరిగి తీసుకుంటామని హామీ ఇచ్చింది. అంతవరకు కంపెనీలో ఒక్కరోజు సమ్మెకు ఎనిమిది రోజుల జీతం కట్ చేసే విధానం ఉండేది. ఇప్పుడు రెగ్యులర్ కార్మికులకు ఒక్కరోజుకు రెండు రోజుల జీతం, కాంట్రాక్టు కార్మికులకు, అప్రెంటిస్ కార్మికులకు ఒక్కరోజుకి ఒక్కరోజు జీతం కోతను అంగీకరించింది. సమ్మె చేసిన కార్మికులపై ప్రతీకారచర్యలు తీసుకోమని హామీ ఇచ్చింది. ఒప్పందాలపై కార్మిక నాయకులు, లేబర్ కమిషనర్ మేనేజ్‌మెంట్ సంతకాలు చేశారు.

'మానేసర్' ప్లాంట్ కార్మికుల పోరాటం పాక్షికంగానైనా విజయ వంతం కావడం, చుట్టుపక్కల ఉన్న పారిశ్రామిక ప్రాంత కార్మికులకు గొప్ప ఉత్తేజాన్నిచ్చింది. ప్రభుత్వ యంత్రాంగం, మేనేజ్ మెంట్లు కుమ్మక్కై కార్మికుల చిన్నపాటి కదలికనయినా సహించలేక, ఉక్కుపాదంతో అణచివేస్తున్న తరుణంలో ఈ పాటి విజయం గొప్ప ఉత్సాహాన్ని నింపింది. 2005లో హోండా మోటార్ సైకిల్ అండ్ స్కూటర్ ఇండియా (ఎచ్.ఎం.ఎస్.ఐ.) కంపెనీలో కార్మికులపై జరిగిన మారణకాండకు గుర్తుగా ప్రతీ సంవత్సరం జులై 25న సంస్మరణ దినం నిర్వహిస్తున్నారు. దానికి గత సంవత్సరం మూడు వేల మంది కార్మికులు హాజరయితే ఈ సంవత్సరం ఎనిమిది వేలమంది కార్మికులు హాజరయ్యారంటే మారుతి సుజుకి కార్మికుల పోరాట ప్రభావమేనని చెప్పవచ్చు.

కార్మికులది పై చెయ్యి అవడం ఏ మాత్రం సహించలేక యాజమాన్యం క్రమశిక్షణా రాహిత్యంతో కార్మికులు 'గోస్లో' చర్యల ద్వారా ఉత్పత్తిని దెబ్బతీస్తున్నారని, విద్రోహ చర్యలు సాగిస్తున్నారనే తప్పుడు అభియోగాలతో ఆగస్ట్ 29న కంపెనీ లాకవుట్ ప్రకటించింది. పదకొండు మంది కార్మికుల్ని డిస్మిస్, పది మంది కార్మికుల్ని సస్పెండ్ చేసింది. తిరిగి ఆగస్ట్ 30న మరో 28 మంది కార్మికుల్ని సస్పెండ్ చేసింది. తుపాకులతో ఐదు వందల మంది పోలీసులు, కంపెనీ గూండాలు ఫ్యాక్టరీకి కాపలాగా నిలబడ్డారు.

సెప్టెంబర్ 1న యూనియన్ పిలుపు మేరకు, హర్యానాలో గుర్‌గాం వ్, మానేసర్, ధిరూహెరా, బావాల్ పారిశ్రామిక ప్రాంతాల నుండి సుజుకి పవర్ ట్రైన్, హోండా మోటార్ సైకిల్, హీరో హోండా, ఫ్రీ రికో, రీకో ఆటో, ఓమాక్స్, లూమెక్స్, సోనాస్టీరింగ్, ఇంకా అనేక ఇతర కంపెనీల నుండి ఐదువేల మంది కార్మికులతో ఊరేగింపు, మీటింగ్ జరిపారు. చుట్టు పక్కల గ్రామాల ప్రజలు, విద్యార్థులు, యువజనులతో పాటు ఢిల్లీ, హర్యానాల్లోని యూనివర్సిటీ, కాలేజీల నుండి విద్యార్థులు, మేధావులు కూడా ఈ ప్రదర్శనలో పాల్గొనడం విశేషం.

సెప్టెంబర్ 5న నాలుగు వేల మంది కార్మికులు హైవేను నిర్బంధించారు. సెప్టెంబర్ 12న ఐక్య ర్యాలీతో గుర్‌గావ్ బంద్‌కు డెమొక్రటిక్ స్టూడెంట్స్ యూనియన్ (డి.ఎస్.యు.), ఆల్ ఇండియా స్టూడెంట్స్ అసోసియేషన్ (ఎ.ఐ.ఎస్.ఎ.), ఆల్ ఇండియా స్టూడెంట్స్ ఫెడరేషన్ (ఎ.ఐ.ఎస్.ఎఫ్.), విద్యార్థి యువజన సభ (వి.వై.ఎస్.)లు మద్దతు ప్రకటించాయి. క్రాంతికారి యువజన సభ (కె.వై.ఎస్.) కార్మికుల పోరాటంపై వివరంగా కరపత్రం వేసి మద్దతు తెలిపింది.

సెప్టెంబర్ 14న మానేసర్ సుజుకి కార్మికుల పోరాటానికి మద్దతుగా అదే కంపెనీకి చెందిన సుజుకి మోటార్ సైకిల్ ఇండియా ప్రై. లిమిటెడ్, సుజుకి కాస్టింగ్స్, సుజుకి పవర్ ట్రైన్ ఇండియా లిమిటెడ్ కార్మికులు సమ్మె ప్రారంభించారు. దీంతో మేనేజ్‌మెంట్ గుర్‌గాం వ్, మానేసర్ ప్లాంట్లలో ఉత్పత్తిని నిలిపి వేస్తున్నట్లు ప్రకటించింది. ఈ సమ్మె ప్రభావంతో కార్ల విడిభాగాలు ఉత్పత్తి చేసే 'ముంజాల్ షోవా లిమిటెడ్' కంపెనీలో కార్మిక నాయకుల్ని బదిలీ చేసినందుకు నిరసనగా సమ్మె ప్రారంభించారు.

సెప్టెంబర్ 15న కాంట్రాక్టు కార్మికులు, సూపర్ వైజర్లు, పోలీసుల సహాయంతో ఫ్యాక్టరీ లోపలికి వెళ్లేందుకు ప్రయత్నించినపుడు సమ్మె చేస్తున్న కార్మికులు అడ్డుకున్నారు. పోలీసులు, గూండాలు జరిపిన దాడిలో కార్మికులకు గాయాలయ్యాయి. కొంతమందిని అరెస్టు చేశారు. కార్మికులే దాడి చేసారని మేనేజ్‌మెంట్ ఆరోపణ చేసింది.

సెప్టెంబర్ 18న యూనియన్ నాయకులు శివకుమార్ (జనరల్ సెక్రటరీ), సోనుకుమార్ (ప్రెసిడెంట్) రవీందర్‌లు మేనేజ్‌మెంట్‌తో రాత్రి వరకు చర్చలు సాగించి 10:30 గంటలకు బయటకు రాగానే పోలీసులు అరెస్టు చేశారు. వారిలో రవీందర్‌పై దాడి కేసులో ప్రమేయ ముందని ఎఫ్ఐఆర్ ఉంది. మిగతా ఇద్దరిపై ఎలాంటి కేసులు లేకపోయినా అరెస్టు చేశారు. సుజుకి కంపెనీ యాజమాన్యం ఏజెంట్‌లా వ్యవహరిస్తూ హర్యానా ప్రభుత్వం, పోలీసులు, తమ న్యాయమైన డిమాండ్ల పరిష్కారం కొరకు సాగిస్తోన్న కార్మికుల పోరాటాన్ని అణచి వేయాలనే లక్ష్యంతో చేసిన ఈ అరెస్టులను ఖండిస్తూ, హక్కుల సంఘాలైన పి.యు.డి.ఆర్ (ఢిల్లీ), పి.యు.సి.ఎల్. (హర్యానా), సిటిజెన్స్ ఫ్రంట్ ఇన్ సపోర్ట్ ఆఫ్ సుజుకి వర్కర్స్ స్ట్రగుల్ అరెస్టు చేసిన కార్మిక నాయకుల్ని వెంటనే విడుదల చేయాలని, వారితో చర్చలు కొనసాగించి సమస్యను వెంటనే పరిష్కరించాలని డిమాండ్ చేశాయి. సెప్టెంబర్ 22న కార్మికుల పోరాటానికి మద్దతునిస్తూ, వివిధ కార్మిక సంఘాలు, మజ్దూర్ ఏక్తా కేంద్ర, మజ్దూరీ ఏక్తా కమిటీ, సెంటర్ ఫర్ స్ట్రగులింగ్ వర్కర్స్ ట్రేడ్ యూనియన్, క్రాంతికారీ యువ సంఘటన్, ఎఐఎఫ్‌టియు, ఇంక్విలాబ్ మజ్దూర్ కేంద్రంల ఆధ్వర్యంలో 'హర్యానా భవన్' వద్ద నిరసన ప్రదర్శన జరిపాయి.

ప్రపంచీకరణలో భాగంగా మన దేశంలో కార్ల కంపెనీలు అత్యంత వేగంగా పెరగడం కనిపిస్తుంది. ఇక్కడ కార్మికుల శ్రమశక్తి విలువ కారుచౌక అవడం వలన, మల్టీనేషనల్ కంపెనీలు, కార్లను తక్కువ ధరలకు ఉత్పత్తి చేస్తూ, ప్రపంచకార్ల మార్కెట్‌కే పోటీగా నిలబడు తున్నాయి. అందుకే మన దేశంలో తయారయ్యే కార్లకు దేశీయంగానే కాకుండా విదేశీ మార్కెట్లలో డిమాండ్ అధికంగా ఉంది.

గుర్‌గాం వ్, చుట్టుపక్కల పారిశ్రామిక ప్రాంతాలలో దాదాపు ఇరవై లక్షల మంది కార్మికులు పని చేస్తున్నట్లు ఒక అంచనా. వారిలో ఆటోమోటివ్ పరిశ్రమల్లో దాదాపు పది లక్షల మంది పనిచేస్తున్నారు. వీరిలో 80 నుండి 90 శాతం వరకు కాంట్రాక్టు కార్మికులే. ఆ రాష్ట్ర ప్రభుత్వం నిర్ణయించిన కనీస వేతనం కన్నా తక్కువ చెల్లిస్తూ పనులు చేయించుకుంటారు. రోజుకు దాదాపు పది నుండి పన్నెండు గంటల వరకు పని చేయాలి. సెలవులుండవు. ఒక రోజు పని మానివేస్తే వెయ్యి

రూపాయల వరకు జీతం కట్. అధిక శాతం ఫ్యాక్టరీలలో యూనియన్లు లేవు. జాతీయ కార్మిక సంఘాలు వీరి గురించి పెద్దగా పట్టించుకోవు. పడుతున్న బాధలు సహించలేని పరిస్థితుల్లో స్వంత యూనియన్ ఏర్పాటుకు ప్రయత్నిస్తే, మేనేజ్‌మెంట్ గూండాల దాడులు, పోలీసుల దాడులు. ఉన్న బతుకుతెరువు పోతుందేమోనని భయం.

గుర్‌గాంవ్‌లో మారుతి సుజుకి ఫ్యాక్టరీ 300 ఎకరాలలో ఉంది. సంవత్సరానికి ఏడులక్షల కార్లు ఉత్పత్తి చేస్తాయి. అందులో ఇంజన్ ప్లాంట్‌లో 7.5 లక్షల ఇంజన్లు ఉత్పత్తి అవుతాయి. మానేసర్‌లో ప్లాంటు 600 ఎకరాలలో ఉంది. 2007లో ఉత్పత్తి ప్రారంభమైంది. దీనిలో సంవత్సరానికి మూడు లక్షల కార్ల ఉత్పత్తి జరుగుతోంది. ఇందులో ఇంకొక అసెంబ్లీ ప్లాంట్‌లో మార్చ్ 2012 నుండి ఉత్పత్తి ప్రారంభ మవుతుంది. దీనిలో సంవత్సరానికి రెండు లక్షల కార్లు ఉత్పత్తి అవుతాయి. దీని పక్కనే ఉన్న సుజుకి పవర్ ట్రైన్ డీజల్ ఇంజన్ ఫ్యాక్టరీలో మూడు లక్షల ఇంజన్‌లు తయారవుతాయి.

అసలు ఉత్పత్తి పరిమితి పన్నెండు లక్షలే అయినా 2010-11లో 12.7 లక్షల కార్లు ఉత్పత్తి అయ్యాయి. అంటే అధికంగా 70 వేల కార్లు ఉత్పత్తి అయ్యాయి. 2010-11లో 120 విదేశాలకు 1.4 లక్షల కార్లు ఎగుమతి చెయ్యబడ్డాయి.

మారుతి సుజుకి కంపెనీ ప్రభుత్వానికి ఎక్సైజ్ డ్యూటీ, ఇతర పన్నులకు రు. 4290.81 కోట్లు చెల్లించింది. హర్యానా ప్రభుత్వానికి పన్నుల రూపంలో రు. 820.11 కోట్లు చెల్లించింది. ముడిసరుకుల కోసం రు. 27,576.13 కోట్లు, బ్యాంక్ వడ్డీలకు రు. 24.41 కోట్లు, ఉద్యోగులకు రు. 703.62 కోట్లతో పాటు ఇతర చెల్లింపులు చెల్లించగా నికర లాభం రు. 2288.64 కోట్లు.

ఉద్యోగులకిస్తున్న రు. 703. 62 కోట్లలో ఫ్యాక్టరీ కార్మికులకు చెల్లిస్తున్నది రు. 123.64 కోట్లు మాత్రమే. అంటే కంపెనీకి వచ్చిన లాభాలలో కేవలం 5.4 శాతం మాత్రమే. మార్చ్ 2011నాటికి కంపెనీలో 8500 మంది ఉద్యోగులున్నారు. వారిలో ఫ్యాక్టరీ కార్మికులు గుర్‌గాంవ్‌లో 2300, మానేసర్‌లో 900 మంది.

అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐ.ఎల్.ఒ.) లెక్కల ప్రకారం మారుతి సుజుకి ఫ్యాక్టరీలలో 15 శాతం రెగ్యులర్ 85 శాతం కాంట్రాక్టు కార్మికులున్నారు. నోకియా కంపెనీలో 50 శాతం రెగ్యులర్, 50 శాతం కాంట్రాక్టు కార్మికులు; ఫోర్డ్ కంపెనీలో 25 శాతం రెగ్యులర్, 75శాతం కాంట్రాక్టు కార్మికులున్నారు. అంటే మారుతి సుజుకి ఎంత ఎక్కువ స్థాయిలో కాంట్రాక్టు కార్మికులతో పని చేయిస్తుందో అర్థం అవుతుంది.

'పనిలోనైనా, ఇంటిలోనైనా భద్రతదే మొదటి స్థానం' అన్న స్లోగన్ కంపెనీ ధ్యేయంగా ప్రకటించుకుంది. ఆ విధంగానే జపాన్‌లో సరుకు నాణ్యత, ధర, ఉత్పత్తిలలో తేడా వచ్చినా ఫరవాలేదు గాని భద్రత విషయంలో ఏ లోటునూ అంగీకరించరు. కాని మన దేశంలో భద్రత కన్న మిగతావే ప్రధానం.

నాణ్యత కోసం కార్మికుల్ని విపరీతంగా వేధిస్తుంటారు. సరైన జీతాలు లేకుండా, పని స్థలంలో సరైన సదుపాయాలు లేకుండా, ఎక్కువ పని గంటలతో పనిలో నైపుణ్యం, సరుకులో నాణ్యత ఎలా వస్తుందో వారే చెప్పాలి. 2006-07లో ప్లాంట్ ఉత్పత్తి సామర్థ్యం 3,50,000 కార్లు అయితే, ఉత్పత్తి అయినవి ఆరు లక్షల కార్లు. అంటే క్వాలిటీ కోసం, ఉత్పత్తి పెంచడం కోసం కార్మికులపై ఎంత ఒత్తిడి తెస్తున్నారో ఎవరికైనా సులభంగా అర్థమవుతుంది. కార్మికులపై నిఘా కోసం ఫ్యాక్టరీ లోపల, బాత్‌రూంలో కూడా కెమెరాలు ఏర్పాటు చేశారు. (చాప్లిన్ మోడరన్ టైమ్స్ గుర్తుకు వస్తుంది.)

పెయింటింగ్ షాప్‌లో 12 రోబోట్‌లు పెయింట్ చేస్తాయి. ఒక్కో కార్మికుడు వాటి దగ్గరకు 25 కేజీల బరువున్న వాడిన స్క్రీన్‌లు మోసుకెళ్లి (రెండు అంతస్తులు మెట్లు ఎక్కి) తిరిగి ముప్పై కేజీల శుభ్రపరిచిన స్క్రీన్‌లు మోసుకురావాలి. భోజన విరామం అరగంట, టీ విరామం 15 నిమిషాలు.. మధ్యలో మంచినీళ్లు తాగడానికి కాని, బాత్‌రూంకు వెళ్లడానికి వీలు లేదు.

క్వాలిటీ మెయింటెనెన్స్ యూనిట్‌లో 95 మంది కార్మికులు పని చేస్తారు. వారు రసాయనిక పదార్థాలతో నిండిన టాంకుల్ని శుభ్రం చేయాలి. వాళ్లను 'సి' షిఫ్టులో పని చేయిస్తారు. అంటే అర్ధరాత్రి 12:30 నుండి ఉదయం 8:30 గంటల వరకు. వీరికి ఎలాంటి భోజన విరామం, టీ విరామం ఉండవు. గతంలో వీరికి ఆహార అలవెన్సు రు. 44 ఇచ్చేవారు. దాన్ని సగానికి తగ్గించేసారు. 'సి' షిఫ్టు పూర్తయ్యేసరికి వారు పూర్తిగా అలసిపోయి, రసాయనిక పదార్థాల ప్రభావం కారణంగా తల తిరగడం, వాంతులవ్వడం జరుగుతుంటుంది. వీరితో నెలకు 32 నుండి 192 గంటల వరకు ఓవర్ టైం చేయిస్తారు. గంటకు రు. 28 అలవెన్స్ ఇస్తారు. ఒక్కోసారి షిఫ్టులో పని విరామం లేకుండా 17 గంటలు పని చేయిస్తారు. క్వాలిటీ కోసం అత్యంత దుర్మార్గపు పద్ధతులు కొనసాగిస్తున్నారు.

అధిక ఉత్పత్తి సాధించినందుకు కార్మికులకు సెల్‌ఫోన్‌లు బహుమతిగా ఇవ్వడం హాస్యాస్పదం. ఎందుకంటే ఎవరికైనా ఫోన్ చేయడానికి సమయమే లేని కార్మికులు ఆ ఫోన్లను పని స్థలంలో ఉపయోగించే అవకాశమే లేదు.

ప్రపంచ పెట్టుబడిదార్లకు నిరంతరం దిశా నిర్దేశం చూపే 'వాల్‌స్ట్రీట్' తమ పత్రిక 'వాల్‌స్ట్రీట్ జర్నల్'లో గుర్‌గాంవ్ పారిశ్రామిక పరిస్థితి గురించి ఒక వ్యాసం ప్రచురించింది. అందులో ముఖ్యాంశాలు కొన్ని చూద్దాం.

'భారతదేశ పారిశ్రామిక కేంద్రాలలో కొద్దికాలంగా సాగుతోన్న ఆందోళనలు పరిశ్రమలను కుదిపేస్తున్నాయి. స్వదేశంలోనూ, విదేశాలకూ చేయాల్సిన కార్ల డెలివరీలు ఆగిపోతున్నాయి. భారత్‌లో కార్ల విడిభాగాలు తయారు చేసే 'రీకో ఆటో ఇండస్ట్రీ'లో జరిగిన సమ్మె కారణంగా అమెరికాలోని ఫోర్డ్ మోటార్ కంపెనీ, జనరల్ మోటార్ ఫ్యాక్టరీలలో వారం రోజుల పని ఆగిపోయింది.

2008-09 ఆర్థిక సర్వే ప్రకారం అధిక కార్మికశక్తితో నడిచే ఆటో పరిశ్రమలు రు. 2.69 ట్రిలియన్ (1 ట్రిలియన్ = 1 లక్ష కోట్లు) ల టర్నోవర్ సాధించాయి. అందులో కేవలం కార్ల విభాగంలో 1.43 ట్రిలియన్లు, కార్ల విడిభాగాలు తయారు చేసే విభాగంలో 76,320 కోట్ల రూపాయలు. దీనిలో 5వ వంతు ఎగుమతుల వల్ల లభించింది.

భారతదేశంలో ఉన్న కార్మిక చట్టాల ప్రకారం కార్మికులకు ఉద్యోగాలు ఇవ్వడం సులువేగాని, తీసేయడం అంత సులువు కాదు.

భారతదేశం ఈ ఆటో విభాగంలో జరుగుతున్న సమస్యను అంతగా పట్టించుకొన్నట్లు లేదు.

భారత్‌లో కార్మిక ఆందోళనలు ఎప్పటి నుంచో సాగుతున్నాయి. కానీ 1982-83 దత్తా సామంత్ నాయకత్వంలో జరిగిన మిలిటెంట్ ఆందోళన వస్త్ర పరిశ్రమను నాశనం చేసింది.

కార్మిక యూనియన్ల ప్రభావంతో కార్మికుల్లో ఒక 'చెడు పని సంస్కృతి' వారిలో మిలిటెన్సీని పెంచింది. అదే 2008లో ఇటాలియన్ కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్ చావుకు దారితీసింది.

ప్రపంచ వ్యాప్తంగా దేశాలన్నింటినీ ఆర్థిక సంక్షోభాలు కుదిపేస్తున్న తరుణంలో పారిశ్రామిక అభివృద్ధి కుంటు పడుతున్న పరిస్థితి ఉంది. ఈ ఆర్థిక సంక్షోభాలు ఏ మాత్రమూ సోకని భారత్ అభివృద్ధిలో మరింత వేగంగా పెరిగే పరిస్థితి ఉంది. ఆ లక్ష్యం సాధించడానికి ఆ దేశం ఆటోమొబైల్ పరిశ్రమలో జరుగుతున్న కార్మికుల ఆందోళనలు అడ్డంకిగా ఉన్నాయి.'

**ఇవీ వాల్‌స్ట్రీట్ జర్నల్‌లోని ముఖ్యాంశాలు.**

జీవించే హక్కులో భాగంగా సాగుతున్న కార్మికుల పోరాటాల్ని 'అడ్డంకి'గా పేర్కొంటూ, వాటిని తొలగించుకోకపోతే అభివృద్ధి లక్ష్యం చేరుకోలేరని, మన దేశ పాలకవర్గాలకు, వాల్‌స్ట్రీట్ జర్నల్ చేసిన హెచ్చరిక చాలా ప్రమాదకరమైన పరిస్థితులకు దారితీస్తుంది. అలాగే పారిశ్రామిక రంగంలో హింసా ధోరణులు పెరగడానికి కార్మికులే కారణంగా విశ్లేషించడం దుర్మార్గం. ఎందుకంటే దేశవ్యాప్తంగా రెగ్యులర్ ఉద్యోగాలు తగ్గిపోవడం, కాంట్రాక్టు ఉద్యోగాలు పెరిగిపోవడం, వారు బతకడానికి వీలులేని నామమాత్రపు జీతాలు చెల్లించడం, తీవ్రమైన ఒత్తిడితో పని చేయడం, ఏ రోజు పని ఉంటుందో తెలియని అభద్రతా భావం, మేనేజ్‌మెంట్ల తొత్తుగా ప్రభుత్వ యంత్రాంగం అణచివేతలు ఇవన్నీ కార్మికరంగంలో తీవ్రమైన అసంతృప్తిని, అశాంతిని పెంచుతున్నాయి. కోట్లాది మంది కార్మికుల జీవితాలు ప్రైవేట్ కంపెనీ యజమానుల దయాదాక్షిణ్యాల మీద ఆధారపడి ఉంటున్నాయి. ఈ ఒత్తిడిలన్నీ హింసా ధోరణులకు దారితీయక తప్పదు.

వాల్‌స్ట్రీట్ జర్నల్ ఉదహరించిన సంఘటనలో వాస్తవాలను చూద్దాం. 2008లో ఉత్తర్‌ప్రదేశ్, నోయిడా పారిశ్రామిక ప్రాంతంలో ఇటలీకి చెందిన 'గ్రాజియానో ట్రాన్స్‌మిస్సోని' కంపెనీలో పనిచేస్తున్న 200 మంది కార్మికుల్ని తొలగించారు. రెండు నెలలుగా ప్రజాస్వామిక పద్ధతుల్లో ఎన్ని ఆందోళనలు సాగించినా మేనేజ్‌మెంట్ పట్టించుకోలేదు. బతుకుతెవురుకి వేరే దారి లేని ఆ కార్మికులు కంపెనీ మేనేజింగ్ డైరెక్టర్ లలిత్ కిషోర్ చౌధరీతో చర్చలు జరిపినా విఫలం కావడంతో కార్మికుల్లో తీవ్ర ఆగ్రహావేశాలు పెరిగాయి. ఆ సందర్భంలో సెక్యూరిటీ గార్డులు తుపాకులతో కాల్పులు జరిపారు. దాంతో కోపంతో ఉన్న కార్మికులు చౌదరీపై దాడి చేసి కొట్టారు. అంతే గాని అతన్ని చంపాలని ప్రయత్నించ లేదు. అతన్ని హాస్పిటల్ తీసుకెళుతుండగా దారిలో చనిపోయాడు.

ఈ సంఘటన జరిగిన వెంటనే అప్పటి కేంద్ర కార్మిక మంత్రి ఆస్కార్ ఫెర్నాండేజ్ 'కార్మికుల్లో పెరుగుతున్న అసంతృప్తే దీనికి కారణం. ఇది యాజమాన్యాలకు ఒక హెచ్చరికగా పనిచేయాలి' అని అసలు కారణాన్ని సరిగ్గానే చెప్పారు. కాని తర్వాత దేశవ్యాప్తంగా వ్యాపార సంఘాలన్నీ విరుచుకు పడడంతో ఆ దాడికి తట్టుకోలేక 'నేను ఎటువంటి హింసను సమర్థించలేదు. జరిగిన సంఘటన గురించి కార్మిక శాఖ మంత్రిగా నేను మాట్లాడాను. నా మాటలు అపార్థం కలిగిస్తే క్షమించండ'ని చెప్పవలసి వచ్చింది.

ఇదే ఘటనపై అప్పటి కేంద్ర కార్యదర్శి సుధా పిళ్లై 'ఇది ఒక చెడు సంఘటన. దీనికి పారిశ్రామిక సంబంధాల విఫలం ప్రధాన కారణం. ఇంత వరకు మన దేశంలో చాలా మంచి పారిశ్రామిక సంబంధాలు కొనసాగుతున్నాయని భావించాం. కాని జరుగుతున్న ఘటనలు చూస్తుంటే అవి అంత సరిగ్గా లేవు అని అర్థం అవుతుంది. అలాగే కార్మిక అశాంతిని పరిష్కరించాల్సిన కార్మిక శాఖ యంత్రాంగ పరిస్థితి చాలా ఘోరంగా ఉంది' అని చెప్పారు.

పై విషయాలను గమనిస్తే సమాజంలో హింసకు దారితీసే పరిస్థితుల్ని చక్కబెట్టనంత కాలం పెరిగే హింసా ధోరణుల్ని అరికట్టడం అసాధ్యమని స్పష్టమవుతుంది.

2005 గుర్‌గాంవ్‌లో హోండా మోటార్ సైకిల్ కంపెనీలో కార్మికులపై జరిగిన మారణకాండ తర్వాత, ఢిల్లీ, గుర్‌గాంవ్, మానేసర్, ఫరీదాబాద్, నోయిడా తదితర పారిశ్రామిక ప్రాంతాలలో అనేక పోరాటాలు జరుగుతున్నాయి. అందులో భాగంగానే మారుతి సుజుకి కార్మికుల పోరాటం. గెలుపు-ఓటమి-గెలుపు దిశలో సాగుతోంది. ఈ పోరాటాలకు ఆ ప్రాంత ప్రజలు, విద్యార్థులు, మేధావులు, హక్కుల సంఘాలు, ప్రజాసంఘాలు, విద్యార్థి సంఘాలు మద్దతునివ్వడం గొప్ప విశేషం. దేశవ్యాప్తంగా ఈ పోరాటాలకు మద్దతు ఇవ్వాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

*(రచయిత ట్రేడ్ యూనియన్ నాయకులు)* వీ

*ఇటీవల వీక్షణం సంచిక తమకు అందలేదని పాఠకుల నుంచి ఫిర్యాదులు వస్తున్నాయి.*
*పోస్టల్ శాఖలో సిబ్బంది కొరత, పత్రికకు తగిన రక్షణ సౌకర్యాలు పోస్టాఫీసుల్లో లేకపోవడం,*
*ఈ మధ్య వర్షాల వల్ల అతికించిన చిరునామాలు ఊడిపోవడం.. ఇలా రకరకాల కారణాలు ఉన్నాయి.*
*ఈ అసౌకర్యానికి చింతిస్తున్నాం. ఈ పరిస్థితులను గుర్తించి కాపీ అందని వారు*
*మాకు ఫోన్ చేస్తే మరొక కాపీ తెప్పించుకోగలరు.*

వీక్షణం పత్రికను ప్రతి నెల 29-30 తేదీల్లో పోస్టు చేస్తాం. పత్రిక 7వ తేదీలోగా అందకపోతే మాకు తెలియపర్చండి.
చందా రెన్యువల్ చేసుకున్న వారికే పత్రికను పంపించడం జరుగుతుంది.

**కార్యాలయం ఫోన్ : 040 - 66843495 (ఉ. 10.30 నుండి సా. 5.30 లోపు)**

**చందా మనీ ఆర్డర్ ద్వారా పంపేవారు వారి చిరునామాతో పాటు ఫోన్ నంబర్ తప్పకుండా రాయండి.**

*జీతన్ మరాండీ, మరి ముగ్గురు కళాకారుల ఉరిశిక్షలను రద్దు చేయాలని కోరుతూ జీతన్ సహచరి అపర్ణ మరాండీ పంచుకున్న విషయాలను అందిస్తున్నారు* **డి.వి. రామకృష్ణారావు**

# ఉరిశిక్షలు రద్దు కావాలి!

**జీ**తన్ మరాండీ, అతనితో సహా ఉరిశిక్షకు గురైన అనిల్‌రాం, మనోజ్ రాజ్వర్, ఛత్రపతి మండల్‌ల ఉరిశిక్షకు సంబంధించిన విషాద గాథ ఇది. జార్ఖండ్ రాష్ట్రం పదకొండేళ్ల క్రితం (15 నవంబర్ 2000) మన దేశంలో 28వ రాష్ట్రంగా ఏర్పడింది. ఆదివాసీలు ఎన్నో పోరాటాలు చేయగా ఏర్పడిన రాష్ట్రం. ప్రత్యేక సాంస్కృతిక వైవిధ్యం, విస్తారమైన అడవులు, బోలెడు ఖనిజ వనరులు, అన్నిటిని మించి అద్భుతమైన శ్రమశక్తిని కలిగిన రాష్ట్రం. ఈ రాష్ట్ర వైశాల్యం 79,714 చ.కి.మీ. అందులో 18,423 చ.కి.మీ.ల వైశాల్యంలో అడవులున్నాయి. జార్ఖండ్ జనాభా మూడు కోట్ల ముప్పై లక్షలు. ప్రధానంగా వ్యవసాయం, అనుబంధ పనులపై జార్ఖండ్ ఆధారపడి ఉంది. దామోదర్, మౌరక్షి, బరాకర్, ఉత్తర్ కోయల్, దక్షిణ కోయల్, శంఖ్, సుబర్నరేఖ, ఖార్కై, అజై ముఖ్యమైన జల వనరులు. మెత్తం సాగుభూమిలో కేవలం ఎనిమిది శాతం భూమికి మాత్రమే సాగునీటి వసతి ఉంది. బొగ్గు, ఇనుము, సున్నపు రాయి, రాగి, బాక్సైట్, పైరైట్, చైనాక్లే, క్రైనైట్, ఫైన్‌క్లే, డోలమైట్, గ్రాఫైట్, బెంటోనైట్, సోప్ స్టోన్, క్వార్ట్జ్ ఇసుక, సిలిక ఇసుక అక్కడ దొరికే ముఖ్యమైన ఖనిజాలు. ఇనుము, బొగ్గు, సిమెంట్, యురేనియం, రాగి, బాక్సైట్‌లను ఉత్పత్తి చేసే పరిశ్రమలున్నాయి.

ఆ రాష్ట్ర జనాభాలో ఆదివాసులు, దళితులు కలిపి 40 శాతం వరకు ఉన్నారు. పాలకుల విధానాలతో అక్కడి వనరులుగానీ, బతుకు దెరువు అవకాశాలు గానీ స్థానికులకు దక్కడం లేదని, అవి స్థానికులకే దక్కాలని అడిగినందుకు జీతన్, అతనితో పాటు ఆ ముగ్గురు కళాకారులు ఉరిశిక్షలకు గురవుతున్నారు. వరుసగా ఈ పదేళ్లలో ఏడు దఫాలు నలుగురు ఆదివాసీ ముఖ్యమంత్రులు మారారు. ఆదివాసీ ముఖ్యమంత్రులే అయినా అక్కడి సామాన్య ఆదివాసులకు, దళితులకు, మొత్తంగా పీడిత ప్రజానీకానికి ఒనగూరిందేమీ లేదు.

ఈ నేపథ్యంతో అనేక ఆదివాసీ పోరాటాలకు పుట్టినిల్లు అయిన జార్ఖండ్ ఆదివాసులు, దళితులు, మొత్తంగా అట్టడుగువర్గాల ప్రజలు తమ కాలి కింద నేలను తమ అభివృద్ధితో నిమిత్తం లేకుండా బహుళజాతి కంపెనీలకు దక్కనివ్వమని అంటూ, తమకోసం, భవిష్యత్ తరాలకోసం ప్రత్యామ్నాయ మార్గాలను, ప్రత్యామ్నాయ పోరాటాలను చేస్తున్నారు. జీతన్ మరాండీని రాష్ట్ర రాజధాని రాంచీలో 2008 ఏప్రిల్ 5న అరెస్టు చేసారు. అలా అరెస్టు చేసినపుడు ఆయన జార్ఖండ్ విస్థాపన విరోధి జన వికాస్ ఆందోళన్ ఏర్పాటు చేసిన బహిరంగ సభనుంచి తిరిగి వస్తున్నాడు. భూ ఆక్రమణలు, అక్రమ ఖనిజ తవ్వకాలు చేస్తున్న ప్రైవేటీ కంపెనీలకు వ్యతిరేకంగా పోరాడుతున్న సంస్థ అది. 2007 అక్టోబర్ 1న ముఖ్యమంత్రి నివాసం ముందు జరిగిన రాస్తారోకోలో ఆదివాసుల నిర్వాసితత్వానికి వ్యతిరేకంగా మాట్లాడినందుకే అరెస్టు చేస్తున్నామని పోలీసులు అతనికప్పుడు చెప్పారు కూడా. కాని ఆ తర్వాత క్రమంలో 27 అక్టోబర్ 2007న జార్ఖండ్‌లో దేవరి పోలీస్ స్టేషన్ పరిధిలోని చిల్ఖారా గ్రామంలో ఒక బహిరంగ సభ ప్రదేశంలో మాజీ ముఖ్యమంత్రి బాబూలాల్ మరాండీ కొడుకు అనూప్ మరాండీని, మరో 19 మందిని మావోయిస్టులు చంపేశారు. జీతన్‌ను అరెస్టు చేసిన కారణం ఒకటైతే ఆ క్రమంలో జీతన్‌ను అతనితో పాటు మిగిలిన ముగ్గురిని కేసులో ఇరికించిన కారణాలు వేరు. జైలులో ఉండగానే ఆయన మీద ఎన్నో కేసులు బనాయించారు. అలా బనాయించిన కేసుల్లో ఒకటి చిల్ఖారీ హత్యాకాండ కేసు. ఈ నేపథ్యంలో గిర్డీ మొదటి అదనపు జిల్లా, సెషన్స్ జడ్జీ 23 జూన్ 2011న ఇచ్చిన తీర్పులో జీతన్ మరాండీకి, ఛత్రపతి మండల్, మనోజ్‌రాజ్వర్, అనిల్‌రాం లకు మరణ శిక్ష విధించాడు.

జీతన్ మరాండీ, అతనితో పాటు మిగిలిన ముగ్గురి ఉరిశిక్షల రద్దు కోరుతూ 30 ఆగస్టు 2011న హైదరాబాదులో జీతన్ మరాండీ కళాబృందం (అనిల్‌రాం, మనోజ్‌రాజ్వర్, ఛత్రపతి మండల్) ఉరిశిక్ష రద్దు కమిటీ ఆధ్వర్యంలో జరిగిన బహిరంగ సభలో పాల్గొనడానికి వచ్చిన జీతన్ సహచరి అపర్ణా మరాండీతో మాట్లాడినపుడు ఆమె చెప్పిన విషయాలు మీతో ఇక్కడ పంచుకుంటున్నాను.

'నాది, జీతన్‌ది ఒకే రకమైన జీవన స్థితిగతులు. మా ఇద్దరి పరిచయం జార్ఖండ్ అభేన్ సంస్థవల్ల ఏర్పడింది. అభేన్ పాటలతోనే, ప్రభావంతోనే నేను నారీముక్తి సంఘటన్ మహిళా సంఘంలో పని చేయడం మొదలు పెట్టాను. జార్ఖండ్ అభేన్‌కు లక్షలాది అభిమానులు, వందల సంఖ్యలో కళాకారులు ఉన్నారు. జీతన్‌తో పాటు శిక్షకు గురైన మిగతా ముగ్గురు అభేన్ సమర్థకులు, అభిమానులు. ఛత్రపతిమండల్ సోదరుడు మావోయిస్టు ఉద్యమంలో పని చేస్తున్నాడు. జీతన్‌కు నాకు ప్రజలకోసం పనిచేసే క్రమంలోనే పరిచయం అయింది. జీతన్ తన బాల్యం నుంచే అంటే 1993 నుంచే ఉద్యమం పట్ల ఆకర్షితుడయ్యాడు. నేనేమి చదువుకోలేదు. జీతన్ అతి కష్టం మీద మూడవ తరగతి వరకు చదువుకున్నాడు. మాకు అసలు చదువుకునే అవకాశం లేదు. ఇంట్లో పని, చేను పనులకు సహాయపడడంతోనే మా బాల్యం గడిచిపోయింది. సమాజం గురించి ఆటపాటలు వినీ, చూసీ మేము ప్రభావితమయ్యాం. సామాజిక మార్పుకోసం పనిచేసే వారు మాకు ఎంతో ప్రేరణ ఇచ్చారు.

వారినుంచే జనాన్ని చైతన్య వంతులు చేసే పనిచేయాలని ప్రేరణ పొందాం. ప్రజలనుంచి, సామాజిక కార్యకర్తల నుంచి మా కెంతో ప్రోత్సాహం దొరికింది. ఇంకా ఎంతో నేర్చుకోవాలని భావించాం. నేను సంఘం వల్లే కాస్త చదువుకోవడం నేర్చుకున్నాను.

నాకు జ్ఞానం వచ్చాక ఎప్పుడూ జీవితంలో కలిసినడిచే వ్యక్తికి ఉండే ఇల్లు, వాకిలి, ఆస్తిపాస్తులు ముఖ్యంకావని అర్థం చేసుకున్నాను. కలిసి జీవించే మనిషికి మంచి నడవడిక, మంచి అలవాట్లు, పద్ధతులు ఉండాలని భావించేదాన్ని. సమాజంలో మర్యాదమన్ననలతో జీవించడం నాకిష్టంగా ఉండేది. అలాంటి వ్యక్తితోనే జీవించాలనుకున్నాను. సమాజం, ప్రజలు ఒక వ్యక్తి గురించి ఏమనుకుంటారనేదే నా వరకు నేను ముఖ్యమనుకున్నాను. జీతన్ పరిచయం అయ్యాక పెళ్లి గురించిన నా ఆలోచన తనతో ప్రస్తావించడానికి మొహమాటమనిపించింది. వెనుక ముందు అయ్యాను. మా పెళ్లి విషయంలో నిర్ణయం నాదే. జీతన్‌తో 'మీకిష్టమైతే మనం పెళ్లి చేసుకుందామని, ఒకవేళ మీకు ఇష్టం లేక పోయినా తెలియజేయండ'ని అన్నాను. దానికి జీతన్ స్పందిస్తూ తనకు ఏమీ అభ్యంతరం లేదని అంటూ, కేవలం మనం నిర్ణయించుకోవడమే కాదు సంఘంతోనూ, ప్రజలతోనూ చెబుదామన్నాడు. వాళ్లంతా కలిసి 2003 లో మా పెళ్లి జరిపించారు.

మాకున్నంత భూమి, కాస్త మెరుగైన ఆర్థిక పరిస్థితి జీతన్ వాళ్లకు లేవు. మాకున్న భూమితో మాకు ఆరు ఏడు నెలలు గడిచిపోయేవి. జీతన్ వాళ్లకున్న భూమ్మీద సంవత్సరంలో మూడు నాలుగు నెలలు కూడ గడవడం కష్టంగా ఉండేది. ఆ భూములు కూడా పరిస్థితులు అన్నీ అనుకూలిస్తేనే పండుతాయి. లేకుంటే లేదు. మా చిన్నతనంలో మా కుటుంబం కు వ్యవసాయంతోనే గడిచిపోయేది. సంఘాలు రాక పూర్వం భూములు మహాజనులు, జమీందార్ల ఆధీనంలో ఉండేవి. సంఘాలు పని చేయడం మొదలయ్యాకే ప్రజలకు కొంత భూమి వచ్చింది. తాతలు, తండ్రుల నుంచి కొంత భూమి వస్తే, స్వాధీనం చేసుకున్న భూమి కొంత. మేము పెరిగే నాటికి భూస్వాములను చూడలేదు.

మా అమ్మ ఉంది, నాన్న చనిపోయారు. మేము మొత్తం ఐదుగురం. ఇద్దరు ఆడ, ముగ్గురు మగ పిల్లలం. మా అన్నలు వ్యవసాయం చేసుకుంటారు. చెల్లి చనిపోయింది. మా గ్రామానికి మంచి నీళ్లు, కరెంట్, స్కూలు, హాస్పిటల్‌లు లేవు. వాగు నీళ్లు తాగుతాం. సాగుకు కూడా నీళ్లు లేవు. ముఖ్యంగా ధాన్యం, మొక్కజొన్న, మహువా, సజ్జ, కందులు పండిస్తారు.

జీతన్ వాళ్ల పరిస్థితి మరీ పేద స్థితి. జీతన్ వాళ్ల ఊరు గిర్డీ జిల్లాలోని పిర్తాండ్ పోలీస్ స్టేషన్ పరిధిలోని కరందో గ్రామం. వాళ్లకున్న వ్యవసాయ భూమి కూడా చిన్న చిన్న ముక్కలుగా ఉంది. అందరూ కూలీనాలీ చేసుకొని బతుకుతారు. జీతన్ తండ్రి కాలుకు కురుపు అయి సరియైన వైద్యం అందక 1996లో చనిపోయారు. జీతన్ తల్లి రాళ్లు కొడుతుంది. నేను కూడ రాళ్లు కొడతాను. జీతన్ అన్నలిద్దరూ రోజు కూలికి పోతారు. మూడు నాల్గు నెలలు ఊళ్లో చేను పనులు చేసుకున్నాక వలస పోవల్సిందే. ఢిల్లీ, బొంబాయిలకు పనులు చేసుకోవడానికి పోతారు. బెంగాల్‌కి కూడా పోతారు. పేదరికం వల్ల పిల్లలు చదువుకునే పరిస్థితి లేదు. సంఘం ఇచ్చిన చైతన్యంతో ఇటీవల చదువుకోవడం కొంత మొదలైంది. వైద్యం కోసం గిర్డీ పోవాల్సిందే. చిన్న చిన్న రోగాలకు లోకల్ ఆర్.ఎం.పి.లు ఉన్నారు. రేషన్ కార్డులు ఇచ్చారు. అయితే వేరుపడిన కుటుంబాలకు కార్డులు లేవు. ఉమ్మడిగా ముప్పై, ముప్పై ఐదు కిలోల బియ్యం కార్డుపై వస్తాయి. ఎన్నో ప్రకృతి వనరులు, మానవ వనరులు ఉన్న జార్ఖండ్‌లో ప్రజలు వలసలు పోయే పరిస్థితి ఉంది. బొగ్గు గొట్టె పనికి పోతారు. బిల్డింగ్‌లకు ఉపయోగించే రాళ్లను కొడతారు. మహిళలు విస్తరాకులు కుడతారు.

జీతన్ అరెస్టు, ఆ క్రమంలో ఉరిశిక్షతో ఇపుడు నేను దేశమంతా తిరుగుతున్నాను. ప్రజలను చైతన్య వంతం చేసే మంచి కళాకారుడు. జ్ఞానం వచ్చినప్పటినుంచి ప్రజాకళాకారుడిగా ఎదుగుతూ వచ్చాడు. ఒక మంచి వ్యక్తిగా రాష్ట్రంలో చిన్నపిల్లల నుంచి వృద్ధుల వరకు అందరూ అతనిని ప్రేమించారు. ఈ సమాజంలో జరుగుతున్న అన్ని రకాల దోపిడీ పీడనలకు వ్యతిరేకంగా తను అనేక పాటలు రాసాడు, పాడాడు, ఆడాడు. ఒక దశాబ్దానికి పైగా సంథాలీ, ఖొత్తా, నాగ్‌పురీ, హిందీ భాషల్లో పాటలు, శ్రవ్యదృశ్య కళారూపాలు ప్రదర్శిస్తున్నారు. ఆడియో, వీడియో క్యాసెట్లు ఆదివాసీ ప్రాంతాల్లో, హిందీ తెలిసిన ప్రాంతాల్లో ప్రసిద్ధమైనవి. తెలుగు ఉద్యమ పాటలనూ సంథాలీలోకి తీసుకున్నారు. వరకట్న దురాచారానికి వ్యతిరేకంగా, మద్యనిషేధం కోసం, సామ్రాజ్యవాదానికి, సామ్రాజ్యవాద విషసంస్కృతికి వ్యతిరేకంగా అనేక అంశాలపై పాటలు రాసాడు. 1994ల నుంచి జార్ఖండ్ అభేన్‌లో పనిచేస్తున్నాడు. జిందల్‌లు, మిట్టల్‌లు ఇంకా అలాంటి పెట్టుబడిదారులు, సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా ప్రజలకు బాసటగా నిలిచి పాటలు రాసాడు. జీతన్ పాటలు కేవలం మనస్సుకు ఉల్లాసాన్నిచ్చేవి కావు. జీతన్ సమాజ మార్పు కోసం, విముక్తి కోసం పాటలు రాసాడు. బయట సమాజంలోని పాటలు భార్యాభర్తలు, ప్రేమికులు పాడుకునే పాటలైతే, ఇద్దరు వ్యక్తులు పాడుకునే పాటలైతే జీతన్ పాట సామూహిక పాట, అది ఆదివాసీలను కాపాడే పాట. సమాజ స్థితిని మార్చేపాట.

ఈ పెట్టుబడిదారులంతా కలిసి ఆదివాసులను అడవి నుంచి బేదఖలు చేస్తున్నారు. కుట్రపూరితంగా జార్ఖండ్ రాజకీయ నాయకులు, జార్ఖండ్ వికాస్ మోర్చా ప్రతినిధులు, పోలీసులు తనను తప్పుడు కేసులో ఇరికించి ఉరిశిక్ష విధించారు. ఇప్పుడు నాకున్న లక్ష్యం ఒక్కటే – ఈ అన్యాయాన్ని అందరి దృష్టికి ఎలా తీసుకుపోవాలన్నదే. జీతన్ ఉరిశిక్షతో చట్టాలు తెల్సుకునే అవసరం ఏర్పడింది. ఈ వ్యవస్థ ఏమిటి, దాని స్వభావం ఏమిటి అనే విషయాలు మేము అర్థం చేసుకోవడానికి, అర్థం చేయించడానికి జీతన్ ఉరిశిక్ష ఒక గొప్ప అవకాశాన్ని ఇచ్చింది. నాకు రెండున్నర సంవత్సరాల బాబు ఉన్నాడు. బాబుతో పాటు తిరగడం కాస్త కష్టంగా ఉంది. ఈ వ్యవస్థ అసలు రూపం, సారం అర్థం చేసుకునే అవకాశం దొరికింది. ఈ పరిస్థితిని, ఈ విషయాలను ప్రజలకు ఎలా అర్థం చేయించాలనేదే ఇప్పుడు మా ముందున్న లక్ష్యం. మేము సమాజమార్పుకు పూనుకున్నప్పుడే మాకు తెలుసు మా పట్ల ఇలాంటివి జరుగుతాయని. రాజ్యం మా పట్ల ఇలా వ్యవహరిస్తుందని. నా సహచరుడికి, మిగిలిన వారికి శిక్ష పడవచ్చు లేదా విడుదల కావచ్చు. ఇలాంటి శిక్షలకు కూడా మేము సిద్ధపడే పనిచేస్తున్నాం. మాకు ఏం జరుగుతుందనేది కాదు – ఈ విషయాలను ప్రజలకు, సమాజం మొత్తానికి ఎలా అర్థం చేయించాలనేదే మా తపనంతా. ప్రభుత్వాలు ఏం చేస్తున్నాయి, ఎలా పని చేస్తున్నాయి, ఎవరికోసం పని చేస్తున్నాయి

అర్థం చేయించడమే మా పని. జీతన్ ప్రజలకోసం పని చేసాడు. జీతన్ విడుదల కోసం అన్ని రకాల పద్ధతులలో ప్రభుత్వంపై ఒత్తిడి చేయాలని అనుకున్నాం. ఈ శిక్ష కేవలం ఆయనకు మాత్రమే కాదు. ఇది ప్రజలపైన జరుగుతున్న దాడి. ప్రజలకు జల్ – జంగల్ – జమీన్ కావలని కొట్లాడుతున్న జీతన్‌కు శిక్ష విధించడం ప్రజల మీద జరుగుతున్న దాడిలో భాగమే.

తెలుగు ప్రజల నుంచి మాకు చాలా ప్రేరణ, ప్రోత్సాహం దొరికాయి. జీతన్ తన సాంస్కృతిక కార్యక్రమాలు చేస్తూ ఏ విధంగా అయితే దేశవ్యాప్తంగా తిరిగాడో మేము కూడా అట్లా ప్రచారం చేస్తూ తిరుగుతాం. ఒకవేళ మనం జీతన్‌ను ఉరిశిక్షనుంచి కాపాడుకోలేక పోతే ఈ ప్రభుత్వం ప్రజావ్యతిరేకమైనదని మరోసారి రుజువు అవుతుంది. జీతన్‌ను కాపాడుకోలేక పోయినా, ఏం జరిగినా ఇదంతా సమాజ మార్పుకోసం, విప్లవం కోసం జరిగిందని నేను భావిస్తాను. జీతన్‌ను కాపాడులేక పోయినా ప్రజలకోసం మరింత గట్టిగా పోరాడడానికి నేను సిద్ధంగా ఉన్నాను.

అభేన్ తరఫున మేము జార్ఖండ్ రాష్ట్రమంతటా ప్రచారం చేసాం. ప్రదర్శనలు ఇచ్చాం. ప్రజల నుంచి మాకు కావల్సినంత మద్దతు దొరుకుతోంది. కేవలం ఆదివాసులు, దళితులు నుంచి మాత్రమే కాదు మొత్తం సమాజం నుంచి మాకు మద్దతు దొరుకుతోంది. హైదరాబాదు వచ్చే ముందు 18 ఆగస్టు 2011న జీతన్‌ను కలిసాను. జీతన్‌ను ఎప్పుడు కలిసినా మాకు ధైర్యం నూరి పోస్తాడు. 'నాకు ఏదో అవుతుందని చింతపడొద్దు. మీరందరూ ఉత్సాహంగా పోరాడండి. గట్టిగా నిలబడండి. ఏం జరిగినా ప్రజలకోసమే జరుగుతుంది. దానికి నేను సిద్ధపడి ఉన్నాను. నేను సంతోషంగానే ఉన్నాను. మీరూ సంతోషంగా ఉండండి. సమాజ జాగృతికి, సమాజాన్ని మార్చడానికి పనిచేస్తున్నా. నాకేమైనా సిద్ధంగానే ఉన్నా. ప్రజలకోసం, ప్రజల కష్టాలు తొలగించడం కోసం పనిచేస్తున్న వాళ్లకు ఏమి జరుగుతోందో ప్రజలు ఆలోచిస్తారు. ఆ నమ్మకం నాకుంది. విడుదలైనా, శిక్షపడినా నాకు చింతేమీ లేదు' అని అన్నాడు. ఇప్పుడు రాంచీలోని బిర్సా ముండా కేంద్ర కారాగారంలో ఉన్నాడు. పదిహేను రోజులకు ఓసారి కలిసే అవకాశం ఉంది. కలిసినపుడల్లా ఒక గంటసేపు కలుస్తాను. తనను ఖైదు చేసిన గదిలోనే కలుస్తాను. జైలులో చాలా ఇరుకు స్థలంలోనే తను కాలం వెళ్లబుచ్చుతున్నాడు. ఆ ఇరుకు స్థలంలోనే కాలకృత్యాలు అవసరాలు తీర్చుకోవాలి. గట్టిగా వర్షం పడితే జైలు గదిలోకి నీళ్లు వస్తాయి. అరెస్టు చేసినపుడు మానసికంగా చాలా హింసించారు. జనాన్ని చైతన్యవంతులు చేసే పనులు మానేయమని గిర్ది ఎస్.పి. హెచ్చరించాడు. జీతన్ వాళ్ల కేసును కృష్ణమురారి అనే న్యాయవాది చూస్తున్నారు. కేసులో బలం లేదని, జీతన్‌పై ఆరోపణలు వీగిపోతాయని ఆయన అన్నారు. మనం గెలుస్తామని ధీమా వ్యక్తం చేసారు. జీతన్‌తో పాటు మిగిలిన ముగ్గురిని కోర్టువద్ద కలిసాను. జీతన్ అరెస్టై మూడున్నర సంవత్సరాలు కావస్తోంది. జైలులో కూడా జీతన్‌కు సత్సంబంధాలున్నాయి. జైలు క్యాంటీన్ బాధ్యతలు జీతనే చూస్తున్నాడు. జైలులో కూడా జీతన్ పాటలు పాడడం, అందరికీ ప్రేరణనివ్వడంతో జైలు అధికారులు జీతన్‌ను విడిగా ఉంచారు. తను ఇప్పుడు ప్రేంచంద్ కథలు, భగత్‌సింగ్ లేఖలు ఇంకా ఇతర మంచి సాహిత్యం చదువు తున్నాడు. భగత్‌సింగ్, అతని సహచరులు జైలులో తమ జీవితం ఏవిధంగా గడిపారో అధ్యయనం చేస్తున్నట్లు చెప్పాడు. జీతన్‌కు ఇంకా అతని సహచర ఖైదీలకు రాజకీయ ఖైదీలకు ఇచ్చే వసతులనే ఇవ్వాలి.

చిల్ఖారీ ఘటనతో నా భర్తకు ఎటువంటి సంబంధం లేదు. తప్పుడు ఆరోపణలు, తప్పుడు సాక్ష్యాలతో, తప్పుడు కేసులో నా భర్తకు, అతనితో సహా మిగిలిన ముగ్గురికీ గిర్ది సెషన్స్ కోర్టు ఉరిశిక్ష విధించింది. ఈ అన్యాయానికి వ్యతిరేకంగా చేస్తున్న పోరాటంలో మీరందరూ సహకరిం చాలని, అన్నిరకాల అండదండలు అందించాలని కోరుతున్నాను. అందిస్తారని ఆశిస్తున్నాను' అని ముగించింది.

రెండున్నరేళ్ల జీతన్ కొడుకు కూడా 'మేరా పాపా నిర్దోష్ హై, మేరే పాపాకో రిహా కరో' (మా నాన్న నిర్దోషి, మా నాన్నను విడుదల చేయండి) అని చేతులెత్తి, పిడికిళ్లు బిగించి నినాదాలు ఇస్తున్నాడు.

64ఏళ్ల ఈ 'స్వాతంత్ర్య' దేశంలో పాలకులు ప్రకృతి వనరులను, ఖనిజ సంపదలను సామ్రాజ్యవాద కంపెనీలకు అప్పజెప్పే క్రమంలో ప్రజలను వారి భూమి నుండి, బతుకు నుండి బేదఖలు చేస్తున్నారు. ఇప్పటికే దేశవ్యాప్తంగా దాదాపు మూడుకోట్ల మంది ఆదివాసీలు తమ అడవి నుంచి, బతుకు దెరువు నుంచి వివిధ ప్రాజెక్టుల మూలంగా విస్థాపనకు గురైయ్యారు. బతుకును, భరోసాను ఇస్తామని రాజ్యాంగంపై ప్రమాణం చేసి గద్దెనెక్కిన పాలకులు, ఆ రాజ్యాంగం ప్రజలకు నిర్దేశించిన మౌలిక హక్కులను కాలరాస్తూ, లక్షల కోట్ల రూపాయల కుంభకోణాలలో, తీవ్ర అవినీతిలో కూరుకుపోయారు. ప్రజావ్యతిరేక విధానాలను, 'అభివృద్ధి' నమూనాలను ప్రజల నెత్తిపై రుద్దుతున్నారు. ప్రజలు తమకు జరిగిన అన్యాయానికి వ్యతిరేకంగా ఉద్యమిస్తే జీవిత కాలం ఖైదు చేయడమో, పోలీస్ కాల్పుల్లో చనిపోవడమో, ఉరిశిక్షలకు గురికావడమో జరుగుతోంది. అట్టడుగు శ్రామిక వర్గాల కోసం ఆలోచిస్తున్న మనుషులను సమాజ మార్పు కోసం పనిచేస్తున్న వారిని అవసరమైతే మానవ రహిత విమానాలతో కూడా నిర్మూలించడానికి పాలకులు సిద్ధపడుతున్నారు. ఇప్పటికే ప్రపంచ వ్యాప్తంగా 137 దేశాలు మరణ శిక్ష చట్టాన్నే రద్దు చేసాయి. 34దేశాలు మరణ శిక్షలు అమలు చేయవద్దని నిర్ణయించుకున్నాయి. మనదేశం మాత్రం తన అన్యాయ, అప్రజాస్వామిక పాలనను వ్యతిరేకించే వారి అడ్డు తొలగించుకోవడానికే ఈ దుర్మార్గమైన చట్టాన్ని ఆశ్రయిస్తోంది. ప్రజాకళాకారులపై ఉరిశిక్ష పడడం మన దేశంలో ఇదే మొదటి సారి. దీనికి వ్యతిరేకంగానూ, అసలు మొత్తంగానే ఉరిశిక్షల రద్దు కోసం మనమంతా ఉద్యమించాలి. వీరే కాక రాజీవ్ గాంధీ హత్య కేసులోనూ, పార్లమెంట్‌పై దాడి కేసులోనూ, ఎర్రకోటపై దాడి కేసులోనూ ఇంకా అనేక ఇతర కేసులలో దేశవ్యాప్తంగా నాలుగు వందల మందికి పైగా ఉరిశిక్ష పడిన వాళ్లు ఉన్నారు. ఇప్పటికే వీరంతా ఏళ్ల తరబడి జైళ్లలో మగ్గుతున్నవాళ్లే. ప్రభుత్వాలు ప్రజల పట్ల దుర్మార్గమైన దోపిడీ విధానాలను అమలు చేస్తూ, తమ విధానాలను వ్యతిరేకిస్తున్న వారిని, రాజకీయ ప్రత్యర్థులని అంతమొందించడానికి ఉరిశిక్షలను అమలు చేస్తోంది. ఈ ఉరిశిక్షల వలన ఈ దేశంలోని ఆదివాసులకు, దళితులకు, ముస్లిం, మైనారిటీలకు, జాతి పోరాటాలు చేస్తున్న వారికి, ప్రత్యామ్నాయ ఉద్యమాలు చేస్తున్న వారికి, అట్టడుగు వర్గాల ప్రజలకు ప్రమాదం ఉంది తప్ప, ప్రజావ్యతిరేక పాలనను అందిస్తున్న వారికి కాదు. ప్రజలకోసం పాడే ఆ గొంతులను నులిమి వేయకుండా చేతులు అడ్డం పెట్టాల్సింది మనమే.

*(రచయిత వీక్షణం సహాయ సంపాదకులు)* వీ

*మల్కన్‌గిరి ప్రాంత ఆదివాసుల రాజకీయార్థిక జీవన స్థితిగతులు, వారిపై కొనసాగుతున్న దోపిడీ, అణచివేతలను వివరిస్తూ, వారి అభివృద్ధికి ఏం చేయాలో వివరిస్తున్నారు* **శ్రీరాముల శ్రీనివాస్**

# మల్కన్‌గిరిలో ఏం జరుగుతోంది?

మల్కన్‌గిరి జిల్లా కలెక్టర్ ఆర్. వినీల్ కృష్ణ, జూనియర్ ఇంజనీర్ పవిత్ర మోహన్ మాఝీలను మావోయిస్టులు 16 ఫిబ్రవరి 2011 సాయంత్రం తీసుకెళ్లిన తరువాత ఎలక్ట్రానిక్, ప్రింట్ మీడియాలు కలెక్టర్ చేపట్టిన అభివృద్ధి కార్యక్రమాలంటూ కేంద్రీకరించి ప్రసారాలు చేపట్టినాయి. ఆ క్రమంలో మావోయిస్టులు ప్రతిపాదించిన డిమాండ్స్, ప్రభుత్వ ప్రతినిధులు, మధ్యవర్తులు, మావోయిస్టుల ప్రకటనలు – కలెక్టర్, జూనియర్ ఇంజనీర్ల విడుదల, మావోయిస్టులు, చాసీముళీ ఆదివాసీ సంఘం సభ్యుల విడుదల, చట్టపరమైన సమస్యలు, మానవ హక్కులు, అక్రమ నిర్బంధాలు వంటి ముఖ్యమైన విషయాలపై నిష్ణాతుల, మానవ హక్కుల కార్యకర్తల, వివిధ పార్టీల ప్రతినిధుల, రిటైర్డ్ అధికారుల, న్యాయాధీశుల, సమాజ సేవకుల అభిప్రాయ సేకరణలు, ప్రకటనలు నిరంతర ప్రసారాలు జరిగాయి. ఈ మొత్తం ప్రక్రియలో రెండు అంశాలను ప్రముఖంగా పరిశీలించాల్సి ఉంది.

1. కలెక్టర్ ఆర్. వినీల్ కృష్ణ మోటర్ సైకిల్‌పై జన సంపర్క్ శిబిరానికి వెళ్లడం, తను విధుల్లో చేరిన తరువాత ఆదివాసుల సమస్యలను వారి దగ్గరకు వెళ్లి పరిష్కరించడం.

2. వివిధ జైళ్లలో ఉన్న తొమ్మిది మంది మావోయిస్టు పార్టీ కార్యకర్తలతో పాటు మల్కన్‌గిరి, కోరాపుట్, గజపతి, సుందర్‌గడ్, రూర్కెలా తదితర జైళ్లలో ఉన్న చాసీమూలీ ఆదివాసీ సంఘం కార్యకర్తలు, ఆదివాసీ ప్రజలపై పోలీసులు ఆరోపించిన తప్పుడు కేసుల ఉపసంహరణలు.

భూమి, అడవి, అడవిలోని వనరులపై ఆదివాసులకు హక్కుగా రాజ్యాంగంలో అయిదో షెడ్యూల్ స్పష్టమైన హామీ ఇచ్చింది. అయిదు, ఆరు షెడ్యూళ్లలో ప్రత్యేక పాలన అంశాలు, అధికారాలు నిర్దేశించబడినాయి. వడ్డీ వ్యాపార నిషేధ చట్టం, అటవీ సంరక్షణ చట్టం, అటవీ హక్కుల చట్టం వంటి చట్టాలు చాలానే ఉన్నా, ఆదివాసుల పరిస్థితిలో గత ఆరు దశాబ్దాలుగా ఏ విధమైన మార్పులు తీసుకురాలేక పోయినాయి. ప్రజా పంపిణీ వ్యవస్థ, సమగ్ర శిశు వికాస కార్యక్రమం, మధ్యాహ్న భోజన పథకం, జాతీయ గ్రామీణ ఉపాధి హామీ చట్టం, మాతా, శిశు సంక్షేమ పథకాలు తీసుకురాబడినా నేటికీ సంవత్సరంలో ఆరు నెలలు వెదురు కొమ్మలు, పనస పండ్లు, దుంపలు తింటూ కాలం వెళ్లదీస్తున్నారు. 1990లలో తీసుకవచ్చిన నూతన ఆర్థిక విధానాల తరువాత ప్రభుత్వాలు అడవి, అడవిలోని సహజ వనరులను కార్పొరేట్ సంస్థలకు, విదేశీ గుత్త పెట్టుబడిదారీ సంస్థలకు, సామ్రాజ్యవాదులకు కట్టబెడుతూ వస్తున్నాయి. గనులు తవ్వుకోవడానికి వీలుగా ఆదివాసులను బలప్రయోగంతో ప్రభుత్వాలు అడవి నుంచి ఖాళీ చేయిస్తున్నాయి. జీవించే హక్కుకు దిక్కులేని పరిస్థితుల్లో ఆదివాసులు కొట్టుమిట్టాడుతున్నారు. పుట్టి పెరిగిన చోటే తిండి, నీరు లేకుండా చేస్తూ అభివృద్ధి పేర ఆదివాసుల బతుకులను కుప్పకూల్చుతున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో ఆదివాసుల భూమి, అడవి, వనరులపై హక్కుల కోసం, రాజకీయంగా అధికారం కోసం పోరాటం అనివార్యం అవ్వగా పాలకవర్గాలు రాజకీయ పరిష్కారం చూపకుండా అణచివేతకు పూనుకుంటున్నాయి. ఆపరేషన్ గ్రీన్‌హంట్ పేర వేలాది బి.ఎస్.ఎఫ్., సి.ఆర్.పి.ఎఫ్. తదితర బలగాలను మోహరించడం జరుగుతోంది. పడుకున్న వారిపై, తోవవెంట వెళ్లేవారిపై, బంధువుల ఇండ్లల్లోకి వెళ్లిన వారిపై, ఆలీవ్ గ్రీన్ కలర్ ప్యాంట్ కొని తొడిగిన వారిపై, సర్పంచ్, ఉప సర్పంచ్, వార్డ్ మెంబర్స్, మహిళలు, వృద్ధులు, పిల్లలు, రోగ పీడితులపై రాజద్రోహం, కుట్ర, ఆయుధాలు కలిగి ఉన్నారనే సెక్షన్లతో పాటు 'ఉపా' నల్ల చట్టాన్ని ప్రయోగించడం జరుగుతోంది. స్వయంగా మల్కన్‌గిరి జిల్లాలో ఆదివాసులు తమ గోడును వెళ్లబోసుకుంటూ జైలు లోపల, బయట నుండి కలెక్టర్, ఎస్.పి., హోం సెక్రటరీ, ముఖ్యమంత్రి, ఎస్.ఎచ్.ఆర్.సి., ఎన్.ఎచ్.ఆర్.సి.లకు నివేదించడమే గాక ధర్నాలు, ఊరేగింపులు, నిరసన ప్రదర్శనలు, నిరాహార దీక్షలు చేపట్టారు.

పై సామాజిక పరిస్థితుల్లో ఆదివాసులు తలెత్తుకొని హక్కులు, అధికారాలకై ప్రశ్నిస్తూ రావడమేగాక గణతంత్ర రాజ్యంగా రాజ్యాంగాన్ని రూపొందించిన సుదీర్ఘకాలం తరువాత కూడా తమ బతుకులు ఎక్కడ వేసిన గొంగళి అక్కడనే అన్నట్టుగా ఉండడాన్ని నిలదీస్తున్నారు. ఆరు దశాబ్దాలుగా ఉద్ధరించబడని ఆదివాసులను ఆర్. వినీల్‌కృష్ణ ఉద్ధరిస్తున్నాడనంలో వాస్తవమెంత? కలెక్టర్ ఉద్ధరించిన అభివృద్ధి ఏమిటి? అనేది మల్కన్‌గిరి జిల్లా భౌగోళిక, సామాజిక, రాజకీయ, ఆర్థిక అంశాలను పరిశీలించడంద్వారా అర్థం చేసుకోవాలి.

అవిభక్త కోరాపుట్ జిల్లా నుండి మల్కన్‌గిరి ప్రాంతాన్ని వేరు చేస్తూ మల్కన్‌గిరి జిల్లాగా 1992లో ఏర్పాటు చేశారు. మల్కన్‌గిరి జిల్లా, ఆంధ్రప్రదేశ్‌లోని విశాఖపట్నం, తూర్పు గోదావరి, ఖమ్మం జిల్లాల సరిహద్దులు, ఛత్తీస్‌గఢ్‌లోని దంతేవాడ సరిహద్దులు, నదులు, పర్వతాలతో కూడుకున్న విశాలమైన అటవీ ప్రాంతం. ఆంధ్రా–ఒడిశాలను వేరు చేస్తూ జాలాపూట్, సీలేరు ప్రాజెక్టులు, బలిమెల రిజర్వాయర్, ఒడిశా–ఛత్తీస్‌గఢ్‌లను వేరు చేస్తూ కొలాబ్, శబరీ నదులు నిరంతరం ప్రవహిస్తూ గోదావరిలో కలుస్తాయి.

జాలాపూట్, అరక్, పార్వతీపురం నదుల ప్రవాహం

మాచ్‌ఖండ్‌లోకి చేరుతుంది. బలిమెల రిజర్వాయర్‌లో ఎల్లంపాక, దోలిఆమ్, బదాపూట్, కుంతూర్ తదితర ఉపనదులు, మాచ్‌ఖండ్ నుండి విడుదలయ్యే నీరు నిరంతరం బలిమెల రిజర్వాయర్‌లోకి వచ్చి చేరుతుంది. బలిమెల రిజర్వాయర్ పొడవు 90 కిలోమీటర్లు, వెడల్పు 1,2,3 కిలోమీటర్లతో కూడుకొని ఉంటుంది. ఈ రిజర్వాయర్ నుండి విడుదలయ్యే నీరులో సీలేరు నుండి అతి తక్కువ నీరు గోదావరి డెల్టాకు విడుదల చేయగా మిగిలిన నీరంతా గోదావరి నదిలో కలుస్తుంది.

మాచ్‌ఖండ్‌లోని చిన్నపాయ లమతాపూట్, పత్తర్‌పూట్, బొండా ఘాట్స్ నుండి నీరు సప్తధారలో కలిసి కియాంగ్ చేరుతుంది. దీని పొడవు రమారమి వంద కిలోమీటర్లు. ఛత్తీస్‌గఢ్‌లోని కైంకేర్ కొండల నుండి వచ్చే నీరు గుప్తేశ్వరంలో కలుస్తుంది. బొండాఘాట్స్ మరోవైపు నుండి గిరియాగార్, దరుద్రర్‌ల నుండి చావుల్‌మిడి దగ్గర కల్సి మెక్కా నదిలోకి నీరు ప్రవహిస్తుంది. ఆకూర్ నుండి చక్కాబుక్కా నది పుష్పల్లే (చత్తీస్‌గఢ్) కమ్మర్‌పల్లి (ఒడిశా) లలో కలిసే సంగమాలనే కొలాబ్ అని, ఇక్కడ నుండి గోదావరిలో కలిసే వరకు ప్రవహించే నదిని శబరి అని పిలవడం జరుగుతుంది. కొలాబ్ పొడవు సుమారు 150 కిలోమీటర్లు, శబరి 250 కిలోమీటర్లు ఉంటుంది. బలిమెల రిజర్వాయర్‌లోని నీరు, టర్నల్ క్యాంప్ దగ్గర గల రెండు గేట్ల ద్వారా విడుదలయ్యే నీరు బలిమెల పవర్ హౌజ్ నుండి సుర్లుకొండ డ్యాంలోకి చేరుతుంది. సుర్లుకొండ నుండి ఆరంభమై 125 కిలోమీటర్లు ప్రవహించి మల్కన్‌గిరిలోని కట్టంపల్లి, దంతేవాడలోని ఎర్రబోరు దగ్గర శబరిలో కలిసే నదినే పొట్టేరు నదిగా పేర్కొనడం జరుగుతుంది. మల్కన్‌గిరి జిల్లా జీవనదులు, వాగులు, వంకలతో అలరారుతూ ఉపరితల నీటిమట్టంతో కూడుకున్న ప్రకృతి సౌందర్యాన్ని కలిగి ఉంది.

మల్కన్‌గిరి జిల్లాలో కోయ, కోందు, పోర్జా, బొండా, దురువా, బుమియా, గదువా, రాణా, హల్వా, డిదోయ్, కొండరెడ్డి మొదలైన ఆదివాసీ తెగలు జీవిస్తున్నాయి. దురువాలు మథిలీ సమితిలో అధికంగా కనిపించే గోందు జాతికి చెందిన ఉప తెగకు చెందినవారు. వీరికి ప్రత్యేక భాష ఉంటుంది. దీనినే దురువా భాష అంటారు. వీరి సంఖ్య పదిహేను వేలు. కోరాపూట్ జిల్లాలోని బయిపరిగూడా, కుందా, కోట్‌పాడ్ సమితీలలో విస్తరించి జీవిస్తున్నారు. సాంప్రదాయకంగా వ్యవసాయం, వేటాడడం వీరి ఉపాధి కార్యక్రమం. 14వ శతాబ్దంలో దండకారణ్యంలో గుప్తేశ్వరాన్ని వెలుగులోకి తెచ్చింది, జయపురం రాజు విక్రమ్‌దేవ్ దృష్టిలోకి తీసుకొచ్చింది వీరే. ఛత్తీస్‌గఢ్‌లో వీరిని ప్రభుత్వం ఆదివాసులుగా గుర్తించినా ఒడిశాలో గుర్తించడం లేదు. గుప్తేశ్వర ఆలయం పైతమకున్న హక్కును ప్రభుత్వం కాలరాచి అర్ధభాగం బ్రాహ్మణులకు కట్టబెట్టింది. ఇదే రకమైన పరిస్థితి కొండరెడ్లు ఎదుర్కొంటున్నారు. వీరి జనాభా దురువాల కంటే ఎక్కువగా ఉంటుంది. మల్కన్‌జిల్లాలో వీరు కలిమెల బ్లాక్‌లోని బెజ్జంకివాడ, చిత్రకొండ నుండి మోటు వరకు సీలేరు నదిని ఆనుకొని ఉన్న పర్వతపు సానువులలో జీవిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో జీవిస్తున్న కొండరెడ్లను అక్కడి ప్రభుత్వం ఆదివాసులుగా గుర్తిస్తున్నా ఒడిశా ప్రభుత్వం వీరిని ఆదివాసులుగా గుర్తించడం లేదు. కొండరెడ్లు తమని ఆదివాసులుగా గుర్తించాలని గత కొన్ని సంవత్సరాలుగా పోరాడుతున్నారు. వీరిది సాంప్రదాయిక పోడు వ్యవసాయమే. తైలు (రాగులు), కొర్రలు పండిస్తారు. బొండాలు అధికంగా జీవించే ప్రాంతాన్నే బొండాఘాట్స్ అని పిలుస్తారు. ఈ బొండాఘాట్స్‌లో బొండా, రాణా, డిదోయ్ అనే ఆదివాసి తెగలు జీవిస్తున్నాయి. రాణాలు అత్యల్పం. రాణాల కంటే డిదోయ్ వారు అల్పం. బొండాల జనాభా ముప్పై నుండి నలభై వేల వరకు ఉంటుంది. వీరు ఖైర్‌పూట్ కేంద్రంగా ఇటు గోవిందపల్లి అటు బలిమెల మధ్య ఘాట్స్‌లలో బలిమెల రిజర్వాయర్ పరీవాహక ప్రాంతాలలో జీవిస్తున్నారు. వీరిది పురాతన సాంప్రదాయ వ్యవసాయమే. అటవీ ఉత్పత్తులపై ఆధారపడడం జరుగుతోంది.

జాలాపూట్ ప్రాజెక్టు నిర్మాణం ద్వారా నిర్వాసితులైన కోరాపూట్, సిమిలిగూడ, జయపూర్ తదితర ప్రాంతాల ప్రజలను చిత్రకొండ, బలిమెల, గుమ్మ, ఖైర్‌పూట్, కోరుకొండ తదితర ప్రాంతాలకు ఆనాటి ప్రభుత్వం తరలించింది. వీరినే పోర్జా ఆదివాసులంటారు. ఇందులో దొర, హంతాల్, ఖిలో, మొదులి, కెముదు తదితరులు వస్తారు. పేర్ల చివర దొర, హంతాల్, కెముదు టైటిల్‌గా ఉండడంతో వీరి తెగలు తేలికగా గుర్తించడం జరుగుతోంది. వీరంతా మాట్లాడే భాషను దేశీయ ఒడియాగా పేర్కొనడం జరుగుతోంది. వేరు వేరు సంస్కృతులు, వ్యవహారాలు ఉంటాయి.

బుమియా ఆదివాసులు మల్కన్‌గిరి విశాల ప్రాంతాలలో నివసిస్తున్నప్పటికీ కోయ ఆదివాసుల కన్నా సంఖ్యరీత్యా తక్కువ. అత్యధిక జనాభాను కలిగిన కోయ ఆదివాసులు జిల్లా నలుమూలలలో నివసిస్తున్నారు. వీరిలో సాంప్రదాయిక వ్యవసాయం చేయడం, వేటాడడం, అటవీ ఉత్పత్తులపై ఆధారపడి జీవించడం ఉన్నాయి. ఆదివాసీ తెగలకు వారి వారి స్వంత భాష, ఆచార వ్యవహారాలు ఉంటాయి. రాష్ట్ర జనాభాలో ఆదివాసులు 23 శాతం ఉంటే, మల్కన్‌గిరిలో 35 నుండి 40 శాతం జనాభా కలిగిన ఆదివాసులు ఉన్నారు. 60 – 70 సంవత్సరాల పూర్వం 90 శాతం ఆదివాసీ జనాభా ఉండగా 10 శాతం ఆదివాసేతరులు ఉండేవారు. మల్కన్‌గిరి ప్రాంతం పూర్వం మద్రాస్ ప్రెసిడెన్సీలో ఉండడం మూలంగా ఆనాటి ఉద్యోగ వర్గాలు, వీరిని ఆధారం చేసుకొని ఉద్యోగేతర తెలుగు ప్రజానీకం జీవించేవారు.

ఇప్పటి పరిస్థితి చాలా మారిపోయింది. స్థానికులు దరిద్ర నారాయణులుగా, రోగ పీడితులుగా అడవి, భూమి, నీటిపై ఉన్న హక్కులను, ఆధారాలను కోల్పోయి మనుగడ కోసం నిరంతరం పోలీసుల, అటవీ అధికారుల, షావుకార్ల, భూస్వాముల, రాజకీయ నాయకుల, పెత్తందార్ల వేధింపులకు, దోపిడీ పీడనలకు గురవుతూ వస్తున్నారు. అభివృద్ధి పేర చేపడుతున్న కారక్రమాలు ఆదివాసుల పాలిట విధ్వంసంగా పరిణమించి నిర్వాసితులవుతూ వస్తున్నారు. ఈ విషయాలను వివరంగా పరిశీలిద్దాం.

1955లో మాచ్‌ఖండ్ ప్రాజెక్టు నిర్మాణం ప్రారంభమైంది. కొంత ఆలస్యంగా బలిమెల రిజర్వాయర్ డ్యాం నిర్మాణం, విద్యుత్ ఉత్పాదనకు టర్నల్ క్యాంప్ నుండి నీరు తీసుకెళ్లడానికి అవసరమైన నిర్మాణపు పనులు ప్రారంభమైనాయి. ఇందుకు పూర్వం మొత్తం అటవీ ప్రాంతం – నేడు ఉన్న బలిమెల, చిత్రకొండ, మల్కన్‌గిరి, కలిమెల మొదలు ఈనాడు వెయ్యి నుండి పదివేలకు పైగా జనాభా ఉన్న వ్యాపార, వాణిజ్య కేంద్రాలన్నీ నిర్వాసితులైన ఆదివాసీ గ్రామాలు. నేడు వీరి ఉనికే లేకుండా పోగా కటక్, భువనేశ్వర్, బరంపూర్, గంజాం, విజయనగరం, విశాఖపట్నం, సంబల్‌పూర్, రాయ్‌పూర్, జగ్దల్‌పూర్, రాజస్థాన్ తదితర ప్రాంతాల నుండి ఉద్యోగ రీత్యా, పనుల కోసం, వ్యాపారం కోసం వచ్చినవారు విద్యా, ఉద్యోగ, రాజకీయ, ఆర్థిక, వాణిజ్య, వ్యాపార

కార్యకలాపాలలో కీలక పాత్రలు పోషిస్తున్నారు.

1964-72ల మధ్య మూడు దఫాలుగా బంగ్లా దేశీయులను కేంద్ర ప్రభుత్వం రెఫ్యూజ్డ్ ప్రజలుగా మల్కన్‌గిరి ప్రాంతాలకు పంపింది. వీరంతా 220 గ్రామాలలో స్థిరపడినారు. 1964లో వచ్చిన వారిని మల్కన్‌గిరి విలేజర్స్ (ఎం.వి.) తరువాత వచ్చిన వారిని మల్కన్‌గిరి పొట్టేరు విలేజర్స్ (ఎం.పి.వి.)గా పేర్కొనడం జరుగుతోంది. వీరికి ప్రభుత్వం 6, 5, 3 ఎకరాల చొప్పున భూమి, ఉండడానికి ఇల్లు, వంట పాత్రలతో పాటు సాగునీరు, తాగునీరు, పాఠశాలల నిర్మాణం వంటి వసతులు కల్పించింది. 1980లలో కలకత్తా నుండి వచ్చిన వారికి ప్రభుత్వం నుండి ఎలాంటి సహాయం లభించలేదు.

తెలుగువారిని ఆధారం చేసుకొని శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నం నుండి 1960, 70లలో వచ్చినవారు, నేపాల్, బీహార్, హర్యానా, రాజస్థాన్‌ల నుండి వచ్చి స్థిరపడిన వారిలో కొద్దిమంది రాజకీయ, ఆర్థిక, విద్య, ఉద్యోగ, ఉత్పత్తి, వాణిజ్య, వ్యాపార రంగాలలో ఆధిపత్యం వహిస్తున్నారు. వీరంతా వచ్చి చేరడంతో ఆదివాసీ జనాభా 90 శాతం నుండి 35 - 40 శాతానికి పడిపోయింది. చిత్రకొండ, బలిమెల, మల్కన్‌గిరిలను పరిశీలిస్తే మొత్తం మల్కన్‌గిరి జిల్లా నాటి, నేటి పరిస్థితులను మరింతగా అర్థం చేసుకోవచ్చు.

బలిమెల డ్యాం నిర్మాణానికి ముందు ప్రస్తుతం ఉన్న చిత్రకొండ అడవే. పర్మినెంట్, టెంపరరీ, కలహండి హౌజింగ్ బోర్డు మొదలయిన కాలనీలు - ఒడియా, బెంగాలీ, తెలుగు, తమిళ, నేపాలి, మార్వాడి వారంతా వలస వచ్చినవారే. డ్యాం నిర్మాణం మూలంగా నిర్వాసితులైన వారికి, స్థానిక ఆదివాసులకు పైసలో వెయ్యోవంతు ప్రయోజనం కూడా లభించలేదు. నేటి చిత్రకొండకు ఆనుకొని ఉన్న ఆనాటి గ్రామం గోజ్యాగూడ ప్రజల పరిస్థితి అప్పుడు ఎలా ఉందో నేటికీ అలానే ఉంది. రవ్వంత మార్పు రాకపోగా వీరు కూలీ చేసుకోవడానికి విజయవాడ, హైదరాబాద్, బెంగళూరు, సూరత్ ప్రాంతాలకు తరలి వెళ్తుంటారు. విద్యా బుద్ధులు లేవు. ఉండడానికి ఇండ్లు, వసతులు లేని దైన్య పరిస్థితి. తమ ప్రాంతంలోనే పర ప్రాంతీయుల దోపిడీ, పీడనలు, ఆగ్రహానికి గురవుతూ వస్తున్నారు. ఇది ఇలా ఉండగా బయట నుండి వచ్చిన వారిలో 96 శాతం ప్రజలది కూడా ఇదే విపత్కర పరిస్థితి. 4 శాతం ప్రజలలోనే వ్యాపార, వాణిజ్య, ఉద్యోగ, రాజకీయ రంగాలలో ఆధిపత్యం కొనసాగిస్తున్నారు.

కొద్దిమంది చేతుల్లోకి కిరాణా దుకాణాలు, మందుల దుకాణాలు, సిమెంట్, ఎరువులు, సారాయి దుకాణాలు, ట్రక్కులు, జీపులు, ట్రాక్టర్లు, వ్యాన్లు ఉన్నాయి. ఉపాధ్యాయులు, ఫార్మసిస్టులు, క్లర్కులు తదితర ఉద్యోగాలు చేస్తున్నది కూడా వీరి కుటుంబీకులే. వడ్డీ వ్యాపారం, ధాన్యం, ఇప్పపూలు కొనుగోలు చేసి ఇతర ప్రాంతాలకు ఎగుమతి చేయడం, చిన్న చిన్న దుకాణాదారులకు సరుకులు సప్లయ్ చేసేది వీరే. ఆదివారం సంతకు దాదాపు 6, 7 వందల గ్రామాల ప్రజలు వచ్చి వారానికి సరిపడ సరుకులు తీసుకెళ్లడం, వీటిని కొనడానికి అటవీ ఉత్పత్తులు, బుట్టలు, కోళ్లు, మేకల అమ్మకం వంటి కార్యకలాపలలో ప్రధాన వ్యాపారం వీరిదే. చిత్రకొండలో నివాసముంటున్న 400 మంది ఉద్యోగస్తులకు కావాల్సిన నిత్యావసరాలు వీరే సప్లయి చేస్తారు. ఇదంతా ఒక పార్శ్వం అయితే మరో పార్శ్వం చీకటి వ్యాపారం. అధికారులు, రాజకీయ నాయకులతో సత్సంబంధాలు కలిగి ఉండి మూడు పువ్వులు, ఆరు కాయలుగా ఆస్తులను కూడేస్తూంటారు.

ఒక ఆసామికి స్పిల్‌బాయిలో దుకాణం, చిత్రకొండలో దుకాణం, ఈ దుకాణాలలోకి సామాన్లు తేవడానికి నాలుగు వాహనాలు, సిమెంట్ వ్యాపారంతో పాటు ఈ కుటుంబంలో ముగ్గురు ఉపాధ్యాయులు, పది రూపాయల వడ్డీ వ్యాపారం, బంగారం పెట్టిన వారికి ఐదు రూపాయల చొప్పున వడ్డీ తీసుకుంటారు. మరొకరు సారాయి తయారు చేసి చిత్రకొండలోని పదిహేను దుకాణాలకు సారాయి సప్లయ్ చేయడమే గాక తను కూడా ఒక దుకాణం ద్వారా అమ్మకాలు కొనసాగిస్తాడు. కుటుంబంలో ఒకరు ఫార్మసిస్టు, వడ్డీ వ్యాపారం, సారాయి తయారీకి, సప్లయ్‌కి లైసెన్స్ లేకుండా వ్యాపారం కొనసాగిస్తుండడంతో ఎలాంటి పన్నులు చెల్లించడు. ఇంకొకరికి పది వాహనాలు, కిరాణా దుకాణం, ఎరువులు, సిమెంట్ దుకాణాలు ఉన్నాయి. ఇతను రైతులకు గంజాయి విత్తనాలు, ఎరువులు సప్లయి చేస్తాడు. పండించినందుకు రైతుకు సగం. తనకు సగం కాని రైతు దగ్గరి గంజాయినీ మార్కెట్ ధరకంటే తక్కువ ధరకు తీసుకొని ఆ డబ్బులు వాయిదాలుగా ఎప్పటికో ఇస్తే ఇస్తాడు. లేదా ఎంతో కొంత ఇచ్చి బ్లాక్‌మేల్ చేసి భయపెట్టేస్తాడు. ఇంకా ఆసామి వలసవచ్చి వెల్డింగ్ దుకాణం పెట్టుకొని కుటుంబాన్ని నెట్టుకెళ్లే పరిస్థితి నుండి నేడు గంజాయి వ్యాపారం ద్వారా ఐదు ట్రక్కులు, ఒక కమాండర్ జీపును కొనుగోలు చేశాడు. 10 కోట్ల రూపాయల యజమాని అయ్యాడు. వడ్డీ వ్యాపారం చేస్తాడు. పై వారంతా పది నుండి అరవై కోట్ల రూపాయల విలువ చేసే ఆస్తులను కలిగి ఉన్నారనే అంచనా ఉంది. ఇక్కడ వ్యాపార, వాణిజ్యాలు కొనసాగిస్తూనే ఇతర ప్రాంతాలలో భూములు కొనుగోలు చేయడం, బిల్డింగ్‌లు నిర్మించుకోవడం జరుగుతోంది.

బలిమెల విద్యుత్ ఉత్పాదన ప్లాంట్ ఒరికల్ గ్రామంలో ఏర్పాటు చేయడం వల్ల ఈ గ్రామాన్నే బలిమెలగా పిలవడం జరుగుతోంది. ఒరికల్‌లో కోయ, రాణా ఆదివాసీ తెగలకు చెందిన 25 కుటుంబాలు నేటికీ ఎలాంటి అభివృద్ధికి నోచుకోకుండా పూరిగుడిసెల్లో జీవిస్తున్నారు. 7, 8 వరకు చదివి మానేసిన వారు ఇద్దరు ముగ్గురు తప్పా ఉన్నత విద్యా బుద్ధులు ఉద్యోగాలకు నోచుకోలేదు. బలిమెల జనాభా పన్నెండు వేల మంది. కేరళీయులు 250, తెలుగువారు 100, గజపతి, బరంపూర్, గంజాంల నుండి వచ్చినవారు మూడు వేల మంది. భువనేశ్వర్, మయూర్‌భంజ్, కటక్, పూరీల నుండి వచ్చిన దళిత, ఆదివాసీ జనాభా నాలుగు వేలకు పై చిలుకు ఉంది. బంగ్లాదేశ్ రెఫ్యూజీ అవిభక్త కోరాపుట్‌లోని జయపూర్, కోటపాడుల నుండి వచ్చిన దళిత, ఆదివాసీ జనాభా నాలుగు వేలకు పైగా ఉంది. తండ్రులు ఉద్యోగరీత్యా బలిమెల రాగా వారి పిల్లలు ఉద్యోగాలు లభించక పోవడంతో వ్యాపారంలోకి మారి కోట్ల ఆస్తులను ఆర్జించిన వారిలో ఎక్కువగా ఉన్నది బరంపూర్ వాసులే. ఒకరికి హోల్‌సేల్ దుకాణం, నాలుగు లారీలున్నాయి. లారీలు వ్యాపారం కోసం వీటిని రోజు వినియోగించడం జరుగుతోంది. మరొకరికి స్టేషనరీ, ఇనుము, సిమెంట్ దుకాణాలు ఉన్నాయి. పాడి అనే మరొకతనికి హోల్ సేల్ కిరాణా, సిమెంట్, ఇనుము దుకాణాలు ఉన్నాయి. ఇంకొకరికి కిరాణా హోల్‌సేల్ దుకాణం, రెండు వ్యాన్లు కలిగి ఉన్నాడు. సంత రోజున ఒక్కొక్కరు దాదాపు ఎనిమిది లక్షల రూపాయల విలువ చేసే వ్యాపారం చేస్తారు. వీరంతా బ్లాక్ (సమితి) స్థాయిలో తమ వ్యాపార కార్యక్రమాలను కొనసాగిస్తారు.

*(ఇంకా వుంది)*

*(రచయిత మావోయిస్ట్ నాయకులు, రాజకీయ ఖైదీ)* వీ

*వ్యవసాయ రంగంలోకి కార్పొరేట్లను ప్రోత్సహిస్తూ, బడ్జెట్ కేటాయింపులను తగ్గించుకుంటూ వస్తున్న ప్రభుత్వ వ్యవసాయ నిర్లక్ష్య విధానాలను వివరిస్తున్నారు* **వి. హనుమంతరావు**

# దేశ ఆర్థిక పరిస్థితిపై కారుమబ్బులు

దేశ ఆర్థిక, ద్రవ్య పరిస్థితుల మీద కారుమబ్బులు కమ్ము కొంటున్నాయి. దేశాభివృద్ధికి వ్యవసాయం కీలకం అని అంటూనే ప్రభుత్వం దృష్టి వ్యవసాయం మీద నుంచి లాంగ్‌జంప్ చేసి, పారిశ్రామిక రంగం మీద కేంద్రీకరిస్తే ఆ రంగం కూడా ఈ సంవత్సరం ప్రారంభం నుంచి పల్టీలు కొడుతోంది.

ప్రపంచంలో ఏ దేశమైనా తన అభివృద్ధికి ఈ రెండు రంగాలకు ప్రాధాన్యత ఇస్తాయి. కాని, మన దేశం సేవల రంగం అభివృద్ధి మీద దృష్టి సారించి, అదే దేశాభివృద్ధి అని, అదే పారిశ్రామికరంగం అభివృద్ధిగా చూపిస్తూ ప్రజలను నమ్మబలుకుతోంది. తనను తానే జోకొట్టుకుంటోంది. ఈ మూడు రంగాల ఉత్పత్తుల విలువనే స్థూల జాతీయాదాయం అని అంటారు. దీని అభివృద్ధినే దేశాభివృద్ధిగా చూపిస్తోంది ప్రభుత్వం. కాని తాజా సమాచారం ప్రకారం ఈ సంవత్సరం మొదటి త్రైమాసికంలో ఎనిమిది శాతం పైగా ఉంటూ వచ్చిన పెరుగుదల 7.7 శాతానికి దిగజారింది. అంటే పైన ఉదహరించిన మూడు రంగాల్లో ఉత్పత్తి విలువ ఆ మేరకు తగ్గిందన్న మాట. ఆర్థిక మంత్రి ప్రణబ్ ముఖర్జీకి ఈ తగ్గుదల చమటలు పట్టిస్తున్నాయి. ఈ గణాంకాలు తనకు ఆందోళన కలిగిస్తున్నాయని బహిరంగంగా అంగీకరించాల్సి వచ్చింది.

2008లో ప్రపంచ ఆర్థిక సంక్షోభ సమయంలో మన పారిశ్రామిక రంగం నుంచి ఎగుమతులు తగ్గి ఉత్పత్తి మందగించినా, తర్వాత కాలంలో ఎగుమతులు పుంజుకొన్నాయి. కాని ఇటీవలి యూరోప్ మార్కెట్లో, ఆర్థిక పరిస్థితుల్లో సంక్షోభం ఏర్పడడంతో ఆ దేశాలకు మన ఉత్పత్తుల ఎగుమతులు తగ్గిన కారణంగా మన పరిశ్రమల్లో ఉత్పత్తులు తగ్గాయి. కార్ల ఎగుమతులు తగ్గడం, ధరలు పెరగడం వల్ల దేశ మార్కెట్లో గిరాకీ తగ్గడం వల్ల ఉత్పత్తుల పెరుగుదల గణనీయంగా తగ్గింది. గత నెలలో అంతకు ముందు 29 నెలల్లో ఎన్నడూ లేనంతగా పారిశ్రామిక ఉత్పత్తి తగ్గింది. కామర్స్ మంత్రివర్గ కార్యదర్శి రాహుల్ ఖుల్లార్ ప్రకారం ఇకముందు ఎగుమతులు మందగిస్తాయన్నారు.

వ్యవసాయ రంగానికి వస్తే ఉత్పత్తి నక్క తొక్కించిందేమో గాని బాగా ఉన్నా, ఆహార ద్రవ్యోల్బణం రెండంకెల స్థాయి దాటింది. కాని ఆ రంగం సంక్షోభంలో కొట్టుమిట్టాడుతోంది. ఉత్పత్తి కారకాల ధరలు పెరగడంతో రైతులు ధర గిట్టుబాటు కాక క్రాప్ హాలీడే ప్రకటించారు. మరో మాటలో చెప్పాలంటే రైతులు సమ్మెకు దిగారు. వ్యవసాయ రంగ చరిత్రలోనే ఇదొక అపూర్వ పరిణామం. ఎరువుల కొరత, ధరల పెరుగుదల తోడయ్యాయి.

పశ్చిమ బెంగాల్‌లో జనపనార ముఖ్యమైన పంట. దానికీ ధర చాలా తక్కువగా ఉంది. ఈ విషయా లన్నీ ఇటీవల లోక్‌సభలో చర్చకు వచ్చాయి. స్వామినాథన్ కమిటీ పంట పండించడానికి అయ్యే ఖర్చు మీద అదనంగా యాభై శాతం కలిపి కనీస ధరను నిర్ణయించాలనే సిఫార్సు అటకెక్కించేశారు. ఒకవేళ తిండి గింజలు లభ్యమైనా పోషకాహార విలువలుండడం లేదనే హెచ్చరికలు వినవస్తున్నాయి. దేశంలో ఆహార ధాన్యాల నిల్వలు పుష్కలంగా ఉన్నా సరఫరా వ్యవస్థ లోపం వల్ల అవి అందవలసిన వారికి అందడం లేదు. జపాన్, చైనా లాంటి దేశాల్లో ఎకరానికి ఆరు టన్నులు పండిస్తూంటే, మన దేశంలో మూడు టన్నులు పండించడం గగనమైపోయింది. ఇదిలా ఉండగా విదేశీ సంస్థలు, కార్పొరేట్లు వ్యవసాయంపై కన్నేశాయి. తిండి గింజల పంట నుంచి పళ్లు, ఫలాలు, కూరగాయాల పంటలకు భూములను మళ్లించడం, వాటిని పండించి ఎగుమతి చేసి లాభాలు సంపాదించడం వారి లక్ష్యం. చిత్తు 12వ ప్రణాళికలో ఈ లక్ష్యాన్ని ప్రతిపాదించారు కూడా. పంట భూములను కొనడం, కాంట్రాక్టు వ్యవసాయం చేయించడం, రైతులను వారి పొలాల్లోనే వ్యవసాయ కూలీలుగా మార్చడం వారెంచు కున్న విధానం. గత కొద్ది కాలంగా పప్పుధాన్యాల ధరలు చుక్కలు చూశాయి. ఎపుడూ దిగుమతుల మీద ఆధారపడడం నిత్యకృత్యమై పోయింది. కారణం? కెనడా, ఆస్ట్రేలియా, అమెరికా, మయన్మార్ లాంటి దేశాల్లో మనదేశం కన్న చాలా తక్కువ విస్తీర్ణంలో ఈ పంటలు పండిస్తున్నా, ఆ దేశాలు హెక్టారుకు వెయ్యి నుంచి 1900 కిలోలు పండిస్తూంటే, మన దేశంలో రెండున్నర కోట్ల హెక్టార్ల భూమి మీద పండించినా, ఉత్పాదకత కేవలం ఆరు వందల కిలోలే. ప్రణాళికల్లో వ్యవసాయానికి ప్రాముఖ్యత నానాటికీ దిగజారిపోతూ వచ్చింది.

ప్రణాళికా కేటాయింపులు ఇలా తగ్గిపోతూ వస్తూంటే వ్యవసాయం సంక్షోభంలో పడక ఏమవుతుంది. ఇలా తగ్గిపోవడం సరళీకృత ఆర్థిక విధానాలు 1991లో అమలుపరచడం ప్రారంభమై నప్పటి నుంచే అనేది గమనార్హం. సంవత్సరాలుగా గణాంకాలను విశ్లేషిస్తే బడ్జెట్‌లో ఈ రంగానికి చేసిన కేటాయింపులు ఖర్చు కాకపోవడం జరుగుతునే ఉంది. ఉత్పాదకతకు, జిడిపికి తోడ్పడే రంగాలు ఇలా నీరు కారిపోతుంటే, ఉత్పాదకతకు ఎంత మాత్రం తోడ్పడని సేవలరంగం శాతం పెరిగి పోతుంటే దేశ, రాష్ట్ర ఆర్థిక పరిస్థితి ఎలా బాగుపడుతుంది?

ఎంతకూ దిగిరాని ద్రవ్యోల్బణం పాలకుల బుర్రలు తినేస్తుందని పత్రికల్లో నిరంతరంగా వార్తలు వస్తున్నాయి. దానికి విరుగుడు వడ్డీ

రేట్లు పెంచడమేనని రిజర్వ్ బ్యాంక్ పదకొండు సార్లు పెంచినా ఫలితం లేక, పన్నెండవ సారి పెంచుతారనే వార్తలు వస్తున్నాయి. ధరలు కూడా మొండిగా పెరుగుతూనే ఉన్నాయి. ఏదైనా రోగం వచ్చి డాక్టర్ వద్దకు వెళితే మందులు రాసిస్తాడు. తగ్గకపోతే వేరే మందు రాసిస్తాడు. కాని అదే మందు అదే పనిగా రాసిస్తుంటే రోగమూ మొండికేస్తుంది. సరఫరా వైపు లోపాల కారణంగా ఈ విధానం వైఫల్యాన్నెదుర్కోవాల్సి వచ్చిందంటున్నారు. తిండి గింజలు ఆరుకోట్లు నిల్వలుంటే సరఫరా లోపం ఎందుకు ఏర్పడాలి. చెరకు విస్తారంగా పండింది. కాని పంచదార ధర ఎందుకు తగ్గలేదు? పైగా ప్రజలు మేలైన తిండి తింటున్నారని మధ్యతరగతి మీద అవాకులు, చవాకులు పేలుతున్న ఆర్థిక శాస్త్రవేత్తలు, పాలకులు ధరలు పెరిగిన కొద్దీ తమ వినియోగాన్ని తగ్గించుకోవడం తప్ప వేరే మార్గం లేదనే విషయం ఈ పెద్ద మనుషులకు తోచలేదా? ఎపుడో టెండుల్కర్ 77 శాతం మంది రోజుకు ఇరవై రూపాయలతో వెళ్లబుచ్చుతున్నారనే లెక్క అప్పటి నుంచి ధరలు పెరగడంతో ఏ పన్నెండు రూపాయలకో దిగిపోయి ఉంటుందని ఏ లెక్కల మేష్టారినైనా అడిగితే చెబుతాడే? అలాంటిది పాలకుల బుర్రకు తట్టలేదా? ఇలాంటి నేపథ్యంలో దేశం అభివృద్ధి పథకంలో పరుగులు తీయడం ఎలా సాధ్యం?

వచ్చే సంవత్సరం గడ్డు పరిస్థితి నెదుర్కోవాల్సి వస్తుందని రిజర్వ్ బ్యాంక్ 2010-11 వార్షిక నివేదికలో ప్రభుత్వాన్ని హెచ్చరించింది. ప్రపంచవ్యాపిత ఆర్థిక పరిస్థితులు ప్రపంచ రాజ్యాలను ఇబ్బందులకు గురి చేయవచ్చుని, అలా జరిగితే మన దేశంలో జిడిపి ఎనిమిది శాతం పెరుగుదల అనుమానమేనని అభిప్రాయపడింది. ప్రస్తుత జిడిపి పెరుగుదల రేటు ఇలాగే కొనసాగితే 2025లో ప్రపంచంలోనే మూడవ అతి పెద్ద రాజ్యంగా అవతరిస్తుందని ప్రధాని మన్మోహన్ అంటున్నారు. జిడిపి పెరుగుదల రేటు ఎనిమిది శాతం కన్నా కిందకు జారిపోయిన నేపథ్యంలో ఎపుడో 2025 నాటికి ఏదో జరుగుతుందన్న మన్మోహన్‌జీ, మీరు ఆకాశానికి నిచ్చెనలు వేస్తున్నారేమో కాస్త ఆలోచించండి. పరుగెత్తుతూ పాలు తాగేకన్నా నిలబడి నీళ్లు తాగడం మంచిదని మన పెద్దలు చెబుతారు. మూడు సంవత్సరాలుగా ద్రవ్యోల్బణాన్ని, ధరల పెరుగుదలను అదుపు చేయలేని మీరు ఎప్పటికో ఏదో చేసేస్తానంటుంటే ప్రజలెలా నమ్ముతారనే ఆలోచనే మీకు రాలేదా?

మన నిత్య జీవితంలో అప్పుల అప్పారావులు తరచుగా తారస పడుతుంటారు. అలాంటి వారందరికీ పెద్దన్నయ్య కేంద్ర ప్రభుత్వం. అమెరికా లాంటి బడా పెట్టుబడిదారీ దేశమే వారి ప్రజాప్రతినిధుల సభ అప్పు చేయడానికి పెట్టిన సీలింగ్‌ను దాటే పరిస్థితి ఏర్పడి చావు తప్పి కన్నులొట్టపోయి తాత్కాలికంగా బయట పడిందని అనుకొంటూండ గానే యూరోపియన్ దేశాలు అలాంటి ఊబిలో దిగబడ్డాయి. బయట పడడానికి గిలగిలా కొట్టుకుంటుంది. రాచపీనుగు తోడు లేకుండా పోదన్నట్లు, ప్రపంచీకరణ పుణ్యమా అంటూ మన దేశమూ మంద గమనంలో పడింది. షేర్ మార్కెట్ కుదేలవడం, విదేశీ పెట్టుబడిదారులు పెద్దమొత్తంలో ఉపసంహరించు కోగా, దేశంలోని చిన్నచిన్న పెట్టుబడి దారులు దాదాపు నాలుగు లక్షల కోట్ల రూపాయలు నష్టపోయారు. ప్రపంచీకరణ విషవలయంలో చిక్కుకొన్న ఏ దేశమూ తప్పించుకోలేదని స్వయాన ఆర్థికమంత్రి ఒప్పుకొన్నారు. మరోపక్క మనకేమీ ఫర్వాలేదు, మన ఫండమెంటల్స్ బలంగా ఉన్నాయని ఆయన అంటారు. మన

| ప్రణాళికా సంఖ్య | మొత్తం ప్రణాళికా కేటాయింపులో వ్యవసాయ రంగం శాతం |
|---|---|
| 2 | 6.9 |
| 3 | 6.3 |
| వార్షిక ప్రణాళికలు | 6.7 |
| 4 | 6.1 |
| 5 | 5.0 |
| 6 | 3.6 |
| 7 | 4.6 |
| వార్షిక 90-92 | 4.0 |
| 92-95 | 2.3 |
| 95-97 | 3.2 |
| 8 | 2.7 |
| 9 | 3.5 |
| 10 | 3.8 |

దేశ విదేశీ రుణభారం మన విదేశీ మారక నిల్వలను మించిపోయింది. ఎపుడేమి ఇబ్బంది వచ్చినా ప్రపంచ బ్యాంక్ వద్దకు పరుగులు తీయడం, వాళ్లు షరతులతో కూడిన రుణాలు ఇస్తే తెచ్చుకోవడం జరుగుతూనే ఉంది. ఇప్పుడు పరిస్థితి ఏమంటే ప్రపంచ బ్యాంక్ రుణాలివ్వడానికి విధించిన పరిమితిని అధిగమించే జోన్‌లో మనం పడ్డాం. జూన్ 2011 నాటికి మన ప్రపంచ బ్యాంక్ రుణం 11.4 బిలియన్ డాలర్లు. జూన్ 2010 నాటికే బ్యాంక్ మన దేశంలో వివిధ ప్రాజెక్టులకు 21.4 బిలియన్ల రుణం ఇవ్వడానికి ఒప్పందాలు జరిగాయి. ఈ గణాంకాలన్నీ కేవలం ప్రపంచ బ్యాంక్ రుణాలకు సంబంధించినవి మాత్రమే. వీటికి ఇతర విదేశీ, స్వదేశీ రుణాలు జోడిస్తే - తలచుకొంటేనే భయం వేస్తుంది. బ్యాంకులు జాతీయం చేసినపుడు ఆ నిధులను దేశాభివృద్ధికి వినియోగిస్తామని చెప్పిన ప్రభుత్వం ఆ బ్యాంకుల షేర్లను అమ్మకానికి పెట్టింది. అంటే ఎవరైతే ఆ షేర్లు కొంటారో వాళ్లకు ఆ మేరకు వారి స్వంత పరిశ్రమలకు, వ్యాపారాలకు రుణాలు తీసుకొనే అవకాశం ఏర్పడుతుంది. అంటే ఆ మేరకు నిధులు దేశాభివృద్ధికి కాక వ్యక్తుల, కార్పొరేట్ల ప్రయోజనాలకు మళ్లించబడతాయి. అంతేకాదు, విదేశీ బ్యాంకులకు దేశంలో శాఖలు ఏర్పాటు చేసుకోవడానికి అనుమతి ఇవ్వడం జరిగింది కాబట్టి. అంతవరకూ బ్యాంకుల్లో డిపాజిట్ అవుతున్న నిధులు విదేశ బ్యాంకులకు మళ్లుతాయి. అదే పరిస్థితి ఇన్సూరెన్స్ రంగంలో ఏర్పడనుంది. ప్రభుత్వానికి నిధులు సమకూర్చే బ్యాంకులు, ఇన్సూరెన్స్ రంగాల్లో షేర్లు అమ్మకానికి పెట్టిన తర్వాత ప్రభుత్వ రంగ పరిశ్రమలు ఒక లెక్కా?

లాభాలు సంపాదించి పెడుతూ, ప్రభుత్వానికి డివిడెండ్లు కోట్ల రూపాయలు చెల్లిస్తున్న ప్రభుత్వ రంగ పరిశ్రమల్లో షేర్లను అమ్మకానికి పెట్టింది. ఇది తానెక్కిన చెట్టు కొమ్మను తానే నరుక్కోవడం అంటారు. కాని ప్రస్తుతం మాంద్య పరిస్థితి నెలకొనడంతో పారిశ్రామికవేత్తలు ఈ షేర్లు కొనడానికి ఉత్సాహం చూపించడం లేదు. 2010-11 కేంద్ర బడ్జెట్‌లో ఈ షేర్ల అమ్మకం ద్వారా నలభై వేల కోట్ల రూపాయల ఆదాయం సంపాదించాలనుకుంది. కాని అంత సొమ్ము లభించే

*వ్యవసాయం అంటేనే అదును, పదునులతో సాగుతుందంటూ, ఎరువుల కోసం రోజుల తరబడి గానుగెద్దుల్లా తిరుగుతున్న రైతాంగ దుస్థితిని వివరిస్తున్నారు* **ఎన్. భగవాన్ రెడ్డి**

# ఎరువుల కోసం ఎవుసం పాట్లు

అక్రమార్జనల మాఫియా ముఠాల సభ్యులు కారు. సంఘ విద్రోహులు కారు. ఉద్యమకారులు కారు. అయినా రోజుల తరబడి పోలీసు స్టేషన్ల చుట్టూ, ప్రాథమిక కేంద్రాల చుట్టూ తిరుగుతున్నారు. పోలీసుల పహారాలో, తుపాకుల నీడన అన్న పానీయాలు లేక గంటల తరబడి 'క్యూ'లో నిలబడి నీరసించి స్పృహ తప్పి పడిపోతున్న పాట్లు వాళ్లవి. వాళ్లెవరో కాదు. ఆరుగాలం కష్టించి పదిమందికి పట్టెడన్నం మెతుకులు అందించే అన్నదాతలు. రైతు రాజ్యం, రైతు శ్రేయస్సు తమ కర్తవ్యం అంటూ ప్రకటనలు ఇచ్చే ప్రభుత్వాలు రైతుల సమస్యలు పరిష్కరించడంలో వైఫల్యం చెందుతున్నాయనడానికి గత నెల రోజులుగా రైతులు ఎదుర్కొంటున్న అవస్థలే నిదర్శనం. మొన్న ధాన్యం సేకరణలో, నిన్న విత్తనాలు, నేడు ఎరువుల సరఫరాలో ఎదురైన, ఎదురవుతున్న సమస్యలే ప్రభుత్వ నిర్లక్ష్యం, వైఫల్యానికి నిదర్శనాలు.

మొన్న ప్రభుత్వం నిర్ధారించిన మద్దతు ధరకు రైతుల వద్దనున్న ధాన్యాన్ని కొనుగోలు చేయడానికి గిడ్డంగులులేక ప్రభుత్వ కార్యాలయాలు, పాఠశాలలు దేన్నీ విడిచిపెట్టలేదు. అయినా ఎన్నో ఇబ్బందులెదురైనాయి. వర్షాకాలం ప్రారంభం కాగానే విత్తడానికి సరిపోయేటన్ని విత్తనాల్ని అందించడంలో సమస్య లెదురైనవి. విత్తనాల కోసం రైతులు ఆందోళన చేయాల్సి వచ్చింది. నేడు పంట చేలకు కావాల్సిన ఎరువుల కోసం ఆందోళన. డబ్బులిచ్చినా దొరకని ఎరువు బస్తాల కోసం రైతుల పాట్లు.

## ఎరువుల వాడకం నాడు – నేడు

గతంలో స్థానికంగా లభించే సహజ వనరుల నుండి రైతులు సేంద్రియ ఎరువుల్ని తయారు చేసుకొని వినియోగించేవారు. వరి పంట పండించే పొలాల్లో వేప, తంగేడు, సీతాఫలాల చెట్ల ఆకుల్ని వేసి బురదలో కుళ్లింపజేసి ఎరువుగా ఉపయోగించేవారు. పశువుల పేడ, ఇతర చెత్తా చెదారాల్ని ఎరువుగా వాడేవారు. ఇక మెట్ట ప్రాంతాల్లోని భూముల్లో వేసవి కాలంలో ఖాళీ సమయాల్లో ఎడ్ల బండ్ల ద్వారా చెరువు కుంటల్లోని మెత్తటి మట్టిని నింపి సారవంతం చేసేవారు. సాగుభూమిని దున్నడానికి ట్రాక్టర్ల వినియోగం పెరగడం, పశుపోషణ తగ్గడం, విత్తనాల సేకరణలో మార్పు తదితర కారణాలతో అనేక మార్పులు సంభవించి సేంద్రియ ఎరువుల స్థానంలో రసాయనిక ఎరువుల వాడకం పెరిగింది. ఎడ్లబండ్లు కనుమరుగై, ట్రాక్టర్ల ఖర్చుతో మట్టికొట్టడం కన్నా ఎరువు బస్తాలు కొనడం సులభమై డిమాండ్ పెరుగుతూ వచ్చింది. దానికి తోడు సాంప్రదాయకంగా కొన్నితరాలుగా వచ్చిన స్థానిక విత్తనాల సేకరణ తగ్గుతూ వచ్చి హైబ్రిడ్ విత్తనాలకు డిమాండ్ పెరిగింది. ఈ విత్తనాలు ఒకసారి మాత్రమే ఉపయోగపడతాయి. వాటికి తగిన ఎరువులు అనివార్యంగా ఉపయోగించాల్సిందే. అందుకోసం విత్తనాలు, ఆ తర్వాత ఎరువుల సమస్య రోజురోజుకూ పెరుగుతూ వచ్చింది. ప్రతిసారి సీజన్లో విత్తనాల కోసం, ఎరువుల కోసం రైతులు ఆందోళన చేయాల్సి వస్తోంది.

---

అవకాశం ప్రస్తుతానికి లేదు. ప్రభుత్వ వాటాలు అమ్మకానికి సమయం కాదని ప్రణబ్ ముఖర్జీ అంగీకరించారు. కట్టుకొన్న ఇల్లు అమ్మకానికి ఎవరైనా పెట్టారంటే ఆ వ్యక్తి దివాళా తీసినట్లేగా? అలాగే ప్రజల సొమ్ముతో ఏర్పాటు చేసుకొన్న పరిశ్రమల్లో వాటా అమ్మకానికి పెట్టడం ద్వారా ప్రభుత్వ ఆర్థిక పరిస్థితి ఎంత సంక్షోభంలో కూరుకు పోయిందో అర్థమవుతుంది.

జిడిపి పెరిగితే ఉత్పత్తి పెరిగిందన్నమాట. ఉత్పత్తి పెరిగితే ఉపాధి పెరగాలి. కాని ప్రభుత్వ గణాంకాల ప్రకారమే 1999–2000 / 2004–05 మధ్యకాలంలో గ్రామీణ ప్రాంతాల్లో ఉపాధి అవకాశాలు 2.2 శాతం పెరిగినట్లు అంచనా వేయగా ఈ పెరుగుదల 2009–10 మధ్య 0.42 శాతం మాత్రమే ఉంది. ఆర్థిక సంస్కరణలు రెండు దశాబ్దాల క్రితం ప్రారంభమైన తర్వాత దేశంలో ఉద్యోగావకాశాల పరిస్థితి క్షీణించింది. ప్రభుత్వ రంగ పరిశ్రమల్లో ఉద్యోగాల తొలగింపు పెరిగిపోయింది. రిటైరైనవారి స్థానాలను భర్తీ చేయడం లేదు. ప్రభుత్వ కార్యాలయాల్లో కూడా తాత్కాలిక సిబ్బందిని నియమించడం జరుగుతోంది. విస్తృతంగా ప్రైవేటీకరణ చేపట్టడం వల్ల ఉద్యోగావకాశాలు మరింత కుంచించుకపోయాయి. పరిశ్రమల ఆధునికీకరణ పేరుతో కార్మికుల స్థానే రోబోలనుపయోగిస్తున్నారు. ప్రతీ సంవత్సరం జనాభా పెరుగుతుందంటే ఉద్యోగార్థుల సంఖ్య పెరుగుతుంది. కళాశాలల నుంచి బయటకు వచ్చి ఉద్యోగాల వేటలో పడేవాళ్లు లక్షల్లో ఉన్నారు. ప్రభుత్వం అమలుపరుస్తున్న సంక్షేమ పథకాల సంఖ్యలో అభివృద్ధి కనిపిస్తుంది కాని ఆ పథకాల ఫలితాలను అనుభవించాల్సిన వారి సంఖ్య అవినీతి పుణ్యమా అంటూ కుదించుక పోతున్నది. అన్నా హజారే ప్రారంభించిన అవినీతి వ్యతిరేక ఉద్యమానికి వచ్చిన స్పందన అవినీతితో ప్రజలు ఎంత విసిగివేసారి పోయారో అనే విషయాన్నే కాక ప్రభుత్వ పథకాల ఫలితాలు తమకు చేరడం లేదని వెలిబుచ్చిన ప్రజాగ్రహంగానూ భావించాలి.

*(రచయిత వీక్షణం వ్యవస్థాపక సంపాదకులు)* వీ

## ఎరువులకై రైతుల పాట్లు

రాష్ట్రంలోని పలు ప్రాంతాల్లో ముఖ్యంగా తెలంగాణ జిల్లాల్లోని రైతాంగం ఎరువుల కోసం తీవ్ర ఇబ్బందులకు గురవుతున్నారు. దేశంలోని వివిధ వర్గాల ప్రజలు స్వాతంత్ర్య దినోత్సవ వేడుకల్లో ఉండగా రైతులు మాత్రం ఎరువుల విక్రయ కేంద్రాల వద్ద, పంట చేల వద్ద పడిగాపులు మొదలుపెట్టారు. ఆదిలాబాద్ మొదలుకొని కరీంనగర్, నిజామాబాద్, మెదక్, వరంగల్, రంగారెడ్డి, నల్గొండ, మహబూబ్‌నగర్ వరకు వివిధ మండలాల్లో ఎరువుల కోసం రైతులు రోడ్డు మీదికొచ్చారు. కరీంనగర్ జిల్లాలో హుస్నాబాద్, పెద్దపల్లి, ఎల్కతుర్తి, తిమ్మాపూర్‌లలో; మెదక్ జిల్లాలోనైతే మెదక్, రామాయం పేట, దౌల్తాబాద్, సిద్ధిపేట, గజ్వేల్, వర్గల్, దుబ్బాక, జిన్నారం, నర్సాపూర్, నారాయణ్‌ఖేడ్ లాంటి అన్ని మండలాల్లో; వరంగల్ జిల్లా వర్ధన్నపేట; మహబూబ్‌నగర్ జిల్లా బిజినేపల్లి, నాగర్‌కర్నూల్, షాద్‌నగర్, ధన్వాడ్, మద్రికల్ లాంటి ప్రాంతాల్లో సమస్య తీవ్రంగా ఏర్పడింది.

ఎరువుల సమస్య నెలకొన్న ప్రాంతాల్లోని రైతులు విక్రయ కేంద్రాలు, పోలీస్ స్టేషన్ల చుట్టూ నేరస్తుల మాదిరిగా ప్రదక్షిణలు చేయడం, పడిగాపులు కాయడం తప్పలేదు. రైతు కుటుంబాల్లోని మహిళలు, పిల్లలతో వచ్చి గంటల తరబడి క్యూలలో నిల్చోవడం, అయినా దొరక్కపోవడం, రోజుల తరబడి తిరగాల్సి రావడం జరుగుతోంది. విక్రయ కేంద్రాల వద్ద పరిస్థితులు ఇలా ఉంటే ఎదురు చూడగా వచ్చిన ఎరువుల బస్తాలు తమదాకా వస్తాయో లేదోనన్న ఆందోళనలతో తోపులాటలు, తొక్కిసలాటలు జరుగుతున్నవి. నియంత్రణ కోసం అధికారులు పోలీసుల్ని ఆశ్రయించడంతో కొన్ని పోలీసు స్టేషన్లు విక్రయకేంద్రాలుగా మారడంతో స్టేషన్ల చుట్టూ తిరుగుతున్నారు. మరికొన్ని ప్రాంతాల్లో పి.ఎ.సి.ఎస్.లు కేంద్రాలుగా మారినాయి. ఈ కేంద్రాల చుట్టూ ఐదారు రోజులు తిరిగినా దొరకని పరిస్థితులున్నాయి. ఒక్కో రైతుకు ఒక్క బస్తా ఇస్తారనడంతో మహిళలు, పసి పిల్లలతో పాటు వచ్చి క్యూలు కడుతున్నారు. ఒక్కొక్కరు మూడు క్యూలు కడుతున్నారు. ఒక్కో క్యూలో గంటలు గంటలు నిలబడాల్సి వస్తుంది. టోకన్లు ఉన్నవారికే ఎరువు ఇస్తారని టోకన్ల కోసం మొదటి 'క్యూ', బిల్లు చెల్లించడానికి రెండో 'క్యూ', ఎరువుల బస్తా కోసం మూడో 'క్యూ'. తెల్లారేసరికి 'క్యూ'లు కడుతున్నారు. అన్నపానీయాలు లేక సాయంత్రం వరకు నిలబడడంతో నీరసించి సొమ్మసిల్లి పడి పోయిన సందర్భాలున్నాయి. ఇలా రోజులు తరబడి తిరిగి, గంటల తరబడి నిలబడడంతో విసిగిపోయి కొన్నిచోట్ల చెప్పులను, మరికొన్ని చోట్ల చెట్ల కొమ్మలను 'క్యూ'లల్లో పెట్టి పక్కలకు కూర్చుంటున్నారు. వర్షంలో సైతం గొడుగులు పట్టుకొని నిలబడుతున్నారు. ఉదయం నుండి రాత్రి వరకు వస్తున్నాయనడంతో తమకు అందుతవో లేదోనని అక్కడే పడిగాపులు కాస్తున్నారు. రాత్రి వరకు 'క్యూ'లో నిలబడుతున్నారు. ఆ వచ్చిన ఎరువుల బస్తాలు క్యూలో ఉన్న అందరికీ సరిపోక నిరాశకు గురవుతున్నారు. ధర్నాలు, రాస్తారోకోలకు దిగుతున్నారు.

గజ్వేల్ లోనైతే రాత్రి పదకొండు గంటలకు ఎరువుల లోడు రాగా అర్ధరాత్రి 'క్యూ'లో ఉన్నవారికి పోలీస్ స్టేషన్లో పంపిణీ చేశారు. నర్సాపూర్ – తూప్రాన్ హైవే పై రెండు గంటల పాటు రైతులు రాస్తారోకో నిర్వహించగా ఆరు కిలోమీటర్ల మేరకు వాహనాలు నిలిచిపోయే పరిస్థితి ఏర్పడింది. పంపిణీ కోసం వచ్చిన ఎరువు అందరికి సరిపోదని ఏమి చేయాలో తోచక పరిష్కారం కోసం ఆలస్యమైన సందర్భాల్లో ఓపిక నశించి లూటీలకు పాల్పడే ప్రయత్నాలు సైతం చోటు చేసుకున్నాయి.

ప్రతి ఏటా ఖరీఫ్ సీజన్లో ఎదురవుతున్న ఎరువుల సమస్యను పరిష్కరించడానికి తగిన చర్యలు సకాలంలో తీసుకోగలిగితే సమస్యల తీవ్రతలు ఉండవు. మొక్కజొన్న పంట పీపెల దశలో ఉన్నందున సకాలంలో ఎరువులు అందనట్లైతే ఉత్పత్తి సరిగా రాదనేది రైతుల వాదన. చెరువులు నిండక ప్రాజెక్టులు, కాల్వల ద్వారా నీటిపారుదల లేనందున వర్షాధార పంటలే తమకు జీవనాధార మంటూ, అందుకే సకాలంలో ఎరువులు లేకుంటే తీవ్రంగా నష్టపోతా మని రైతులంటున్నారు. కొన్ని చోట్ల ఎరువు బస్తాలివ్వకుంటే పురుగుల మందు తాగి చస్తామంటూ మందు డబ్బాలతో వచ్చి కూర్చున్న సందర్భాలున్నాయి.

## ఎరువుల కొరతకు కారణాలు

ఎరువుల వినియోగంపై సరైన అవగాహన లేక తగిన సమయాల్లో తగిన చర్యలు తీసుకోకపోవడంతో సమస్య తీవ్రత ఎక్కువగా కనిపిస్తుంది. యూరియా బస్తా ఒక్కంటికి ప్రభుత్వం నిర్ణయించిన ధర రు. 278 అమ్మడం తమకు లాభసాటి కాదన్న కారణంతో డీలర్లు ముందుకు రావడం లేదు. రైతుల కోసం ఏర్పడిన ప్రాథమిక వ్యవసాయ సహకార కేంద్రాలు కొన్ని ఆర్థికంగా వెనుకబడి ఉండడంవల్ల అవి సరఫరా చేయించలేకపోతున్నాయి. కొన్ని ప్రాంతాల్లో కొందరు డీలర్లు ఎరువుల్ని బ్లాక్ మార్కెటింగ్‌కి తరలించారు. ఎక్కువ ధర చెల్లించిన వారికి ఎరువులు అందడం జరుగుతుందనేది రైతులు చెబుతున్నారు. కేంద్ర ప్రభుత్వం మన రాష్ట్రానికి అందించాల్సిన ఎరువులు విదేశాల నుండి రావాల్సిందనీ, ఆ నౌకా ప్రయాణాల జాప్యంవల్ల పంపిణీలో ఆలస్యం జరుగుతోందంటున్నారు. ఎరువుల మిక్సింగ్ ప్లాంట్ల వద్ద జరిగే అవకతవకలు, రవాణాలో నిర్లక్ష్యం తదితర చర్యలు సమస్య తీవ్రతకు కారణమవుతున్నాయి. అందు బాటులో ఉన్న ఎరువుల్ని సైతం అయినవారికి అప్పగించడం, గొప్పవాళ్లు ఎగరేసుకు పోవడం జరుగుతోంది.

రాష్ట్ర రైతుల అవసరాల మేరకు ఖరీఫ్ సీజన్లో 15 లక్షల టన్నుల యూరియా, 7.30 లక్షల మెట్రిక్ టన్నుల డిఎపి కేంద్రం కేటాయించినా సరఫరా కావట్లేదు. జూన్ నుండి సెప్టెంబర్ వరకు రైతులకు ఈ ఎరువు అవసరం ఎక్కువ. ఈ సమయంలో రైతులకు మినహా ఇతరులకు ఈ ఎరువు ఇవ్వవద్దని కంపెనీలకు, డీలర్లకు వ్యవసాయ శాఖ జూన్‌లో ఆదేశాలిచ్చినా పట్టించుకోవట్లేదు. ఈ ఆదేశాల్ని ఏవో సాకులతో తుంగలో తొక్కేస్తున్నారు. నిర్లక్ష్యం, ముందు చూపు లేకపోవడం, ప్రణాళికా బద్ధంగా తగిన చర్యలు చేపట్టకపోవడం వంటి చర్యలతో సమస్యలు ఉత్పన్నమవుతున్నాయి. సమస్యలు ఏర్పడకుండా నివారించగలిగే మార్గాలుంటాయి. ఆ దిశలో చర్యలు చేపట్టగలగాలి.

మన సమాజంలో డెబ్భై శాతం పైగా ప్రజానీకం వ్యవసాయ రంగంపై, అనుబంధ రంగాలపై ఆధారపడి జీవిస్తున్నారు. అట్టి వ్యవసాయం గిట్టుబాటుగా, లాభసాటిగా లేదంటూ అప్పుల బాధలకు లోనై ఆత్మహత్యలకు పాల్పడుతున్న తరుణంలో రైతాంగ సమస్యల పరిష్కారం పట్ల చిత్తశుద్ధితో వ్యవహరించాల్సిన అవసరముంది. ఇల్లూ వాకిలినొదిలి, పొలాలనొదిలి రోజుల తరబడి నిరీక్షించడం, తిరగాల్సి రావడం, ఆందోళనకు దిగడం నిత్యకృత్యాలుగా మారకుండా తగిన చర్యలు తీసుకోవాల్సిన బాధ్యత ప్రభుత్వానిది. ఇక ముందైనా విత్తనాలు, ఎరువులు, ధాన్య సేకరణ (ధాన్యం కొనుగోలు) లాంటి సందర్భాల్లో సమస్యలు ఉత్పన్నం కాకుండా ప్రణాళికా బద్ధంగా వ్యవహరించి పరిష్కారాల వైపు పాలకులు శ్రద్ధ వహించాలి.

*(రచయిత ఉపాధ్యాయులు)*

*వ్యవసాయరంగాన్ని నిర్లక్ష్యం చేయడంతో తలెత్తిన సంక్షోభం అంతిమంగా ఆహార ధాన్యాల కొరతకు దారితీస్తుందని అంటున్నారు* **విద్యాభూషణ్**

# ఛిద్రమవుతున్న ఆహార భద్రత!

మనిషికి జీవనాధారమైన ఆహారం పుష్కలంగా లభ్యమయ్యే పరిస్థితి ఆహార భద్రత. లభ్యమౌతున్న ఆహారం సామాన్యుల కొనుగోలుకు అందుబాటులో ఉండాలన్నదీ ఇందుకనుబంధమైన అంశం. అయినా 'లభ్యత' అన్నదే ఈనాటి ప్రధానాంశం. ఎందుకంటే ఓ వైపు తగ్గుతున్న ఉత్పత్తి, కరువు కాటకాలు కారణంగా ఒక్క ఏడాది కాలంలో ఆహారం ధరలు సుమారు 40 శాతం పెరిగాయి. గడచిన మూడేళ్లను పరిగణన లోకి తీసుకుంటే ఆహార ధాన్యాల ధరల పెరుగుదల 83 శాతానికి చేరింది. దీంతో ప్రపంచ వ్యాప్తంగా 85 కోట్ల మంది ప్రజానీకం ఆకలితో అల్లాడిపోయే పరిస్థితి నెలకొంది. ప్రపంచవ్యాప్తంగా ఆహార భద్రతను సమీక్షిస్తూ తగు ముందస్తు జాగ్రత్తలు తీసుకునేందుకనువుగా 1945 అక్టోబర్‌లో 'ఫుడ్ అండ్ ఎగ్రికల్చరల్ ఆర్గనైజేషన్ (ఎఫ్ఎఒ) ను ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యంలో నెలకొల్పారు. పౌష్టికాహార లభ్యత, జీవన స్థాయి పెంపుదల, సక్రమ పంపిణీ, ఆకలి లేకుండా చేయడం వంటి లక్ష్యాలను నిర్దేశించుకున్నా ఆచరణకు ఆమడదూరంలో ఉంది.

2008 జూన్‌లో రోమ్‌లో జరిగిన 'ప్రపంచ ఆహార సదస్సు'లో పరిస్థితులను సమీక్షించుకుని, 2030 నాటికి నేటి ఆహారోత్పత్తిని 50శాతం మేరకు పెంచాలని అంచనా వేశారు. సమగ్ర కార్య నిర్వహణ పథకాన్ని రూపొందించారు. ఆహారోత్పత్తిని ఈ స్థాయిలో పెంచాలంటే చిన్న కమతాల రైతులను ప్రోత్సహించాలన్నారు. వీరికి అవసరమైన మేలు రకమైన విత్తనాలను, ఎరువులను అందజేయాలని, ఉత్పత్తుల మార్కెటింగ్‌కు అనువుగా రవాణా ఏర్పాట్లు చూడాలనీ, ఈ సన్నకారు రైతాంగానికి సూక్ష్మ రుణాలను అందివ్వాలనీ సూచించారు. రైతుల ఉత్పత్తులకు సరైన గిట్టుబాటు ధరలు లభ్యమయ్యేలా వ్యాపార పన్నులను సవరిస్తూ.. ఎగుమతి ఆంక్షలను దిగుమతుల సుంకాలను సమీక్షించాలనీ పేర్కొన్నారు. ఈ ప్రకటిత లక్ష్యాలను పర్యవేక్షించేందుకు ప్రత్యేక టాస్క్‌ఫోర్స్‌ను ఏర్పాటు చేసినా, చిత్తశుద్ధి లేని లక్ష్యాలు గానే ఎఫ్ఎ.ఒ.లు మిగిలిపోయాయి. ఈ నేపథ్యంలో మనదేశం - మన రాష్ట్రంలోని పరిస్థితులను సమీక్షించుకుందాం.

ఆహార ధాన్యాల ఉత్పత్తి ప్రస్తుతానికి సంతృప్తికరంగా ఉన్నా భవిష్యత్ కాలంలో ఆహార కొరతను అధిగమించేందుకు గానూ దేశ స్థాయిలో ప్రధానమంత్రి ఆర్థిక సలహా మండలిని రంగరాజన్ నేతృత్వంలో ఏర్పాటు చేశారు. ఈ సలహా మండలి 2008-09 సంవత్సరంలో ఆహార భద్రతపై ఓ నివేదికను రూపొందించింది. ఇందులో అధిక ఉత్పత్తులకనువుగా సాగునీరు కల్పన, విద్యుత్ వినియోగం, ఎరువులు విత్తనాల సరఫరాపై ప్రత్యేక శ్రద్ధ చూపించాలని స్పష్టం చేశారు. 2007-08లో 230.7 మిలియన్ టన్నుల ఉత్పత్తి జరగ్గా, 2010-11 నాటికి 210 మిలియన్ టన్నులకే పరిమితం అయింది. ఇందుకు కారణం ఏటా సాగు విస్తీర్ణం క్రమంగా తగ్గుతూ రావడమే. ఈ ఏడాది కేవలం 30 శాతం సాగుభూమి మాత్రమే సాగులో ఉంది.

వాస్తవంగా ఆర్థిక మండలి అంచనా ఉత్పత్తి 250 మిలియన్ టన్నులు. అంటే ఉత్పత్తి అంచనాలు తారుమారయ్యే పరిస్థితి ఊపందు కుందన్న మాట. పెట్రోల్, డీజిల్, వంట గ్యాస్ వంటి నిత్యావసరాల ధరలను పెరుగుదలతో బడ్జెటేతర చెల్లింపులు పెరగడంతో ద్రవ్యోల్బణం అదుపు తప్పిన పరిస్థితి. వెరసి ఆహార భద్రతకు అభద్రతా ప్రమాణం పొంచి ఉందన్న మాట.

ఇక మన రాష్ట్రానికి వస్తే... చరిత్రలో ఇంతవరకూ కనీవినీ ఎరుగని రీతిలో రాష్ట్రంలో అన్నపూర్ణ జిల్లాలైన ఉభయ గోదావరి జిల్లాల్లో రైతులు 'క్రాప్ హాలిడే' (పంటలకు విరామం) ప్రకటించారు. ఈ పరిస్థితి ఎందుకు వచ్చింది? ప్రభుత్వ అలక్ష్య విధానాలకు నిరసగా. ఎకరాలకు 55 బస్తాల మేరకు పండించే కోనసీమ రైతులు, సేద్యానికి దూరంగా నిరసన వ్రతం చేపట్టారు. సుమారు లక్ష హెక్టార్ల పంట భూమిని బీడు భూమిగా వదిలేశారు. ఇలానైనా మా బతుకు మమ్మల్ని బతకనివ్వండని ప్రభుత్వాన్ని వేడుకుంటున్నారు. అన్నదాతను ఈ దీనస్థితికి దిగజార్చిన పరిస్థితులేంటి? ఏ ప్రభుత్వ విధానాలు ఈ విపరీత పరిస్థితులకు హేతువయ్యాయి?

పై ప్రశ్నలకు సమాధానం సూటిగా చెప్పుకోవాలంటే, అటు కేంద్రం - ఇటు రాష్ట్ర ప్రభుత్వాలు చేపడుతున్న ప్రపంచీకరణ విధానాలే కారణం. వ్యవసాయ రంగాన్ని ఈ రెండు (కేంద్ర - రాష్ట్ర ప్రభుత్వ) విధానాలూ ప్రభావితం చేస్తాయి. రాజ్యాంగం ప్రకారం వ్యవసాయం రాష్ట్రానికి సంబంధించిన సబ్జెక్ట్ అయినప్పటికీ కేంద్ర ప్రభుత్వ విధానాలూ ప్రభావితం చేస్తాయి.

1991లో అమెరికా పుణ్యమా అని చేపట్టిన ప్రపంచీకరణ విధి విధానాలు మన రైతాంగానికి అనుకూలం కాదు. ఈ విధానాల లక్ష్యమే మార్కెట్ సంస్కృతిని ప్రవేశపెట్టడం.. అంటే వాణిజ్యం. దీంతో పెట్టుబడిదారులు, వాణిజ్య కార్పొరేట్లు, వీరికంటే ముందుగా బహుళజాతి సంస్థలు రంగప్రవేశం చేస్తాయి. వాణిజ్యానికి కీలక లక్ష్యం లాభం. ఇదెక్కడి నుంచో శూన్యం నుంచి రాదుగా. ఎదుటి వాడు ఎంతగా మోసపోతే అంతగా లాభం వస్తుంది. అంటే అంతగా ఎదుటి వాడ్ని మోసం చేస్తుండాలన్న మాట. ఇక్కడ సామాజిక లక్ష్యం, దృక్పథం కొరవడతాయి. వ్యక్తి స్వేచ్ఛ, స్వలాభమే కీలకం. ఈ గీతోపదేశాన్ని

చేసిన సామ్రాజ్యవాద నేతలకనువుగా దేశీయ విధి విధానాలే మారిపోతూ ఉంటాయి. అయితే బాహాటంగా చేస్తే అది 'మోసం' కాదు కాబట్టి.. ఆహార భద్రత (ఎఫ్ఎఐ) సదస్సు వంటి పెద్ద పెద్ద మాటలు చెప్తూనే, సామాన్యునికి గోరీ కట్టేస్తారు. ఇందు కనువుగా ప్రపంచీకరణ ప్రథమ సూక్తుల ఆచరణగా, వ్యవసాయ రంగంలో పెట్టుబడుల్ని తగ్గించేశారు. ప్రణాళికా బడ్జెట్‌ల్లో కేటాయింపులు తగ్గిపోతున్నాయి. స్థూల జాతీయోత్పత్తిలో 18 శాతం వరకు వ్యవసాయరంగం నుంచి వస్తున్నదే అయినా బడ్జెట్ కేటాయింపులు నాలుగు శాతానికి మించడం లేదు. సుమారు 70 శాతం ప్రజానికానికి నెలవైన రంగం – ఈ వ్యవసాయ రంగం. వ్యవసాయ రంగానికిదివరకు ఇస్తున్న రాయితీలను కుదించడం జరిగింది. ప్రభుత్వం అందివ్వాల్సిన విత్తనాలు, మార్కెటింగ్ విధానాలకు స్వస్తి పలికి కార్పొరేట్ సంస్థలకు ధారాదత్తం చేసేసి చేతులు దులిపేసుకుంది. కల్తీ విత్తనాలు – కల్తీ మందులు లాభాపేక్షతో రంగ ప్రవేశం చేసినా, నియంత్రణ అన్న మాటే లేకుండా ప్రేక్షక పాత్ర వహిస్తోంది ప్రభుత్వం. తత్ఫలితంగా విత్తనాల వ్యాపారంలో 30 శాతం మేరకు, ఎరువుల్లో 90 శాతం వరకు బహుళజాతి సంస్థలే ఆక్రమించుకున్నాయి. సేంద్రీయ ఎరువుల స్థానంలో రసాయన ఎరువులే వినియోగంలోకి వచ్చి, భూసారాన్ని దిగజారుస్తున్న పరిస్థితీ నెలకొంది.

నేటి కోనసీమ రైతు కన్నెర్ర చేయడానికి కారణం.. పంటకు గిట్టుబాటు ధర లభ్యం కాకపోవడం. ఇతర రంగాల్లో తమ ఉత్పత్తులకు (పారిశ్రామిక, తయారీ రంగాల్లో) తామే ధర నిర్ణయిస్తున్నా వ్యవసాయ రంగ ఉత్పత్తులకు మాత్రం ఢిల్లీలో కూర్చున్న అధికారులు (ధరల కమిషన్) గిట్టుబాటు ధరలను నిర్ణయిస్తారు. వీరికి వ్యవసాయం పట్ల ప్రాథమిక అవగాహన ఉండదు. ఈ నేల గురించి, నేలల్లో రకాలు–సారాలు అంతుపట్టవు. గత సంవత్సరపు గిట్టుబాటు ధరకు పదో – పరకో పెంచేసి, వాణిజ్యవేత్తలకు అనువుగా ధరను నిర్ణయిం చేస్తారు. ఆచరణలో రైతుకు ఏడాదికా ఏడాది పెట్టుబడులు విస్తారంగా పెరిగి పోతుంటాయి. అకాల వర్షాలు – చీడలు – నీటి ఎద్దడి– విద్యుత్ సరఫరా సక్రమంగా లేకపోవడం – నకిలీల బెడద – ఫలితంగా పెట్టుబడి ఇబ్బడిముబ్బడిగా పెరిగిపోతుంది. కావాలనే ప్రభుత్వం రుణ సౌకర్యాన్ని కల్పించదు. ప్రైవేట్ వ్యక్తులకు పంటను పణంగా పెట్టి అప్పు తీసుకుని సేద్యం పనిచేసినా (ఈ విషయం కమిషన్ అధికార్లకు తెలీదు) అరాకొరా సేద్య ఫలం.. వచ్చిన వెంబడే రుణదాతకు సమర్పణం. రైతు పంటకు గిట్టుబాటు ధరను నిర్ణయించాల్సిన కమిషన్‌కు శాస్త్రీయ అవగాహన లేదు. వ్యవసాయ విశ్వవిద్యాలయాల సూచనల మేరకు ఈ ధరల కమిషన్ వ్యవహరిస్తుంది.

కూలిరేట్లు వ్యవసాయ రంగంలో గత రెండేళ్లలో 80 శాతం మేరకు పెరిగాయి. ఆయా కుటుంబ సభ్యుల కష్టాన్ని పరిగణనలోకి తీసుకోవాలి. ద్రవ్యోల్బణంను కూడా గుర్తించాలి. ఇందుకు తోడు మన సేద్యపు భూముల్లో రకరకాల నేలలు. విభిన్న వాతావరణ పరిస్థితులు, రకరకాల సేద్యపు పద్ధతులు, ఫలితాల్లోనూ దిగబడుల్లోనూ అంతరాలు. ఇవేవీ పరిగణనలోకి తీసుకోకుండా దేశం మొత్తానికి ఒకే తరహా గిట్టుబాటు ధర. పోనీ ప్రభుత్వపరంగా పంటల ను కొనుగోలు చేయడం ఉంటుందా అంటే అదీ ఉండదు. కంటి తుడుపుగా ఓ 10, 15 శాతానికి మించని కొనుగోళ్లు. తదుపరి ధర పెరిగేంత వరకు ఉత్పత్తిని నిలువ చేసుకుందామంటే నిల్వల సౌకర్యం ఉండదు. మరీ పరిస్థితులు రైతుకు సానుకూలమా ఆలోచించాలి.

గతంలో రైతు తన సంప్రదాయ సేద్య రీతిన రకరకాల పంటలను పండించేవారు. ఆహార ధాన్యాలు, పప్పుధాన్యాలు, నూనెగింజలు, కాయ గూరలను పండించేవారు. ఇప్పుడు వాణిజ్య సంప్రదాయ ప్రకారం ఏకపంట విధానం (మోనో కల్చర్)తో ఏదో ఒకపంటను, లాటరీ పద్ధతి లో ఎన్నుకుని 'అటో–ఇటో' అన్న జూదానికి బలైపోతున్నాడు. దీనికి తోడు నీరు కలుషితం – గాలి కలుషితం – భూమి రసాయన ఎరువుల బారినపడి సారాన్నికోల్పోవడం. ఉత్పత్తిని ఆశించినంతగా ఇవ్వడం లేదు.

మన సేద్యంలో చిన్న చిన్న కమతాలు ఎక్కువ. అధిక ఉత్పత్తికి చిన్న కమతాలే సానుకూలమైనప్పటికీ, నేటి సేద్యం జూదంగా మారిపోయి, వ్యవసాయాన్ని చేజేతులా ఒదులుకునే పరిస్థితికి నెట్టేయ బడుతున్నారు.

స్వంత భూమిలేని వారు కౌలుసేద్యానికి సాహసించినా కౌలుకే గ్యారంటీలేదు. పంటలో 1/3 వ వంతు, కొన్ని ప్రాంతాల్లో 2/3 వంతు సైతం కౌలుగా తీసుకుంటున్నారు. పంట పండినా పండక పోయినా, కౌలు రైతులకు హక్కులుగానీ ప్రయోజనాలు గానీ లేవు. సంస్థాగత రుణాలు వంటి వాటికి కౌలు రైతులు అనర్హులు. రాష్ట్రంలో బంజరు భూములున్నా అవి పేదవారి వరకూ రావడం లేదు. పంట భూముల్నే ప్రత్యేక ఆర్థిక మండలాల పేరిట పారిశ్రామికవేత్తలకు కట్టబెట్టే ప్రయత్నం చేస్తుందీ ప్రభుత్వం. అదీ పారిశ్రామికీకరణ ముసుగులో. పట్టణాలకు ఆనుకుని ఉన్న ,రేవులను అంటిపెట్టుకున్న తీర ప్రాంతాల్లో వందల వేలాది ఎకరాలను, సెజ్‌ల పేరిట సంతర్పణ చేస్తుంది. ఇందులో సేద్యానికి అనువైన భూముల్లో చేపల పెంపకం వంటి వాటిని ప్రోత్సహించి అటు పర్యావరణాన్ని ఇటు భూసారాన్ని దెబ్బతీసే కుట్రకు పాల్పడుతోందీ ప్రభుత్వం.

మరిరీతిన ప్రభుత్వాలే వ్యవసాయరంగంపై కక్షకట్టి వ్యవహరిస్తే 'ఆహార భద్రత'కు అవకాశమెక్కడ?

జీవన భద్రతకు ఆలవాలమైన స్వావలంబన ఆశయాలతో 'ఆహార భద్రత' ఆవశ్యకతను గుర్తెరగాలి. ప్రజాస్వామ్య పద్ధతిలో సామాజిక న్యాయ లక్ష్యంతో ప్రత్యామ్నాయ వ్యవసాయ విధానాన్ని రూపొందిం చాలి. మార్కెట్ లక్ష్యంగా కాకుండా రైతు శ్రేయస్సు లక్ష్యం కావాలి. సంప్రదాయ సేద్య విధానాలను ప్రోత్సహించాలి. సేంద్రీయ సేద్యాన్ని ప్రభుత్వమే రాయితీలు ఇచ్చి ప్రోత్సహించాలి. దళారీల బారి నుండి రైతును రక్షించి, వ్యవసాయ మార్కెటింగ్ విధి విధానాలను అమలు పరచాలి. జాతీయ బ్యాంకుల ద్వారా రైతులకు, కౌలుదార్లకు రుణ సదుపాయాన్ని కల్పించాలి. జన్యు మార్పిడి పంటల నిషేధం అనివార్యం. పంట మార్పిడి విధానాన్ని ప్రోత్సహించాలి.

గిట్టుబాటు ధరలను శాస్త్రీయంగా అంచనా వేయాలి. స్వామినాథన్ సూచనల మేరకు ఉత్పత్తి వ్యయానికి యాభై శాతం అదనంగా కలిపి మద్దతు ధరను అందివ్వాలి. ఉత్పత్తిని ప్రభుత్వరంగ సంస్థల ద్వారా కొనుగోళ్లు చేపట్టాలి. పంట బీమా పద్ధతిని అమలు చేయాలి. భూసంస్కరణలను చేపట్టి భూమిలేని నిరుపేదలకు భూవసతిని కల్పించాలి. మార్కెట్ యార్డుల్లో స్టోరేజ్‌లను, గౌడౌన్లను ఏర్పాటు చేసి యాజమాన్యాన్ని రైతులకే కల్పించాలి. తక్షణం ఉపాధి హామీ పథకాన్ని సక్రమంగా అమలుపర్చాలి. సక్రమ నిర్వహణలేని కారణంగా ఈ పథక ప్రభావం వ్యవసాయ రంగం మీదపడి, వ్యవసాయ కూలీలే కరువయ్యే వైనం ఎదురవుతోంది.

*(రచయిత పాత్రికేయులు)* వీ

***పాలకులు తమ పాలనకు సమ్మతితో పాటు సేఫ్టీవాల్వ్ లాగా అసమ్మతిని కూడా తామే సృష్టించుకుంటున్నారనీ, అవినీతి ఉద్యమాలు ప్రత్యామ్నాయ ప్రజా ఉద్యమాలతో కలిసి సాగాలనీ అంటున్నారు*** **ఎస్. శేషయ్య**

# హజారే ఉద్యమం - ప్రత్యామ్నాయం

అవినీతికి వ్యతిరేకంగా జరిగిన అన్నా హజారే ఉద్యమాన్ని 'రెండవ స్వాతంత్ర్య పోరాటం'గా మీడియా, మేధావులు కొనియాడారు. ఈ ఉద్యమంలో పట్టణ మేధావి, మధ్యతరగతి ప్రజలు ఎక్కువ సంఖ్యలో పాల్గొన్నారు. గత సంవత్సరం నుండి భారీ అవినీతి కుంభకోణాలు బయటపడడం, వీటిల్లో రాజకీయ నాయకులు, కార్పొరేట్ శక్తుల పాత్ర ఉండడం, ప్రభుత్వం నిర్లక్ష్యం చూసి ప్రజలు విస్తుపోయారు. ప్రభుత్వ పాలనలోనూ, ప్రజాసేవలను పొందడంలోనూ అధికారుల చేతులు తడపందే పనులు జరగడం లేదు. వ్యవస్థీకృతమైన అవినీతి, లంచగొండితనంతో ప్రజలు విసిగిపోయారు. ప్రభుత్వం పట్ల ప్రజల్లో విశ్వాసం సన్నగిల్లింది. ప్రజల ఆవేదనకు, అసంతృప్తికి, ఆవేశానికి అన్నా హజారే అవినీతి వ్యతిరేక ఉద్యమం వ్యక్తీకరణ అయింది. దేశంలోని పలు పట్టణాలకు విస్తరించింది. అన్నా హజారేని 'అపర గాంధీ'గా చూసారు. ఉద్యమానికి మద్దతునిచ్చారు. ఉద్యమాన్ని అన్నా హజారే టీంకు వదిలేశారు.

అన్నా హజారే ఉద్యమం ఎంతగా ప్రశంసించబడిందో అదే స్థాయిలో కాకున్నా విమర్శలకు గురైంది. ఉద్యమం అగ్రకులాల నాయకత్వానికి పరిమితమైందనీ, వెనుకబడిన వర్గాలకు, బడుగు వర్గాలకు ప్రాతినిధ్యం లేదనీ కొంతమంది విమర్శించారు. పౌరసమాజం ప్రతినిధుల పేరుతో కొంతమంది వ్యక్తులు, స్వచ్ఛంద సంస్థల ప్రతినిధుల నాయకత్వంలో ఉద్యమం ఉండిపోయిందని విమర్శ ఉంది. ఆర్.ఎస్.ఎస్., బిజెపి, వాటి అనుబంధ సంస్థలు వెనక ఉండి ఉద్యమాన్ని నడిపించాయనే విషయం కూడా వాస్తవమే. కంచ ఐలయ్య ఈ ఉద్యమాన్ని పోషక ఫాసిజం అని వివరమైన వ్యాసం రాశాడు.

అన్నా హజారే టీం (కూటమి) ఉద్యమంపై వచ్చిన ప్రశంసలను, విమర్శలను పక్కనబెడితే చివరికి ఫాసిజం ప్రతినిధులు ప్రతిపాదించిన జనలోక్‌పాల్ బిల్లు యాథాతథంగా పార్లమెంట్ సభ్యులు ఒప్పుకోలేదు. పార్లమెంట్‌లో చర్చ జరిగి చట్టం స్థానంలో ఒక తీర్మానం కూడా కాదు 'ఒక ప్రకటన'కు మాత్రమే పార్లమెంట్ ఆమోదం తెలిపింది. మొత్తంగా ఉద్యమం గెలిచి ఓడిపోయిందా అనిపిస్తుంది. ప్రస్తుతం అవినీతిపరులైన రాజకీయ నాయకులు అన్నా హజారే టోపీలు పెట్టకొని భయం లేకుండా బహిరంగ సభల్లో పాల్గొంటున్నారు. మేమూ అవినీతికి వ్యతిరేకంగా పోరాడుతాం అని శపథం చేస్తున్నారు.

వాస్తవానికి అన్నా హజారే ఉద్యమం కొన్ని అపోహలను, భ్రమలను సమాజంలో పునః ప్రతిష్ఠించడానికి, బలపరచడానికి ప్రయత్నించింది. అలాగే ప్రజా ఉద్యమాలు జాగ్రత్తగా ఉండాలనే సంకేతం కూడా ఇచ్చింది. అన్నా హజారే లేదా పౌరసమాజం పేరుతో జరిగే ఉద్యమాలు రాజకీయాల పట్ల, రాజకీయ పార్టీల పట్ల, రాజకీయ ప్రక్రియ పట్ల ప్రజల్లో, ప్రత్యేకించి మధ్యతరగతి ప్రజల్లో ఏహ్యాభావాన్ని పెంచగలవని స్పష్టమైంది. మూడు అంశాలను వివరంగా పరిశీలిద్దాం.

### పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పరమ పవిత్రమైంది

ప్రభుత్వం రూపొందించిన లోక్‌పాల్ బిల్లు పటిష్ఠంగా లేదని, అనేక లొసుగులు ఉన్నాయని, దాని స్థానంలో అన్నా హజారే టీం ప్రతిపాదించిన జనలోక్‌పాల్ బిల్లును పార్లమెంట్‌లో ప్రవేశపెట్టి చట్టం చేయాలని పౌరసమాజం ప్రతినిధులు పట్టుపట్టారు. జనలోక్‌పాల్ బిల్లును పరిశీలిస్తామని చెబుతూనే ఆగస్ట్ 17న ప్రధానమంత్రి ఒక అభిప్రాయాన్ని స్పష్టం చేశారు. 'అన్నా హజారే ప్రతిపాదించిన జనలోక్‌పాల్ బిల్లు డ్రాఫ్టును పార్లమెంట్‌పై రుద్దడం సరైంది కాదు. అన్నా హజారే ఆలోచన సరైంది కాదు. బిల్లును ఒప్పుకోవాలని ఒత్తిడి చేయడం పార్లమెంటరీ ప్రజాస్వామ్యాన్ని వ్యతిరేకించడమే' అని తన వ్యూహాన్ని స్పష్టంగా ప్రకటించాడు. ఆగస్ట్ 27న పార్లమెంట్‌లో బిల్లుపై జరిగిన చర్చ సందర్భంగా ప్రణబ్ ముఖర్జీ మాట్లాడుతూ 'పార్లమెంట్ సభ్యులు ప్రజల చేత ఎన్నుకోబడ్డారు. పార్లమెంట్ మాత్రమే చట్టం చేయాలి. కొంత మంది బయటి వ్యక్తులు (పౌరసమాజం ప్రతినిధులు) ప్రజా ప్రతినిధుల విధులను, అధికారాలను నిర్వహిస్తామంటే కుదరదు' అని అన్నా హజారే టీంను పరోక్షంగా విమర్శించాడు. 'రాజ్యాంగం మీద ప్రమాణం చేసిన పార్లమెంట్ సభ్యులు రాజ్యాంగ విలువలకు, ప్రమాణాలకు అనుగుణంగానే నడుచుకోవాలి' అని ఆవేశంగా ప్రసంగించాడు. ప్రతిపక్ష పార్టీలు కూడా జనలోక్‌పాల్ బిల్లులోని కొన్ని అంశాలపై అభ్యంతరాలు తెలిపాయి. ప్రధానమంత్రిని, న్యాయమూర్తులను లోక్‌పాల్ పరిధిలో ఉంచకూడదన్నారు. ప్రధానమంత్రి పదవి అత్యున్నతమైందనీ, న్యాయవ్యవస్థ స్వతంత్రతను కాపాడడం అవసరం అని వాదించారు. రాష్ట్రాల్లో లోకాయుక్తలను ఏర్పాటు చేయాలనడం కూడా రాజ్యాంగంలోని ఫెడరల్ విధానానికి విరుద్ధం అని అన్నారు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం గురించి, దాని పవిత్రతను గురించి, రాజ్యాంగం విలువలు, ప్రమాణాల గురించి ఏకరువు పెట్టిన వారు, రాజ్యాంగంలోని ఆర్టికల్ 118ని తుంగలో తొక్కారు. ప్రభుత్వం తరఫున ప్రవేశపెట్టిన ప్రకటన (స్టేట్‌మెంట్) పార్లమెంట్ సభ్యులందరూ 'బల్లలు గుద్ది' ఆమోదం తెలిపారు. ఈ ఆమోదాన్ని సెన్స్ ఆఫ్ ది హౌస్‌గా స్పీకర్ కొనియాడారు.

ఈ పద్ధతి ద్వారా ఒక తీర్మానానికి గానీ, ప్రకటనకు గానీ ఆమోదం తెలపడం ఆర్టికల్ 118కి పూర్తిగా వ్యతిరేకం.

పార్లమెంట్ సభ్యులు ప్రజల చేత ఎన్నుకోబడ్డవారే. ఎవరు ఎన్నుకోబడుతున్నారు? ఎలా ఎన్నుకోబడుతున్నారు? ప్రజా ప్రతినిధులుగా ఏం చేస్తున్నారు? ఈ ప్రశ్నలకు జవాబులు అందరికీ తెలిసినవే. పార్లమెంట్‌లోని ప్రజా ప్రతినిధులు ఎంతమందిపై నేరారోపణలున్నాయో వోహ్రా కమిటీ వివరంగా చెప్పింది. రెండవసారి ఎన్నికైన పార్లమెంట్ సభ్యుల ఆస్తులు 200 శాతం పెరిగాయి. మరొక విషయం ఏమంటే ప్రస్తుతం పార్లమెంట్‌లో 38 మంది యువకులు ఉన్నారు. వీరిలో 33 మంది తల్లిదండ్రులు గతంలో పార్లమెంట్ సభ్యులుగా, మంత్రులుగా ఉన్నారు. కాంగ్రెస్ పార్టీకి చెందిన 208 ఎం.పి.లలో 23 మంది మహిళలున్నారు. దాదాపు 11 శాతం. వీరిలో 18 మంది గత పార్లమెంట్ సభ్యుల భార్యలు లేదా కూతుళ్లు. మిగిలిన ఐదుగురిలో ఒకరు జోద్‌పూర్ మహారాజా కుమార్తె. యువనేత రాహుల్‌గాంధీ రాజీవ్‌గాంధీ వారసుడు. లోక్‌సభ ప్రజలకు ప్రాతినిధ్యం వహిస్తున్నదా లేక తమ వంశపారం పర్యతను కొనసాగిస్తున్నదా?

(ఇక అత్యున్నత న్యాయస్థానంలో న్యాయమూర్తులు ఎవరు అనే విషయం పరిశీలిస్తే మరింత ఆశ్చర్యం వేస్తుంది. 20 శతాబ్దం మొదటి దశకంలో 83 శాతం జడ్జీలు బ్రాహ్మణులే. జనాభాలో వీరి శాతం 3 మాత్రమే. మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత కాలంలో 72 శాతం జడ్జీలు బ్రాహ్మణులే. ఏ కాలంలోనైనా సుప్రీంకోర్టులో 40 శాతం జడ్జీలు బ్రాహ్మణులే. మిగతా వారు అగ్రకులాలకు చెందిన వారే. కేవలం 10 శాతం మాత్రమే బి.సి., ఎస్.సి., ఎస్.టి.లకు చెందిన వారు. అత్యున్నత న్యాయస్థానంలో పొందిక, ఎంత ప్రజాస్వామికమైందో తెలుస్తుంది.)

'ఓటుకు నోటు' స్కాం మన పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ఎంత వెలిగిపోయిందో తెలిసిందే. అన్నా హజారే ఉద్యమం ప్రభుత్వంపై ఎంత ఒత్తిడి తెచ్చినా, ప్రజలు ఎక్కువ సంఖ్యలో మద్దతు తెలిపినా చివరికి పార్లమెంటరీ ప్రజాస్వామ్యం పేరుతో, రాజ్యాంగం పేరుతో ప్రభుత్వం తాను అనుకున్నది సాధించింది. మన పాలకవర్గాలు, పెట్టుబడిదారులు, కార్పొరేట్ శక్తులు రాజ్యాంగం నీడలో (రతన్ టాటా 'రైట్ టు ప్రైవసీ' మీద 2జీ స్పెక్ట్రం కుంభకోణం సంబంధించిన కేసులో బయటపడ్డాడు) పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ముసుగులో, ప్రజా ప్రతినిధుల వేషంలో రాజకీయ అవినీతి కొనసాగిస్తున్నారు. ఏ ఉద్యమం అయినా నిరసన అయినా రాజ్యాంగ పరిధిలో ఉండాలని, చట్టం నిర్దేశించిన విధంగా నడవాలనీ పదే పదే వల్లేవేస్తారు. అన్నా హజారే టీం కూడా చివరికి సంప్రదింపుల ద్వారా సమస్య పరిష్కారం కోరుకుంది. పార్లమెంట్‌కే వదిలేసింది. జనలోక్‌పాల్ బిల్లుకు ఎన్ని లొసుగులు ఉండాలో, ఏవిధంగా రూపొందించాలో అదే నిర్ణయిస్తుంది. వచ్చే పార్లమెంట్ సమావేశాల్లో బిల్లును ప్రవేశపెట్టి జనలోక్‌పాల్ చట్టాన్ని చేస్తుందో లేదో అనుమానమే.

### అన్నా హజారే ఉద్యమం – పౌరసమాజం

అన్నా హజారే టీం వ్యవహరించిన తీరు, ఉద్యమ స్వభావం, నిర్మాణం, కార్యాచరణ ప్రజాస్వామ్య పద్ధతులకు వ్యతిరేకంగా సాగింది. అన్నా హజారే టీంలోని కొంతమంది సభ్యులపైన ఆరోపణలు వచ్చాయి. కేజ్రీవాల్ తండ్రి, సోదరులు బి.జె.పి.లో క్రియాశీల సభ్యులనే వార్తలు వచ్చాయి. అయితే వీటిని ఆయన ఖండించారు. టీం సభ్యులపై ఎవరైనా ఆరోపణలు చేస్తే వారిపై పరువు నష్టం దావా వేస్తామని బెదిరింపు ధోరణితో ప్రకటన చేసారు.

'ఇండియా ఎగెనెస్ట్ కరప్షన్' ఉద్యమాన్ని నడపడానికి అవసరమైన నిధులు ఫోర్డు ఫౌండేషన్, ఇతర కార్పొరేట్ సంస్థల నుంచి వచ్చాయనే వార్తలు వచ్చాయి. ఈ విషయాలన్నింటిని పక్కకు పెట్టినా 'పౌరసమాజం' 'పౌరసమాజం ప్రతినిధులు' అనే భావన ఉద్యమం సందర్భంగా ప్రాచుర్యం పొందింది. పౌరసమాజంలో స్వచ్ఛంధ సంస్థలు భాగం. ఈ సంస్థలకు ప్రభుత్వం నిర్వహించే అభివృద్ధి కార్యక్రమాలు అప్పజెప్పడం, వారి పాత్రను ప్రోత్సహించడం గురించి ప్రపంచ బ్యాంక్ నిర్దేశించే విధానాల్లో అంతర్భాగం. స్వచ్ఛంధ సంస్థలు నడిపే ఉద్యమాలు రాజకీయాలకు అతీతంగా ఉంటాయి. రాజకీయ పార్టీలను దూరంగా ఉంచుతాయి. అన్నా హజారే ఉద్యమం రాజకీయాల పట్ల, రాజకీయ పార్టీల పట్ల మధ్యతరగతిలో ఏహ్యభావాన్ని పెంచాయి. రాజకీయ పార్టీలను, ఉద్యమాలను సిద్ధాంతపరంగా విమర్శించవచ్చు. కానీ అసలు రాజకీయాల ప్రస్తావనే ఉండకూడదని, రాజకీయాలకు అతీతంగా ఉద్యమాలు నడపాలనే ఆలోచనలు, భావనలు చాలా ప్రమాదకరమైన సంకేతాలు. ప్రభుత్వం అనుసరిస్తున్న నయా ఉదారవాద విధానాల ఫలితంగా ఏర్పడిన సామాజిక, ఆర్థిక సంక్షోభాలు, అభివృద్ధి పేరుతో జరుగుతున్న విస్థాపన, విధ్వంసానికి వ్యతిరేకంగా ప్రజలు పోరాడుతున్నారు. ప్రతిఘటిస్తున్నారు. ఈ నేపథ్యంలో అన్నా హజారే ఉద్యమం పాలకవర్గాలకు ఒక రక్షణ కవచంగా (సేఫ్టీ వాల్వ్)గా ఉపయోగపడింది. మన సమాజంలో నెలకొన్న అనేక రకాల వ్యత్యాసాలు, అసమానతలు, దోపిడీ, ఆధిపత్యాలు 'పౌరసమాజం' అనే భావనలో, ప్రాధాన్యత లేదు. ప్రధానంగా పౌర సమాజం అనే భావన 'వర్గ సమాజం' భావనకు, అవగాహనకు వ్యతిరేకంగా ఉపయోగిస్తున్నారు. పౌరసమాజంలో భాగమైన స్వచ్ఛంధ సంస్థలు నడిపే ఉద్యమాలు వర్గపోరాటాలకు దూరంగా ఉంటాయి. వాటిని పక్కదారి పట్టించడానికి ఉపయోగపడతాయి. అందుకే ప్రభుత్వాలు వీటిని ప్రోత్సహిస్తాయి. వీటికి విదేశీ, స్వదేశీయంగా నిధులు సమకూరుతాయి.

పాలకవర్గాలు తమకు అనుకూలంగా ప్రజల సమ్మతిని మీడియా ద్వారా, ఇతర సాధనాల ద్వారా తయారు చేసుకుంటాయని తెలిసిందే. కాని ఇవ్వాళ తమపై అసమ్మతిని ఒక పథకం ప్రకారం తయారు చేస్తున్నాయి. ప్రపంచీకరణకు వ్యతిరేకంగా 'మరో ప్రపంచం సాధ్యమే' అనే నినాదంతో ప్రపంచ వ్యాపితంగా స్వచ్ఛంధ సంస్థలు డబ్ల్యు.ఎస్.ఎఫ్.గా ఏర్పడ్డాయి. మన దేశంలో 2004లో ఇలాంటి సదస్సు జరిగింది. అప్పుడు డబ్ల్యు.ఎస్.ఎఫ్. కు ఒక నిర్మాణం లేదనే విమర్శలు వచ్చాయి. ఎవరికి తోచిన విధంగా వారు ఉద్యమించవచ్చు. విమర్శించవచ్చు అనేది డబ్ల్యు.ఎస్.ఎఫ్. దృక్పథం. ప్రపంచవ్యాప్తంగా ఇలాంటి అసమ్మతిని తయారు చేసే ఉద్యమాలను కార్పొరేట్ శక్తులు ప్రోత్సహిస్తున్నాయి. వాటికి నిధులను అందజేస్తున్నాయి. క్రియాశీలకమైన నాయకత్వాలను తమకు అనుకూలంగా మార్చుకుంటున్నాయి. తాము నిర్దేశించిన విధంగానే ఉద్యమాలు నడవాలని షరతులు విధిస్తున్నాయి. నాయకత్వానికి కింది స్థాయి కార్యకర్తలకు మధ్య దూరాన్ని పెంచి చివరికి ఉద్యమాన్ని నీరుకారుస్తాయి. అన్నా హజారే టీం 21 మందికే

*రాజకీయ వ్యవస్థ, ఆర్థిక విధానాలు, పాలనా యంత్రాంగం అన్నీ అవినీతిలో కూరుకుపోయాయంటూ, ప్రజా పోరాటాలతోనే అవినీతికి అడ్డుకట్ట వేయగలమని అంటున్నారు* **వాసిరెడ్డి భాస్కరరావు**

# అవినీతి నియంత్రణ పౌర సమాజానికి సాధ్యమా?

**భా**రతదేశంలో అవినీతి అనేక విధాలుగా అనుపమానమైనది. సమాజంలోని అన్నిస్థాయిల్లోను ఇదొక విలక్షణమైనది. అసాంఘికమైన ఈ అవినీతి శతాబ్దాల తరబడి వారసత్వంగా వస్తోంది. ముఖ్యంగా వలస పాలనకు వ్యతిరేకంగా నడిచిన స్వాతంత్ర్యోద్యమంలో ప్రస్తుత అవినీతికి అంకురార్పణ జరిగింది. స్వాతంత్ర్యోద్యమంలో రాజకీయ పోరాటాల ఎత్తుగడలలో భాగంగా పాలనా వ్యవస్థలకు, చట్టాలకు వ్యతిరేకంగా సహాయ నిరాకరణ, చట్ట ఉల్లంఘనలను చేపట్ట వలసిందిగా ఆనాటి రాజకీయ నాయకుల ఉద్బోధలు పాలనా వ్యవస్థల పట్ల గౌరవ మర్యాదలు లేకుండా చేసాయి. అవినీతియే సమస్య కాక అవినీతి పద్ధతులు ఆచరణలోకి తెచ్చి పెంచి పోషించిన స్వార్థ ప్రయోజన వర్గాల పాత్ర కూడా ఈనాటి అవినీతి సమస్యకు కారణం.

భారతీయ సమాజం అతి పురాతనమైనది, సాంప్రదాయకమైనది. సమాజం బహుళమైన 'కులం' నిర్మాణ కట్టుబాట్లతో (కుటుంబం, బంధుత్వం, జాతీయత, భాషాపర) స్థిరితమైన స్థానికమైన అధీనతలతో కూడి ఉంది. ఈ సంస్కృతి బంధుప్రీతిని, ఆశ్రిత పక్షపాతాన్ని ఆమోదించింది. అందుకనే, భారతీయ సమాజంలో దైనందిన జీవితంలో అవినీతి చాపకింద నీరులా అదృశ్యంగా, విస్తృతంగా పాకింది – సర్వత్రా వ్యాపించింది.

చారిత్రకంగా భారతీయ పాలకులందరూ (మొగలాయిలు, బ్రిటిష్ వారు, స్వదేశీయులు ఎవరైతేనేమి) దేశాన్ని దోచుకున్నారు, ప్రజలను హింసించారు. స్వాతంత్ర్యం వచ్చిందన్న తర్వాత కూడా రాజ్య స్వభావంలోగాని, పాలకుల తీరులో కాని పెద్దగా మార్పు లేదు.

---

పరిమితమైంది. టీంను 40 మందికి పెంచుతామని హజారే ఇటీవలే ప్రకటించాడు. 'తన' ఉద్యమం రాజకీయాలకు అతీతం అన్నాడు. రాజకీయ పార్టీలకు స్థానం లేదన్నాడు. కాబట్టి హజారే అవినీతి వ్యతిరేక ఉద్యమం 'అసమ్మతి తయారీ'లో భాగమా అనే అనుమానం వస్తుంది.

### చట్టం అన్ని సమస్యలకు పరిష్కారం కాదు

చట్టం సమస్యకు పరిష్కారం అనే భావనను ప్రజల్లో బలంగా తీసుకవెళ్లింది. కానీ చట్టాలు పరిమితమైన పరిష్కారాన్ని మాత్రమే ఇస్తాయి. జనలోక్‌పాల్ బిల్లు అవినీతిపరులను శిక్షిస్తుంది తప్ప అవినీతిని పూర్తిగా తొలగించలేదు. ప్రస్తుతం సమాజంలో ప్రతి ఆర్థిక, వ్యాపార కార్యక్రమాలు, చివరికి సామాజిక కార్యక్రమాలు కూడా అవినీతి లేకుండా ముందుకుపోవు. అవినీతిని అరికట్టడానికే గతంలో అనేక చట్టాలు ఉన్నాయి. ప్రభుత్వ యంత్రాంగం ఉంది. కానీ అది సమర్థవంతంగా పనిచేయడం లేదన్నది వాస్తవం. ఈ చట్టాలు అమలు కాకపోవడానికి రాజకీయ సంకల్పం లేదనీ, వీటిల్లో చాలా లొసుగులు ఉన్నందున అవి బలహీనం అవుతున్నాయన్నది వాస్తవమే. కాని అసలు చట్టాలు కాగితాలకే పరిమితమై ఆచరణలో విఫలం కావడానికి ఈ వ్యవస్థలో ఉన్న అసమానతలు, దోపిడీలు కారణం. ప్రజా సంక్షేమం కోసం, ప్రజల సమస్యలను పరిష్కరించడానికి ఉద్దేశించిన చట్టాలను పాలకవర్గాల మద్దతుతో, పెట్టుబడిదారులు, భూస్వాములు ఎలా బలహీనం చేసారని చెప్పడానికి ఎన్ని ఉదాహరణలనైనా ఇవ్వొచ్చు. ఇవ్వాళ సమాచార హక్కు చట్టం సహాయంతో అవినీతిని, దోపిడీని ప్రశ్నిస్తున్న విజిల్ బ్లోయర్స్ ఎందుకు హత్యలకు గురవుతున్నారు? అటవీ హక్కుల చట్టం ఎందుకు అమలు కావడం లేదు? రాజ్యాంగంలోని 5వ షెడ్యూల్ గిరిజనులకు కల్పించిన స్వతంత్ర ప్రతిపత్తి, హక్కులను ఎవరు ఉల్లంఘిస్తున్నారు? రాజ్యాంగంతోపాటు అనేక చట్టాలు ఆదివాసులకు రక్షణ కల్పించినా వాటిని అమలుకు అడ్డుపడుతున్నది బహుళజాతి కంపెనీలే కదా.

ప్రజలకు అనుకూలమైన చట్టాలను తీసుకురావడానికి ప్రజలు ఉద్యమించాలి. వాటిని అమలు చేయడానికి మళ్లీ పోరాడాలి. జనలోక్‌పాల్ బిల్లు చట్టంగా మారినా దాన్ని అమలు చేయడానికి పోరాటం చేయాల్సిందే.

అవినీతికి వ్యతిరేకత పోరాటం అసమానతలకు, దోపిడీకి, ఆధిపత్యానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో భాగం కావాలి. వామపక్ష పార్టీలు, విప్లవ పార్టీలు అవినీతికి వ్యతిరేకంగా ప్రత్యామ్నాయ ఉద్యమాన్ని తీసుకోలేకపోయాయి. ప్రస్తుతం మన దేశంలో అమలవుతున్న అభివృద్ధి నమూనా అవినీతిని ప్రోత్సహిస్తూ ఉంది. వ్యక్తిగత స్వార్థాన్ని పెంచుతూ ఉంది. ప్రత్యామ్నాయ రాజకీయ ఉద్యమాలు అవినీతిని తమ పోరాటాల్లో భాగం చేయాలి. ప్రజల అనైతికత మీద కూడా పోరాటం చేయాలి. ప్రజల్లో ప్రజాస్వామిక, నైతిక విలువలను పెంచే కార్యక్రమాలు చేపట్టాలి. చట్టం ద్వారా వీటిని సాధించలేం. అన్నా హజారే లేదా స్వచ్ఛంధ సంస్థలు చేసే ఉద్యమాలకు పరిమితులు ఉంటాయని కూడా అర్థం చేసుకోవాలి. ప్రత్యామ్నాయ రాజకీయాలు ముందుకు పోవడానికి, మిలిటెంట్ పోరాటాలకు అడ్డంకిగా ఉంటాయని తెలుసుకోవడం అవసరం. వీ

*(రచయిత ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం అధ్యక్షులు)*

ప్రజాస్వామ్యమన్నారు, ప్రజారాజ్యాంగమన్నారు. భారతీయ ప్రజాస్వామ్య నాలుగు స్తంభాల (శాసనసభ, కార్యనిర్వాహక వర్గం, న్యాయవ్యవస్థ, మీడియా), అనేక శాసనాలు, సంస్థలు, రెగ్యులేటరీ వ్యవస్థలు ఎన్నో ఉన్నా అవినీతిని అరికట్టడంలో మట్టుకు తమ అసమర్ధతను, చేతగానితనాన్ని చాటుకున్నాయి. ఈ పరిస్థితికంతటికీ ప్రధాన కారణం భారతీయ పాలకవర్గాలు భారతీయ రాజకీయాలు ఒక రకంగా అవినీతికి అలవాటుపడి, దానిని పెంచి పోషించడమే. అలా కేంద్రంలో, రాష్ట్రాలలో, స్థానిక సంస్థలలో మన రాజకీయపార్టీలు ప్రజా ప్రభుత్వ వ్యవస్థలను దుర్వినియోగపరచి, దుష్టపాలనకు అలవాటు చేశాయి. పాలకవర్గాలు (ధనికులు, ప్రభుత్వోద్యోగులు, శిష్టులు) పాలనావ్యవస్థలపై ఒత్తిడితెచ్చి, నీతి, నియమాలను అతిక్రమింపజేసి, పాలనా నియమాలకు, నిబంధనలకు, పద్ధతులకు నీళ్లొదిలి, భారత రాజ్యాన్ని బలహీన పరచడంతో, రాజకీయ వ్యవస్థలు, పాలనా యంత్రాంగం అవినీతి మయంగా మారాయి. 1990ల తర్వాత ఈ పరిస్థితి దిగజారి, రాజ్యం, వ్యవస్థల పతనానికి దారి తీసింది.

సరళీకరణ, ప్రైవేటీకరణ, ప్రపంచీకరణ విధానాలను భారతదేశం చేపట్టిన నాటి నుంచి భారతీయ చరిత్రలో మునుపెన్నడూ జరగనంతగా సమాజం వేగంగా అన్ని స్థాయిల్లో మార్పు ప్రక్రియకు గురయింది. ఈ పరిణామ దశలో భారత రాజ్యంలో, సమాజంలో అనేక మార్పు లొచ్చాయి. దీని ఫలితంగా, పలు రాజకీయ మార్పులు, పాత పాలనా వ్యవస్థలను కూలదోసి, కొత్త శాసనాలు, వ్యవస్థలు ప్రవేశ పెట్టబడినాయి. దీంతో రాష్ట్రస్థాయి రాజకీయ పార్టీలు, నాయకుల ప్రాబల్యం ఎక్కువైంది. విరోధవర్గాల మధ్య మధ్యవర్తిత్వం జరిపే శక్తి, అధికారం, రాజ్యం తన స్వతంత్ర ప్రతిపత్తిని కొంతవరకు కోల్పోయింది. పట్టణ మధ్యతరగతి వర్గీయులు, శిష్టవర్గం, ఈనాడు రాజ్యయంత్రాంగాన్ని ఒక అవినీతి కూపంగా చూస్తున్నారు. ఇంతకు ముందున్న అభివృద్ధికర రాజ్యంపక్షాన ఇప్పుడు వారు లేరు. ఇది రాజకీయ రంగానికి, 'పౌర సమాజానికి' (సివిల్ సొసైటీ) మధ్య ఒక విధమైన విభజనకు దారితీసింది. 'రాజకీయ సమాజం' (పొలిటికల్ సొసైటీ), ఈ రంగంలో రైతులు, చేతి వృత్తుల వారు, అసంఘటిత రంగ లఘు ఉత్పత్తిదారులు, పేదలు ఉంటారు.

భారతీయ పౌర సమాజంలో పట్టణ మధ్యతరగతి, విద్యావంతులు, వృత్తిదారులుగా ఉన్నవారే తాము 'అసలైన పౌరులు'గా పరిగణించు కుంటూ చట్టబద్ధ హక్కులకు రక్షణ ఉండాలని, సమాజంలో శాంతి భద్రతలుండాలని, వారు క్షేమంగా ఉండాలని కోరుకుంటున్నారు. వీరందరూ కార్పొరేట్ వ్యాపార రంగంలో విశ్వాసం కలవారు. కార్పొరేట్ పెట్టుబడి, సమాజ సమస్యలను తీరుస్తుందని నమ్ముతూ, రాజ్యం రాజకీయ రహితంగా ఉండాలని, ప్రభుత్వానికి రాజకీయాలు అవసరం లేదని హితవు పలుకుతున్నారు.

ప్రస్తుతం రాజ్య వ్యవస్థ ఐక్యత, సమగ్రత మొత్తాన్ని పౌర సమాజం నిర్వహిస్తూ ఉందని, ఇది కొంతకాలం పాటు కొనసాగవచ్చని అంటున్నారు. ఇదేరకంగా ఇతర ఆసియా దేశాలలో కూడా ఒకరకమైన తిరుగుబాటు ధోరణులతో అవినీతి రాజ్యవ్యవస్థకు, రాజకీయ ప్రతినిధు లకు వ్యతిరేకంగా పౌరసమాజాలు ఉద్యమాలు నిర్వహించాయి. ఇటీవల కాలంలో భారతదేశంలో కూడా పట్టణ మధ్యతరగతి వారు రాజకీయాలను చీదరించుకుంటూ, రాజకీయాలకు దూరంగా జరుగుతున్నారు. జనప్రియ రాజకీయ విధానాలను, పథకాలను, అవినీతిని వ్యతిరేకిస్తున్నారు. అనగా గ్రామీణ పేద ప్రజల సంక్షేమానికి విరుద్ధంగా తమ బాగునే వారు కోరుకుంటున్నారు.

భారతదేశంలోని అవినీతి స్వభావం, విస్తృతి, కారణాలు, పర్యవసనాల గురించి ఎంతో సమాచారం కుప్పలుగా పడి ఉంది. ప్రభుత్వ వ్యవస్థల నివేదికలు, మాజీ రాజకీయ నాయకులు, ఉన్నతాధికారుల రచనలు, వివిధ పరిశోధనా సంస్థలు, ప్రపంచ బ్యాంక్, ట్రాన్స్‌పరెన్సీ ఇంటర్‌నేషనల్, వివిధ సదస్సుల, సమావేశాల తీర్మానాలు, సిఫారసులు ఎన్నో ఉన్నాయి. రాజకీయ వ్యవస్థకు పట్టిన అవినీతి చెదలను నిర్మూలించడానికి విధానపరమైన, పాలనాపరమైన మార్పులను ఎన్నో సూచించాయి. కానీ ఆశించినంత మేరకు ఏమీ జరగలేదు. కాగా, అవినీతి అంతం లేకుండా పెరిగిపోతూ ఉంది.

సకల పరిశోధనలు కనుగొన్నదేమంటే అవినీతికి మౌలిక కారణం రాజకీయ వ్యవస్థ, దాని ఆర్థిక విధానాలు, పాలనా యంత్రాంగం, రెగ్యులేటరీ సంస్థలు, విధానాలను, కార్యక్రమాలను అమలుపరచక పోవడమే కాక, అసలు తీసుకొన్న విధానాలే లోపభూయిష్టమై, గుత్తేదారు లకు, ఆశ్రితులకు, ప్రభుత్వ ఉన్నతాధికారులకు ప్రయోజనాలు, లాభాలు కలిగించేవిగా ఉండడంవలన పాలనా యంత్రాంగం కిందిస్థాయిలో అవినీతిని నియంత్రించలేకపోయింది. సరిగా పరికించిచూస్తే జరిగే దంతా ప్రజాస్వామ్యానికి, సాధారణ ప్రజల సంక్షేమానికి వ్యతిరేకంగా, బుద్ధిపూర్వకంగా చేస్తున్న ఒక లోతైన కుట్రగా కనపడుతుంది.

రాజకీయ ప్రతినిధుల ఎన్నిక, ఉన్నతాధికారుల ఎంపిక, సలహా, సంప్రదింపుల సంఘాలకు నియామకాలు, మొత్తంగా ఏ నియమాలను పాటించకుండా వారి ఆశ్రితులకు, బంధుమిత్రులకు, అవినీతిపరులకు నిర్లజ్జగా పంచడం జరిగింది. ఇటువంటి నీతి నియమాలు లేని రాజకీయ క్రీడకు నిబంధనలు లేవు, న్యాయ నిర్ణేతలు లేరు. న్యాయస్థానాలు, స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థలు, విజిలెన్స్ కమిషన్, లోకాయుక్తలు, అవినీతి వ్యతిరేక బ్యూరోలు, సి.బి.ఐ., కంప్ట్రోలర్ ఆడిటర్ జనరల్ లాంటి వ్యవస్థలు రాజకీయమైన తప్పుడు నిర్ణయాలు, వాటి దుష్ఫలితాలను ఎత్తిచూపి, ఎలుగెత్తి చాటి పార్లమెంట్‌లోని విపక్షాలు రోజుల తరబడి పోరాడినా పాలక పార్టీలు ఎవరినీ లెక్క చేయకపోగా చట్టాలను తమకనుగుణంగా మార్చుకొన్న ఉదాహరణలు లేకపోలేదు.

కేంద్ర ప్రభుత్వంలోని కొందరు మంత్రులు, కొన్ని రాష్ట్రాల ముఖ్యమంత్రులు, మంత్రులు, శాసనసభ్యులు, స్వయం ప్రతిపత్తి సంస్థల ముఖ్యులు, కొందరు న్యాయమూర్తులు, అనేకమంది ఉన్నతాధికారులు, లెక్కలేనంత మంది చిన్నపాటి ఉద్యోగులు అవినీతి సాగరంలో ఈదులాడుతున్నారు. ఈ లెక్కలేనంత అవినీతి వల్ల ప్రభుత్వ కోశాగారం దోపిడీకి గురై రాత్రికి రాత్రే ధనవంతులు, కుబేరులు కావడం జరిగింది. ప్రజల సొమ్ము సాధారణ ప్రజలకు చెందవలసింది, వారికి చెందకపోవడం వల్ల అసలే పేదలైన వారు మరింత నిరుపేదలుగా రోజురోజుకు అధికమవుతున్నారు. ఈనాడు 50 శాతం ప్రజలు దారిద్ర్యరేఖ కింది స్థాయిలో, బి.పి.ఎల్. ప్రజలుగా, ఒక కొత్త వర్గం ఏర్పడడం సిగ్గుపడాల్సిన విషయం.

ఇటువంటి భయానక, భయంకర, దీనస్థితిలో సమాజం ఉండగా 'పౌరసమాజం' దాని బాధ్యతగా అవినీతిని నియంత్రించడానికి పూనుకొన్నది. శత్రువు అతి శక్తిమంతమైనది, పోరాటం చేయాలను

కున్న పౌరసమాజం ఇంకా అనుభవం లేనిది, దరిలేని సముద్రంలో చుక్కానిలేని నావికుని పరిస్థితిలో ఉంది.

అయినప్పటికీ, పౌరసమాజం నూతనోత్సాహంతో, అత్యంత చొరవతో, కూలిపోతున్న ప్రజాస్వామ్య నాలుగు స్తంభాలను నిలబెట్టే పంచమ స్తంభంగా, అవినీతిని సంహరించే ఉగ్రనరసింహునిగా అవతార మెత్తుతుందని, రాజ్యాన్ని, ప్రజలను రక్షిస్తుందని కొందరు పౌర సమాజికులు ఆశిస్తున్నారు. కొత్తరకమైన సామాజిక ఉద్యమాలను లేవనెత్తి సమాజంలో, రాజ్యంలో, వ్యాపారంలో విస్తరించిన అవినీతిని తుడిచి పెట్టడానికి ప్రయత్నాలు ప్రారంభమైనాయి. కనుక 'పౌరసమాజం' అంటే ఏమిటి, దాని లక్ష్యాలేమిటి, దాని శక్తి సామర్థ్యాలు ఎటువంటివి మొదలైన ప్రాథమిక అంశాలను గురించి తెలుసుకోవడం అవసరంగా భావించాలి.

'పౌరసమాజం', దీనిని నిర్వచించడం కష్టం. ఇదొక అమూర్తమైన పట్టుదొరకని భావన. ఇది కుటుంబం, మార్కెట్, రాజ్యం మధ్యలో నున్న చోటును కలిగి ఉంది. దీనిలో ప్రభుత్వేతర, లాభాపేక్ష రహిత సంస్థలు, ప్రత్యేక ప్రయోజన ముఠాలు, సంఘటితమైన లేక అసంఘటిత మైన, స్వచ్ఛంద సంస్థలు ఆయా నియోజకవర్గాల ప్రజల ప్రయోజనాలను పరిరక్షించుకోడానికి ప్రయత్నిస్తున్న సంస్థలుగా గుర్తించవచ్చు. ప్రజా జీవితం ఈ సమాజాల మధ్యనే గడవాలని, నిశ్చిత సామాజిక మార్పుకు పౌర సమాజం దోహదం చేయాలని ఆకాంక్ష.

స్వాతంత్ర్యానంతర భారత రాజ్యం, ఒక పటిష్ట రాజ్యాన్ని స్థాపించలేకపోయింది. దాని స్థానే పౌరసమాజం కేంద్ర స్థానాన్ని ఆక్రమించిందని ఒక భావన. భారతీయ రాజ్యం సంఘటితంగా ముందుకు వచ్చిన ప్రాంతీయ సంఘాల, అల్పసంఖ్యాక వర్గాల కోరికలను మన్నిస్తూ వచ్చిందని, భారతీయ రాజ్యం, ప్రభుత్వాలు ప్రజల సామాజిక సమస్యల పట్ల గంభీరత, నిజాయితీ, శ్రద్ధ చూపించక, ఆయా సమస్యలు సమాజమే స్వయంగా పరిష్కరించు కొంటుందని తన చేతకానితనాన్ని చాటుకుంది. దాని ఫలితంగా సాంప్రదాయిక భారతీయ సమాజానికి అనుగుణంగా 'అల్ప ప్రభుత్వం, అధిక సమాజం' ఉద్యమాలు ఏర్పడి, స్వార్థపర సమాజం, బంధుప్రీతి, కులంకేంద్రంగా అనేక సంఘాలుగా సమాజం రూపుదిద్దుకుంటుంది.

రాజ్యం స్వతంత్ర్యాన్ని, స్వేచ్ఛను రక్షించడంలో, అభివృద్ధిని సాధించడంలో తన గౌరవాన్ని పోగొట్టుకున్న తరుణంలో, రాజ్యం తాను కోల్పోయిన స్థానాన్ని పౌర సమాజం ఆక్రమించుకుంది. ఆ విధంగా రాజ్యం నిర్వహించవలసిన విధులలో చాలావరకు పౌర సమాజ వ్యవస్థ లకు (ప్రభుత్వేతర, స్వచ్ఛంద సంస్థలకు) బదిలీ కావడం జరిగింది.

భారతీయ రాజ్యం, రాజకీయ పార్టీలు, ప్రభుత్వాలు ప్రజా సమస్యలపట్ల సరిగా స్పందించక, బాధ్యతారహితంగా ఉండడంతో ప్రజలు స్వచ్ఛంద సంస్థలు, ప్రభుత్వేతర సంస్థల ద్వారా విస్తారమైన పౌర సమాజాన్ని ఏర్పరుచుకున్నారు. ఆ విధంగా భారతీయ సామాజిక సమస్యల పరిష్కారాలకు చొరవ చూపుతూ అభివృద్ధి చేతలను రాజ్యం నుండి సమాజం చేజిక్కించుకొంది. రాజ్యం ఆ విధంగా తన చట్టబద్ధతను కోల్పోయి, సమాజంలోని వివిధ సంఘర్షణ వర్గాలతో సర్దుబాటు రాజకీయాలకు దిగజారి, వర్గ సామాజిక వ్యవస్థకు దాసోహమన్నది.

రాజ్యం పౌరసమాజం ఎదుగుదలను పెద్దగా ప్రోత్సహించక పోయినా, ఒక విధంగా, భారతదేశంలో పౌరసమాజాన్ని ప్రాతినిధ్యం వహిస్తూ లక్షల కొద్ది సంస్థలు, సంఘాలు చట్టబద్ధమైనవిగా, స్వచ్ఛందంగా పనిచేస్తున్నాయి. ప్రత్యక్షంగా కాకపోయినా పరోక్షంగానైనా కొంత వరకు వాటికి ప్రభుత్వ సహాయం, తోడ్పాటు ఉందని చెప్పాలి. పౌరసమాజం లోని చాలా సంఘాలు రాజ్యానికి చేదోడు, వాదోడుగా ఉంటే, కొన్ని ప్రజాసంఘాలు, సామాజిక, రాజకీయ ఉద్యమాలుగా ప్రభుత్వానికి, రాజ్యానికి వ్యతిరేకంగా పని చేసేవిగా కూడా ఉన్నాయి. రాజ్యాంగం ప్రజలకిచ్చిన హక్కులను రక్షించడానికి, మానవ హక్కుల వేదికలు, పౌరహక్కుల సంఘాలు, కార్మిక, కర్షక సంఘాలు, కుల సంఘాలు, మైనారిటీల సంఘాలు, పర్యావరణ పరిరక్షణ సంస్థలు, మహిళా, శిశు సంక్షేమ సంఘాలు ఇంకా అనేక ముఠాలకు, ప్రాంతాలకు చెందినవారు తమ హక్కులను కాపాడుకోవడానికి, తమ మతాలను, సంస్కృతిని ప్రచారం చేసుకోవడానికి విపరీతమైన సంఖ్యలో సంస్థలు వెలిసాయి. ఇవన్ని ఏ కార్యక్రమాలు, ఎందుకు చేపడుతున్నాయో, ఏ సమాజసేవా కార్యక్రమాలు నిర్వహిస్తున్నాయో భారతీయ రాజ్యానికి పూర్తిగా తెలిసి ఉండదని సందేహం. ఆయా సంఘాలన్నీ, పరస్పరం తమలో తాము సంఘర్షిస్తూ, ప్రభుత్వాలను కూడా వ్యతిరేకిస్తూ, ఉద్యమాల రూపంలో ప్రభుత్వాలకు, ప్రజలకు విజ్ఞప్తి చేస్తూ, వారి సంఘ సభ్యులను వారి సంక్షేమం పట్ల, సమాజ బాధ్యతపట్ల ఉత్తేజపరచే కార్యక్రమాలు చేపడుతున్నాయి.

అయితే, ఇప్పటివరకు సమాజంలో, ప్రజా జీవితంలో నీతిని నిలబెట్టుటకు, లేక వ్యాపారంలో, ప్రభుత్వంలో, రాజకీయాలలోని అవినీతికి వ్యతిరేకంగా ఏర్పడిన పౌర సమాజ సంస్థల సంఖ్య చాలా తక్కువ. కాని నిజాయితీ నిబద్ధత, సేవా దృక్పథంగల కొందరు సామాజిక కార్యకర్తలు, అధికారంలోనున్న కొందరు వ్యక్తులు, (మేధాపాట్కర్, అరుంధతి రాయ్, అరుణారాయ్, సుందర్‌లాల్ బహుగుణ, బాబా ఆమ్టే, అన్నా హజారే, స్వామి అగ్నివేశ్, సందీప్ పాండే, కిరణ్‌బేడీ, ఎన్. విఠల్, వినోద్‌రాయ్, బాబా రామ్‌దేవ్, సంతోష్ హెగ్డే, అరవింద్ కేజ్రీవాల్, శాంతి భూషన్, ప్రశాంత్ భూషన్, జయప్రకాశ్ నారాయణ్) సామాజిక మార్పు కోసం, ప్రజాస్వామ్య పరిరక్షణ కోసం, ప్రజా హక్కుల సంరక్షణ కోసం ధైర్యంగా, అక్రమాలకు, అన్యాయాలకు వ్యతిరేకంగా రాజ్యానికి, చట్టాలకు విరుద్ధంగా పోరాటం సల్పగలిగినవారు, స్వతంత్రులుగా, రాజకీయాలతో సంబంధం లేకుండా, పేదల సమస్యలకై ప్రజాందోళనలు చేపట్టాలన్న విశ్వాసంకలవారుగా ఉన్నారు. వారు ప్రజాస్వామ్యం, చట్టబద్ధపాలన, మానవ హక్కులు ఆకాంక్షించే వారు. వీరందరూ ప్రభుత్వంలో, వ్యాపారంలో, రాజకీయాలలో, ప్రజా జీవితంలోని అవినీతికర చర్యలను నిశితంగా విమర్శిస్తున్నారు. అయితే, అవినీతి చర్యలను ప్రజలు చైతన్యంతో ఎదురొడ్డినపుడే అవినీతికి వ్యతిరేకంగా పోరాటం విజయవంతమవుతుంది. ప్రజలు మౌనంగా అక్రమాలను, అవినీతిని సహిస్తూ పోతూ ఉంటే, 'అవినీతి సంస్కృతి సవాలు లేనిది'గా ఎదిగిపోతుంది. కనుక అవినీతికి వ్యతిరేకంగా రాజకీయ పార్టీలను, వ్యాపార సంస్థలను, ప్రజా సంఘాలను పౌర సమాజం సమీకరించి, సంఘటితంగా, సమైక్యంగా పోరాటం జరపడం చాలా అత్యవసరమైనదిగా గుర్తించాలి. ఇప్పటి వరకు పౌర సమాజం అట్టి ప్రయత్నాలు పెద్దగా చేయలేదు. దీనికి కారణం పౌరసమాజ కార్యకర్తలు, నాయకులు ప్రభుత్వానికి, కార్పొరేట్ వ్యాపారానికి వ్యతిరేకంగా పని చేయకపోవడానికి ఇష్టపడకపోవడమే.

2010–11లో భారతదేశంలోని పౌరసమాజం అకస్మాత్తుగా రాజకీయ అవినీతికి వ్యతిరేకంగా చాలా గంభీరత వహించింది. వాస్తవానికి ఈ సమస్య అంతకుముందు రెండు మూడేళ్లుగా లోలోపల ఉడుకుతూ ఉంది. పార్లమెంట్ (2జీ స్పెక్ట్రం కుంభకోణంపై విచారణకు సంయుక్త పార్లమెంటరీ కమిటీని ఏర్పరచాలని, దాదాపు నెల రోజుల పాటు పార్లమెంట్‌లోని విపక్షాలు, పార్లమెంట్‌ని బాయ్‌కాట్ చేశాయి. దీనిపై పబ్లిక్ అకౌంట్స్ కమిటీలో చైర్మన్‌కి సభ్యులకు మధ్య వివాదం), సుప్రీంకోర్టు (సెంట్రల్ బ్యూరో ఆఫ్ ఇన్వెస్టిగేషన్ సుప్రీంకోర్టు ఆధ్వర్యంలో పని చేయాలని కాలపరిమితిని విధించడం), కంప్ట్రోలర్ ఆడిటర్ జనరల్ (సెంట్రల్ విజిలెన్స్ కమిషనర్ నియామకం చెల్లదని, కంప్ట్రోలర్ ఆడిటర్ జనరల్ రిపోర్ట్ 2జీ స్పెక్ట్రంకు వ్యతిరేకంగా, సి.ఎ.జి. స్వయంగా ప్రజలను అవినీతికి వ్యతిరేకంగా పోరాడమని పిలుపునివ్వడం), పౌరసమాజం (అన్నా హజారే మిషన్ ఏప్రిల్ 5, 2011న జంతర్ మంతర్‌లో నిరాహార దీక్ష, అవినీతిని అరికట్టడానికి జనలోక్‌పాల్ వ్యవస్థను స్థాపించాలని, బాబా రాందేవ్ నల్లధనాన్ని వెలికితీసి దానిని జాతిపరం చేయాలని డిమాండ్లు) అకస్మాత్తుగా అవినీతి కేసులకు వ్యతిరేకంగా, అనగా 2జీ స్పెక్ట్రమ్ స్కాం, కామన్‌వెల్త్ క్రీడల స్కాం, ముంబైలో ఆధార సొసైటీ అక్రమాలు, చీఫ్ విజిలెన్స్ కమిషనర్ నియామకం చెల్లకపోవడం లాంటివి. అయితే పార్లమెంట్‌లో, గవర్నమెంట్‌లో, సుప్రీంకోర్టులో, మీడియాలో ఈ విషయాలను గురించి తీవ్ర పరిశీలన, విచారణ జరుగుతూ ఉండగా, ఎవరికీ అంతుపట్టని రీతిలో అన్నా హజారే, కొంత పేరున్న సామాజిక కార్యకర్త 'ఇండియా అగెనెస్ట్ కరప్షన్' అన్న ఉద్యమంతో న్యూఢిల్లీలో ఏప్రిల్ 5, 2011న తాను చేపట్టిన నిరాహార దీక్షకు అనూహ్యంగా భారతీయ మధ్యతరగతి వర్గాలలో, మీడియాలో పెద్ద ఎత్తున సంచలనం సృష్టించగా, నలుమూలల నుండి అన్నాహజారే అవినీతి వ్యతిరేక ఉద్యమానికి గొప్ప మద్దతు లభించింది. ఆయన డిమాండ్ అవినీతిని అరికట్టడానికి 'జన్‌లోక్‌పాల్' (లోక్‌పాల్ (అంబుడ్స్‌మన్) వ్యవస్థ, స్వతంత్రంగా అవినీతి కేసులను విచారించే ఒక ఉన్నత సంస్థ – లోక్‌పాల్‌ను ప్రవేశపెట్టాలని గత 42 సంవత్సరాలలో ఎనిమిది సార్లు పార్లమెంట్‌లో బిల్లును చర్చకు తెచ్చినా, ఏ ప్రభుత్వం కూడా దానికి చట్టరూపం ఇచ్చి వ్యవస్థను ఏర్పరచలేకపోయారు. అలాగే అవినీతి వ్యతిరేక తీర్మానాన్ని ఐక్యరాజ్య సమితి 2005లో ఆమోదించగా, అన్ని దేశాలు దానిని అమలు చేస్తామని ఎప్పుడో ఒప్పుకొన్నా, చివరి దేశంగా మే 1, 2011న భారతదేశంగా తన అంగీకారాన్ని తెలిపింది. ఇటువంటి జాప్యం, అశ్రద్ధ పరికించి చూస్తే భారతదేశంలోని రాజకీయ పార్టీలకు అవినీతి అరికట్టడంలో ఆసక్తి, చిత్తశుద్ధి లేదని చెప్పాల్సి ఉంటుంది) వ్యవస్థను ప్రభుత్వం తేవాలని, దానికి తగ్గ బిల్లు ముసాయిదాను పౌరసమాజం ప్రతినిధులతో, ప్రభుత్వ ప్రతినిధులు కలిసి సంయుక్తంగా తయారుచేసి దానిని రాబోయే పార్లమెంట్‌లో చర్చించి జనలోక్‌పాల్ శాసనం తేవాలని వారు ఆకాంక్షించారు. ప్రభుత్వం కూడా, పౌరసమాజం కార్యకర్తల ఉద్యమ ఊపును (వివరాలకు '2011 ఇండియన్ ఆంటీ కరప్షన్ మూవ్‌మెంట్, వికీపీడియా, ది ఫ్రీ ఎన్‌సైక్లోపీడియా, అమెరికాలో, ఆస్ట్రేలియాలో, ఇంగ్లాండ్‌లో అనేక పట్టణాలలో దండి మార్చ్ – 2 పేరున అవినీతికి వ్యతిరేకంగా ప్రవాస భారతీయులు తీవ్ర నిరసన తెలుపుతూ ఒక ప్రదర్శనలు చేశారు) గుర్తించి, వారి కోరికలను మన్నించి ఒక సంయుక్త ముసాయిదా కమిటీని (కమిటీలో – అధ్యక్షుడు: ప్రణబ్ ముఖర్జీ (ఆర్థిక మంత్రి); సహ అధ్యక్షుడు: శాంతి భూషన్ (మాజీ మంత్రి); సభ్యులు: పి. చిదంబరం (హోం మంత్రి), వీరప్ప మొయిలీ (న్యాయశాఖ మంత్రి), కపిల్ సిబాల్ (కమ్యూనికేషన్ మంత్రి), సల్మాన్ ఖుర్షీద్ (జల వనరుల మంత్రి), అన్నా హజారే (సామాజిక కార్యకర్త), ప్రశాంత భూషన్ (న్యాయవాది), సంతోష్ హెగ్డే (లోకాయుక్త, కర్ణాటక), అరవింద కేజ్రీవాల్ (సహ కార్యకర్త)) నియమించింది. ఇదంతా గమనించిన వారు ప్రజా జీవితంలో నీతి పెరుగుతుందని, జన లోక్‌పాల్ నియామకం వల్ల అవినీతి తగ్గుముఖం పడుతుందని కొందరు ఆశావాదులు సంతోషపడ్డారు. అన్నా హజారే ఉద్యమం భారతీయ పౌరసమాజం శక్తికి ప్రతీకగా భారతీయులకు మేల్కొలుపు పిలుపుగా కొందరు అభివర్ణించారు. ప్రభుత్వం అన్నాహజారే కోరికలను సులభంగా ఆమోదించడంతో చాలామంది ఇది పౌరసమాజం విజయ చిహ్నంగా భావించారు.

కంప్ట్రోలర్ ఆడిటర్ జనరల్ ఆఫ్ ఇండియా (2జీ స్పెక్ట్రం కుంభకోణం వల్ల దేశానికి ఒక లక్షా డెబ్భై వేల కోట్ల రూపాయల నష్టం వాటిల్లిందని ఆయన రిపోర్టిచ్చారు) రిపోర్ట్, తర్వాత ఆయన స్వయంగా అవినీతికి వ్యతిరేకంగా పోరాటం చేయాలని ప్రజలకు పిలుపునివ్వడం జరిగింది. ప్రజలు ఇంక ఎంతమాత్రం మౌనంగా ఉండడానికి వీలులేదని, అవినీతికి వ్యతిరేకంగా ప్రభుత్వం చర్యలు తీసుకోదని, ఇదంతా ప్రజలు, పౌరసమాజం బాధ్యతగా ఆయన గుర్తు చేసారు.

సంయుక్త ముసాయిదా కమిటీ, జన లోక్‌పాల్ అధికారాల పరిధి పై పౌర సమాజం ప్రతినిధుల, ప్రభుత్వ ప్రతినిధుల మధ్య తలెత్తిన వివాదాలపై తీవ్రమైన చర్చలు జరిగాయి. చర్చలలో పౌర సమాజం సభ్యులు జనలోక్‌పాల్ అధికార పరిధిలోకి ప్రధానమంత్రిని, న్యాయ మూర్తులను, పార్లమెంట్ సభ్యులను, ఉన్నతాధికారులందరినీ తీసుకువచ్చి, జన లోక్‌పాల్‌ను చాలా పటిష్టవంతమైన సంస్థగా రూపొందించాలని పట్టుబట్టారు. దీనికి ప్రభుత్వ తరపున సభ్యులు అంగీకరించకపోవడం, ఈ వివాదం పట్ల రాష్ట్రాల ముఖ్యమంత్రులకు, రాజకీయ పార్టీలకు, ప్రజలకు తమ అభిప్రాయాలను తెలియజేయ వలసిందిగా ప్రభుత్వం ఒక ప్రకటన జారీచేసింది. స్పందన స్పష్టంగా లేక మిశ్రమంగా ఉంది. కొన్ని రాజకీయ పార్టీలే స్పష్టంగా తమ అభిప్రాయాన్ని వెలిబుచ్చాయి. మిగతావన్నీ బిల్లు పార్లమెంట్‌లో పెట్టినపుడు తమ అభిప్రాయాలను వెల్లడి చేస్తామన్నాయి.

భారత ప్రభుత్వం, ప్రధానమంత్రి, యు.పి.ఎ. చైర్‌పర్సన్ సోనియా గాంధీలు కలిసి ఉన్నతాధికారుల ఐచ్ఛిక అధికారాలను, తప్పుడు చర్యలకు అవకాశాలను తగ్గిస్తూ, అవినీతిపరులను తప్పకుండా శిక్షిస్తామని, మాటల రూపంలోకాక, చేతలలో తమ వాగ్దానాన్ని నెరవేరుస్తామని మే 22, 2011న ప్రకటిస్తూ, లోక్‌పాల్ బిల్లును తదుపరి పార్లమెంట్‌లో తప్పక ప్రవేశపెడతామని పత్రికా ముఖంగా హామీ లిచ్చారు. ఆ విధంగా భారత ప్రభుత్వం తమ చిత్తశుద్ధిని చాటుతూ, ప్రజలలో విశ్వాసం కలిగేటట్లు ప్రయత్నించారు. కాని ఎంత చెప్పినా, ప్రభుత్వం అవినీతిపై గట్టి చర్యలు తీసుకుంటుందన్న నమ్మకం ప్రజల్లో సన్నగిల్లిందనే చెప్పాలి.

ప్రభుత్వం, పౌరసమాజం అత్యున్నత స్థాయిలో అవినీతిపై చర్యలు జరుపుతూ ఉన్నా, రెండు పక్షాల మధ్య సత్సంబంధాలు లేకుండా

పోయాయి. అభిప్రాయ భేదాలను బహిరంగంగా విమర్శించుకుంటూ ఉండగా బాబా రామ్‌దేవ్ జరుగుతున్న నాటకంలోకి ప్రవేశించాడు. ఆయన అవినీతికి, నల్లధనానికి ఇంకా ఇతర డిమాండ్లతో రామ్‌లీలా మైదాన్‌లో జూన్ 5, 2011 నుండి వేలాది మందితో నిరాహార దీక్ష చేస్తానని ఢిల్లీ వచ్చాడు. నిరాహార దీక్షను ఉపసంహరించుకోవాలని, ఢిల్లీ విమానాశ్రయంలో బాబా రామ్‌దేవ్‌ని భారత ప్రభుత్వ నలుగురు సీనియర్ మంత్రులు కలిసి నాలుగు గంటలపాటు చర్చలు జరిపారు. బాబా రామ్‌దేవ్‌కి ప్రభుత్వానికి మధ్య అంగీకారం కుదరలేదు. కనుక ఆయన నిరాహార దీక్షను ప్రారంభించిన నాటి అర్ధరాత్రి ఢిల్లీ పోలీసులు ఆయనను అరెస్టు చేసి అందరిని భయభ్రాంతులను చేసి తరిమివేసారు. దీక్షా శిబిరం ఖాళీ చేయించి బాబా రామ్‌దేవ్‌ని విమానంలో హరిద్వార్‌లో ఆయన ఆశ్రమం వద్ద వదిలిపెట్టి వచ్చారు.

ప్రభుత్వం తీసుకున్న పాశవిక చర్యను, అప్రజస్వామికమని నాగరికులందరూ, పౌరసమాజ నాయకులందరూ, పార్లమెంట్‌లో విపక్షమైన ఎన్.డి.ఎ. రాజకీయ పార్టీలు, మీడియా అంతా ముక్తకంఠంతో తీవ్రంగా ఖండించాయి. సుప్రీంకోర్టు, మానవ హక్కుల సంఘం కూడా తమంతట తామే కలుగచేసుకొని ప్రభుత్వాన్ని తమ చర్యల పట్ల వివరణను కోరింది. ప్రభుత్వం తీసుకొన్న చర్యను పరిశీలిస్తే రాజకీయ అవినీతికి, కార్పొరేట్ వ్యాపారశక్తికి వ్యతిరేకంగా భారత ప్రభుత్వం తగిన చర్యలు తీసుకోవడానికి ఇష్టపడుతున్నట్లు కనపడడం లేదనిపిస్తుంది. ముఖ్యంగా విదేశీ బ్యాంకులలో దాచుకొన్న లక్షల కోట్ల నల్లధనాన్ని వెలికితీసి, ఆ సంపదను జాతీయం చేయడం యు.పి.ఎ. ప్రభుత్వానికి అస్సలు ఇష్టం లేదని తెలుసుకోవచ్చు. ఇది ప్రభుత్వ దివాళాకోరుతనానికి నిదర్శనమని మేధావులెందరో విమర్శించారు.

బాబా రామ్‌దేవ్ తన ఆశ్రమంలోనే తొమ్మిది రోజులపాటు దీక్ష చేసి విరమించుకున్నారు. రామ్‌దేవ్‌ని భారతీయ జనతా పార్టీ ఆర్.ఎస్.ఎస్. ఇంకా ఇతర కాంగ్రెస్ వ్యతిరేక శక్తులు బలపరుస్తాయని, అదంతా ఒక కుట్రగా ప్రభుత్వం భావించడమే కాక, అన్నా హజారే, బాబా రామ్‌దేవ్‌లు ప్రభుత్వానికి హెచ్చరికలు, తాఖీదులు ఇస్తున్నారని మంత్రులు పౌర సమాజం పట్ల తమ విముఖతను బాహాటంగా, ప్రస్ఫుటంగా మీడియా ద్వారా చాటుకున్నారు.

బాబా రామ్‌దేవ్ అరెస్టుకు వ్యతిరేకంగా సంయుక్త ముసాయిదా కమిటీ సమావేశం జూన్ 6న జరగలేదు. జూన్ 8న అన్నా హజారే ప్రభుత్వ చర్యను నిరసిస్తూ ఒక రోజు నిరాహార దీక్షను చేపట్టారు. ఆగస్ట్ 15 నాటికి జనలోక్‌పాల్ బిల్లు పార్లమెంట్‌లో ఆమోదం పొందకపోతే ఆగస్ట్ 16 నుండి ఆమరణ నిరాహార దీక్షకు పూనుకుంటానని అన్నా హజారే ప్రకటిస్తూ ప్రభుత్వాన్ని హెచ్చరించారు. పౌరసమాజ సభ్యుల విమర్శలు, హెచ్చరికలు ప్రభుత్వానికి నచ్చలేదు. అయినా కూడా లోక్‌పాల్ బిల్లును పార్లమెంట్‌లో తప్పక ప్రవేశపెడ్తామని ప్రభుత్వం పలుసార్లు తన చిత్తశుద్ధిని చాటుకునే ప్రయత్నాలు చేస్తూనే ఉంది. అవినీతిపరులైన మంత్రులపై, నాయకులపై కొన్ని నిర్దిష్టమైన చర్యలు తీసుకొంది. సంయుక్త పార్లమెంటరీ కమిటీ 2జీ స్పెక్ట్రమ్ స్కాంపై విచారణ చేస్తూ ఉంది. అవినీతిని అరికట్టాలని అటు ప్రభుత్వం, ఇటు పౌర సమాజం, ప్రజలు తీవ్రంగా ఆందోళన చెందుతున్నారు. ఆ ప్రయత్నంలో జరుగుతున్న కొంత కృషి సత్ఫలితాలను కూడా ఇస్తున్నది. అన్ని వివాదాలు సామరస్యంగా పరిష్కారమయి జనలోక్‌పాల్ బిల్లు పార్లమెంట్ ఆమోదం పొంది, ఐక్యరాజ్యసమితి 'అవినీతి వ్యతిరేక దినం' డిసెంబర్ 9, 2011 నాటికైనా జన లోక్‌పాల్ శాసనంగా రూపొందు తుందని ఆశిద్దాం. తద్వారా అవినీతి కొంతైనా తగ్గడానికి ఆస్కారం ఉంటుందని భావించాలి.

పౌర సమాజం చొరవ వలన, ప్రాథమిక ప్రోత్సాహం వలన దేశంలో అవినీతి తగ్గుతుందనుకోవడం పొరపాటు. దీనికి అనేక కారణాలున్నాయి. ఏమైనా ప్రజా జీవితరంగాలు (సామాజిక రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక), నీతివంతమైనవిగా ఉండాలని, సమాజానికి హృదయం లాంటి పౌరసమాజం ఆశించడం దాని నైతిక విధి. కనుక ప్రజాస్వామ్యాన్ని వృద్ధి చేయడం, రాజ్యాంగాన్ని రక్షించడం, సరైన శాసనాలను, సముచిత సంస్థలను ఏర్పరచాలని కోరడం, అవినీతిని, నల్లధనాన్ని అరికట్టాలని ఉద్యమించడం పౌరసమాజం కర్తవ్యంగా భావించాలి. ఇంతటి మహత్తర కార్యం సాధించాలంటే పౌరసమాజం కొన్ని కార్యాచరణ పనులు చేయాల్సి ఉంటుంది.

1. పౌరసమాజంలో ఉన్న వివిధ రకాల సంస్థలు, సంఘాల మధ్య ఐక్యతకై, సంఘటితంకై కృషి చేయాలి.
2. అవినీతికి వ్యతిరేకంగా ఒక అఖిల భారత స్థాయి సంస్థ నిరంతరం నిఘా నిర్వహించాలి.
3. పౌర సమాజ సంస్థలన్ని కలిసి ఒక అఖిల భారత అవినీతి వ్యతిరేక సంస్థనొకదానిని ఏర్పరచుకోవాలి. దీని ద్వారా అవినీతి నియంత్రణకు జాతీయ స్థాయిలో ఒక ఉద్యమం, ఒక పిలుపు, ఒక కార్యక్రమం రూపొందించుకొని, నిత్యం, నిరంతరం ఉద్యమించాలి.
4. అఖిల భారత అవినీతి వ్యతిరేక ఉద్యమం రాజకీయ పార్టీలతో సంబంధం లేకుండా, జాతీయమైనదిగా, దేశభక్తి పూర్వకమైనదిగా ఉండాలి.
5. రాజనీతిలో, ఉద్యోగస్వామ్య పద్ధతులలో, వ్యాపారనీతిలో మార్పులకై, మీడియా మద్దతుకై పనిచేయాలి.
6. రాజ్యాంగం ఏర్పరచిన స్వయం ప్రతిపత్తి గల సంస్థలు సమర్థవంతంగా పని చేయడానికి పౌరసమాజం అప్రమత్తంగా ఉండాలి.
7. ప్రభుత్వ విధానాలను సక్రమంగా తయారు చేసిన తర్వాత వాటిని పూర్తిగా అమలు చేయాలని ఒత్తిడి చేయాలి.
8. అసమర్థులను, అవినీతిపరులను, ప్రజాధనాన్ని నష్టపరిచిన వారిని కఠినంగా శిక్షించాలని ఎలుగెత్తి చాటాలి.
9. నల్లధనాన్ని జాతీయం చేయాలని పెద్ద ఎత్తున ఉద్యమించాలి.
10. పౌర సమాజం రాజ్యానికి, ప్రభుత్వాలకు వ్యతిరేకం కాదని, వారు చేయవలసిన పనుల్లో తోడ్పాటు, మద్దతు ఇస్తున్నట్లు ప్రభుత్వాలను నమ్మించాలి. ప్రజాస్వామ్యంలో ప్రజలు చైతన్యవంతంగా తమ సమస్యలను తామే ప్రభుత్వ సహాయంతో పరిష్కరించుకోవడానికి పౌరసమాజ సంస్థలు బాటలు వేస్తున్నాయని, మార్గదర్శకత్వం వహిస్తున్నాయని అటు ప్రభుత్వాలకు, ఇటు ప్రజలకు తెలియజేసుకోవాలి. అపుడే పౌరసమాజం సమాజానికి ఏదైనా అసలైన మంచి చేయగలుగుతుంది.

*(రచయిత రిటైర్డ్ పబ్లిక్ అడ్మినిస్ట్రేషన్ ప్రొఫెసర్)* వీ

*ప్రజలు తమ శ్రమతో సృష్టించే అదనపు విలువను దోచుకునే, దోచుకోగలిగే ఆర్థిక పునాదే అవినీతికి మూలమని, శ్రామికుల పోరాటాలతోనే అవినీతి అంతరిస్తుందని అంటున్నారు* **లోకే రాజ్‌పవన్**

# అవినీతి సమస్య - మార్క్సిస్ట్ అవగాహన

అవినీతి అంతమొందించే లక్ష్యసాధనలో అన్నా హజారే ఆది కాదు, అంతమూ కాదు. అయినా సరే ఎందుకోగాని అవినీతి నిర్మూలనకు ఆయన ఒక ఐకన్ (చిహ్నం) అనే భావన నేడు మధ్యతరగతి, ఉన్నతవర్గాలలో వచ్చింది. అన్నాటీమ్ కూడా అవినీతివ్యతిరేక గుర్తింపును బాగానే సంపాదించుకుంది. ఇక ప్రచార, ప్రసార సాధనాల సంగతి చెప్పనక్కర లేదు. రాంలీలా పుణ్యమా అని విపరీతమైన రేటింగ్ పోటీలో పడిపోయింది. అయితే ఈ మొత్తం వ్యవహారంలో ఒకే ఒక ప్రశ్న. అవినీతి సమస్యను ఎలా చూడాలి అనే దాని మీద మాత్రం శాస్త్రీయ రీతిలో సమాధానం రాబట్టుకోవాలని ఏ ఒక్కరూ ప్రయత్నించలేదు.

ఈ రోజున ప్రతి ఒక్కరి ఆలోచన ఏమిటంటే భారతదేశంలో అవినీతి అంతమైతే దేశం మొత్తం బాగుపడుతుందని, ఈ అరవై ఏళ్ల స్వాతంత్ర్యానంతర భారతదేశం ఒక అమెరికాతోనో, ఒక జపాన్‌తోనో, ఒక ఇంగ్లండ్‌తోనో పోటీ పడడానికి చాలా దూరంగా ఉన్న పరిస్థితి రావడానికి ప్రధాన కారణం దేశంలో వివిధ స్థాయిలలో కొనసాగుతున్న అవినీతే అని, భారతదేశంలో కుల సమస్యకు, వర్గాల అంతరాలకు, ప్రజాస్వామ్యం వైఫల్యపు అడుగులకు, అవినీతే కారణం అని, కనుక అవినీతిని అంతమొందించడం ప్రతి పౌరుని ప్రాథమిక బాధ్యత, అదే గొప్ప దేశభక్తి అని సాధారణ, ఉన్నత స్థాయి ప్రజలు ఆలోచించే లాగా అవినీతి గురించి వ్యతిరేకత వారి మనసుల్లో ఇంజెక్ట్ చేయబడింది. అలా చేసే ఈ ప్రయత్నంలో మీడియా, అన్నా టీం బాగానే విజయం సాధించాయి.

అయితే ఏ సమస్యనైనా మార్క్సిస్ట్ సైద్ధాంతిక జ్ఞాన ప్రాతిపదికన విశ్లేషించుకోకపోతే ఆ సమస్యకు శాస్త్రీయ పరిష్కారం లభించదనేది అందరికీ తెలిసిందే. మరి అనేక సమస్యల లాగానే అవినీతి సమస్య పట్ల మార్క్సిస్ట్ అవగాహన ఎలా ఉంటుంది? అనేది తెలిస్తే సహజంగానే ఆ సమస్యను ఎదుర్కోవడానికి అనుసరించాల్సిన మార్గం, విధి విధానాలు తెలుస్తాయి. కనుక సమస్యను మొదట ఆ కోణంలో విశ్లేషించాల్సిన అవసరముంది.

అసలు అవినీతి అనేది ఏ స్థాయిలో జరుగుతోంది? దేశంలోని కోట్లాది మంది ప్రజలు ఏదో ఒక రూపంలో తెలిసిగానీ తెలియకుండా గానీ అవినీతికి పాల్పడుతున్నారు. లేదా పాల్పడే వ్యక్తులను ప్రోత్సహిస్తున్నారు. నిజమే, (దీని ఆధారంగానే అన్నా టీం గానీ, దేశీయ ధనిక వర్గం గానీ ప్రజలకు కూడా అవినీతిలో పూర్తి భాగస్వామ్యం ఉందని సూత్రీకరిస్తుంటారు.) అలాంటపుడు అవినీతి ఎక్కడ జరుగుతుంది? అనే ప్రశ్నకు 'దేశంలోని అన్ని వర్గాల ప్రజలలో' అనే సమాధానం చెప్పుకోవలసి వస్తుంది. అలా చెప్పుకుంటే మరి అన్ని వర్గాలకు అవినీతి జరగడం ఆమోదమయ్యేటట్లుంటే అది సమస్య ఎలా అవుతుంది? అనే ప్రశ్న వస్తుంది. కనుక అవినీతి అన్ని వర్గాల ప్రజలలో ఉన్నట్లు పైకి కనబడినా అది చాలా వర్గాల ప్రజలకు సంబంధం లేనిదిగా ఉంటుందనేది గమనించాల్సిన విషయం. అవినీతికి పాల్పడేవారు, అవినీతి చర్యల ద్వారా లక్షలాది, కోట్లాది రూపాయలు సంపాదించుకునే వారు ఇతర వర్గాల ప్రజలు తప్పనిసరిగా అవినీతిని ప్రోత్సహించకుండా ఉండలేని పరిస్థితులను ఆ ప్రజలకు కల్పిస్తున్నారు. కనుక అవినీతి ఎక్కడ జరుగుతుందనే లోతుల్లోకి వెళ్తే అది అవినీతి ద్వారా లాభాలు గడించే వారి దగ్గరే జరుగుతుంది. ఒక రాజకీయ నాయకుడు ఎన్నికలలో నిల్చున్నపుడు తన నియోజకవర్గ ప్రజలకు ఒక్కొక్కరికి వెయ్యి రూపాయలు లంచంగా ఇచ్చాడనుకుందాం. ఆ మనిషి తర్వాత మండలాధ్యక్షుడో, జెడ్‌పి చైర్మనో, మంత్రో అయితే ఆ ప్రజల నుంచే లక్షలు, కోట్ల రూపాయలు దోచుకుంటాడు.

మరిప్పుడు ఈ అవినీతికి బాధ్యులెవరు? కోట్లు దోచుకునే మనిషా? వెయ్యి రూపాయలు తీసుకుని ఓటు వేసిన మనిషా? విషయాన్ని పైపైన చూస్తే ఆ ఇద్దరూ బాధ్యులే అనిపిస్తుంది. కానీ, ఆ అవినీతికి సంపూర్ణ కారకుడు ఆ రాజకీయ నాయకుడే అవుతాడు. సందర్భం వచ్చింది కాబట్టి ఒక విషయాన్ని ఇక్కడ చర్చించుకోవాలి. అసలు రాజకీయ నాయకులకు తమ నియోజకవర్గ ప్రజలందరికీ డబ్బు పంచే శక్తి ఎక్కడి నుండి వస్తుంది? ఆ డబ్బులన్నీ ఎక్కడివి? వేలాది మంది ప్రజలు పేదరికంలో మగ్గుతూ ఉంటున్న అదే సమాజంలో తన గెలుపు కోసం ఆ నాయకుడు కోట్లాది రూపాయలు ఎలా ఖర్చు చేయగలుగు తున్నాడు? ఎప్పుడైనా ఆలోచించగలిగామా? ఆ డబ్బంతా ప్రజలది. ప్రజల శ్రమ వల్ల, ప్రజలు చిందించిన చెమట వల్ల పుట్టిన డబ్బు అది. ఇంకా చెప్పుకోవాలంటే ఒక సమాజం నుంచి పీడించి సంపాదించిన సామాజిక అదనపు విలువలోని భాగమే ఆ డబ్బంతా. ప్రతి మనిషి చేసే పని విషయంలో, ఆ పని ఒక ఆర్థిక సంబంధ చట్రంలోకి వచ్చినపుడు, ఆ పనికి ప్రతిఫలం విలువగా మారినపుడు అందులో నుండి దోచుకోబడే విలువను అదనపు విలువ అంటామనేది మార్క్సిజంలో ప్రాథమిక సూత్రం. ఆ వ్యక్తిగత అదనపు విలువలన్నీ

కలిసి ఒక సమాజపు సామాజిక అదనపు విలువను ఏర్పరచినపుడు దాన్ని పంచుకునే, దోచుకునే శక్తులలో భాగంగా సంపాదించుకున్న మనిషే ఈ రాజకీయ నాయకుడు. అతను ఖర్చు పెట్టే డబ్బంతా ఆ సమాజపు పేద ప్రజలదే. ఇప్పుడు ఆలోచిస్తే ఆ అదనపు విలువను కొల్లగొట్టిన వాడు అవినీతిపరుడా? తన శ్రమను అదనపు విలువగా నష్టపోయిన ప్రజలు అవినీతిపరులా? ఆ సందర్భంలో, ఆ క్షణంలో ప్రజలు అవినీతి పరులుగానే కనిపించినా, అసలైన అవినీతిపరులు అని నిందిచాల్సింది మాత్రం వారిని కాదు. ఒక పోలీసుకంటే ఒక ఎస్సై, ఎస్సై కంటే సిఐ, సిఐ కంటే ఎస్.పి., ఎస్.పి. కంటే డి.జి.పి... ఇలా స్థాయి పెరుగుతున్న కొద్దీ ఆ స్థాయిలో అవినీతి ఎక్కువగా కేంద్రీకృతమయ్యే అవకాశముంటుంది. అలాగే ఒక వార్డు మెంబర్ కంటే సర్పంచ్, సర్పంచ్ కంటే ఎం.ఎల్.ఎ.లకు, ఎం.ఎల్.ఎ.ల కంటే మంత్రికి, మంత్రి కంటే ముఖ్యమంత్రికి... ఒక ముఖ్యమంత్రితో పోల్చినప్పుడు ఒక వార్డు మెంబర్ చేసేది అవినీతిగా పరిగణనలోకి తీసుకోలేం. (అలాగని ఆ వార్డు మెంబర్ చేసింది అవినీతి కాకుండా పోదు. అయితే ముఖ్యమంత్రి స్థాయితో పోల్చితే అది నిర్లక్ష్య పరచాల్సిం దనేదే మన అవగాహనగా ఉండాలి.) రాజశేఖరరెడ్డి దోచుకున్న మొత్తంతో పోల్చినప్పుడు మన ఊరి సర్పంచో, ఎంపిటిసినో చేసింది అవినీతి అనగలమా? దేశంలోని కొద్దిమంది పెట్టుబడిదారులు లక్షల కోట్ల రూపాయలు దోచుకుంటూ విలాసవంతమైన జీవితాలు గడుపుతున్నప్పుడు వారితో పోల్చితే వంద రూపాయలిచ్చి తహశీల్ ఆఫీసులో జనన ధృవీకరణ పత్రం తీసుకున్న వ్యక్తిని గానీ, వంద రూపాయలు తీసుకున్న ఉద్యోగిని గానీ అవినీతి పెంచే ప్రధాన కారకులు అనగలమా? కనుక ప్రతి స్థాయిలో ఎంతో కొంత అవినీతి జరుగుతున్నా ఎక్కువ మొత్తంలో డబ్బును కేంద్రీకరింప చేసుకుని ఆ డబ్బు ద్వారా పలుకుబడిని, పలుకుబడి ద్వారా దోపిడీని, దోపిడీ ద్వారా మరింత డబ్బు సంపాదించుకునే మార్గాలను ఏర్పాటు చేసుకుని దేశ పురోగతిని అడ్డుపడుతున్న వారినే ప్రధానమైన అవినీతిపరులుగా చూడాలి. కనుక అవినీతి వారి స్థాయిలోనే జరుగుతున్నదని అర్థం చేసుకోవాలి.

మార్క్సిస్ట్ అవగాహనలో అవినీతి సమస్య ఒక ఉపరితల సమస్య. దోపిడీ ఆర్థిక సంబంధాలు పునాదిగా గల వర్గ సమాజాలలో ఆయా సంబంధాల వల్ల ఉత్పన్నమయ్యే అనేక సమస్యలలో అవినీతి సమస్య ఒకటి. ఇంతకు ముందు అనుకున్నట్లుగా అవినీతి ద్వారా చేతులు మారే డబ్బు, దోచుకునే డబ్బు సామాజిక అదనపు విలువలోని ఒక భాగం. ఒక పెట్టుబడిదారుడు తన పెట్టుబడితో ఒక వ్యాపారం నిర్వహించినపుడు తన ఉత్పత్తి సాధనాల ఖర్చు, శ్రామికుల జీతాలు, ఆగ్జిలరీలు, ఇతర ఇన్సిడెంటల్ ఖర్చులు పోను తన సంపాదనలో మిగిలినదంతా లాభమే. ఈ లాభం ఎక్కడి నుండి పుట్టుకొచ్చింది? సాధారణంగా చాలామంది ఈ లాభాల పరిమాణం అనేక రెట్లు పెరిగి, పెట్టుబడితో పోల్చినపుడు లాభాలు అనేక రెట్లు ఉన్నప్పుడు గాని అక్కడేదో అవినీతి జరుగుతున్నట్లు అనుకోరు. కానీ అసలు లాభం పుట్టుకలోనే అవినీతి ఉంది. శ్రామికుల నుండి దోపిడీ చేసిన అదనపు విలువకే పెట్టుబడిదారుడు లాభం అని పేరు పెట్టుకున్నాడు. ఈరోజు మనమంతా ఈ లాభాల ఉచ్చులో బిగుసుకుపోయిన సంగతి వేరేగా చెప్పనవసరం లేదు. అంటే లాభం పుట్టుకే ఒక అవినీతి కనుక ఆ పైన ఎన్ని రెట్లు లాభమైన కూడా పునాది మాత్రం లాభం పుట్టుకకు సంబంధించిన అవినీతే. కనుక మార్క్సిస్ట్ అవగాహనలో అవినీతి నిర్మూలన అంటే లాభం పుట్టుకను రద్దు చేయడం. లాభాన్ని రద్దు చేయడం ద్వారా లాభం పునాదిగా ఉన్న అన్ని ఆర్థిక వ్యవస్థలనూ దెబ్బకొట్టాలి. మనం లాభాన్ని ఎలా రద్దు చేస్తాం? లాభాన్ని సృష్టించిన పరిస్థితులను, నిర్మాణాలను, సంబంధాలను రద్దు చేయడం ద్వారా లాభాన్ని రద్దు చేయగలం. అంటే లాభాన్ని సృష్టించిన ఈ దోపిడీ సంబంధాలను, ఆర్థిక పీల్చివేతను, అసమ సంబంధాలను, వాటిని పాటిస్తూ వస్తున్న వ్యక్తుల చర్యలను, వారి మద్దతులను బద్దలుకొట్టడం ద్వారా ఒక కొత్త సమాజాన్ని ఏర్పరచినపుడు ఆ సంబంధాలు రద్దై తద్వారా లాభం ఆనవాళ్లు కూడా రద్దవుతాయి. అప్పుడు సహజంగానే అవినీతి సమస్య పరిష్కారమవుతుంది. ఇదంతా చేయకుండా అంటే దోపిడీ ఆర్థిక సంబంధాలు అదే విధంగా కొనసాగుతూ పెట్టుబడిదారుల, భూస్వాముల దోపిడీ యథేచ్ఛగా, నిరాఘాటంగా కొనసాగుతూ ఉన్నంత కాలం జరిగే అవినీతి వ్యతిరేక ఉద్యమాలన్నీ పగుళ్లకు పూసే పైపై పూతల వంటివే తప్ప పునాది పునర్నిర్మాణం కాజాలదు. ఆ పూతల ద్వారా జరిగే పరిష్కారం తాత్కాలికమూ, అతి స్వల్పమూ.

సమాన ఆర్థిక సంబంధాలు ఉన్న సమాజంలో, ప్రతి వ్యక్తికీ కూడు గుడ్డ వంటి కనీస అవసరాలు తీరడంతో పాటు ప్రతి మనిషికి పని దొరికే, ప్రతి మనిషి శ్రమ చేసే, ప్రతి వ్యక్తి తన శ్రమను ఎవరూ దోచుకోకుండా తానే అనుభవించగలిగే, సమష్టి శ్రమ ఫలాలను అందరూ సమష్టిగా అనుభవించే అవకాశాలున్నప్పుడు అలాంటి కొత్త పరిస్థితులలో ఏ వ్యక్తికీ అవినీతి ఆలోచనే రాదు. తన అవసరాలన్నీ తీరుతాయి కనుక అవినీతి వైపు చూడమన్నా చూడరు. కనుక అవినీతిని సమూలంగా నిర్మూలించే మార్గం దోపిడీ ఆర్థిక సంబంధాల నిర్మూలనే తప్ప దోపిడీ సమాజాలలో చేసే పాలిష్డ్ ఉద్యమాలు కావు. ఇదీ అవినీతి సమస్య పట్ల మార్క్సిస్ట్ అవగాహన.

అవినీతి ఎలా జరుగుతుంది? అనే అంశాన్ని పరిశీలిస్తే ఎంత సేపూ మనం అవినీతి అంటే లంచం, డబ్బును అక్రమ పద్ధతులలో ఇచ్చి పుచ్చుకోవడం అనే అర్థంలోనే చూస్తూ వస్తున్నాం. అయితే నిజానికి 'అవినీతి' అనే పదానికి అంత సంకుచితమైన అర్థాన్ని ఆపాదించడమే పెద్ద తప్పిదం. నీతి బాహ్యమైన ఏ పని అయినా అవినీతి కోవలోకే వస్తుంది. కేవలం ఆర్థికమైన చట్ట వ్యతిరేక లావాదేవీలే అవినీతి కాదు. అందుకే అవినీతి సమస్యను విస్తృతార్థంలో చర్చిస్తేనే గాని ఈ రోజు భారతదేశంలో అవినీతి ఎలా సాగుతున్నదో అర్థం చేసుకోలేవుతుంది. 1991 తర్వాత దేశంలో ప్రవేశపెట్టబడిన సరళీకరణ విధానాలు మొదలుకొని తర్వాత ప్రపంచీకరణ దిశగా దేశం నేడు సామ్రాజ్యవాద విధానాల వైపు ప్రయాణిస్తున్నది. మౌలిక ప్రజారంగాలను దెబ్బకొట్టి, వృత్తులను, పేద ప్రజల జీవనోపాధులను ధ్వంసం చేసి కార్పొరేట్ సంస్కృతిని, పెట్టుబడిదారీ తత్వాన్ని ప్రభుత్వాలు పెంచి పోషించాయి. ఈ ఇరవై ఏళ్లలో ప్రపంచీకరణ విషఫలితాలు ధనిక, పేద అంతరాన్ని తీవ్రంగా పెంచివేసి ప్రమాదకరమైన స్థాయిలో అసమానతలను వృద్ధి చేశాయి. దేశ వ్యాప్తంగా సహజ వనరులను, నిక్షేపాలను బహుళజాతి

సంస్థలకు, బడా దేశీయ, కంపెనీలకు దారాధత్తం చేశారు. స్పెషల్ ఎకనమిక్ జోన్‌లను ఏర్పాటు చేసి వేలాది ఎకరాల భూములను కారు చవకగా అప్పగించారు. దక్షిణ భారతదేశం మొత్తం నేడు ఎం.ఎన్.సి.ల, కంపెనీల పడగ నీడలో ఉందంటే పరిస్థితి తీవ్రతను అర్థం చేసుకోవచ్చు. జార్ఖండ్, ఛత్తీస్‌గఢ్‌ల పరిస్థితి సరేసరి. భారతదేశ ఆర్థిక విధానాలను ప్రపంచ బ్యాంక్, ఐ.ఎం.ఎఫ్. లాంటి సంస్థలు శాసిస్తున్నా, అమెరికన్ పాలసీ కనుసన్నలలో నేటి భారత పార్లమెంటరీ విధానాలు రూపుదిద్దుకుంటున్నా అవన్నీ అవినీతి పరిధిలోకి (నీతి బాహ్యమైన) రాని అంశాలుగా విస్మరించగలమా? ఒక పార్టీ బహిరంగ సభకు జనాల సేకరణకు డబ్బులివ్వడం, ఓటుకు నోటు ఇవ్వడం వంటివి మాత్రమే అవినీతి చర్యలు కావు. అదే బహిరంగ సభలో జనాల అందరి ముందు వాగ్దానం చేసిన హామీలను మరచిపోయి నిర్లజ్జగా వ్యవహరించడమూ అవినీతే. ఓటుకు నోటు తీసుకునేలా ప్రజలను ప్రేరేపించి, గెలిచిన తర్వాత తామిచ్చిన దానికంటే కొన్ని వేల, లక్షల రెట్ల సొమ్మును ఆ ప్రజల నుంచే దోచుకోవడాన్ని కూడా అవినీతిగానే అర్థం చేసుకోవాలి.

అనేక కేసులలో ప్రజల ఆత్మాభిమానాలను, ఆత్మగౌరవాలను దెబ్బతీసే విధంగా న్యాయస్థానాలు తీర్పులివ్వడాన్ని, అలాంటి తీర్పులకు తప్పుడు సాక్ష్యాలను, వక్ర సాక్ష్యాలను, రాజకీయాలను కూడగట్టడాన్ని కూడా అవినీతి అనే అనాల్సి ఉంటుంది. జీవించవలసిన హక్కును కాలరాసి వ్యక్తి ప్రాణాలను తీసే అధికారాన్ని చేతుల్లోకి తీసుకుని ప్రభుత్వాలు జీతన్ మరాండీ బృందాన్ని ఉరికొయ్యలకు ఎక్కించడాన్ని కూడా అవినీతిగా పరిగణించాలి. (ఆ చర్యకు అంత చిన్న పేరు సరిపోదు గాని దాన్నొక నీతిబాహ్యమైన చర్యగానే చూడాలి కదా!) చంపడాన్ని చట్టబద్ధం చేసిన ప్రభుత్వాల క్రూరత్వం అవినీతి కోవలోదే. బాక్సైట్ ఖనిజం కోసం, ప్రాజెక్టుల కోసం, గ్రానైట్ కోసం లక్షలాది మంది గిరిజనులను నిర్వాసితులను చేస్తున్న చర్యలను అవినీతి అనకూడదా? తమకు నచ్చినదే చూపిస్తూ, సెకనుకింత అని సమాచారాన్ని ప్రసారాన్ని లాభాల అంగట్లో అమ్ముకుంటున్న మీడియా చర్యలను అవినీతి అనవద్దా?.. ఇలా ఒకటేమిటి, నీతిలేని ప్రతీచర్యా అవినీతి ఖాతాలోనిదే. అందుకే అవినీతి 'డబ్బులు అన్యాయంగా చేతులు మారడం' అనేది చాలా సంకుచితమైన నిర్వచనం. దాన్ని మించిన అర్థాలు, ఉదాహరణలు స్వాతంత్ర్య భారతదేశంలో కోకొల్లలు.

లోతుల్లోకి వెళ్తే అనేక రైతాంగ, గిరిజన, వర్గ ఉద్యమాలను తనలో మిళితం చేసుకోకుండా, ఏకపక్ష నిర్ణయాలతో కాంగ్రెస్ ఆధ్వర్యంలో జరిగిన స్వాతంత్ర్యోద్యమం ఒక పెద్ద అవినీతికరమైన ఉద్యమం. పేరులో సోషలిజం వల్లిస్తూ తీరులో నయా పెట్టుబడిదారీ విధానాలను అవలంబించిన జవహర్‌లాల్ నెహ్రూపాలన అవినీతిపాలన. 'గరీబీ హఠావో' అంటూనే గరీబుల కడుపుకొట్టిన ఇందిరా గాంధీ, 'బికారీ హఠావో' అంటూ బికారితనాన్ని మరింత వృద్ధి చేసిన రాజీవ్‌గాంధీల పాలనను అవినీతి అనాలి. రెండు రూపాయలకు కిలో బియ్యం లాంటి సంక్షేమ పథకాలతో ప్రజలను బిచ్చగాళ్లను చేసిన ఎన్.టి.ఆర్. పాలన, దేశంలోని గ్లోబల్ విధానాలను రాష్ట్రంలోని మధ్యతరగతి, పేద ప్రజలపై రుద్ది రాష్ట్రాన్ని ఎడారిగా మార్చిన చంద్రబాబు పాలనలను అవినీతి పాలనలుగా చూడాలి. ఇదీ అవినీతి అంటే. నీతి తప్పి ప్రజలను ఎంతగా వంచించవచ్చో చేసి చూపే ప్రతీ చర్య అవినీతి చర్యే. ఇక ఇన్ని రకాలుగా అవినీతి సాగుతున్నప్పుడు వీటన్నింటికీ ఉమ్మడి కారకులెవరనేదే మనం నిర్ణయించుకోవలసిన అంశం. ఆ నిర్ణయాన్ని బట్టే పోరాట రూపం ఉంటుందనేది ఒక వాస్తవం.

అవినీతికి కారణాలేమిటి? మనుషులలో స్వార్థం పెరిగిపోవడమే అవినీతికి కారణమని చాలామంది అంటుంటారు. అలాంటపుడు సకల సమస్యలకు కారణమనుకునే అవినీతిని, అవినీతికి కారణమనుకునే స్వార్థాన్ని పోగొట్టుకోవడానికి ఆధ్యాత్మిక కేంద్రాలను స్థాపించుకుని, ముక్కు మూసుకుని నైతిక విలువలు, నిస్వార్థత అంటూ జపాలు చేసుకుంటూ కూర్చుంటే సరిపోదా? ఈ ఉద్యమాలు, పోరాటాలు ఎందుకు? కానీ స్వార్థం కంటే కూడా ముఖ్యమైన కారణాలు అనేకం ఉన్నాయి. భారతదేశంలో చట్టాలు చాలా లోపాలతో ఉన్నాయి. ఈ చట్టాలు పెద్దవాడు దోచుకునేందుకు, పేదవాడు దోచుకోబడేందుకు దోహదపడేవిగా ఉన్నాయి. ఈ చట్టాలకు మాతృక అయిన భారత రాజ్యాంగం కూడా అనేక లోపాభూయిష్టతలతో నిండి ఉంది. ఒక వెహికిల్ ఇన్‌స్పెక్టర్ వంద రూపాయలు లంచం అడిగినపుడు వాహన దారుడు ఏం ఆలోచిస్తాడు? ఇన్‌స్పెక్టర్ కేసు చేస్తే స్టేషన్ చుట్టూ, కోర్టుచుట్టూ తిరగడం, ఈ లంచం కంటే జరిమానా కట్టాల్సి రావడం.. ఇదంతా ఎందుకు? వంద రూపాయలతో ఎలాంటి కష్టం లేకుండా బైటపడవచ్చు కదా! అనుకుంటాడు.. ఇక్కడ అవినీతికి కారణమెవరు? ఇచ్చేవాడా? తీసుకునే వాని స్వార్థమా? రెండూ కాదు. తీసుకునేవానికి కేసుకు ప్రత్యామ్నాయంగా మరో రూపంగా డబ్బు తీసుకునే అవకాశం కల్పించిన, ఇచ్చేవాడికి నిజాయితీగా వ్యవహరించే వీలు లేకుండా చేసిన చట్టాలే కారణం.

గనిని లీజుకు తీసుకోవడం ద్వారా గాలి జనార్దన్‌రెడ్డి లాంటి ఒక మైనింగ్ మాఫియాకు వేల కోట్ల రూపాయలు దోచుకునే అవకాశం ఉన్నపుడు ఆ లీజుకు అవకాశం కల్పించిన చట్టం పరోక్షంగా అతనికి ఆ కోట్లాది రూపాయలు కట్టబెట్టే కారకమైనట్లే కదా! పార్లమెంట్ వేదికగా దేశ నిర్మాణానికి అవసరమైన శాసనాల రూపకల్పన చేసి అమలు చేసే అవకాశమున్నపుడు ఆ వేదికను దేశ విచ్ఛిన్నానికే ఎక్కువగా వాడుతున్నపుడు అలాంటి పార్లమెంట్‌లో ప్రజాస్వామ్యానికి అవకాశం కల్పించిన భారత రాజ్యాంగం అందుకు పరోక్ష కారణమే కదా! కనుక మనం ఏ సూత్రాలను, ఏ మార్గదర్శకాలను అనుసరించాలనుకున్నామో, వాటి ద్వారా వ్యక్తిగత, సామాజిక, ఆర్థిక, రాజకీయ స్వేచ్ఛను, స్వచ్ఛతను పొందాలనుకున్నామో ఆ నియమావళులలోనే పూరించుకోలేనంత అగాధం ఏర్పడి ఉంది. అందుకే అవినీతికే గానీ, అసమానత్వానికేగానీ స్వార్థం ప్రధాన కారణం కాదు. స్వార్థం ఏకవ్యక్తి లక్షణం. కానీ కోట్లాది వ్యక్తులను నడిపించే ప్రభుత్వ విధానాలే వాటికి అసలు కారణాలు. ఈ విషయం గమనించనిదే అవినీతిపై పోరాటానికి దిగలేం. దిగినా కారణాలు తెలియకుండా చేసే పోరాటాలతో ఏ ప్రయోజనమూ ఉండదు.

అవినీతిపై ఉద్యమం పేరుతో ఇటీవల అన్నా హజారే చేసిన హంగామా మరో రెండు అంశాలను చర్చకు తెచ్చింది. మొదటిది – అవినీతి వ్యతిరేకత అనేది గొప్ప దేశభక్తి చర్య అని, దేశం మీద ప్రేమ, భక్తి ఉన్న ప్రతి ఒక్కరూ అవినీతిని వ్యతిరేకించాల్సిందే అని, లేకుంటే

అలాంటి వారు దేశభక్తులే కాదనే వాదాన్ని అన్నా టీం ముందుకు తెచ్చింది. అసలు మార్క్సిస్ట్ అవగాహనలో దేశభక్తి అనేదే ఒక బూర్జువా లక్షణం. దేశంలోని రాజకీయ నాయకులు, దోపిడీ శక్తులు, ఫ్యూడల్ శక్తులు ప్రజా సమస్యల నుండి ప్రజలను దారి మళ్లించడానికి 'దేశభక్తి' ఉన్మాదాన్ని ప్రచారం చేస్తుంటారు. ఈ విషయంలో హిందూ మత సంస్థలు మరింత రెచ్చగొట్టే విధంగా ప్రవర్తిస్తుంటాయి. దేశభక్తి, జాతీయత భావనలు హద్దులు దాటితే ఏమవుతుందో రెండో ప్రపంచ యుద్ధ సమయంలో జర్మనీ, ఇటలీల చరిత్రలు చెప్తూనే ఉన్నాయి. దేశభక్తి ముసుగులో ప్రజలు తమ మెదళ్లను దేశ సమస్యల వైపు మరల్చకుండా, మతం లాంటి మత్తులో దోపిడీవర్గాలు ప్రజలను పడేస్తుంటాయి. సహజంగానే ఉద్వేగాలను రెచ్చగొట్టే అంశాలు కనుక దేశభక్తి, మతం, కులం లాంటి సంకుచిత ధోరణులు ప్రజలను బాగానే రెచ్చగొడతాయి. ప్రజలు ఆ ఉన్మాదాలకు పరిమితమై సమస్యల దిశగా ఆలోచించరు. ఇంతకంటే ఇక దోపిడీ శక్తులకు కావలసిందేముంది? యథేచ్ఛగా దోచుకుంటూనే ఉంటారు. కనుక దేశభక్తి పరిధిలోనే అవినీతిని కూడా ఇమడ్చాలని చేసే ప్రయత్నాలే అవినీతి ఉద్యమాలు.

అన్నా హజారే హంగామా చర్చకు తెచ్చిన మరో అంశం - నిరాహార దీక్షల ద్వారా దేశ సమస్యలను పరిష్కరించుకోవచ్చు అనేది. ఇది చాలా నిరంకుశమైన అభిప్రాయం. దేశ ప్రజలందరినీ స్తబ్దంగా ఉంచి, ఒక వ్యక్తి మాత్రమే ప్రచారంతోనో, మీడియాతోనో, ప్రతిపక్షాల సాయంతోనో ఉద్యమం (?) చేసి, ప్రభుత్వంపై బాణం సంధించాలనడం లో చాలా తప్పుడు విధానం దాగి ఉంది. సమస్యల పరిష్కారానికి ప్రజలందరి సమష్టి ఉద్యమాలే శాశ్వత పరిష్కారాలు చూపుతాయని చరిత్ర నిరంతరం నిరూపిస్తూ వస్తూనే ఉంది. (ఆ సమష్టి ఉద్యమాలకు కూడా సరైన శాస్త్రీయ సిద్ధాంత జ్ఞానం లేకపోతే అవి కూడా విఫలమవుతాయి. అది వేరే సంగతి). అలాంటిది రైతులు, కార్మికులు, విద్యార్థులు, కూలీలు, మైనారిటీలు, పేదలు, మహిళలు వంటి అనేక ఇతర ప్రజాబాహుళ్యాలన్నింటినీ నిష్క్రియాపరంగా ఉంచడం అంటే అది బానిసత్వాన్ని ప్రేరేపించడం కాగా ఒక వ్యక్తి మాత్రమే అందరి తరఫున నిరాహార దీక్ష చేయడం అనేది ఆ వ్యక్తి నిరంకుశత్వ ధోరణిని సూచిస్తుంది. స్వాతంత్ర్యోద్యమ సమయంలో కూడా గాంధీ తనొక్కడే ఆ ఉద్యమానికి చిహ్నంగా భావించుకుని ఉద్యమ రూపాలను ఏకవ్యక్తి రూపాలుగా నిర్వహించాడు. అదొక ప్రమాదకరమైన కొనసాగింపు. కానీ గాంధీకి సమాంతరంగా అనేకులు సమష్టి ఉద్యమాలు నిర్వహించడం వల్ల కొంతవరకైనా గాంధీ నియంత్రించబడ్డాడనేది మార్క్సిస్టుల అభిప్రాయం. కనుక అదే గాంధీ స్ఫూర్తితో అన్నా చేసిన ఈ హంగామాను కూడా మార్క్సిస్టులు 'గాంధీయన్ మోనోపలిక్ అల్లరి'గానే చూడాల్సిన అవసరముంది. శాస్త్రీయ జ్ఞానంతో కూడిన సమష్టి ప్రజా ఉద్యమాలే అవినీతిని అంతమొందిస్తాయి గానీ నిరాహార దీక్షల వంటి సాత్విక ప్రతిఘటన చర్యలు కాదు. (సాత్విక ప్రతిఘటన సిద్ధాంతాన్ని గాంధీ ప్రతిపాదించాడు. మార్క్సిస్టులు ఈ సిద్ధాంతాన్ని విఫల సిద్ధాంతంగా భావిస్తారు.) అందుకే గాంధీ తరహా ఏకవ్యక్తి కేంద్రిత నిరాహార దీక్షలు, సత్యాగ్రహాల ద్వారా కాకుండా ప్రజలంతా కలిసి పోరాడే వర్గపోరాటాల ద్వారానే అవినీతి అయినా మరే ఇతర సమస్య అయినా పరిష్కరించబడుతుందని మార్క్సిస్టులు నమ్ముతారు.

ఇక సంక్షిప్తంగా పై విషయాల సారాంశాన్నంతా నాలుగు మాటల్లో కింది విధంగా చెప్పుకోవచ్చు.

1. అవినీతి అనేది ఉపరితల అంశం. దోపిడీ ఆర్థికసంబంధాలు అనే పునాదిని తొలగిస్తేనే అవినీతి సంపూర్ణంగా తొలగించబడుతుంది.
2. అవినీతిని ప్రేరేపించేది, చేసేది అంతా దోపిడీదారులు, పెట్టుబడి దారులు, రాజకీయ నాయకులే. సామాన్య ప్రజలు ఎప్పుడైనా చేసినా అది నిర్లక్ష్యపరచాల్సినంత స్వల్ప విషయం.
3. అవినీతికి 'డబ్బును అక్రమ పద్ధతుల్లో ఇచ్చి పుచ్చుకోవడం' అనేది సంకుచితార్థం. నీతిబాహ్యమైన ఏ పని అయినా అవినీతి చర్యే అవుతుంది.
4. అవినీతికి స్వార్థం మాత్రమే కారణం కాదు. చట్టాల నిర్మాణంలో ఉన్న మౌలికమైన లోపాలు కూడా అవినీతికి కారణం.
5. అన్నా హజారే చేసిన నిరాహార దీక్ష వంటి గాంధీ తరహా పనుల ద్వారా కాకుండా వర్గపోరాటాల ద్వారానే పరిష్కారాలను వెతకాలి.

ఇదీ అవినీతిపై మార్క్సిస్ట్ అవగాహన. ఏ విషయం పైనైనా మార్క్సిస్ట్ అవగాహనను ఇంత చిన్న వ్యాస పరిధిలో చర్చించడం కష్టమైన పనే. అందుకే విస్తృతమైన అవగాహన కోసం 'కాపిటల్' చదవడం ప్రతి ఒక్కరూ మొదటగా చేయాల్సిన పని. అప్పుడు అనేక సమస్యలకు శాస్త్రీయ పరిష్కారాలను అదే నేర్పుతుంది. తర్వాత చేయాల్సిందల్లా నేర్చుకున్నది ఆచరణలో పెట్టడమే. ఆచరణలో విజయం సాధించడమే.

*(రచయిత ఉపాధ్యాయులు, తెలంగాణ ఉద్యమ కార్యకర్త)* వీ

**రాబోయే సంచికలలో...**

- ❖ గ్రామాల అధ్యయనం - ఎందుకు? ఎలా?
- ❖ ఆంధ్రప్రదేశ్‌లో భూసంస్కరణల విధానాలు : ఒక సమీక్ష - ఎం. కోదండరాం, కె. సీతారామారావు
- ❖ భారతీయుల స్వదేశీయత, విదేశీయతలోని మూలాలు - డా. జి. సాంబశివా రెడ్డి
- ❖ భాషా ప్రయుక్త రాష్ట్రాలపై అంబేడ్కర్ దృక్కోణం - ఎం. కృష్ణ ఆదిత్య
- ❖ సామాజిక న్యాయం నుంచి సమాజ ద్రోహం వరకు... - ఎస్. కిషోర్

***ఆర్.ఎస్. రావు** తెలుగు వ్యాసాలన్నీ 2010 అక్టోబర్ లో 'కొత్తచూపు' పేరుతో వీక్షణం ప్రచురణగా వెలువడ్డాయి. కాని 1995లో వెలువడిన 'టువర్డ్స్ అండర్ స్టాండింగ్ సెమి ఫ్యూడల్ సెమి కలోనియల్ సొసైటీ' లోనూ, పత్రికలలోనూ ఇంకా తెలుగులోకి రాని వ్యాసాలున్నాయి. ఆ రచనలను కూడ తెలుగుచేసి పాఠకులకు అందించే ప్రణాళికలో భాగంగా ఈ వ్యాసం. ఇది 1984 మార్చ్ 10-11 లలో వరంగల్ కాకతీయ విశ్వవిద్యాలయంలో జరిగిన ఆంధ్రప్రదేశ్ ఎకనమిక్ అసోసియేషన్ రెండవ వార్షిక సదస్సులో సమర్పించిన పత్రం - సం.*

# వ్యవసాయ సంబంధాల సిద్ధాంతం దిశగా.. - 3

*(గత సంచిక తరువాయి)*

ఉద్యోగ కల్పనలో వ్యవసాయ రంగానికి ఉన్న సామర్థ్యపు పరిమితులను దృష్టిలో ఉంచుకుని చూస్తే, వ్యవసాయ కార్మికులు వలస వెళ్లడానికి ఎందుకు ఆసక్తి చూపుతున్నారో అర్థమవుతుంది. ఈ విషయంలో వ్యవసాయ కార్మికుల అభిప్రాయాల వివరాలను జాతీయ నమూనా సర్వే 1970–71 నుంచి గ్రహించవచ్చు. చిన్నరైతు కుటుంబాల కన్నా సాగుదార్లు కాని కుటుంబాలే వలస వెళ్లడానికి ఎక్కువ ఆసక్తి చూపించాయి[16]. దేశం మొత్తం మీద సాగుదార్లు కాని, వేతనాల మీద బతికే కుటుంబాలకు చెందినవారి జనాభాలో 10.89 శాతం మంది గ్రామం నుంచి బైటికి వెళ్లి పూర్తికాలం వేతన ఉపాధి సంపాదించుకునే ఆసక్తి కనబరచారు. కుటుంబంలోని ఒక వ్యక్తి అయినా గ్రామం నుంచి బయటికి వెళ్లి ఉద్యోగం సంపాదించాలనే ఆసక్తి ఉన్న కుటుంబాల సంఖ్య ఈ పత్రంతో పాటు ఉన్న పట్టికలో ఉంది. ఇక్కడ రెండు రకాలవాళ్లు ఉన్నారు. ఒకరు ఎటువంటి ఉపాధి హామీ లేకపోయినా గ్రామం వదిలిపోవడానికి సిద్ధంగా ఉన్నవారు. దేశవ్యాపిత గణాంకాలను చూస్తే, వ్యవసాయ కార్మిక కుటుంబాలలో 27.24 శాతం మంది ఈ తరహాకు చెందుతారు. మరొకరకం, ఉపాధి హామీ ఉంటేనే గ్రామం వదలడానికి సిద్ధమయ్యేవారు. వీరు 7.04 శాతం మంది. అంటే రెండు రకాల వారు కలిసినా వ్యవసాయ కార్మిక కుటుంబాలలో మూడో వంతు మంది మాత్రమే వలస వెళ్లడానికి సిద్ధంగా ఉన్నారన్నమాట.

ఇక రాష్ట్రాలవారీగా విభజించి చూస్తే, పంజాబ్, హర్యానా వంటి అభివృద్ధి చెందిన రాష్ట్రాలలో వ్యవసాయ కార్మిక కుటుంబాలలో చాల ఎక్కువమంది, దాదాపు 50 శాతం మంది, వలస వెళ్లడానికి ఆసక్తి చూపారనే వాస్తవాన్ని గుర్తించడం చాలముఖ్యం. అదే సమయంలో ఒరిస్సా, బీహార్ వంటి వెనుకబడిన రాష్ట్రాలలోనూ, రాజస్తాన్, తమిళనాడు, కర్నాటక, ఆంధ్రప్రదేశ్ వంటి ఇతర రాష్ట్రాలలోనూ వలస వెళ్లడానికి సిద్ధంగా ఉన్నవారి సంఖ్య 30 శాతం కన్న తక్కువగా ఉంది. ఇక్కడ గుర్తించవలసిన మరొక విషయమేమంటే ఈ రాష్ట్రాలన్నిటిలోనూ మొత్తం ఉద్యోగాల పరిమాణం అఖిల భారత గణాంకాల కన్న తక్కువగా ఉంది.

వ్యవసాయ కార్మిక కుటుంబాల అభిప్రాయాల గురించిన ఈ సమాచారం నుంచి గమనించవలసిన అంశాలు రెండు: ఒకటి, ఉద్యోగాన్వేషణలో గ్రామం నుంచి బయటికి వెళ్లడానికి వారు తక్కువ ప్రాధాన్యత ఇస్తున్నారు. బహుశా దీనికి కారణం పట్టణ పరిశ్రమలకు వారిని ఇముడ్చుకునే శక్తి లేకపోవడం, లేదా మార్క్స్ చెప్పినట్టుగా "అసాధారణ పరిమాణంలో తెరుచుకుని ఉద్యోగాలు" ఇవ్వలేకపోవడం కావచ్చు. ఉన్నత స్థాయి నైపుణ్యాలతో కూడిన సామ్రాజ్యవాద సాంకేతిక పరిజ్ఞానానిదీ, ఉన్నత స్థాయి పెట్టుబడి ఘనాంగ నిర్మాణానిదీ[17] పైచేయి కావడం వల్ల, అదే విధంగా, మొత్తంగా మదుపు పరిమాణం మీదనే పరిమితులు ఉండడం వల్ల పారిశ్రామిక రంగం అర్ధ విద్యావంతులైన, సాంప్రదాయిక నైపుణ్యాలు ఉండే వ్యవసాయ కార్మికులకు ఉపాధి కల్పించలేకపోతుంది. దాని ఉద్యోగకల్పనా శక్తిపరిమితంగానే ఉంటుంది. మరొకపక్క మన పరిశ్రమలలో అసంఘటిత రంగం అనేది కూడ ఉంది. దాన్ని క్రమబద్ధం కాని రంగం అని కూడ పిలుస్తున్నారు. అక్కడ కార్యక లాపాలు చిన్న స్థాయిలో జరుగుతుంటాయి. పెట్టుబడి ఘనాంగ నిర్మాణం కూడ తక్కువగానే ఉంటుంది. అక్కడి పని పరిస్థితులు, జీవన పరిస్థితులు చాల అనిశ్చితంగా ఉంటాయి. వేతనాలు పెద్దగా ఉండవు. ఈ కారణాలవల్ల ఈ అసంఘటిత రంగం కూడ గ్రామాల నుంచి వలసలను ఎక్కువగా ఆకర్షిస్తున్నట్టు లేదు. అయితే దిక్కులేక నిస్సహాయంగా గ్రామాల నుంచి వచ్చేవారికి ఈ రంగం కొంత ఆకర్షణ కల్పించవచ్చు. అంటే మొత్తం మీద పారిశ్రామికరంగానికి గ్రామీణ వలసలను ఆకర్షించి ఉద్యోగాలు కల్పించే సామర్థ్యం విస్తృతిలోనూ, లోతులోనూ పరిమితం గానే ఉంది. బహుశా ఈ పరిస్థితి వల్లనే కావచ్చు, గ్రామీణ పేదలు వలస వెళ్లడానికి పెద్దగా ఆసక్తి చూపడం లేదని సర్వేలో తేలింది.

వలస వెళ్లాలనే ఆలోచనలలో పెట్టుబడి ఎక్కువగా ప్రవేశించిన ప్రాంతాల ప్రజాభిప్రాయానికీ, పెట్టుబడి తక్కువగా ప్రవేశించిన ప్రజాభిప్రాయానికీ మధ్య అంతరం ఈ పట్టిక నుంచి బయటపడిన మరొక అంశం. ఉదాహరణకు పంజాబ్ నూ ఒరిస్సానూ పోల్చి చూడండి. పెట్టుబడి ఎక్కువగా ప్రవేశించిన, సాపేక్షికంగా ఎక్కువ ఆదాయం, ఎక్కువ ఉద్యోగ కల్పన ఉన్న పంజాబ్ లోనే ఎక్కువమంది ప్రజలు వలస వెళ్లడానికి సిద్ధంగా ఉన్నారు. కాని ఒరిస్సాలో తక్కువ ఆదాయం, తక్కువ ఉద్యోగ కల్పన ఉన్నప్పటికీ వలస వెళ్లడానికి ఆసక్తి కూడ తక్కువగానే ఉంది.

అంటే మన పారిశ్రామికీకరణకు గ్రామీణ పేదల మిగులు శ్రమశక్తిని ఆకర్షించే స్వభావం తక్కువగా ఉండడం వల్ల గ్రామీణ పేదలు గ్రామంలోనే పాతుకుపోయే పరిస్థితి ఉంది. తద్వారా ఈ

పారిశ్రామికీకరణ పరోక్షంగా సాంప్రదాయిక సామాజిక భద్రత భావాలను కూడ బలోపేతం చేస్తోంది. మరొకవైపు గ్రామంలోని భూస్వామ్య ప్రయోజనాలు కూడ ప్రత్యక్షంగా ఆ పనే చేస్తుంటాయి. గ్రామంలోనే పాతుకుపోవడం, గ్రామంలోనే సామాజిక భద్రత ఉందనుకోవడం రెండు రకాలుగానూ – పేదరికం ఉన్నప్పటికీ, పేదరికం వల్ల కూడ – జరుగుతున్నాయి.

చివరిగా, పేదరికం స్వభావం గురించి కూడ ఒక వ్యాఖ్య చేయడం అవసరం. వ్యవసాయ రంగంలోని పేదలు వారి ప్రస్తుత వినియోగ ప్రమాణాల ప్రకారం మాత్రమే పేదలుగా లేరు, నానాటికీ పెరిగిపోతున్న రుణభారం వల్ల కూడ వారు పేదలుగా ఉన్నారు. పట్టిక చివరి రెండు వరుసలలో ఇప్పటికే పేరుకుపోయిన మొత్తం రుణభారం, 1971-72 సంవత్సరంలో నికరంగా చేరిన రుణభారం కూడ ఇవ్వడం జరిగింది.

హర్యానాలో మినహా మిగిలిన అన్ని రాష్ట్రాలలోనూ పేరుకుపోయిన మొత్తం రుణభారానికి ఈ సంవత్సరం అదనపు రుణభారం నికరంగా చేరినట్టు కనబడుతున్నది. హర్యానాలో మాత్రమే ఈ సంవత్సరం తీసుకున్న రుణం కన్న తిరిగి చెల్లించిన పాతరుణం ఎక్కువగా ఉంది. పంజాబ్ లో ఈ సంవత్సరం నికరంగా రు. 23 అదనపు రుణభారం తోడయింది. ఈ అదనపు రుణభారం రాష్ట్రాల మధ్య వేరువేరుగా ఉన్నప్పటికీ, మొత్తం మీద నిస్సందేహంగా పెరుగుతోంది. అంటే రైతులు రుణభారపు విషవలయంలో చిక్కుకున్నా రనేది స్పష్టం. అంతర్జాతీయ ద్రవ్యనిధి సంస్థ అప్పుల విషయంలో ఈ విషవలయం అనే మాట తరచుగా వాడుతున్నారు. తక్కువ ఉద్యోగకల్పన, తక్కువ చలనశీలత, రుణభారం పెరిగిపోతుండడం అనే పరిణామాల వల్ల వ్యవసాయ కార్మికులు భౌతిక శాస్త్రంలో చెప్పే కృష్ణబిలం[18] భావనకు సరిగ్గా సరిపోతున్నారు.

మన నిర్వచన అవసరాలను బట్టి మాత్రం వ్యవసాయ కార్మికులు బంధనాలు లేకుండా, స్వేచ్ఛగా ఉన్నట్టు అనిపిస్తుంది. కాని స్వేచ్ఛగా ఉండడం అంటే వారిని కట్టి ఉంచే ఉత్పత్తి సాధనాలు లేకపోవడం అనే అర్థంలో మాత్రమే కాదు, పెట్టుబడిదారీ సంచయనం కోసం ఏ పెట్టుబడిదారయినా పనిలో పెట్టుకోవడానికి వీలుగా బంధనాలు లేకుండా ఉండడం అనే అర్థంలో కూడ చూడాలి. మరో మాటల్లో చెప్పాలంటే పెట్టుబడి చేత విడుదల చేయబడి పెట్టుబడి చేతనే పనిలో పెట్టుకోవడానికి సిద్ధంగా ఉండడం అని అర్థం. అయితే పెట్టుబడి పనిలో పెట్టుకోవడానికి బంధనాలు లేకుండా ఉండడం అనేది ఒక షరతుతో కూడిన స్థితి. పెట్టుబడిదారులు తమ మధ్య ఎటువంటి పోటీని ఎంతగా నడుపుకుంటారు అనేదే ఆ షరతు. ఆ పోటీ కూడ పెట్టుబడి సంచయన క్రమంకోసం మాత్రమే జరగవలసి ఉంటుంది.

ఇది అర్థం కావాలంటే మరొక స్థితి ఊహించండి. గ్రామాన్ని అదుపులో ఉంచుకునేదీ నడిపేదీ కొందరు ధనిక రైతులు అనుకోండి. వారు తమ ఉత్పత్తి పద్ధతుల ద్వారా తమమధ్య తాము పోటీ పడుతున్నారనుకోండి. ఆ పోటీ సహజంగానే శ్రామికులను పనిలో పెట్టుకోవడంలో పోటీగా పరిణమిస్తుంది. అటువంటి స్థితిలో శ్రామికులు స్వేచ్ఛాయుతమైన శ్రామికులవుతారు. ఈ యజమాని దగ్గర పనిచేయడమా ఆ యజమాని దగ్గర పనిచేయడమా అని వాళ్లు స్వేచ్ఛగా నిర్ణయించుకోగలుగుతారు. అటువంటి పోటీ లేనప్పుడు, కుల ప్రాతిపదికపైననే సంబంధాలు ఉన్నప్పుడు, ఎవరి దగ్గరికంటే వారి దగ్గరికి పనికి పోగలిగిన స్వేచ్ఛమీద పరిమితులు ఉంటాయి. అంటే ఆ స్వేచ్ఛ మీద ఆర్థికేతర ప్రయోజనాల నిర్బంధాలు ఉంటాయి. ఇక ఈ స్థితి తీవ్రంగా ఉన్నట్టయితే, అంటే 'పెట్టుబడిదారీ భూస్వామి తలెత్తి ఉన్నట్టయితే, ఆ భూస్వామికి భూమే ప్రాథమిక ఆసక్తి అయితే, శ్రామికుడికి ఆ స్వేచ్ఛ తలెత్తనే తలెత్తదు. ఆర్థికేతర ప్రయోజనాలే శ్రామికుడికి అన్నివైపులా గోడలు నిర్మించి ఉంటాయి.

అంటే దేశంలోని వెనుకబడిన ప్రాంతాలలో, పోటీ లేని ప్రాంతాలలో వ్యవసాయ కార్మికుల స్థితి వెలుగునంతా మింగివేసి బైటికి ఏ మాత్రం ప్రతిఫలించని కృష్ణ బిలంతో పోల్చదగినదిగా ఉంటుంది. అప్పుడు వ్యవసాయ కార్మికులు అటు పెట్టుబడిదారీ విధానమూ ఇటు భూస్వామ్య విధానమూ కల్పించే వైరుధ్యాలన్నీ భరించవలసి వస్తుంది గాని తమ పూర్తి శక్తితో బైటికి వెలుగును ప్రతిఫలించజాలరు.

### 5. ఒక ఆలోచనాత్మక పరికల్పన దిశగా

పెట్టుబడిదారీ పూర్వ రూపాలు రద్దయిపోకుండానే పెట్టుబడి ఉనికిలోకి రావడం అనే వైరుధ్యపూరిత దృశ్యంలో కనబడే అంశాలు పెట్టుబడి స్వభావాన్నీ లక్షణాలనూ ఎలా ప్రదర్శిస్తాయో సూచించడానికి ఈ భాగంలో ప్రయత్నిస్తాను. పెట్టుబడి స్వభావం ఇప్పటికి మూడు దశల గుండా ప్రయాణించి, ప్రస్తుతం సామ్రాజ్యవాదం అనే అత్యున్నత దశలో ఉందనే సూత్రీకరణ అందరికీ తెలుసు. భారతదేశంలో వ్యవసాయ సంబంధాల గురించిన అవగాహనను సక్రమంగా అర్థం చేసుకోవాలంటే సామ్రాజ్యవాద దశలో పెట్టుబడి స్వభావాన్ని అర్థం చేసుకోవాలి.

పెట్టుబడిదారీ సంబంధాలు చాల వరకు పెట్టుబడిదారీ పూర్వ సంబంధాల కన్న అభివృద్ధికరమైనవి. ఎందుకంటే పెట్టుబడిదారీ పూర్వ ప్రయోజనాలు అంతకాలమూ ఉత్పాదకంగా వినియోగించకుండా ఉంచిన శక్తులను అవి విడుదల చేసి ఉత్పత్తిని పెంచుతాయి. ఇలా విడుదల అయ్యే శక్తులలో కేవలం భూమి, నీరు, వగైరా సహజ వనరులు మాత్రమే కాదు, మానవ వనరులు కూడ ఉంటాయి. పెట్టుబడిదారీ విధానం పుట్టినప్పటినుంచి ఇప్పటికి మూడు దశలు దాటి వచ్చింది. అవి మొదట చేతి పరిశ్రమ దశ. రెండవది యంత్రాల దశ. మూడవది సామ్రాజ్యవాద దశ లేదా ద్రవ్య పెట్టుబడి దశ.

ఈ దశలలో ప్రతిఒక్క దశలోనూ మిగులుకు మూలం వేతన శ్రమే అయినప్పటికీ ఆ మిగులును స్వాధీనం చేసుకునే పద్ధతులు మాత్రం భిన్నంగా ఉన్నాయి. తత్ఫలితంగా, ఈ దశలలో ప్రతి ఒక్కదానికీ దానిదైన నిర్దిష్టమైన రాజ్యాంగ యంత్రం పాత్ర, ఉపరితలం ఉన్నాయి. ఈ రాజ్యాంగయంత్రమూ, ఉపరితలమూ పునాది లోని సంబంధం నిరాటంకంగా అభివృద్ధి చెందడానికీ, విస్తరించడానికీ వీలు కల్పిస్తాయి. ఈ మూడు దశలూ సాధారణంగా పెట్టుబడి చరిత్రకు చెందినవే అయినప్పటికీ, ఒక్కొక్క దేశంలో పెట్టుబడికి భిన్నమైన మలుపులతో ప్రత్యేక చరిత్ర కూడ ఉంది. పెట్టుబడిదారీ విధానపు సాధరణ చరిత్రలో ఏ స్థాయిలో, ఏ దశలో ఆ ప్రత్యేక దేశం ప్రవేశించిందనే దానిమీద ఆధారపడి ఈ మలుపులు ఉంటాయి.

పెట్టుబడిదారీ విధానం పుట్టి, సంపూర్ణంగా అభివృద్ధి చెందిన బ్రిటన్, ఫ్రాన్స్ వంటి దేశాలలో భూస్వామ్యాన్ని బలప్రయోగంతో రద్దు చేశారు. బూర్జువా ప్రజాస్వామ్యాన్ని స్థాపించారు. అది చివరిదశ అయిన

సామ్రాజ్యవాద శక్తిగా ఎదిగింది. కాని పెట్టుబడిదారీ చట్రంలోకి ఆలస్యంగా ప్రవేశించిన జర్మనీ, రష్యా, జపాన్‌ల చరిత్ర మరొక రకంగా ఉంది. అవి ఆలస్యంగా ప్రవేశించాయంటే అర్థం, ఫ్రాన్స్, ఇంగ్లండ్ వంటి దేశాలు అప్పటికే చేతి పరిశ్రమ దశను దాటి వచ్చాక, ఉత్పత్తి ప్రక్రియకు శాస్త్ర విజ్ఞానాన్ని అన్వయించడం ప్రారంభించాక, తత్ఫలితమైన రాజకీయ కల్లోలాలలో భాగంగా పెట్టుబడికీ శ్రామికులకూ మధ్య వైరుధ్యం కూడ అభివృద్ధి అయ్యాక ఇది జరిగిందన్నమాట. ఫ్రాన్స్ అప్పటికే పారిస్ కమ్యూన్ రూపంలో మొట్టమొదటి శ్రామికవర్గ గణతంత్ర స్థాపన దిశగా మొగ్గు చూపుతోంది. అంటే పెట్టుబడిదారీ చట్రంలోకి ఆలస్యంగా ప్రవేశించిన దేశాలు అభివృద్ధిచెందిన శాస్త్రీయ ఉత్పత్తి పద్ధతితోనూ పోటీ పడవలసి వచ్చింది, పెరుగుతున్న కార్మికవర్గ చైతన్యాన్నీ అడ్డుకోవలసి వచ్చింది.

ఈ పరిస్థితిని వివరిస్తూ 'ఇంగ్లండ్, ఫ్రాన్స్‌లలో పెద్ద పట్టణాల లోనూ, ప్రత్యేకంగా రాజధాని లోనూ కేంద్రీకృతమైన శక్తిమంతమైన, సంపన్నమైన మధ్యతరగతి వర్గం భూస్వామ్య విధానాన్ని సంపూర్ణంగా ధ్వంసం చేసింది. లేదా ఇంగ్లండ్‌లో లాగ ఏవో కొన్ని అప్రధానమైన రూపాలకు కుదించి వేసింది. కాని జర్మనీలో భూస్వామ్య ప్రభువర్గం తమ ప్రాచీన అధికారాలలో అత్యధికభాగాన్ని యథాతథంగా ఉంచుకో గలిగింది. భూస్వామిక భూకమతాల పద్ధతి ప్రచలితంగానే ఉండి పోయింది' అని 1851లో ఎంగెల్స్ రాశాడు. ఉత్పత్తికి సంబంధించిన విషయాలలో ఫ్రెంచి, బ్రిటిష్ పెట్టుబడిదారులతో పోటీ, అప్పటికే యూరప్‌లో మొత్తంగా వికసిస్తున్న కార్మికవర్గ చైతన్యం అనే స్థల నేపథ్యంలో జర్మన్ బూరువావర్గం తనకు మిత్రులు ఎవరున్నారా అని వెతికింది. 'ఆ మిత్రులందరూ అభివృద్ధి నిరోధక స్వభావం గలవారే. వారు ఒకవంక తన సైన్యంతో, అధికార వర్గంతో ఉన్న రాచరికం, మరొకవంక బడా భూస్వామ్య ప్రభువర్గం. మరొకవంక ఊబకాయపు కులీనవర్గం, చివరికి మతాధికారవర్గం' అని ఎంగెల్స్ వివరించాడు. అలా జర్మన్ బూర్జువావర్గం భూస్వామ్యవర్గంతో రాజీపడింది. వారిని తనలో కలుపుకుంది. వారిని మార్చివేసింది. దాన్నే ఆ తర్వాత కాలంలో 'జంకర్ తరహా అభివృద్ధి' అని పిలవడం మొదలుపెట్టారు. అది విప్లవేతర పెట్టుబడిదారీ పరిణామ క్రమం. ఈ తరహా అభివృద్ధి ప్రక్రియలో ఆసక్తికరమైన విషయమేమంటే, ఇక్కడ సమాజం శ్రామికశక్తిలో జరిగే విప్లవాన్ని దాటవేసి, శ్రమసాధనాల విప్లవం దగ్గర మొదలవుతుంది.

ఈ ప్రక్రియను జపాన్ ఉదాహరణతో వివరించవచ్చు. జపాన్‌లో జరిగిన మెయిజీ పునరుద్ధరణ[19] కాలంలో అప్పటికి అభివృద్ధి చెందుతున్న బూర్జువావర్గం భూస్వామ్యవర్గాన్ని తనలో ఎలా సంలీనం చేసుకున్నదో నిదర్శనాలున్నాయి. పాత భూస్వామ్యవర్గమైన సమురాయి లకు అప్పటికి అందుతున్న నజరానాల ఆధారంగా ప్రభుత్వ హామీ పత్రాలు ఇవ్వడం జరిగింది. ఒక ఉత్సాహవంతుడైన జపనీస్ వ్యాఖ్యాత మాటల్లో చెప్పాలంటే, 'భూస్వామ్య విధానాన్ని రద్దు చేయడం, నిర్మూలించడం యూరప్‌లో క్రమబద్ధంగా, నెమ్మదిగా రెండు వందల సంవత్సరాల పైన తీసుకుంది. కాని జపాన్‌లో మాత్రం భూస్వామ్య విధానాన్ని నామరూపాలు లేకుండా నిర్మూలించడం పునరుద్ధరణ తర్వాత ఎనిమిది తొమ్మిది సంవత్సరాల స్వల్పకాలంలోనే పూర్తయిపోయింది. పైగా ఈ పరిణామం శాంతియుతంగా, ఎటువంటి రక్తపాతం లేకుండా జరిగిందని మేం పదే పదే నొక్కి చెప్పదలచాం.... కాని, భూస్వామ్య విధానం వల్ల ప్రయోజనాలు పొందుతుండిన సమురాయి వర్గమే ఈ పునరుద్ధరణను నడిపించిందనీ, ఆ వ్యవస్థను సమూలంగా రద్దు చేసిందనీ చూస్తే ఆ పరిణామం అంత ఆశ్చర్యకరమైన సౌలభ్యంతోనూ, శాంతిభద్రతలతోనూ ఎలా జరిగిందో అర్థమవుతుంది.

జపాన్ అప్పటికి ఏ పెట్టుబడిదారీ దేశానికీ వలసగా ఉండలేదు. పైగా జపాన్‌కే వలసలు ఉండేవి. అటువంటి జపాన్‌లో పెట్టుబడిదారీ విధానమే జాతీయవాదాన్ని రూపొందించింది. జపాన్ ఆలస్యంగా పెట్టుబడిదారీ విధానంలోకి ప్రవేశించినందువల్ల అప్పటికే సమాజంలో ఉండిన సాంకేతిక పరిజ్ఞానాన్నీ, ఉత్పత్తి విధానాన్నీ సంలీనం చేసుకునే ప్రక్రియ అవసరమైంది. అలా సంలీనం చేసుకుంటేనే స్వతంత్రంగా ఉండగలననీ, అభివృద్ధి చెందిన దేశాలతో పోటీ పడగలననీ జపాన్ భావించింది. అలా జపనీయులు సాంకేతిక పరిజ్ఞానాన్ని సంలీనం చేసుకున్న ప్రక్రియలో రెండు కీలకమైన అంశాలు ఉన్నాయి. ఆ రెండు అంశాలూ కూడ ఉత్పత్తి సాధనాలను విప్లవీకరించడానికి సంబంధించినవే.

మొదటిది, సరుకులను తయారుచేసే ఉన్నతమైన సాంకేతిక పరిజ్ఞానాన్ని సంలీనం చేసుకునేటప్పుడు దాన్ని అక్షరాలా మొత్తంగా స్వీకరించలేదు. అప్పటికే తమ దగ్గర ఉన్న సాంకేతిక పరిజ్ఞానాన్ని మెరుగు పరచడానికి మాత్రమే కొత్త సాంకేతిక పరిజ్ఞానాన్ని తీసుకున్నారు. ఇక్కడ ఒక ఆసక్తికరమైన ఉదాహరణ సుమిటోమో కంపెనీకి చెందిన బెస్సి గనులు. చాలకాలం కిందనే, 1874లోనే, సుమిటోమో అత్యున్నత నైపుణ్యం కలిగిన విదేశీ సాంకేతిక నిపుణులను పనిలో పెట్టుకుంది. తమ సంస్థ పనితీరు గురించి నిర్వహణా సూత్రాలను తయారు చేయమని వారిని కోరుతూ, ప్రత్యేకంగా వారికి ఒక సూచన చేసింది. 'బెస్సి రాగి గనుల్లో ఆధునిక ఖనిజ శాస్త్రం, లోహ శాస్త్రాల దృష్టికోణం నుంచి భూభౌతిక, ఖనిజ సర్వేక్షణ జరుపుతూనే, ప్రస్తుతం గనుల్లో అమలవుతున్న పద్ధతులలో ఏ మార్పులు చేయాలో పరిశీలన జరపాలని' కోరింది. విదేశీ నిపుణులు తమ నిర్వహణ సూత్రాలను తయారు చేసి ఇచ్చిన తర్వాత, సుమిటోమో తన వాస్తవ కార్యకలాపాలలో ఆ సూత్రాలను మొత్తానికి మొత్తంగా అమలులో పెట్టలేదు. దానికి బదులుగా స్వదేశీకరణ, స్థానికీకరణ విధానాన్ని అమలు చేశారు. మరోమాటల్లో చెప్పాలంటే, పెట్టుబడికి ప్రత్యామ్నాయంగా శ్రామికులను వాడారు. స్థానిక సాంకేతిక పరిజ్ఞానం లేనప్పుడు, సరిపోనప్పుడు మాత్రమే విదేశీ పరిజ్ఞానాన్ని వాడారు. అంటే ఒక సాంకేతిక పరిజ్ఞానం ఉన్నతస్థాయిదా, నిమ్నస్థాయిదా అనే ప్రశ్నకు తమ అందుబాటులో ఉన్న వనరుల దృష్ట్యా, ఆ కారకాలకు అయ్యే వ్యయం దృష్ట్యా జవాబు చెప్పుకున్నారు. కొత్త సాంకేతిక పరిజ్ఞానాన్ని సంలీనం చేసుకోవడం అప్పటికే ఉన్న సాంకేతిక పరిజ్ఞానాన్ని ధ్వంసం చేయడానికి కాదని, ఉన్న సాంకేతిక పరిజ్ఞానాన్ని, ఉత్పత్తి సాధనాలను మెరుగు పరచడానికి మాత్రమేననీ వారు చెప్పుకున్నారు.

ఇంగ్లండ్ వంటి దేశాలు శ్రామిక శక్తిలో మార్పుతో మొదలైతే, జర్మనీ వంటి దేశాలు ఉత్పత్తి సాధనాలలో మార్పుతో మొదలయితే, వలస దేశాలు విలువలలో విప్లవంతో మొదలయ్యాయి. ప్రపంచ సరుకుల మార్కెట్ లోకి వలసదేశాలు వ్యాపారీకరణ క్రమాల వల్ల లాగబడ్డాయి. వలసకాలపు వ్యవసాయంలో జనుము, పత్తి, కాఫీ, తేయాకు, రబ్బర్,

నీలిమందు, చెరకు, పొగాకు వంటి పంటలు మొదలయ్యాయి. (వర్జీనియా పొగాకు వంటి మెరుగైన వంగడాలు వలస పాలనాకాలంలో చాల ముందుగానే ప్రవేశపెట్టబడ్డాయి. సరిగ్గా ఆధునిక హరిత విప్లవ గోధుమ వ్యవసాయం లాగనే పొగాకు కూడ నీటిపారుదల సౌకర్యాల మీద, ఎరువుల మీద ఆధారపడుతుంది.) చిన్నతరహా పళ్ల, కూరగాయల సాగు కూడ భారత వ్యవసాయ విధానంలోకి అప్పుడే ప్రవేశించింది. పారిశ్రామిక రంగంలో కూడ అభివృద్ధి విలువలలో విప్లవంతోనే సాగింది.

ఈ మార్పులేవీ సాంకేతిక పద్ధతులలో, ఉత్పత్తి సాధనాలలో, శ్రామిక రూపాలలో మార్పుల ద్వారా రాలేదు. ఉత్పత్తి సాధనాలలోనూ, శ్రమ రూపాలలోనూ వచ్చిన మార్పులలాగ కనబడుతున్నవి కూడ విలువల సృష్టికి అవసరమైన సర్దుబాట్లు మాత్రమే. జౌళి పరిశ్రమ చేనేత పరిశ్రమకు పోటీగా అభివృద్ధి అయింది గాని, చేనేత పరిశ్రమ మీద మెరుగుగా కాదు. అలాగే జనుప వస్త్రాలు జనుప చేనేతకు పోటీ అయ్యాయి. చక్కెర పరిశ్రమ బెల్లంతో పోటీకి వచ్చింది. చమురు పరిశ్రమ పాత గానుగలకు పోటీగా వచ్చింది. రాజకీయంగా స్వతంత్రమైన కాలంలో కూడ, మహలనోబిస్ యుగంలో కొద్దికాలం మినహాయిస్తే, విప్లవీకరించడానికి జరిగిన ప్రయత్నాలన్నీ ఉత్పత్తుల స్థాయిలోనూ, విలువల స్థాయిలోనూ జరిగినవే. చాల స్వల్పకాలం మాత్రమే కొనసాగిన మహలనోబిస్ హయాంలో, ఉత్పత్తి సాధనాలను విప్లవీకరించడానికి ప్రయత్నం జరిగింది. సమాజపు పారిశ్రామిక ఉత్పత్తిని 'యంత్రాలు తయారుచేసే యంత్రాల' దిశగా మరల్చడానికి ప్రయత్నం జరిగింది. ఆ బలహీనమైన ప్రయత్నం జరిగినప్పటికీ, మన పారిశ్రామిక అభివృద్ధి అంతా మామూలుగా పరాయి వ్యతిరేకతకు దూరంగానే ఉండిపోయింది. అణు విద్యుత్తు నుంచి ఎలక్ట్రానిక్స్ దాకా, పళ్లు తోముకునే పేస్ట్ దాకా మన సమస్త పారిశ్రామిక ఉత్పత్తి మార్పులు కొత్త సరుకుల వైపే చూస్తుంటాయి. మరో మాటల్లో చెప్పాలంటే మార్పు పట్ల స్పృహ సరుకుల సమ్మేళనాల మార్పుల గురించి మాత్రమే ఉంది గాని శ్రమశక్తిలో మార్పులుగానో, సాధనాలలో మార్పులుగానో లేదు.

అందువల్ల బ్రిటన్, ఫ్రాన్స్‌లలో భూస్వామ్య వ్యవస్థలు బల ప్రయోగంతో తొలగించబడగా, జపాన్ వంటి దేశాలలో భూస్వామ్య వర్గాన్ని తర్వాత చెల్లుబాటయ్యే హామీపత్రాలతో సంలీనం చేసుకోగా, భారతదేశంలో మాత్రం అప్పటికప్పుడే నష్టపరిహారాలు, నజరానాలు చెల్లించి 21 తుపాకుల గౌరవవందనాలు సమర్పించడం జరిగింది. శ్రమశక్తి రూపాలలో మార్పు తేవడంలో భారతదేశం విఫలమైందనడానికి ఇది ఒక సూచన. అలాగే, బ్రిటిష్, ఫ్రెంచి, అమెరికన్ శాస్త్రవేత్తలు శాస్త్ర విజ్ఞానాన్నీ, సాంకేతిక పద్ధతులనూ ఆవిష్కరిస్తుండగా, జపనీస్ శాస్త్రవేత్తలు ఆ సాంకేతిక పరిజ్ఞానాన్ని పునఃసృష్టిస్తుండగా, భారతీయ శాస్త్ర నిపుణులు షికాగో ప్రయోగశాలలో తమ భావాలను సాకారం చేసుకుంటూ ఉంటారు. అయితే, ఈ దేశంలో దొరికే సరుకుల సమ్మేళనం అభివృద్ధి చెందిన దేశంలో దొరికే సమ్మేళనం కన్న గుణాత్మకంగా భిన్నంగా కూడ ఉండదు. బహుశా కాస్త ఆలస్యం కావచ్చు, అంతే,

ఈ వివరణంతా ఒక అతి మామూలు వాస్తవాన్ని ఎత్తిచూపడానికి మాత్రమే. వలసలుగా ఉన్న దేశాలు పెట్టుబడిదారీ దశలోకి ప్రవేశించడం ఉత్పత్తి విధానంలో మార్పుల ద్వారా జరగలేదు అనే మామూలు వాస్తవం అది. ఉత్పత్తి విధానంలో మార్పులు అంటే శ్రమ శక్తిలో, శ్రమ సాధనాలలో మార్పులు అని అర్థం. కాని మన దగ్గర ఈ మార్పులు అంతిమ ఫలితమైన ఉత్పత్తులలో, విలువలలో మార్పుల ద్వారా జరిగాయి. మరో మాటల్లో చెప్పాలంటే, చలామణీ ప్రక్రియకే ప్రాముఖ్యత ఇవ్వబడింది గాని ఉత్పత్తి ప్రక్రియకు కాదు. ఐతే ఉత్పత్తి ప్రక్రియలో సంబంధిత మార్పులు జరగకుండా చలామణీ ప్రక్రియ అనేది ఉనికిలోనే ఉండదు గనుక, సమాజంలో మార్పులు కూడ దాని పర్యవసానాలే గనుక, సమాజంలో కనబడుతున్న మార్పులన్నీ పైపై పూతలు మాత్రమే అవుతాయి. భారత సమాజం సామాజిక సారాంశంలో అనేక మార్పులను చవిచూసింది. ఆ మార్పులన్నీ కూడ సరుకుల సమ్మేళనంలో మార్పుల ఫలితాలే గాని సామాజిక మార్పుల పర్యవసానాలుగా సరుకుల సమ్మేళనాలు మారలేదు. సామాజిక పరివర్తనా క్రమంలో ఇది చాల చిత్రమైన తలకిందుల వ్యవహారం. ఈ తలకిందుల పరిణామాన్ని పెట్టుబడిదారీ విధానం ప్రవేశపెట్టింది. ఆ పెట్టుబడిదారీ విధానం సామ్రాజ్యవాద పూర్వ దశలోని పెట్టుబడిదారీ విధానం కన్న భిన్నమైనది.

ఈ మార్పులలో మహారాజా పారిశ్రామిక వేత్తగా మారుతాడు. వడ్డీవ్యాపారి ధనిక రైతుగా మారుతాడు. భూస్వామి పెట్టుబడిదారీ భూస్వామిగా మారుతాడు. ఈ ప్రక్రియ 'జంకర్ అభివృద్ధి ప్రక్రియ'తో పోల్చదగినది. ఆధునిక పరికరాల పెరుగుదలే సాధనాలలో విప్లవాత్మక మైన మార్పు అని వర్ణించ దలచుకుంటే మన ఉత్పత్తి సాధనాలు విప్లవాత్మక మార్పులకు లోనయ్యాయనవచ్చు. కాని పాత సాధనాల మెరుగుదలగా, వాటి స్థానంలో కొత్త సాధనాలు రాలేదు. అందువల్ల ఈ మార్పులకు మరొక అర్థం కూడ చెప్పవచ్చు. ఈ సాధనాల పెరుగుదల అంతా సామ్రాజ్యవాద బూర్జువావర్గమూ, దాని స్థానిక దళారులూ తమ మార్కెట్ ను విస్తరించుకుంటున్నారనడానికి సూచన మాత్రమే కావచ్చు.

కొన్ని భూస్వామ్య శక్తులు పెట్టుబడిదారీ మార్కెట్ చలామణీ చట్రంలోకి చేరిపోవడానికి సమాంతరంగానే, దానితోపాటే మధ్యతరగతి రైతులు పేదరైతులుగా, పేదరైతులు వ్యవసాయ కార్మికులుగా మారిపోయే ప్రక్రియ కూడ జరుగుతోంది. అందువల్ల వ్యవసాయంలోకి చలామణీ చట్రం ప్రవేశం పెరిగినకొద్దీ, వ్యవసాయ కార్మికులు మరింత ఎక్కువ మంది తయారుకావడం యాదృచ్ఛికం కాదు. వ్యవసాయ కార్మికులు తప్పనిసరిగా పెట్టుబడిదారీ స్వభావానికి ప్రాతినిధ్యం వహించే మాట నిజమే, కాని వారు పెట్టుబడిదారుకు అదనపు విలువ అందజేసే వనరుగా ఉన్నప్పుడు మాత్రమే వారిని అలా చూడవలసి ఉంటుంది.

ఈ వ్యాసం నాలుగో భాగంలో చూసినట్టుగా నిరుద్యోగ వ్యవసాయ కార్మిక జనాభా అదనపు విలువ సృష్టికీ, సంచయన క్రమానికీ వనరుగా ఉపయోగపడడం లేదు. ఎందుకంటే ఇటు వ్యవసాయంలోనూ అటు పరిశ్రమలోనూ కొత్త ఉత్పత్తికి దారితీస్తున్న సాంకేతిక పునాదికి ఈ వ్యవసాయ కార్మికులతో పని లేదు. లేదా అతి తక్కువ పని ఉంది.

మూడో భాగంలో చూసినట్టుగా ఈ వ్యవసాయ పేదలు వారి తక్కువ ఉద్యోగస్థాయి వల్ల, వారి తక్కువ ఆదాయం వల్ల స్థానిక దేశీయ మార్కెట్ ను సంతృప్తిపరిచే పని కూడ చేయలేకపోతున్నారు. అంటే పెట్టుబడి సంచయన క్రమాన్ని ఒక పెద్ద తోపు తోయగలిగే స్థితిలో కూడ వారు లేరు. తత్ఫలితంగా, చాల విచిత్రంగా, భారతీయ పెట్టుబడి విదేశీ మార్కెట్ కోసం వెతుకులాడుతూ ఉంటుంది. భారతీయ శ్రామికులు విదేశీ ఉద్యోగాల కోసం వెతుకులాడుతుంటారు.

గ్రామీణ భారతంలో శ్రామిక కుటుంబాల సమాచారం

| రాష్ట్రం | వయోజన ఉద్యోగ అంచనా (పని దినాలలో) | గ్రామానికి బయట ఉద్యోగం చేయడానికి ఆసక్తి చూపే కుటుంబాల శాతం | | | రుణభారం (రు.) | |
|---|---|---|---|---|---|---|
| | | ఉద్యోగ హామీ ఉన్నవి | ఉద్యోగ హామీ లేనివి | మొత్తం | పాత రుణం | ఈ సంవత్సరపు నికర రుణం |
| ఆంధ్రప్రదేశ్ | 250 | 20.78 | 7.33 | 28.11 | 260 | +94 |
| అసోం | 369 | 25.43 | 16.63 | 42.06 | 71 | +35 |
| బీహార్ | 273 | 21.07 | 5.73 | 26.80 | 63 | +71 |
| గుజరాత్ | 283 | 25.89 | 10.37 | 35.96 | 289 | +133 |
| హర్యానా | 431 | 44.72 | 9.44 | 54.16 | 729 | –76 |
| జమ్మూ కాశ్మీర్ | 586 | 35.95 | 7.11 | 43.06 | 102 | +125 |
| కేరళ | 323 | 43.07 | 2.73 | 45.80 | 143 | +155 |
| మధ్యప్రదేశ్ | 243 | 25.49 | 5.64 | 31.13 | 253 | +91 |
| మహారాష్ట్ర | 261 | 23.81 | 9.82 | 33.63 | 77 | +39 |
| మైసూర్ | 228 | 20.47 | 5.14 | 25.61 | 280 | +66 |
| ఒడిశా | 228 | 21.76 | 6.05 | 27.81 | 106 | +55 |
| పంజాబ్ | 397 | 48.19 | 5.54 | 53.73 | 568 | +233 |
| రాజస్థాన్ | 233 | 17.34 | 6.28 | 23.62 | 424 | +105 |
| తమిళనాడు | 226 | 23.53 | 5.71 | 29.24 | 175 | +50 |
| ఉత్తర్‌ప్రదేశ్ | 234 | 32.25 | 4.57 | 36.82 | 321 | +124 |
| పశ్చిమ బెంగాల్ | 329 | 38.91 | 7.60 | 46.52 | 46 | +30 |
| **భారతదేశం** | **269** | **27.24** | **7.04** | **34.28** | **210** | |

మూలం: ఎన్.ఎస్.ఎస్. రిపోర్ట్ నం. 233, 234, 241, వాల్యూం 1, 241 వాల్యూం 2

గమనిక : 1971–72 కు సంబంధించిన ఈ జాతీయ నమూనా సర్వే నివేదిక 234 భారత ప్రభుత్వం 1978లో అచ్చు వేసింది..

అలాగే, రెండో భాగంలో చెప్పినట్టు, భారతీయ రంగస్థలం మీదికి పెట్టుబడి ప్రవేశం దానితోపాటు పెట్టుబడిదారీ ఉపరితలాన్ని తీసుకు రాలేదు. పాత ఉపరితలాన్ని యథాతథంగా కొనసాగనిచ్చించి. ఆ పాత ఉపరితలానికి దాని పెట్టుబడిదారీ పూర్వ సంబంధాలు తొలగిపోలేదు. మరొకపక్క దానికి వలసవాదం సృష్టించిన వ్యవస్థలతో కూడ సంబంధం తెగలేదు. తత్ఫలితంగా వృద్ధికోసం వలసవాద వ్యవస్థలమీద, స్థిరత్వం కోసం పెట్టుబడిదారీ పూర్వ వ్యవస్థలమీద మరింత ఎక్కువగా ఆధార పడవలసి వస్తోంది. అందువల్ల పునాదికీ ఉపరితలానికీ మధ్య తీవ్రమైన వైరుధ్యం తలెత్తుతోంది.

అంటే వ్యవసాయ సంబంధాలలో 'ఏమి జరుగుతున్నదో' అధ్యయనం చేయాలంటే 'ఆర్థిక ప్రత్యయాల' అధ్యయనాన్ని మించినదేదో జరగాలి. అది ఆ సందర్భాన్ని, నేపథ్యాన్ని, పూర్వరంగాన్ని అధ్యయనం చేయడం. ఆ పూర్వరంగాన్ని గురించి మాట్లాడకుండా ఎంత చర్చ చేసినా, ఆ చర్చ వేడిగా జరగవచ్చుగాని దానికి జీవం ఉండదు. నావరకు నాకు ఆ వ్యవసాయ పూర్వరంగాన్ని వాస్తవికంగా చూసిన అనుభవం లేదు. కేవలం గణాంక ప్రతిఫలనాల నుంచి మాత్రమే చూశాను. అందువల్ల ఆ వాస్తవికతను ఎలా సూత్రీకరించాలనే విషయాన్ని ఆ వాస్తవికతను చూసిన మేధావులకే వదిలేయడం ఉచితం.

ఈ వ్యాసాన్ని క్రోడీకరించడానికి బదులుగా, ఆ వాస్తవికతను పట్టుకున్న రెండు నివేదికలను చూద్దాం.

**6**

'ఆంధ్రప్రదేశ్ లో వ్యవసాయ సంబంధాలు' అనే అంశం మీద సిద్ధాంత పత్రం రాస్తున్న పరిశోధకులొకరు ఆ సిద్ధాంత పత్రం సారాంశంలో ఆ పూర్వరంగాన్ని ఇలా చెప్పారు:

'భూపరిమితి చట్టాల అమలు, కౌలుదార్ల ఉనికి, వ్యవసాయ కార్మికుల సంఘ నిర్మాణాలు, భూసంస్కరణల తర్వాత భూకమతాల

**ప్రత్యామ్నాయ ఉద్యమాలు ఈ దేశంలోని ఉత్పత్తి సంబంధాలను విశ్లేషిస్తూ చేసుకున్న సూత్రీకరణను మారిన పరిస్థితుల్లో పునర్నిర్వచించుకోవాల్సిన అవసరం ఉందని అంటున్నారు రమేష్ పట్నాయక్**

# భారతదేశంలో భూస్వామ్య విధానం ఉందా?

*(గత సంచిక తరువాయి...)*

వస్తురూపంలో కౌలు – సాపేక్ష స్వేచ్ఛ : భూస్వామ్య కౌలు రెండవ దశలో రైతు తన స్వాధీనంలో ఉన్న భూమిలో పంట పండించి పంటలో నిర్దిష్ట భాగాన్ని భూస్వామికి కౌలుగా చెల్లిస్తాడని చూసాం. ఈ స్థితిలో భూస్వామి తన డిమిస్నీలో వెట్టి చేసే వారెవరూ లేకపోవడం వలన డిమిస్నీ భూములను కూడా కౌలుకిచ్చేవాడు. అయితే డిమిస్నీ భూములపై రైతు భూముల మీద కంటె ప్రతి ఎకరాకు ఎక్కువ కౌలు వచ్చి ఉండవచ్చు. ఈ విషయాన్ని విడిచిపెడితే వెట్టి మానివేసి తన స్వాధీనంలో ఉన్న భూమిలో పండించిన పంటలో కొంత భాగాన్ని అద్దెగా చెల్లించిన రైతు సాపేక్షంగా ఎంతో స్వేచ్ఛననుభవించాడు. ఈ రైతు తన స్వాధీనంలో ఉన్న భూమిలో తను నిర్దేశించుకున్న పద్ధతిలో ఉత్పత్తి చేసేవాడు. కౌలు పోనూ మిగిలిన పంటను స్వంతం చేసుకునే వాడు. అయితే ఈ రూపంలో కూడా అదనపు ఉత్పత్తి భూస్వామికి చెల్లించి వేయడంతో రైతు కుటుంబ అభివృద్ధికి, వ్యవసాయం అభివృద్ధికి తగినంత అవకాశం ఉండేది కాదు. ఏదేమైనా మొదటి దశ కంటె ఈ దశలో రైతు అభివృద్ధి చెందాడు. ఉత్పత్తి సాధనాలు, పద్ధతులు, ఉత్పత్తి అభివృద్ధి చెందాయి. రైతుకు ఉత్పత్తి ప్రక్రియలో సాపేక్షంగా వచ్చిన స్వేచ్ఛ అందుకు ప్రధాన కారణం. ఈ దశలో పట్టణ పరిశ్రమలు కూడా అభివృద్ధి చెందాయి. రైతుకు మరింత స్వేచ్ఛ ఇచ్చే తరువాత దశలోనికి వెళ్లడానికి అవసరమైన రాజకీయ పోరాటాలకు కావలసిన పరిస్థితులను కూడా ఈ దశ రైతుకు అందించింది.

'వస్తు రూప కౌలు ప్రత్యక్ష ఉత్పాదకుని మరింత ఉన్నతమైన నాగరిక దశను కోరుతుంది. అంటే అతని శ్రమ అభివృద్ధి స్థాయి, సార్వత్రికంగా సామాజిక స్థాయి మరింత ఉన్నత స్థాయిలో ఉండాలి. ఇంతకు ముందున్న రూపం కంటె ఈ రూపం భిన్నమైనది. ఇక్కడ అదనపు శ్రమ దాని సహజ రూపంలో నిర్వహించాల్సిన అవసరం లేదు. అంటే భూస్వామి గాని, అతని ప్రతినిధి గాని ప్రత్యక్ష తనిఖీ లేదా బలవంతం చేయనవసరం లేదు.. ఉత్పత్తి దారుడు (రైతు).. పరిస్థితుల ప్రాబల్యం ('పరిస్థితుల ప్రాబల్యం' వలన అంటే భూస్వాముల చేతిలో రాజ్యాధికారం ఉండడం వలన అని గ్రహించాలి) వలన తన స్వంత భూమిలో సాధించే అదనపు ఉత్పత్తిని (భూస్వామికి దఖలు పరుస్తారు.)'
**– కార్ల్ మార్క్స్**, క్యాపిటల్ (3వ సంపుటి, భూమి కౌలు, అధ్యాయం)

### డబ్బు రూపంలో కౌలు – అస్థిరత్వం పాలైన భూస్వామ్య వ్యవస్థ

ఇంతకు ముందు చెప్పినట్లు భూస్వామ్య వ్యవస్థలో కౌలు మూడవ రూపం డబ్బు రూపం. రైతు తన స్వాధీనంలో ఉన్న భూమిలో పంట పండించి అందులో కొంత పంట మార్కెట్‌లో అమ్మి భూస్వామికి కౌలు చెల్లించవలసి ఉండేది. రెండవదశలో పంటలో మూడవ భాగాన్ని కౌలుగా చెల్లిస్తున్నట్లయితే ఇప్పుడు అదే పంటను మార్కెట్లో అమ్మి వచ్చిన డబ్బును భూస్వామికి కౌలుగా చెల్లించవలసి ఉంటుంది. (డిమిస్నీ భూములలో కౌలు గురించి మరొక దగ్గర ప్రస్తావించబడింది. ఇక్కడ ప్రధానంగా రైతుభూముల గురించే చర్చిస్తున్నాం). అయితే క్రమంగా ఈ పరిస్థితి

---

పంపిణీ వంటి సున్నితమైన సమస్యల గురించి ఈ గ్రామాలలో ప్రధాన వ్యక్తులతో మాట్లాడడం, సమాచారం రాబట్టడం జరిగింది. కాని గ్రామంలో ప్రస్తుతం ఉన్న సామాజిక రాజకీయ అధికార వ్యవస్థ వల్ల ఈ సున్నితమైన, వివాదాస్పదమైన అంశాల మీద విశ్వసనీయమైన సమాచారాన్ని సేకరించడం కష్టం గనుక సమగ్రమైన, వివరమైన విశ్లేషణ జరపడానికి వీలు లేకపోయింది.'

గూడ అంజయ్య అనే మరొక మేధావి తెలుగులో ఒక పాట రాశారు. ఆ పాట తెలంగాణ రైతాంగంలో చాల ప్రాచుర్యం పొందింది. ఆ పాటలో ఒక చరణం 'ఊరు మనదిరా, వాడ మనదిరా, నడుమ దొర ఏందిరో, దొర పెత్తనమేందిరో...' అని ఉంటుంది.

*(అయిపోయింది)*

*పాదసూచికలు :*

*16. జాతీయ నమూనా సర్వే రూపొందించిన అధికారిక వర్గీకరణలో సాగుదార్లు, సాగుదార్లు కానివారు (నాన్ కల్టివేటర్స్) అనే విభజన ఉంయుంది. ఈ సాగుదార్లు కానివారిలో వ్యవసాయ కార్మికులు, చేతివృత్తుల వారు, ఇతర కుటుంబాల వారు ఉంటారు.*

*17. మొత్తం పెట్టుబడిలో స్థిర పెట్టుబడి (భవనాలు, యంత్రాలు, ముడి సరుకులు, ఇంధనాలు, వగైరాలకు వెచ్చించే పెట్టుబడీ), కీ, అస్థిర పెట్టుబడి (కార్మికుల జీతాలకు వెచ్చించే పెట్టుబడి) కీ మధ్య నిష్పత్తిని పెట్టుబడి అంగనిర్మాణం అంటారు. ఘనంగా నిర్మాణం అంటే పెట్టుబడిలో స్థిర పెట్టుబడి ఎక్కువ కావడం.*

*18. విశ్వంలో వెలుగును ఆకర్షించి తమలో జీర్ణం చేసుకుని బయటికి ప్రతిఫలించే ప్రాంతాలు ఉన్నాయని గుర్తించిన భౌతిక శాస్త్రం వాటిని బ్లాక్‌హోల్స్ (కృష్ణబిలాలు) గా పిలుస్తోంది.*

*19. జపాన్‌లో 1866–68 మధ్య జరిగిన విప్లవం, పునరుద్ధరణ, సంస్కరణల ప్రక్రియ మెయిజి చక్రవర్తికి రాజ్యాధికారాన్ని కట్టబెట్టింది. ఆ పరిణామమే జపాన్ పారిశ్రామికీకరణకూ, మార్కెట్ విత్తనాలకూ, మార్కెట్ విస్తరణకూ, అమరికాతో పోటీకీ మార్గం సుగమం చేసింది.*

వీ

మారింది. చెల్లించవలసిన కౌలుకు, పండించిన పంట పరిణామానికి సంబంధం తెగిపోయాయి. ఎకరా భూమిలో పండిన పంట పెరిగినా, అంటే ఉత్పాదకత పెరిగినా చెల్లించవలసిన కౌలు మాత్రం పెరగలేదు. డబ్బు రూపంలో ఎకరాకు కౌలు ఇంత అని స్థిరపడిపోయింది. రైతులు ఎన్నో పోరాటాలు చేసి అద్దె చెల్లించే పద్ధతిలో ఈ మార్పును సాధించినట్లు చరిత్ర చెప్తుంది. వ్యవసాయ ఉత్పత్తుల ధరలు పెరిగిన కొద్దీ కౌలుగా నిర్ణయించబడిన డబ్బు విలువ పంటలో వాటా విలువ కంటె అధికాధికంగా తగ్గిపోతూ వచ్చింది. అయితే కౌలును పెంచాలని పాలకవర్గం ప్రయత్నించింది. కాని అప్పటికే అనేక పోరాటాలలో రాటుదేలి సంఘటిత పడిన రైతులు అటువంటి ప్రయత్నాలను నిలువరించగలిగారు. సాపేక్షంగా తక్కువ కౌలుతోనే భూస్వాములు సంతృప్తి పడవలసి వచ్చింది. అయితే వారి జమీందారీలో ఇతర పన్నులు, పాలితులు చేసే 'నేరాలపై' జుర్మానాలతో వారు ఈ లోటు తీర్చు కోవడానికి ప్రయత్నించే వారు. ఒకానొక దశలో భూస్వాములకు కౌలు కంటే ఇతర జమీందారీ రాబడులే అధికమైనాయి. మొత్తం పైన భూస్వామ్య వర్గం బలహీన పడింది. ఒకవైపు రైతుల పోరాటాలు, రెండవ వైపు పట్టణాలలో మార్కెట్ల విస్తరణ మందుకు దారితీశాయి.

*'వస్తు కౌలు డబ్బు కౌలుగా, రూపాంతరం చెందడం అన్నది మొదట అక్కడక్కడా జరుగుతుంది. తరువాత జాతీయ స్థాయిలో జరుగుతుంది. దీనికి వాణిజ్యమూ, నగర పరిశ్రమ సార్వత్రిక సరుకు ఉత్పత్తీ, డబ్బు చెలామణీ గణనీయంగా అభివృద్ధి చెందాల్సి ఉంటుంది.'*
***– కార్ల్ మార్క్స్,** (711, 3వ సంపుటి, క్యాపిటల్, విశాలాంధ్ర ప్రచురణ)*

డబ్బు రూపంలో కౌలు, సరుకుల ఉత్పత్తి, మార్కెట్ల విస్తరణ భూస్వాములను బలహీనపరచడమే గాక రైతుల ఉనికిని కూడా మార్చి వేశాయి. కొందరు రైతులు భూస్వామికి కొంత ముదరా చెల్లించి స్వతంత్ర రైతులయ్యారు (ఫ్రీహోల్డ్). ఈ స్వతంత్ర రైతులలో కొద్దిమంది ఇతరుల భూమిని కూడా 'స్వంతం' చేసుకుని, ధనిక రైతులయ్యారు. రైతులలో అత్యధికులు భూమిలేని కూలీలయ్యారు. ఈ విధంగా అస్వతంత్ర రైతులు ధనిక రైతులుగా, వ్యవసాయ కూలీలుగా రెండు వర్గాలుగా విడిపోయారు. భూమిలేని కూలీలు ధనిక రైతుల వద్ద కూలీలుగా కుదురుకున్నారు. ఇప్పుడు వ్యవసాయ కూలీ సృష్టించే అదనపు విలువను ధనిక రైతు కొల్లగొడుతున్నాడు. అందులో కొంత భాగాన్ని – సంవత్సరానికి సంవత్స రానికి తగ్గే భాగాన్ని – భూస్వామికి కౌలుగా చెల్లిస్తున్నారు. 'అదనపు విలువ'లో అధిక భాగాన్ని వ్యవసాయ రంగంలో, ఇతర రంగాలలో పెట్టుబడిగా ఉపయోగిస్తున్నారు. ఈ విధంగా రైతుల స్వాధీనంలో ఉండిన భూమి వారి నుంచే ఉద్భవించిన కొద్దిమంది ధనిక రైతుల చేతిలోనికి వెళ్లిపోగా భూస్వామి డిమిస్నీ భూముల్లో కూడా మార్పులు త్వరితగతిని చోటు చేసుకున్నాయి. భూస్వామ్య వ్యవస్థ రెండవ దశలో భూస్వామి డిమిస్నీ పై పేదరైతులే కౌలు చేసేవారు. వారు మొదట మొత్తం 'అదనపు ఉత్పత్తి'ని, తరువాత అంటే మూడవ దశ ప్రారంభంలో డబ్బు రూపంలో మొత్తం అదనపు ఉత్పత్తి విలువను భూస్వామికి కౌలు రూపంలో చెల్లించే వారు. మూడవదశలో కాలం గడిచేకొద్ది డిమిస్నీ భూములలో పేదరైతుల స్థానంలో కొత్తగా ఉద్భవించిన ధనిక రైతులు, పట్టణాల నుండి దిగబడిన పెట్టుబడిదారులు కౌలు చేయడం ప్రారంభిం చారు. వీరు ఉత్పాదకతను బాగా పెంచారు. వీరు కూలీలను, ఆధునిక వ్యవసాయ పద్ధతులను ప్రవేశపెట్టారు. వీరు భూస్వామికి చెల్లించే కౌలు డబ్బు పరిమాణంలో తగ్గి ఉండకపోవచ్చుగాని పంటలో వాటాగా లేదా అట్టి వాటా విలువగా చూసుకుంటే క్రమంగా తగ్గిపోయింది. ఈ విధంగా రైతు భూములలోనూ, డిమిస్నీ భూములలోనూ ధనిక రైతులు లేదా పెట్టుబడిదారులు వ్యవసాయం చేయనారంభించారు. వీరు కూలీలకు వేతనాలు ఇచ్చారు. అదనపు విలువలో కొంత భాగాన్ని కౌలుగా చెల్లించారు. అత్యధిక భాగాన్ని లాభంగా తీసుకుని పెట్టుబడులు పెంచుకున్నారు.

ఇప్పుడు ఈ ధనిక రైతులు లేదా పెట్టుబడిదారీ కౌలుదారులు భూస్వాములకు చెల్లించే కౌలు, డబ్బు రూపంలో కౌలు ప్రారంభమైన తొలి దినాలలో అస్వతంత్ర రైతులు చెల్లించే కౌలుతో ఎంత మాత్రమూ సరిపోలదు. అప్పుడు అస్వతంత్ర రైతు అదనపు ఉత్పత్తి విలువనంతా కౌలుగా చెల్లించాడు. కాగా ఇప్పటి ధనిక రైతు లేదా పెట్టుబడిదారీ కౌలుదారుడు అదనపు విలువలో 'సాధారణ లాభాలు' పోను మిగిలిన భాగమే కౌలుగా చెల్లిస్తున్నాడు. కాబట్టి మూడవ దశలో, ప్రారంభ దినాలలో అస్వతంత్ర రైతులు చెల్లించే మొత్తం 'అదనపు విలువ'గా ఉండిన కౌలు అదే దశ చివరి దినాలలో ధనిక రైతులు, పెట్టుబడిదారీ కౌలుదారులు చెల్లించే అదనపు విలువలో 'సాధారణ లాభాలు పోనూ మిగిలిన భాగంగా దిగజారింది. ఈ దశలో వ్యవసాయ కూలీ, పెట్టుబడిదారీ కౌలుదారుడు, భూస్వామి అనే వర్గాల మధ్య త్రిముఖ ఉత్పత్తి సంబంధాలు కనిపిస్తాయి. అయితే కౌలు వసూలు చేసుకోవడం తప్ప ఉత్పత్తితో ఎటువంటి సంబంధం లేని ఈ భూస్వామ్య వర్గాన్ని, తదనంతర కాలంలో, ఐరోపా చరిత్ర తొలగించి వేసింది. ఆ విషయం పక్కన పెడితే ఇక్కడ ప్రధానమైన విషయమేమంటే వ్యవసాయ అదనపు విలువలో అత్యధిక భాగం (జాతీయ స్థాయిలో పెట్టుబడులపై వచ్చే సాధారణ లాభాలతో సమానమైన భాగం) పెట్టుబడిదారీ కౌలుదారుడు హస్తగతం కాగా సాపేక్షంగా తక్కువ భాగం మాత్రమే భూస్వామికి చేరేది. అది ఆనాటి ఐరోపా పరిస్థితి. దీనికి నేటి భారతదేశ పరిస్థితికి వ్యత్యాసం కనిపిస్తుంది. నేడు భారతదేశంలో పేద కౌలుదారీ రైతులు సుమారు అదనపు విలువనంతా భూ యజమానులకు చెల్లిస్తున్నారు. ఆ కారణంగా భారతదేశంలో ప్రస్తుతం కౌలుదోపిడీని భూస్వాములు కౌలు దోపిడీగా ఎం.ఎల్. పార్టీలు, కొద్దిమంది వామపక్ష మేధావులు భావిస్తున్నారు. ఆ విధంగా పరిగణించడం ఏ విధంగా సరియైనది కాదో మరొక్క దగ్గర వివరంగా చర్చించవచ్చు. ప్రస్తుతానికి ప్రతిపాదిత మూడు దశలపై చర్చను కొనసాగినిద్దాం.

## భూస్వామ్య వ్యవస్థ మూడు దశలు – తులనాత్మక పరిశీలన

ఈ విధంగా మనం పరిశీలించినపుడు భూస్వామ్య కౌలు మూడు రూపాలలో దోపిడీ ఉంది. మూడు రూపాలలో అస్వతంత్ర రైతు 'అదనపు శ్రమ', 'అదనపు ఉత్పత్తి' లేదా అదనపు ఉత్పత్తి విలువ భూస్వామికి చెల్లించాడు. అయితే కౌలు శ్రమగా చెల్లించబడినప్పుడు రైతు వెట్టి చేస్తూ అర్ధబానిసగా జీవించాడు. కౌలు 'అదనపు' ఉత్పత్తిగా చెల్లించబడి నప్పుడు రైతు సాపేక్షంగా స్వేచ్ఛను, అభివృద్ధిని సాధించాడు. కౌలు డబ్బు రూపంలో చెల్లించినప్పుడు అది భూస్వామ్య విధానాన్నే అస్థిర పరచడానికి దోహదమయింది. ఈ డబ్బు రూపంలో కౌలు అస్వతంత్ర రైతుల స్థానంలో వ్యవసాయ కూలీలను, పెట్టుబడిదారీ రైతులను రంగం మీదికి తీసుకువచ్చింది. భూస్వాములు తమకందే కౌలు క్రమంగా తీసికట్టు కావడంతో వారు పెట్టుబడిదారులుగా తమ సామాజిక స్థానాన్ని పునర్నిర్మించుకున్నారు లేదా పూర్తిగా దివాళా తీశారు. చివరికి విప్లవాలలో అధికారాన్ని కోల్పోయి తుడిచిపెట్టుకుపోయారు. అందుకే కౌలు రూపాలలో ఉన్న వ్యత్యాసం చాలా ప్రధానమయినది మాత్రమే కాదు, అది చారిత్రక గతిని కూడా సూచించేది. భూస్వామ్య ఆర్థిక వ్యవస్థలో వచ్చిన ఏయే మార్పులు కౌలు రూపాలలో ఈ మార్పులకు కారణమయ్యాయి అనే విషయాన్ని మనం ఇక్కడ చర్చించడం లేదు.

ఈ మూడు రూపాలలో ఉన్న వ్యత్యాసాన్ని, వాటి చారిత్రక స్థానాలను దృష్టిలోనికి తీసుకోవడమే మన ఉద్దేశ్యం.

ఈ వ్యాసంలో భూస్వామ్య వ్యవస్థలో మూడు దశలున్నట్లు పేర్కొన్నాం. మార్క్స్ కౌలు మూడు రూపాల కాలాలను మూడు దశలుగా పేర్కొనలేదు. కాని భూస్వామ్య కౌలు కాలక్రమంలో అదనపు శ్రమనుండి, అదనపు ఉత్పత్తికి, చివరిగా అదనపు ఉత్పత్తి విలువకు (డబ్బుకు) మారడాన్ని అట్టి మార్పులకవసరమైన పరిస్థితులను, అంతేకాక అట్టి మార్పుల పర్యవసానాన్ని వివరిస్తాడు. కార్ల్‌మార్క్స్ భూమికౌలు అధ్యాయం చదివినప్పుడు భూస్వామ్య వ్యవస్థలో మూడు దశలున్నట్లు మనకు స్పష్టంగా కనిపిస్తుంది. అయితే ప్రతి దేశంలోనూ ఈ మూడు దశలు ఉండనవసరం లేదు. కాని మూడు దశలున్నప్పుడు అవి ప్రధానంగా ఆ క్రమంలోనే ఉంటాయి. తూర్పు ఐరోపాలో 15వ శతాబ్దంలో కౌలు మూడవ రూపం నుండి మొదటి రూపానికి మారినా అది తాత్కాలిక వెనుకబాటే, తరువాత శతాబ్దాలలో తూర్పు ఐరోపా తిరిగి మూడవ దశలోనికి, సాధారణ చరిత్ర గమనంలోనికి వచ్చింది. మూడవ దశలో కౌలు, మొత్తం అదనపు ఉత్పత్తి విలువ నుంచి అదనపు విలువలో ఒక భాగానికి, 'సాధారణ లాభాలు' మినహాయించబడిన భాగానికి కుదించ బడడం కూడా, కనీసం ఐరోపాలో, సార్వత్రికమైనదిగా చెప్పవచ్చు.

ఈ మూడు దశల ప్రతిపాదనకు మరొక్క మద్దతు చరిత్రలోనే లభ్యమవుతుంది. ఇందులో మొదటి దశ: వెట్టి చాకిరీ దశ. భూస్వామ్య వ్యవస్థ ముందటి వ్యవస్థ అయిన బానిస వ్యవస్థతోనూ, చివరి దశ: డబ్బు రూపంలో కౌలు చెల్లించే దశ భూస్వామ్య వ్యవస్థ తరువాత వ్యవస్థ అయిన పెట్టుబడిదారీ వ్యవస్థతోనూ పోలికలు కలిగి ఉండడం యాదృచ్ఛికంకాదు. భారతదేశం విషయానికి వస్తే బానిస వ్యవస్థ గాని, భూస్వామ్య వ్యవస్థలో మొదటి దశ అయిన అర్ధబానిస వ్యవస్థ (ఉత్పత్తిలో వెట్టిచాకిరి ప్రధాన అంశంగా) గాని లేవనే అభిప్రాయం ఉంది. భారత దేశంలో దోపిడీ వర్ణ – కుల రూపాలలో సాగిన విషయం తెలిసిందే. అయితే భారత చరిత్ర భూస్వామ్య విధానం రెండవ దశ నుండి అంటే వస్తురూపంలో కౌలు దశ నుండి ఐరోపా చరిత్రతో సామ్యం చూపిస్తుంది. ఇప్పుడు భారతదేశంలో వస్తూరూపంలో కౌలు, డబ్బు రూపంలో కౌలు రెండూ కలగలిసి ఉన్నాయి. సరుకుల (కమొడిటీస్) ఉత్పత్తి విస్తృతంగా సాగిన నేపథ్యంలో వస్తు రూపంలో కౌలు డబ్బు రూపంలో కౌలుకు మారు రూపంగానే భావించవలసి ఉంటుందని మార్క్స్ చెప్తాడు. భారతదేశంలో నేడు సరుకుల ఉత్పత్తి ప్రధానమైనదిగా భావిస్తే కౌలు వస్తు రూపంలో చెల్లించబడినా దానిని మార్క్స్ చెప్పినట్లు డబ్బు మారు రూపంగానే అంగీకరించవచ్చు. అయితే మార్క్స్ చెప్పిన దానికి విరుద్ధంగా మనదేశ ఎం.ఎల్. పార్టీల నాయకులు డబ్బు రూపంలో కౌలును వస్తు రూపంలో కౌలుకు మారు రూపంగా భావిస్తున్నారు. మార్క్స్ విశ్లేషణలను అప్రకటితంగా, అనాలోచితంగా కూడా కావచ్చు, వ్యతిరేకిస్తున్నారు.

*'పెట్టుబడిదారీ ఉత్పత్తి ప్రాతిపదికపైన ధాన్యం కౌలు ఇంకా కొనసాగుతూనే ఉంటే అది డబ్బు కౌలుకి మధ్యయుగాల ముసుగులో ఉండే వ్యక్తీకరణ తప్ప మరొకటి కాదు, కాజాలదు'*

**కార్ల్‌మార్క్స్,** కాపిటల్, మూడవ సంపుటి, 47వ అధ్యాయం

## రైతు స్వాధీనంలో భూములు – డిమిస్నీ భూములు

భూస్వామ్య వ్యవస్థ రెండవ దశలో అంటే కౌలు పంట / వస్తు రూపంలో చెల్లించబడినప్పుడు భూస్వామి డిమిస్నీ భూములపై వ్యవసాయం పాత పద్ధతిలో అంటే, వెట్టిశ్రమ ద్వారా సాధ్యం కాలేదు. ఈ దశలో భూస్వాములు భూమిలేని రైతు బిడ్డలకు, లేదా భూమి తక్కువ ఉన్న రైతు కుటుంబాలకు తన డిమిస్నీ భూములను ప్రత్యేక కౌలు ఒప్పందం ద్వారా ఇచ్చేవారు. అయితే ఇటువంటి కౌలు ఒప్పందాలు దీర్ఘకాలం ఒప్పందాలుగా ఉండేవి. భూస్వామ్య వ్యవస్థ మూడవ దశలో అంటే డబ్బు రూపేణా కౌలు చెల్లించబడే దశలో ఈ డిమిస్నీ భూములలో వ్యవసాయం నిర్వహించడానికి పట్టణాల నుండి పెట్టుబడిదారీ కౌలుదారులు కూడా దిగబడ్డారు. వీరు అత్యధిక సందర్భాలలో ఎనిమిది సంవత్సరాల ఒప్పందం చేసుకున్నట్లు తెలుస్తుంది. ఈ మూడవ దశలో కౌలు క్రమంగా తగ్గిపోయిన విషయాన్ని ఇంతకముందు పరిశీలించాం. ఇక్కడ ఒక విషయం గమనించాలి. మూడవ దశలో భూస్వామి డిమిస్నీ భూములలో వ్యవసాయం సాంప్రదాయక కౌలు పద్ధతుల కంటె ప్రత్యేకమైన కౌలు ఒప్పందాలపై ఆధారపడి మాత్రమే జరిగేది, కాగా జమీందారీ రైతుల స్వాధీనంలో ఉండే ఇతర భూములపై కౌలు దాని రూపం ఏదైనా సాంప్రదాయ దాస్య స్థితి వలననే చెల్లించబడింది. డిమిస్నీ భూములపై కౌలు భూమి, పెట్టుబడుల సప్లై డిమాండ్ పరిస్థితులపై ఆధారపడి నిర్ణయమయ్యేది. కాగా, రైతు భూములపై కౌలు పరిమాణం శత్రువర్గాల బలాబలాల సమతూకంతో ప్రభావితమయ్యేది. అస్వతంత్ర రైతులు డబ్బు రూపంలో కౌలు చెల్లించిన దశలో కౌలు డబ్బు రూపంలో ఇంత అని స్థిరంగా ఉన్నా, దానిని ఉత్పత్తిలో వాటాగా చూసుకుంటే తగ్గిపోతూ ఉండడాన్ని గమనించాం. అలా తగ్గిపోవడానికి కారణం వర్గ బలాబలాల సమతూకంలో వచ్చిన తేడాయేనని గుర్తించాలి. అందుకే డబ్బు రూపంలో కౌలును పెంచాలని ప్రయత్నించిన భూస్వాములు రైతుల వ్యతిరేకత వలన అవా చేయలేకపోయారు. ఇంతకు ముందు చెప్పుకున్నట్లు డిమిస్నీ భూములపై వ్యవసాయం చేసే రైతులు, పెట్టుబడిదారీ కౌలుదారులు చెల్లించే కౌలు ఈ తరహాకి చెందింది కాదు. ఇది వర్గ బలాబలాలపై కంటె శ్రమ, భూమి, పెట్టుబడుల సప్లై డిమాండ్‌లపై పాక్షికంగా ఆధారపడుతుంది. ఈ సప్లై డిమాండ్ పరిస్థితి అదనపు ఉత్పత్తి లేదా అదనపు విలువలో ఎంత భాగం కౌలుగా చెల్లించాలనే దానిని నిర్ణయిస్తుంది. కాబట్టి మూడవదశలో ఒకవేపు డిమిస్నీ భూములపై కౌలురేట్లు, రెండవ వైపు రైతుల భూములపై కౌలు రేట్లు క్రమంగా తగ్గిపోతూ వచ్చినా ఆ రెండు కౌళ్లు ఒకే ఉత్పత్తి సంబంధాలను చూపించలేదని గ్రహించాలి.

జమీందారీలో అస్వంత్ర రైతులు చెల్లించే కౌలు వారి అస్వతంత్రతకు వ్యక్తీకరణ కాగా, డిమిస్నీ భూములపై పెట్టుబడిదారీ కౌలుదారులు చెల్లించే కౌలు ఒక ఆధునిక పెట్టుబడిదారీ కాంట్రాక్టు లక్షణం కలిగి ఉంటుంది. అదలా ఉండగా ఈ దశలో అస్వతంత్ర రైతులలో ఆర్థికంగా అభివృద్ధి చెందిన వారు భూయజమానికి ఎంతో కొంత ముదరా ఇచ్చి స్వతంత్ర రైతులైనారు. అనేకమంది అస్వతంత్ర రైతులు భూమిపై తమకున్న సంప్రదాయమైన హక్కులను కూడా కోల్పోయి వ్యవసాయ కూలీలై పోయారు. ఫలితంగా ఈ రెండు రకాల కౌలు ఎక్కువ కాలం సహజీవనం చేయలేదు. కాగా అవి రెండూ ఉనికిలో ఉన్న కాలంలో పరస్పరం ప్రభావితం చేసుకుని ఉంటాయన్నది ఇక్కడ అప్రస్తుతం. నేడు భారతదేశంలో భూయజమానులకు పేద రైతులు చెల్లించే కౌలు పరిమాణం సంప్రదాయంగా నిర్ణయించబడడం కంటె భూమి, కౌలుదారుల సప్లై, డిమాండ్‌లపై ప్రధానంగా ఆధారపడి ఉన్న విషయాన్ని ఇక్కడ మనం ప్రధానంగా గుర్తించాలి. కౌలుకు ఈ సందర్భంలో కూడా గరిష్ఠ పరిమితి అదనపు విలువేనని వేరుగా చెప్పనవసరం లేదు.

*(ఇంకా వుంది)*

*(రచయిత విద్యా పరిరక్షణ కమిటీ నాయకులు)* వీ

*ప్రకృతికి లోబడి సాగే విధానాలతోనే వృక్ష, జంతుజాలాల ఉనికి కొనసాగుతుందని, ఉత్పత్తి విధానాలు లాభం కేంద్రంగా కాకుండా, సంక్షేమం కేంద్రంగా సాగాల్సి ఉందని అంటున్నారు* **ఎ. నరసింహారెడ్డి**

# పర్యావరణ విధ్వంసం మానవ మనుగడకు చేటు

ప్రపంచ ధరిత్రి దినోత్సవం మొదటిసారి 1970 ఏప్రిల్‌లో జరిగింది. ఆ తర్వాతనే పర్వత సానువుల విధ్వంసం, ఉష్ణప్రాంత అడవులు అంతరించిపోవడం, సముద్ర ప్రవాహాల దిశ మార్పు, ఓజోన్ పొర దెబ్బతినడం, గ్లోబల్ వార్మింగ్, సమశీతోష్ణమండల అడవుల నరికివేత, చిత్తడి భూముల నాశనం, భూమి కోత, అణుధార్మిక కాలుష్యం, ఎడారులు విస్తరించడం, భూగర్భ జలాలు అంతరించి పోవడం, కోరల్ రీఫ్‌ల నాశనం, పునరుత్పత్తి కాని వనరులు అంతరించిపోవడం, సముద్ర జలాలపై చమురు తెట్టు ఏర్పడడం, వ్యర్థపదార్థాలు పారవేసే విస్తీర్ణం పెరగడం, వాయు జలకాలుష్యాలు పెరగడం, అరుదైన ప్రాణులు అంతరించిపోవడం లాంటి ప్రమాదాల గురించిన చైతన్యం ప్రపంచ వ్యాప్తంగా పెరిగింది. ఈ విధ్వంసం ప్రభావం మెజారిటీ ప్రజల జీవితాలతో ముడిపడి ఉంది. నేడు ప్రతీజీవి శరీరంలోను,పారిశ్రామిక, వ్యవసాయ రసాయనాలు క్యాన్సర్ వ్యాధి కారకాలుగా శరీరంలోకి చొరబడ్డాయి.

జీవావరణాన్ని పరిరక్షించడంలో జరుగుతున్న ఈ వైఫల్యానికి మూలాలు పరిమిత వనరుల ప్రపంచంలో, లాభాపేక్షతో విస్తరిస్తున్నా ఆర్థిక వ్యవస్థలోనే ఉన్నాయి. పెట్టుబడిదారీ వ్యవస్థ ప్రకృతిని కూడ ఒక లాభసాటి వనరుగానే చూస్తోంది. పర్యావరణ పరిరక్షణ ఉద్యమకారులు 'పర్యావరణ సామాజిక సమస్యల' మధ్య గల అంతస్సంబంధాన్ని గుర్తించవలసి ఉంది. ఎందుకంటే ప్రస్తుత సంక్షోభం ప్రకృతి సంక్షోభం కాదని, అది సామాజిక సంక్షోభమని గుర్తించవలసి ఉంది. పర్యావరణంలో మానవ సంబంధం ఒక కీలకమైన అంశం. మానవ అవసరాలకు ఉపయోగపడకుండా భూగోళ వినాశనం దినదినం పెరిగిపోతోంది. అనేక అవసరాలకు తాను ఆధారపడ్డ ప్రకృతిని తానే అభివృద్ధి, ఆధునికత పేరుతో వేగంగా నాశనం చేస్తున్నాడు. ఫలితంగా ప్రకృతి మనుగడకే కాకుండా సమాజం మనుగడకు, ప్రగతికి ప్రమాదం ఏర్పడుతోంది.

1992లో 1575 మంది ప్రపంచ ప్రఖ్యాత శాస్త్రవేత్తలు ఉమ్మడిగా విడుదల చేసిన ప్రకటన సారాంశం ఇలా చెబుతోంది 'మానవులు, ప్రకృతితో ఘర్షణ పడే దిశగా చరిత్ర నడుస్తోంది. మానవ కార్యకలాపాలు పర్యావరణానికి పూరించలేని నష్టాన్ని కలుగచేస్తున్నాయి. ప్రస్తుత విధ్వంసక విధానాన్ని ఆపకపోతే మనం కోరుకొనే భవిష్యత్ సమాజం, వృక్షజాలం, జంతుజాలం ప్రమాదంలో పడతాయి. రాబోయే ప్రమాదాన్ని నివారించాలంటే తక్షణ మౌలిక మార్పులు అవసరం. 'ప్రపంచ శాస్త్రజ్ఞులు వాతావరణం, నేల,సముద్రం, అడవులు, జీవజాలం, జీవశాస్త్రం వంటి రంగాలపైన పర్యావరణం క్లిష్టమైన ఒత్తిడికి లోనవుతోందని నొక్కి చెప్పారు.

21వ శతాబ్ది చివరి నాటికి నేడు ఉన్న జీవజాతులలో మూడవ వంతు మాత్రమే మిగిలి ఉంటాయని తీవ్రమైన హెచ్చరిక చేసారు. నోమ్ చామ్‌స్కీ 'వ్యక్తిగత దురాశ, వ్యక్తిగత లాభమే ప్రధానంగా మనం పనిచేయడం కొనసాగిస్తే, ఉమ్మడి పర్యావరణం నాశనమ వుతుంది. ఇదే సంకుచిత దోపిడీ నీతి సామాజికార్థిక నిర్మాణంలో కొనసాగితే కొన్ని దశాబ్దాలలో ఈ భూమి మన జీవనాధారాలను ముందు తరాలకు అందించడం మానుకుంటుంది' అని హెచ్చరిక చేశాడు. ప్రస్తుతం మనం ఎదుర్కొంటున్న పర్యావరణ సంక్షోభానికి కారణాలు జీవసంబంధమైనవి కావు, మానవుల వ్యక్తిగత నిర్ణయాల ఫలితం కాదు, అవి సామాజికమైనవే, ఆధిపత్యంలో నున్న సామాజిక వ్యవస్థల ఉత్పత్తి సంబంధాలలో, సాంకేతిక విజ్ఞాన ఎంపికలో వాటి మూలాలు ఉన్నాయి. ఈ అంశాన్ని పరిగణనలోకి తీసుకొనకపోతే పర్యావరణ సంక్షోభానికి ఎదురయ్యే కీలకమైన సవాళ్లను విస్మరించినట్లు అవుతుంది. పర్యావరణాన్ని రక్షించుకోవాలంటే క్షీణతకు కారణమైన మౌలికమైన సామాజిక కారణాలను పరిష్కరించాల్సి ఉంటుంది. అంటే, మానవాళిని రక్షించాలంటే పెట్టుబడి ఉత్పత్తి విధానాన్ని ప్రతిఘటించవల్సి ఉంటుంది. పెట్టుబడిదారీ వ్యవస్థ ఇంక ఏమాత్రం కొనసాగినా మానవ నాగరికత, జీవ వ్యవస్థల మనుగడ అసాధ్యం.

ఈనాడు ప్రపంచ వ్యాప్తంగా వాతావరణపు సగటు ఉష్ణోగ్రతలో స్పష్టమైన మార్పు కనిపిస్తోంది. ఇటీవల ఉత్తరార్ధగోళంలో హిమపాతం గణనీయంగా పెరిగింది. మరోవైపు శరదృతువు, వసంతకాలం రాను రాను కుచించుకుపోతున్నాయి. శీతోష్ణస్థితిలో ఇంత తీవ్రమైన మార్పులు రావడానికి కారణం ఏమిటి? ఈ మార్పుల ప్రభావం ఎలా ఉంటుంది? మనకు తెలిసినంత వరకు సమస్త విశ్వంలో భూగ్రహం ఒక్కటే మానవ మనుగడకు అత్యంత అనువైన గ్రహం. మిగతా గ్రహాలు చాలావేడిగా గానీ, భరించలేని శీతలంగా గాని ఉంటాయి. భూవాతావరణం, గ్రీన్ హౌస్ ఎఫెక్టులే భూగ్రహాన్ని ఇతర గ్రహాల కంటే భిన్నంగా ఉంచుతున్నాయి. భూగ్రహం పగటి పూట సూర్యుని నుంచి వికిరణ రూపంలో ఉష్ణాన్ని గ్రహిస్తుంది. సూర్యుని ఉష్ణ వికిరణం భూవాతావరణం లోకి ప్రవేశించి, భూ ఉపరితలం నుంచి మరలా పరావర్తనం చెందుతుంది. భూవాతావరణంలో విభిన్నరకాల వాయువులు ఉంటాయి. అందులో కొన్ని వాయువుల పరమాణువులు ఉష్ణాన్ని పట్టి ఉంచే ధర్మాన్ని

కలిగి ఉంటాయి. వీటిని హరితగృహ వాయువులు అంటారు. ఉదాహరణకు కార్బన్ డయాక్సైడ్ (CO2), కార్బన్ మోనాక్సైడ్(CO), క్లోరో ఫ్లోరోకార్బన్లు (సి.ఎఫ్.సి.), మిథేన్ (CH4), నీటి ఆవిరి లాంటివి ఉష్ణాన్ని పట్టి ఉంచే వాటి ధర్మాన్ని గ్రీన్ హౌస్ ఎఫెక్టు అంటారు. గ్రీన్ హౌస్ ఎఫెక్టు కారణంగా పరావర్తనం చెందిన ఉష్ణంలో కొంతభాగం వాతావరణంలో చిక్కుకొని పోతుంది. పగటి పూట వాతావరణం పట్టి ఉంచిన ఉష్ణమే రాత్రిపూట భూమి ఎటువంటి ఉష్ణ వికిరణాన్ని గ్రహించనప్పటికీ ఉష్ణోగ్రతలు నీరు గడ్డ కట్టే స్థాయికి పడిపోకుండా భూమిని కాపాడుతుంది. వాతావరణంలో హరితగృహ వాయువుల శాతం మోతాదుకు మించి అధికంగా ఉంటే భూ ఉష్ణోగ్రత పెరుగుతుంది.

మానవుని చర్యలే ఉష్ణాన్ని పట్టి ఉంచే హరితగృహ వాయువుల ఉద్గారాలు అధికం కావడానికి కారణమవుతున్నాయి. సముద్ర మట్టాలు పెరగడం, అవక్షేపణ (Precipitation) రీతులు మారిపోవడం, నీటి ప్రవాహాలు దిశను మార్చుకోవడం, పంటల దిగుబడులు పడిపోవడానికి, వాతావరణ మార్పిడికి దారి తీస్తున్నాయి. అంతేకాక భూ ఉపరితల ఉష్ణోగ్రత కూడ పెరిగిపోతోంది. హరితగృహ వాయువుల ఉద్గారాలు పెరిగిపోవడం వల్ల భూమి వేడెక్కడాన్ని భూతాపంగా పేర్కొంటున్నారు. గడిచిన 140 సంవత్సరాల్లో భూ ఉపరితలం ఒక డిగ్రీ ఫారెన్ హీట్ వేడెక్కినట్లు శాస్త్రవేత్తలు లెక్కగట్టారు. హరిత గృహ వాయువుల గాఢతల పెరుగుదలే భూ ఉపరితల ఉష్ణోగ్రత పెరగడానికి కారణమవుతోందని, మరోవైపు సల్ఫేట్, ఎరోసోల్స్ గాఢతలు పెరగడం వల్ల పారిశ్రామిక ప్రాంతాలు ఇతర ప్రాంతాల కంటే చల్ల బడి పోతున్నాయని ఇంటర్ గవర్నమెంటల్ ప్యానెల్ ఆన్ క్లైమేట్ చేంజ్ (IPCC) ఇటీవల నిర్ధారించింది.

నూతన పారిశ్రామికాభివృద్ధి, శాస్త్రవిజ్ఞానం ఫలితంగా సింథటిక్ ఉత్పత్తులు రంగప్రవేశం చేశాయి. ఈ సింథటిక్ ఉత్పత్తుల వినియోగంలో ఉత్పన్నమయ్యే వ్యర్థపదార్థాలు నాశనం అయ్యేవి కావు. ప్రకృతి వైపరీత్యాలకు అంతరించేవి కావు. ఇది నేటి పారిశ్రామికోత్పత్తులలో ముఖ్యమైన అంశం. అంతే కాక ప్రపంచ ఆర్థిక వ్యవస్థ విస్తరించడంలో మానవుల ఆర్థిక కార్యకలాపాలు ప్రకృతి గమనానికి విరుద్ధంగా, శత్రు పూరిత దిశలో వృద్ధి చెందాయి. మానవ సమాజ అవసరాలకు, ఉత్పత్తికీ కీలకమైన వస్తువులు, ఇంధన వనరులూ అంతరించిపోతుండగా వ్యర్థ పదార్థాలు మాత్రం విస్తరిస్తున్నాయి. పునరుత్పత్తి చెందే వనరులైన నీరు, అడవులు, జీవ జాతులు వంటి వాటి సుస్థిరతకు గొడ్డలి పెట్టు అయిన స్థాయిలో వ్యర్థ పదార్థాలను వదలుతున్నాం. ఆధునిక యుగంలో పర్యావరణానికి ప్రమాదంగా పరిణమించిన పరిశ్రమ 'పెట్రోకెమికల్ పరిశ్రమ'. ఈ పరిశ్రమ అభివృద్ధి చెందేకొద్దీ కృత్రిమ ఉత్పత్తులు, వ్యర్థపదార్థాలు విపరీతంగా పెరిగాయి. పెట్రోలియం, గ్యాస్ ఈ పరిశ్రమకు మూలస్తంభాలు. ద్రావకాలు, పురుగుమందులు, ప్లాస్టిక్ లాంటి ఉత్పత్తులన్నీ రసాయన ప్రమాదాన్ని తెచ్చి పెట్టేవే. నేడు దాదాపు 70 వేల రకాల సమ్మేళనాలు (ద్రావకాలు) ఉపయోగంలోకి వచ్చాయి. వీటిలో ఇప్పటికే 400 కు పైగా మన శరీరంలో చేరిపోయాయి. నూతన రోగాలకు ఈ ద్రావకాలే ప్రధానహేతువు. వినియోగ ప్రక్రియ ద్వారా కాకుండా ఉత్పత్తి ప్రక్రియ ద్వారా వ్యర్థపదార్థాలు చాలా వరకు తయారవుతున్నాయి. ఫలితంగా ఈ రకమైన ఆర్థిక కార్యకలాపాలు గతంలో ఎన్నడు లేని విధంగా ప్రపంచ వ్యాప్తంగా పర్యావరణ పతనానికి తెర తీసాయి.

హరిత గృహవాయువులు అధికంగా విడుదల కావడానికి ఈ కింది వాటిని కారకాలుగా పేర్కొనవచ్చు. అవి

**కార్బన్ డయాక్సైడ్:** పెట్రోలు, బొగ్గు మొదలగు శిలాజ ఇంధనాలను మండించడం పెరుగుతున్న కొద్దీ వాతావరణంలో కార్బన్ డయాక్సైడ్, కార్బన్ మోనాక్సైడ్ పరిమాణం నానాటికి అధికమవుతోంది. విద్యుదుత్పత్తి కోసం మండిస్తున్న శిలాజ ఇంధనాల వల్లే సుమారు 40 శాతం కార్బన్ డయాక్సైడ్ ఉద్గారాలు సంభవిస్తున్నాయి. విద్యుదుత్పత్తి పరిశ్రమ నుంచి వస్తున్న కార్బన్ డయాక్సైడ్ ఉద్గారాలకు 93 శాతం బొగ్గే కారణం. విమానాల ద్వారా విడుదలయ్యే కార్బన్ డయాక్సైడ్ 3.5 శాతం భూతాపానికి కారణమవు తోంది. ఇది 2050 నాటికి 15 శాతం పెరగవచ్చని శాస్త్రజ్ఞులు అంచనా వేస్తున్నారు. భవనాలు, రోడ్లు వంటి నిర్మాణాలు సూర్యుడి నుండి వికిరణాన్ని గ్రహించి 12 శాతం ఉద్గారాలకు కారణమవుతూ వాతావరణంలో ఉష్ణోగ్రతలను పెంచుతున్నాయి.

**క్లోరో ఫ్లోరో కార్బన్లు (సి.ఎఫ్.సి.):** క్లోరిన్, ఫ్లోరిన్ కలిగిన కర్బన సమ్మేళనాల (హైడ్రోకార్బన్స్) ను క్లోరో ఫ్లోరో కార్బన్లు అంటారు. ఫ్రియాన్ అని పిలువబడే డైక్లోరో డైఫ్లోరో మిథేన్, ట్రై క్లోరో ఫ్లోరో మిథేన్, క్లోరో ట్రై ఫ్లోరో మిథేన్‌లు సి.ఎఫ్.సి.కి ఉదాహరణలు. ఇవి ముఖ్యంగా రిఫ్రిజిరేటర్స్, ఎరోసోల్ ప్రొపల్లెంట్లలో వాడుతారు. వీటి ద్వారా వాతావరణంలోకి విడుదలైన సి.ఎఫ్.సి.లు ఓజోన్ పొర క్షీణతకు కారణమవుతాయి. ఓజోన్ భూమికి ఒక రక్షణ కవచం లాగ ఉండి సూర్యుని నుండి వెలువడే అతి నీలలోహిత కిరణాల నుండి జీవులను రక్షిస్తుంది. ఓజోన్ క్షీణించడం వలన అతినీలలోహిత కిరణాలు మానవులు, జీవులపై పడటం వల్ల అంధత్వం, చర్మక్యాన్సర్, ఇతర చర్మ సంబంధ వ్యాధులు వచ్చే ప్రమాదం ఉంది.

**మిథేన్:** కార్బన్ డయాక్సైడ్ తరువాత మిథేన్ అత్యంత ముఖ్యమైనది. మిథేన్ కార్బన్ డయాక్సైడ్ కంటే 20 రెట్లు అధికంగా వాతావరణంలో ఉష్ణోగ్రతను పట్టి ఉంచుతుంది. గడిచిన 100 సంవత్సరాలలో వాతావరణంలో మిథేన్ స్థాయి 145 శాతం పెరిగింది. వరి, మొక్కజొన్న పంటలను అధికంగా సాగు చేయడం వలన వాతావరణంలోకి పెద్ద మొత్తంలో మిథేన్ విడుదల చేయబడుతోంది. మిథేన్ ప్రధానంగా వరి పొలాలు, పశువుల విసర్జకాలు, బురద నేలల్లో ఉండే బాక్టీరియా, శిలాజ ఇంధన ఉత్పత్తి ద్వారా విడుదలవుతుంది. వరదలు ముంచెత్తినప్పుడు వాయురహిత పరిస్థితులు ఏర్పడి నేలలో సేంద్రీయ పదార్థం కుళ్ళిపోయి వాతావరణంలోకి మిథేన్ విడుదల చేయబడుతుంది.

**అడవుల నరికివేత:** మానవుని కార్యకలాపాల వల్ల సంభవించే కార్బన్ ఉద్గారాల తరువాత అడవుల నరికివేతే వాతావరణంలో కార్బన్ డయాక్సైడ్ పెరుగుదలకు ప్రధాన కారణమవుతోంది. అడవుల నరికివేత వల్లే 25 శాతం కార్బన్ ఉద్గారాలు వాతావరణంలోకి ప్రవేశిస్తున్నాయి. కాల్చివేయడం వల్ల గాని, నరికి వేయడం వల్ల గాని ప్రపంచవ్యాప్తంగా ఏటా 3.4 కోట్ల ఎకరాల్లో అడవి అంతరించిపోతుంది. ఉష్ణమండల అడవుల ధ్వంసం వల్ల ప్రతి ఏటా వాతావరణంలోకి మిలియన్ టన్నుల

కార్బన్ డయాక్సైడ్ విడుదలవుతోంది. వీటితో పాటు సమశీతోష్ణ అడవులను కూడ మనం కోల్పోతున్నాం. సమశీతోష్ణ అడవులు సంవత్సరానికి ప్రపంచవ్యాప్తంగా 2 బిలియన్ టన్నుల చొప్పున కార్బన్‌ను గ్రహిస్తున్నాయి. అయితే ఒక్క సైబీరియా సమశీతోష్ణ మండల అడవుల్లోనే ఏటా కోటి ఎకరాల అడవులు ధ్వంసమవుతున్నాయి. పర్యవసానంగా 1980-90 మధ్య ప్రపంచ ఎడారులు 12 లక్షల హెక్టార్ల మేర విస్తరించాయి.

పర్యావరణానికి, పెట్టుబడిదారీ వ్యవస్థకు మధ్య గల వైరుధ్యం నిర్దిష్ట స్థాయిలో ఎలా వ్యక్తమవుతుందో అర్థం చేసుకోవడానికి నేడు తీవ్రంగా పరిగణించబడుతున్న‘ భూగోళం వేడెక్కడం‘ అనే సమస్యను పరిశీలిస్తే అర్థమవుతుంది. వాతావరణ మార్పుతో వేసవి కాలం అత్యంత వేడిగా ఉండడం, శీతాకాలం కూడా ఎక్కువ రోజులు ఉండి, అత్యంత చలిగా ఉండడం. వసంతకాలం, శరత్ కాలం (ఆకురాల్చేకాలం) కుచించుకుపోవడం మొదలగునవన్నీ భూతాపం యొక్క ప్రత్యక్ష ఫలితాలే.

అయితే ఈ రెండు ఋతువులు కుచించుకుపోవడమంటే కొన్ని రకాల మొక్కలు పుష్పించడానికి, కొన్ని రకాల కాయలు పక్వానికి రావడానికి వ్యవధి సరిపోవడం లేదు. వాతావరణ మార్పిడి వల్ల కొన్ని వలస పక్షులకు ఎప్పుడు వలసకు బయలు దేరాలో అర్థం కాదు. ఫలితంగా మరిన్ని జీవరాశులు అంతరించిపోయే జాబితాలో చేరిపోతున్నాయి. జీవశాస్త్రవేత్త ఎడ్వర్డ్ ఓ విల్సన్ అంచనా ప్రకారం ఏటా 2700 జీవజాతులు అంతరించిపోతున్నాయి. గడచిన మూడు దశాబ్దాల కాలంలోనే 25 శాతం జీవరాశులు అంతరించిపోయాయి. వాతావరణ మార్పిడి ఫలితంగా వాతావరణంలో అనూహ్యమైన మార్పులు సంభవిస్తాయి. హరికేన్లు, తుపానులు పెరగడానికి దారి తీస్తున్నాయి. ఎల్‌నినో, ఎల్‌డిడో వంటి కల్లోల పరిస్థితులు ఏర్పడు తున్నాయి. అటువంటి కల్లోలాల గురించి భయపడడం మినహా అవి చూపించే దుష్ప్రభావాలను పూర్తి స్థాయిలో అంచనా వేయలేం.

పర్వతాలపై ఉండే హిమనదాలు కరిగిపోవడం వల్ల ప్రపంచం లోని పలు ముఖ్యమైన మంచినీటి వనరులు, జీవనదులైన గంగ, సింధు, బ్రహ్మపుత్ర నదీవ్యవస్థల ఉనికికి ముప్పు ఏర్పడుతోంది. ఉష్ణోగ్రతలు పెరగడం వల్ల సరస్సులు కూడా త్వరగా ఎండిపోతున్నాయి. వీటన్నింటి ఫలితంగా తాగునీటి కొరత ఏర్పడుతోంది. పెరుగుతున్న ఉష్ణోగ్రతల వల్ల ధ్రువపు మంచు, హిమనదాలు కరిగిపోయి, సముద్రమట్టాలు పెరుగుతున్నాయి. సముద్ర మట్టాలు పెరగడం వల్ల యునైటెడ్ కింగ్‌డమ్, బంగ్లాదేశ్, నెదర్లాండ్స్ వంటి అనేక దేశాల ఉనికికి ముప్పు ఏర్పడు తోంది. పెరుగుతున్న ఉష్ణోగ్రత అవక్షేపాల పెరుగుదలకు దారితీస్తోంది. అయితే తుఫానులపై దీని ప్రభావం ఎంత మేరకు ఉందన్నది ఇంకా స్పష్టం కావాల్సి ఉంది. ఉష్ణమండల ప్రాంతాల్లో వస్తున్న అదనపు తుఫానులు కొంతమేరకు ఉష్ణోగ్రత ప్రవణత మీద అధారపడి ఉంటాయి. ధృవపు ప్రాంతాలు ఇతర భూభాగం కంటే ఎక్కువగా వేడెక్కుతుండడంతో ఉత్తరార్ధగోళంలో ఉష్ణోగ్రత బలహీన పడుతుందని భావిస్తున్నారు. హరికేన్ తీవ్రతను తెలియజేసే పవర్ డిసిపేషన్ ఇండెక్స్ లాగా తుఫాను సత్వం పెరిగే కొలది అసాధారణ వాతావరణ పరిస్థితులకు దారి తీస్తుంది. అసాధారణ వాతావరణ పరిస్థితుల వల్ల తలెత్తే ప్రకృతి విపత్తులు సాదారణ ప్రజల జీవితాలను అతలాకుతలం చేస్తాయి.

ప్రపంచవ్యాప్తంగా వాతావరణ మార్పు వల్ల కలిగే ఆర్థిక నష్టాలు, సోషల్ కాస్ట్ ఆఫ్ కార్బన్ (ఎస్సిసి) కు సంబంధించి పలు గణాంకాలు వెలువడుతున్నాయి. కఠిన చర్యలు తీసుకోని పక్షంలో ఆర్థిక వృద్ధి మీద వాతావరణ మార్పిడి ప్రభావం తీవ్రంగా ఉంటుందని వృద్ధి రేటు ఐదో వంతు పడిపోతుందని ప్రపంచబ్యాంకు తన నివేదికలో హెచ్చరించింది. వాతావరణ మార్పుల వల్ల కలిగే ప్రభావాలను ఎదుర్కొనేందుకు ప్రపంచ జిడిపిలో ఒక శాతం వరకు పెట్టుబడి పెట్టాల్సిన అవసరం ఉందని పేర్కొంది. లేకుంటే ప్రపంచ జిడిపి కి 20 శాతం నష్టం కలిగించిన ఆర్థిక మాంద్యం కంటే కూడ తీవ్రమైన పర్యవసానాలు ఎదుర్కోవలసి వస్తుందని హెచ్చరించింది.. వాతావరణ మార్పిడి వల్ల ఇదివరకూ ఎన్నడూ చూడని, దుర్భరమైన మార్కెట్ వైఫల్యాలు కూడా సంభవిస్తాయని ప్రపంచ బ్యాంక్ నివేదిక సూచించింది.

ఉష్ణోగ్రతలు పెరగడం వల్ల ప్రపంచవ్యాప్తంగా ఇటీవలి కాలంలో పంటల దిగుబడిపై ప్రతికూల ప్రభావం పడుతోంది. పెరుగుతున్న వాతావరణ ఉష్ణోగ్రతలు, సుదీర్ఘకాలం ఉండే కరువులు, ఈ రెండింటి వల్ల కలిగే దుష్ప్రభావాల (ఉదాహరణకు గ్రౌండ్ లెవల్ ఓజోన్ వాయువు స్థాయిలు అధికంగా ఉండడం) వల్ల రానున్న దశాబ్దాల్లో పంట దిగుబడులు గణనీయంగా పడిపోనున్నాయని ప్రపంచబ్యాంకు నివేదిక హెచ్చరించించి. అన్నింటి కంటే ఆఫ్రికా ప్రాంతం తీవ్రంగా ప్రభావితం కానుందని తెలిపింది. దాని భౌగోళిక స్వరూపంతో పాటు 70 శాతం మంది ప్రజలు వర్షాధార పంటలపై అధారపడి ఉండడం వల్ల ఈ ప్రభావం తీవ్రంగా ఉంటుంది.

వాతావరణ మార్పిడి వల్ల ఆరోగ్యంపై నేరుగా ప్రభావం చూపేవి అధిక ఉష్ణోగ్రతల వల్ల కలిగే ప్రభావాలే. అసాధారణ అధిక ఉష్ణోగ్రతల వల్ల అనేక మంది ప్రజలు అనేక కారణాల వల్ల చనిపోతారు. గుండె జబ్బులు ఉన్నవారి పరిస్థితి మరింత విషమంగా తయారవుతుంది. వేడి వాతావరణంలో శరీరాన్ని చల్లగా ఉంచడానికి హృదయకండర వ్యవస్థ ఇంకా ఎక్కువగా పని చేయాల్సి ఉంటుంది. దీనివల్ల నిస్సత్తువ ఆవహించడం, కొన్ని శ్వాససంబంధ సమస్యలు కూడా పెరుగుతాయి. అధిక ఉష్ణోగ్రత వల్ల ఓజోన్ వాయువు దిగువ స్థాయిలో అధికంగా నిక్షేపమయ్యే ప్రమాదం ఉందని వైద్యులు హెచ్చరిస్తున్నారు. దిగువ స్థాయి వాతావరణంలో ఉండే ఓజోన్ ఒక హానికరమైన కాలుష్య కారకం. ఇది ఊపిరితిత్తుల కణజాలాన్ని దెబ్బతీసి, అస్తమా, ఇతర ఊపిరితిత్తుల వ్యాధులు ఉన్నవారికి మరిన్ని సమస్యలు తీసుకొస్తుంది. భూతాపం వల్ల కొన్ని దేశాల్లో డెంగ్యూ, మలేరియా జ్వరాల వంటి సంక్రమణ వ్యాధులకు అనువైన వాతావరణం ఏర్పడుతుందని హెచ్చరిస్తున్నారు. ఉత్తర ఐరోపా వేడెక్కిపోతుండడంతో ఎన్సెఫలైటిస్, లైమ్వ్యాధులను మోసుకెళ్లే పిణుజులు (ticks), విస్కరల్ లీష్మానియాసిస్ అనే వ్యాధిని మోసుకెళ్లే సేండ్ ఫ్లైస్ (sand flies) ప్రవేశించే అవకాశం ఉందని, బ్రిటన్, ఐరోపా దేశాల్లో కీటకాల వల్ల వచ్చే వ్యాధులు విజృంభించ బోతున్నాయని ప్రపంచ ఆరోగ్య సంస్థ హెచ్చరిస్తోంది.

విభిన్న వాతావరణ, భౌగోళిక పరిస్థితులు కలిగిన భారతదేశంపై భూతాపం ప్రభావం కూడ భిన్న రకాలుగా ఉంది. సముద్ర మట్టాలు పెరగడం, తుఫానులు అధికంగా రావడం, ఉష్ణోగ్రతలు పెరగడం, అవక్షేపం రీతుల్లో మార్పులు సంభవించి భారతదేశం పై ప్రభావం చూపనున్నాయి. ఇప్పటికే పెరిగిన సముద్రమట్టాల వల్ల పశ్చిమబెంగాల్,

బంగ్లాదేశ్‌ల మధ్య విస్తరించి ఉన్న సుందర్బన్లో కొన్ని దీవులు మునిగి పోయాయి. వేలాది మంది నిరాశ్రయులయ్యారు. టిబెట్ పీఠ భూమిలో ఉష్ణోగ్రతలు పెరుగుతుండడంతో హిమాలయాలలోని హిమ నదాలు వేగంగా కరిగిపోతున్నాయి. ముఖ్యమైన నదీ ప్రవాహాల రేటులో గణనీయమైన మార్పు రావడం వరకు అనేక రకాల దుష్ప్రభావాలు కలుగనున్నాయి. పర్యావరణ విపత్తుల కారణంగా లక్షదీవులు, అండమాన్లలోని 70 శాతానికి పైగా పగడాలు అంతరించిపోయాయి. భూతాపంతో పాటు సముద్రపు ఉష్ణోగ్రతలు కూడ పెరుగుతుండడం సర్వసాధారణంగా మారింది. సముద్రతీరాలలో నివసించే జనాభాలో అధికశాతం మంది ప్రజలు తీవ్రంగా నష్టపోతున్నారు.

పరిశ్రమలు, ఫ్యాక్టరీలు, వాహనాలు మొదలగు వాటి ద్వారా విడుదలవుతున్న కార్బన్ డయాక్సైడ్ ఉద్గారాలు భారతదేశంలో గ్రీన్ హౌస్ ప్రభావానికి కారణమవుతున్నాయి. వాతావరణాన్ని వేడెక్కిస్తున్నాయి. ధూళి, ఏరోసాల్స్‌తో కూడిన వాతావరణ పొర కరిగిపోతోంది. అస్సాం వంటి రాష్ట్రాలను మరిన్ని వరదలు ముంచెత్తు తాయని, భూమి కోసుకుపోతుందని ఆందోళన వ్యక్తమవుతోంది. భూగోళ ఉష్ణోగ్రత 2 డిగ్రీల సెంటిగ్రేడ్ ఉష్ణోగ్రత లేదా 3.6 డిగ్రీల ఫారెన్‌హీట్‌కు పెరిగితే ముంబై, చెన్నై నగరాల్లోని కొన్ని ప్రాంతాలు మునిగిపోయి సుమారు 70 లక్షల మంది నిరాశ్రయులవుతారని అంచనా వేస్తున్నారు. సముద్ర మట్టాలు పెరిగి పొరుగునే ఉన్న బంగ్లాదేశ్ మునిగిపోతే పెద్ద ఎత్తున శరణార్థులు తమ రాష్ట్రంలోకి తరలి వస్తారని మేఘాలయ రాష్ట్ర ప్రజలు ఆందోళన చెందుతున్నారు. తీవ్రమైన వాతావరణ మార్పులు సంభవిస్తే, బంగ్లాదేశ్ తీర రేఖ వెంబడి భూమి కోతకు గురవుతుందని ఇందిరాగాంధీ ఇనిస్టిట్యూట్ ఆఫ్ డెవలప్‌మెంట్ రీసెర్చ్ తన నివేదికలో పేర్కొంది.

భారతదేశంలో ఇప్పటికే అధిక శాతం మంది ఆహారం, ఆవాసం, ఆదాయం కోసం ప్రకృతి వనరుల మీదే ఆధారపడి జీవిస్తున్నారు. 56 శాతానికి పైగా ప్రజలు వ్యవసాయరంగంలో పని చేస్తున్నారు. చాలా మంది తీరప్రాంతాల మీద ఆధారపడి జీవనం కొనసాగిస్తున్నారు. వీరందరికీ వాతావరణ మార్పిడి అంటే ఆకలి, ఆహార అభద్రత, జీవనోపాధి కోల్పోవడం లాంటి సమస్యలు మాత్రమే. భారతదేశ వాతావరణ విధానం వీరి ప్రయోజనాలను ఏ మాత్రం పట్టించుకోవడం లేదని విమర్శలు కూడ ఉన్నాయి. దానికి బదులు అధిక ఉద్గారాలకు కారణమయ్యే విధంగా సంపన్నుల వినిమయ స్వేచ్ఛకు, సాంద్ర జిడిపి వృద్ధికి మాత్రమే ప్రాధాన్యమిచ్చిందని పర్యావరణవేత్తలు ఆందోళన వ్యక్తం చేస్తున్నారు. వాయువ్య భారతదేశంలో జీవద్రవ్యాన్ని (Biomass) కాల్చడంవల్ల దట్టమైన పొగ, పొగమంచుకు తోడుగా ఉత్తర భారతదేశం లోని భారీ పరిశ్రమల నుంచి వస్తున్న వాయు కాలుష్యం కలిసి గంగానది పరీవాహక ప్రాంతాలపై పెను ప్రభావం చూపుతున్నాయి.

గ్రీన్ హౌస్ వాయువుల విడుదలను అరికట్టేందుకు అంతర్జాతీయ ప్రయత్నాలు 1990లో ప్రారంభమయ్యాయి. దీని ఫలితంగా ఒక అంతర్జాతీయ ఒప్పందానికై UNFCCC 1992లో ఏర్పడింది. ఇది వివిధ దేశాలు గ్రీన్ హౌస్ వాయువులను నియంత్రించుకోవాలని సూచించింది. కాని అలా జరగలేదు. 1990 దశకంలో జపాన్లో కర్బనవాయువుల విడుదల పెరుగగా, అమెరికా కర్బన వాయువుల నియంత్రణలో వైఫల్యం చెందింది. త్వరగా ధనవంతులైపోవాలనే క్యోటో ఒప్పందాన్ని అమెరికా అమోదించలేదు. గ్రీన్ వాయువుల విడుదలను తగ్గించాలంటే అమెరికా అర్థిక వ్యవస్థ భారీ మూల్యం చెల్లించాల్సి వస్తుందని అది దాటవేస్తుంది. కర్బన అధారిత ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి చెందిన పెట్టుబడిదారీ దేశాలలో ఎక్కువగా ఉంది. అందువలన పెట్టుబడిదారీ దేశాలే పర్యావరణ విధ్వంసానికి ప్రధాన కారణంగా భావించాలి.

ఇటీవల ఐస్‌ల్యాండ్ లో పేలిన అగ్నిపర్వతం మొత్తం ప్రపంచాన్ని కొన్ని రోజుల పాటు స్తంభింపజేసింది. ప్రకృతి ఎంత శక్తివంతమైనదో తెలియజేసే చిన్న సంఘటన ఇది. మానవజాతి సాంకేతికపరంగా ఎంత ఎత్తుకు ఎదిగినా ప్రకృతి ముందు మానవులు ఎంత దుర్బలులో కూడా ఇది నిరూపించింది. ప్రకృతిని గౌరవించాలని మానవులకు తరచుగా ఇలాంటి భయంకర విపత్తులు గుర్తు చేస్తూనే ఉన్నాయి. అయినా ప్రయోజనం శూన్యం. అనేక పర్యావరణ పరిరక్షణ సంస్థలు భూతాపాన్ని తగ్గించే చర్యలను ప్రోత్సహిస్తున్నాయి. ప్రత్యామ్నాయ ఇంధన వనరుల అన్వేషణకు ముమ్మర ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఇందులో అత్యంత ముఖ్యమైనది, చెప్పుకోదగ్గది హరిత గృహ వాయువు ఉద్గారాల వాణిజ్యం. దీని ప్రకారం కంపెనీలు ప్రభుత్వ సహకారంతో తమ ఉద్గారాలను పరిమితం చేస్తాయి. లేదా ప్రభుత్వం నుంచి కార్బన్ క్రెడిట్లను కొనుగోలు చేస్తాయి.

మానవజాతి మనుగడ, విజయం యావత్తు పరిసరాలకు అనుగుణంగా ఒదిగిపోవడంపైనే అధారపడి ఉంది. భూతాపం, అది కలిగించే నష్టాలపై ప్రపంచ వ్యాప్తంగా జరుగుతోన్న చర్చలు (ధరిత్రి సదస్సులు) మానవుని జీవనశైలిని పర్యావరణానికి మరింత అనుకూలంగా మార్చే విధంగా చర్యలు తీసుకోవడానికి ఏ విధంగా దోహదపడతాయో వేచి చూడాలి. విధ్వంసక పర్యావరణ చరిత్రకారుడు డొనాల్డ్ వర్స్టర్ 'పెట్టుబడిదారీ విధానం విజృంభించడంతో మానవులు తమ చుట్టూ ఉన్న అన్నింటిని 'భూమి, సహజవనరులు, శ్రమ' ని కూడ మార్కెట్ కొరకు లాభం సంపాదించి పెట్టే అవకాశం గల సరకులుగా పరిగణిస్తారు అంటాడు. పర్యావరణవాదులు అంటున్న సుస్థిర అభివృద్ధిని సాధించేలా పెట్టుబడిదారీ విధానాన్ని మార్చగలమా? ఇదే మన కాలానికి అత్యంత కీలకమైన ప్రశ్న. మానవ చరిత్రలో ఎన్నో రకాల సమాజాలు ఏర్పడ్డాయి. పెట్టుబడిదారీ విధానానికి భిన్నమైన సమాజం 1917లో ఏర్పడిన సోవియట్ యూనియన్, ఆ తర్వాతది చైనా రిపబ్లిక్. అయితే ఈ రెండు కూడా ఇప్పుడు పెట్టుబడిదారీ విధానాన్నే అనుసరిస్తున్నాయి.

భూగోళం వేడెక్కే ధోరణి ఇదే విధంగా కొనసాగితే ఈ శతాబ్దం లోనే ప్రపంచ వ్యాపిత విధ్వంసం తప్పదని ప్రపంచ శాస్త్రజ్ఞుల ఏకాభిప్రాయం. విచక్షణా రహితంగా జరుగుతున్న ప్రకృతి, ఉత్పత్తుల ప్రైవేటీకరణ క్రమాన్ని అడ్డుకోవాలి. మానవాళి పురోగమించాలంటే ప్రకృతి, ఉత్పత్తుల సామాజికీకరణ మినహా మరో మార్గం లేదు. బహుళజాతి సంస్థల లాభాపేక్షతో సర్వనాశనం అవుతున్న ధరిత్రిని, భూమిపైనున్న మానవాళి దృష్ట్యా, పర్యావరణాన్ని రక్షించాలనుకుంటే చైతన్యవంతమైన సంఘటితమైన ప్రపంచస్థాయి ఉద్యమం ఒక్కటే పరిష్కారమార్గం. పెట్టుబడిదారీ ఉత్పత్తికి ప్రత్యామ్నాయమైన ఉత్పత్తి విధాన సాధన తప్ప మానవాళి మనుగడకు మరో మార్గం లేదు.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకులు)* వీ

*భూమికీ, మనిషికీ సంబంధాన్ని నిర్దేశించే రెవెన్యూ పాలన ప్రారంభం, పూర్వాపరాల చరిత్రను వివరిస్తున్నారు*

**ఎస్. సరళా వందనం**

# ఆంధ్రప్రదేశ్‌లో రెవెన్యూ పరిపాలన - 8

*(ఆగస్ట్ 2011 సంచిక తరువాయి...)*

**టేకా బందీ రిజిష్టర్:** గ్రామంలోని ప్రతి పట్టాదారుని పేరు, అతనికి కేటాయించిన వ్యక్తిగత నంబరు (ఖాతా), భూమి స్వభావం, శిస్తు వివరాలు, పొలం పేరు మొదలగు వివరాలతో కూడి గ్రామ స్థాయిలో గ్రామాధికారి దగ్గర ఉండే రిజిష్టర్‌ను టేకాబందీ రిజిష్టర్ అంటారు. సర్వేయర్లు భూమి కొలతలకు వెళ్లేటప్పుడు ఈ రిజిష్టర్‌ను ఉపయోగించుకుంటారు.

**మాజీ నంబర్ జాస్తి :** గ్రామంలో సర్వే, సెటిల్‌మెంట్ జరుగుతున్నపుడు పాత సర్వే నంబర్లు, అప్పటి విస్తీర్ణం ఒకవైపు, దానికి ఎదురుగా ఇప్పుడు సర్వేలో కొత్తగా ఇచ్చిన నంబర్ వాటి విస్తీర్ణాలను ఇంకోవైపు నమోదు చేస్తారు. దీనివలన అన్ని భూములను సర్వే చేసిందీ లేనిదీ, వాటి విస్తీర్ణం అంతా సరిపోయినదీ లేనిదీ వెంటనే తెలుసుకోవచ్చు.

భూముల వర్గీకరణను అప్పటి సర్వేయర్లు తాము తయారు చేసిన రిజిష్టర్‌లలో ఈ విధంగా పొందుపరిచారు.

**ఖరిజ్ ఖాతా:** వ్యవసాయ యోగ్యమైన భూములలో పట్టాదారుకు వారసులు లేకుండా మరణించినవి పట్టాదారు తమ హక్కులను భూమిపై తామే వదులుకొన్న వాటిని ఖరిజ్ ఖాతా భూములుగా వర్గీకరించారు.

**ఆయకట్టు:** గ్రామంలో కచ్చితమైన నీటిపారుదల కోసం కేటాయించబడిన భూ విస్తీర్ణం.

**బంచరాయి:** గ్రామం మొత్తం వ్యవసాయ భూమి విస్తీర్ణంలో 10 నుండి 15 శాతం భూమిని పలుచోట్ల పశువుల గడ్డి మేతకు వదిలి వేసినవి. ఈ భూములు రక్షిత అడవులలో ఉంటే కాంట్రాక్టర్లకు గడ్డి పెంచుకోవడానికి ఇచ్చి అటవీ అధికారులు రుసుం వసూలు చేసేవారు. అవే గ్రామ బయలులో ఉంటే ప్రతి సంవత్సరం రెవెన్యూ శాఖ గడ్డి పెంచుకునే వారికోసం వేలం నిర్వహించి అప్పగించేది

**పోరంబోకు :** వ్యవసాయ యోగ్యానికి పనికిరాని ప్రభుత్వ భూమి.

ఇవి కాకుండా గ్రామకంఠం, స్మశానం, అడవులు, చెరువులు, దేవాలయాలు, రహదారులు, కాలువలు ఎంత విస్తీర్ణం ఉన్నప్పటికీ వాటికి అప్పట్లో ఒకే సర్వే నెంబర్ కేటాయించేవారు. మిగిలిన పట్టా భూములు, ఇనాం భూములు ఎవరి పేరుతో ఉన్నాయో వారి పేర్లను నమోదు చేయడం జరిగింది. ఇలా సాలార్‌జంగ్-1 ప్రవేశపెట్టిన శాశ్వత సర్వే విధానంలో ప్రతి ఒక్కరి భూమిపైనా, అన్ని భూములపైనా కూడా క్రమబద్ధమైన సమగ్రమైన సమాచారం తయారైంది. సర్ సాలార్‌జంగ్-1 1875లో నెలకొల్పిన ఈ సర్వే, సెటిల్‌మెంట్ శాఖ వీటి మూలాలతోనే ఒక గ్రామంలో భూమికి సంబంధించిన సమగ్ర సమాచారం ఉండే 'సేత్‌వార్' రిజిష్టర్‌ను తరువాత కాలంలో తయారు చేసింది.

## రెవెన్యూ యంత్రాంగ న్యాయ విధులు

క్రీ.శ. 1861లోనే నిజాం పాలనలో కూడా బ్రిటిష్ ఇండియా న్యాయ వ్యవస్థను అంటే రెవెన్యూ యంత్రాంగమే న్యాయవిధులను కూడా నిర్వర్తించే విధానాన్ని అవలంబించాలని సాలార్‌జంగ్-1 నిర్ణయించుకున్నాడు. ఇందులో భాగంగా 1862లో సివిల్, క్రిమినల్ కేసులకు వేరు వేరు కోర్టులను మొదలుపెట్టాడు. న్యాయవ్యవస్థ బలపడడానికి కావలసిన సూత్రాలు, నిబంధనలు తయారు చేయడానికి తన ఆధ్వర్యంలోనే నడిచే ఒక ప్రత్యేక శాఖను 1875లో నెలకొల్పాడు. 1877లో ప్రభుత్వ పాలనకు సంబంధించి న్యాయ సంబంధ సలహాలు ఇవ్వడానికి, న్యాయసూత్రాలు, నిబంధనలకు విరుద్ధంగా ప్రభుత్వ శాఖలు నడవకుండా చూడడానికి ఒక 'లా' సెక్రటరీని నియమించాడు.

మొఘలుల పరిపాలనా కాలంలో లేని గ్రామీణ న్యాయ వ్యవస్థను గ్రామ పరిపాలనకు అనుసంధానించడానికి గాను గ్రామ రెవెన్యూ అధికారియైన పోలీస్ పటేల్‌కు న్యాయాధికారాన్ని కట్టబెట్టి, తప్పు చేసిన వారిని నాలుగు రోజులు నిర్బంధించే అధికారం, రు.3 అపరాధ రుసుం విధించే విచక్షణాధికారాన్ని అప్పగించారు. గ్రామస్థాయి సివిల్ తగాదాలను విచారించే అధికారం మాత్రం ఇవ్వలేదు. తహసిల్‌దార్లకు సివిల్ తగాదాల్లో రు. 300 అపరాధ రుసుం, క్రిమినల్ కేసులో ఆరు నెలలు జైలు శిక్ష, రు. 50 అపరాధ రుసుం విధించే అధికారం ఉండేది. మూడవ రెండవ తాలూకాదార్లకు ఒక సంవత్సరం జైలుశిక్ష, రు. 1000 అపరాధ రుసం. సివిల్ తగాదాల్లో రు. 1000 నుంచి రు. 2000 వరకూ అపరాధ రుసుం విధించే న్యాయాధికారం ఉండేది. ఫస్ట్ తాలూకాదారు లేదా జిల్లా మెజిస్ట్రేట్‌గా ఉండే అధికారికి నాలుగు సంవత్సరాల జైలుశిక్ష, క్రిమినల్ కేసులలో రు. 1000 అపరాధ రుసుం విధించే విచక్షణాధికారం ఉండేది. మొఘలుల పరిపాలనలో ఉన్న విధంగానే ఫస్ట్ (మొదటి) తాలూకాదారు రెవెన్యూ, క్రిమినల్, సివిల్ విషయాలకు కార్యనిర్వహణాధిపతిగా ఉండేవాడు. శాంతిభద్రతల బాధ్యత జిల్లా పోలీస్ అధికారి (మొహతమిమ్) కన్నా కూడా తాలూకాదారుపైనే ఉండి మొహతమిమ్ తాలూకాదారు ఆధీనంలో పనిచేసేవాడు.

సదర్ తాలూకాదారుకు పది సంవత్సరాల జైలు శిక్ష పడే కేసులు, రు. 4000 అపరాధ రుసుం విధించే న్యాయవిచారణాధికారం ఉండేది. ఇవి కాకుండా అన్ని రెవెన్యూ, ఎక్సైజ్, స్టాంపుల దుర్వినియోగానికి సంబంధించిన కేసులలో రు. 100 విలువ కలిగిన వాటికి తీర్పునిచ్చే అధికారం ఉండేది. సదర్ తాలూకాదారు పై అప్పీలు మజ్లిస్-ఇ-అలియా అదాలత్ (హైకోర్టు)లో మాత్రమే చేసుకొనే వీలు కల్పించారు. 1867లో స్థిరపరిచిన ఈ 'జిలాబంది' వ్యవస్థ ద్వారా రెవెన్యూ అధికారులకు గ్రామస్థాయి నుండి దివాను (సాలార్‌జంగ్) స్థాయివరకు విశేష అధికారాలు సంక్రమించాయి. ఇవేకాక సాలార్‌జంగ్-1 దివానుగా ఉన్న కాలంలోనే పైస్థాయి రెవెన్యూ, పోలీస్, ఆర్థిక శాఖలు చాలావరకు బ్రిటిష్ సివిల్ సర్వెంట్ల ఆధీనంలో నియమించి వారు చెప్పిన విధంగానే పరిపాలన జరిగేది. 1920లో సర్ అలీ ఇమామ్ ప్రధానమంత్రిగా ఉన్న సమయంలో రెవెన్యూ అధికారుల నుండి జుడిషియల్ అధికారాన్ని తొలగించి వేరుచేశాడు. కాని ఈ ఉత్తర్వులకు పైస్థాయి రెవెన్యూ అధికారులు వ్యతిరేకించడం వలన వెంటనే ఈ ఉత్తర్వులను వెనక్కు తీసుకొన్నారు.

1297 ఫసలీ (1888) నాటికే స్థానిక పాలన కోసం మునిసిపాలిటీలు వచ్చాయి. జిల్లా బోర్డులు, తాలూకా బోర్డులు, గ్రామస్థాయిలో పంచాయితీల ఆధీనంలో లోకల్ ఫండ్ ఉండేది. పంచాయితీ సర్పంచ్‌ను తాలూకాదారు ఆధ్వర్యంలో గ్రామంలోని ఒక ప్రముఖుణ్ని ఎన్నుకొనేవారు. అన్ని ఖల్సా జిల్లాలలోను వసూలయిన భూమి శిస్తులో రూపాయికి ఒక అణాను స్థానిక రుసుం (లోకల్ సెస్)గా కేటాయించి, ఈ అణా భాగంలో 3 పైసలు విద్యకు, 2 పైసలు వైద్యం, 2 పైసలు రోడ్లు, 1 పైస పరిశుభ్రత ప్రజావసరాలకు ఉపయోగించేవారు.

పరిపాలనకు సంబంధించి ప్రతి జిల్లాకు కనీసం మూడు విభాగాలుండేవి. విభాగాలలోని తాలూకాకు తహసిల్దార్లు ఉండి పరిపాలనలో తహసిల్దారుకు సహకరించడానికి నాయబ్ లేదా డిప్యూటీ తహసిల్దార్లు కనీసం ఇద్దరు ఉండేవారు. ఒకతను తాలూకా హెడ్‌క్వార్టర్ లో ఉండి పరిపాలనలో సహాయం చేస్తుంటే, ఇంకొక నాయబ్ తాలూకాలో ఎప్పుడూ పర్యటిస్తూ అధికారులకు పరిపాలనలో సహకారం అందిస్తూ ఉండేవాడు. ఒక్కో తాలూకాను మూడు నుంచి నాలుగు సర్కిళ్లుగా విభజించి దానిని 'హల్కా' అని పిలిచేవారు. ఒక హల్కాకు ఉండే రెవెన్యూ ఇన్‌స్పెక్టర్‌ను 'గిర్‌దావర్' అనేవారు. ఈ గిర్‌దావర్‌లు తమ పరిధికి వచ్చిన గ్రామాలలో భూమి శిస్తు వసూలు, కొలతలు, భూమి హద్దులు నిర్ణయించడం, ఆహార ధాన్యాలను వ్యవసాయదారుల నుంచి వారికి విధించిన లెవీ ప్రకారం సేకరిస్తుండేవారు.

ప్రతి గ్రామానికి ఒకటి లేదా రెండు శివారు (మజరా) గ్రామాలుండేవి. ప్రతి గ్రామానికి వారసత్వారీత్యా అధికారం సంక్రమించిన గ్రామాధికారులు మాత్రమే ఉండేవారు. ఈ వారసత్వ అధికారమైన పటేల్‌గిరి, పట్వారీగిరి, దేశ్‌ముఖ్ లేదా దేశ్‌పాండ్యాగిరి తరచుగా ఒకే కుటుంబానికి గాని, లేదా ఒక్కోసారి ఒక్కరికే ఈ అన్ని అధికారాలు ఉండేవి. ఈ వాటన్‌దారులు సహజంగా పెద్ద భూస్వాములుగా ఉండేవారు. వీరికి గ్రామాల పై చాలా పట్టు ఉండడం వలన వారసత్వ రీత్యా గ్రామాధికారిగా నియమింపబడిన 'అసలుదారులు' కాని, అసల్‌దారులచే భూమిశిస్తు వసూలుకు నియమింపబడే గుమాస్తాలు కాని ఈ దేశ్‌ముఖ్‌లు, దేశ్ పాండ్యాలు, సర్ దేశ్‌ముఖ్‌లు, సర్ దేశ్‌పాండ్యాలపై ఆధారపడి శిస్తు వసూలు, గ్రామరెవెన్యూ పరిపాలనలోని ఇతర విధులను నిర్వర్తించాల్సి వచ్చేది.

భూమి పై హక్కు రకాలు : ప్రజలకు భూమిపై సాగు చేసుకొనే హక్కు కాని, అధికారం కాని ఉన్నవారికి లేదా, పొందిన వారికి భూమిని తన ఆధీనంలోనే ఉంచుకొనే హక్కు రకరకాల రూపంలో ఉండేది. ఖల్సా భూముల (దివాని)లో భూమి శిస్తు కట్టినంతకాలం తన ఆధీనంలోనే భూమి ఉండే హక్కు కలిగిన వ్యక్తిని **'పట్టాదారు'** అంటారు. భూమి ఇద్దరు లేక ఇంకొందరి ఆధీనంలో సాగుచేసుకొనే అధికారం మాత్రమే ఉండి, వీరందరికీ పంటపై సమాన హక్కు ఉంటే వారిని **'పోట్ - పట్టాదార్'** అంటారు. భూమి ఉన్న వ్యక్తి వేరే ప్రదేశంలో నివసించడం, వ్యవసాయాన్ని స్వంతంగా చేయలేని పరిస్థితిలో ఉండడం లేదా వేరే వృత్తిలో స్థిరపడిన సందర్భాలలో, అలాంటి వారి భూమిని వ్యవసాయం చేయడం కోసం తీసుకొని సాగు చేస్తున్న వారిని **'షిక్ మదార్'** లేదా **'అసామి షిక్మి'** అంటారు. వీరిలో షిక్‌మదార్ రక్షిత కౌలుదారు (ప్రొటెక్టెడ్ టెనెంట్)గా నమోదు కాబడి ఆ భూమిపై వచ్చే ఆదాయానికి హక్కుదారుగా ఉంటాడు. అదే అసామి షిక్మి భూమిపై తాత్కాలిక వ్యవసాయదారుడిగా మాత్రమే ఉండి, పట్టాదారునికి అతనిని భూమిపై నుండి ఎప్పుడైనా వెళ్లగొట్టే అధికారం ఉంటుంది. అసామి షిక్మి ఒకే భూమిపై పన్నెండు సంవత్సరాలు నిరంతరాయంగా వ్యవసాయం చేస్తే అతను కూడా షిక్‌మదార్ అవుతాడు.

ఖల్సా భూములలో ప్రభుత్వం నుంచి చాలా తక్కువ మొత్తంలో భూమి శిస్తు కట్టే షరతుతో ఒప్పందం చేసుకొని గ్రామాలలో చిన్నచిన్న కమతాల నుంచి గ్రామాలకు గ్రామాలనే తమ అధీనంలో ఉంచుకొనే హక్కుని పొందిన వారిని **'మక్తాదారు'** అంటారు. ఈ మక్తాదారులు సహజంగా భూస్వాములు, అధికారులు బాగా ధనవంతులో అయి ఉండేవారు. ఈ మక్తా లేదా పాన్‌మక్తాలు శాశ్వతంగాను, వారసత్వంగాను, లేదా జీవితాంతం సంక్రమించే విధంగా మంజూరు చేసేవారు. 1893లో వరంగల్ తాలూకా సెటిల్‌మెంట్ ప్రకారం మక్తా భూములు 406 రెట్లు పెరిగాయి. మొత్తం వరంగల్ సుబాలో రైతువారీ గ్రామాలు దివాని భూములలో 286 ఉంటే, మక్తా గ్రామాలు 271 ఉన్నాయి. ఈ మక్తా గ్రామాలన్నీ కూడా నీటిపారుదల సౌకర్యం ఉన్నవే. ఇలా సారవంతమైన భూములన్నీ కూడా అప్పట్లో ధనవంతుల చేతుల్లోనే ఉండేవి.

వ్యవసాయ యోగ్యమైన కొద్దిపాటి విస్తీర్ణాలలో ఉండే భూములను బాగు చేసుకొని సాగుచేసుకోవడానికి ప్రభుత్వం నుండి అనుమతి పొందిన వారిని **'కౌలుదారులు'** అంటారు. ఇందులో నీరుపారని భూములను సహజంగా ముప్పై సంవత్సరాల వరకూ కౌలుకు ఇచ్చే ఆనవాయితీ ఉండేది. అదే తరి భూములకు నాలుగు సంవత్సరాల నుండి నలభై సంవత్సరాల వరకూ కౌలుకు ఇచ్చే ఆనవాయితీ ఉండేది. ప్రభుత్వ భూములే కాకుండా మక్తాదారుల దగ్గర నుంచి, జాగీర్దార్ల దగ్గర నుంచి కూడా వ్యవసాయం చేసుకోవడానికి భూమి తీసుకొనే వారిని కూడా 'కౌలుదారుల'నే అంటారు.

ముళ్లచెట్లు, కంపలు, ఎత్తు పల్లాలతో వ్యవసాయానికి పనికిరాని

# నండూరి రామమోహనరావు



తెలుగు సాహితీ రంగంలో విశేష కృషి చేసిన నండూరి రామమోహనరావు (85) సెప్టెంబర్ 2 రాత్రి 7.30 కు విజయవాడలోని ఒక ప్రైవేట్ ఆసుపత్రిలో అనారోగ్యంతో చికిత్స పొందుతూ చనిపోయారు. ఆయన సాహిత్యం, సైన్స్, తత్వశాస్త్రం, అనువాదం, బాల సాహిత్యం, పాత్రికేయ రంగాలలో కృషి చేసి అమూల్య మైన రచనలు అందించారు. ఆంధ్రజ్యోతి సంపాదకుడుగా పనిచేసిన నండూరి 1927 మార్చి 24వ తేదీన కృష్ణా జిల్లా బాపులపాడు మండలం ఆరుగొలను గ్రామంలో పుట్టారు. నూజివీడు, మచిలీపట్నంలో చదివారు. రాజమండ్రి ఆర్ట్స్ కళాశాలలో విద్యార్థిగా ఉండగానే 'విజ్ఞానం' అనే 'లిఖిత' పత్రికను నడిపారు. నండూరి తన 21వ ఏటనే పాత్రికేయుడిగా తన ప్రస్థానం ప్రారంభించారు. బి.ఏ. పూర్తి చేసిన తరవాత 1947 లో తొలుత ప్రైవేటు బోధకుడిగా పనిచేసారు. అనంతరం 'జన్మభూమి ' దినపత్రిక లో ఉపసంపాదకుడిగా చేరి పాత్రికేయుడిగా జీవితాన్ని ప్రారంభించారు. 1950 లో 'ఆంధ్రపత్రిక' వారపత్రికకు మారిన ఆయన 1958-1960 మధ్యకాలంలో ఆ పత్రిక తాత్కాలిక సంపాదకత్వ బాధ్యతలు నిర్వహించారు. 1960లో సహ సంపాదకుడి హోదాలో 'ఆంధ్రజ్యోతి'లో అడుగు పెట్టారు. 1960 నుంచి 1994 దాకా ఆయన 'ఆంధ్రజ్యోతి'లో సంపాదకుడిగా ఉన్నారు. సరళంగా ఉండే ఆయన సంపాదకీయాలు పాఠకులపై మంచి ప్రభావం చూపేవి. నండూరి ఖగోళ, భౌతిక శాస్త్రాలను పరిశోధించి 'విశ్వరూపం' అనే పుస్తకం రచించారు. మానవాళి పరిణామ క్రమానికి సంబంధించిన నరావతారం, తత్త్వశాస్త్రాన్ని సులువుగా వివరించే 'విశ్వ దర్శనం' ఆయన కలం నుంచి జాలువారినవే. నండూరి.. సవ్యసాచి పేరుతో రాజకీయ వ్యంగ్య రచనలు, హరివిల్లు పేరుతో బాల గేయాలు, ఉషస్విని పేరిట కవితలు రచించారు. తెలుగు సాహిత్యంలో పాపులర్ సైన్స్ ఒక ప్రత్యేక విభాగం స్థాయి సంతరించుకోవడానికి నండూరి రాసిన 'నరావతారం', 'విశ్వరూపం', 'విశ్వదర్శనం' పుస్తకాలే ముఖ్యకారణమంటే అతిశయోక్తి కాదు . అక్షరయాత్ర, అనుపల్లవి, చిరంజీవులు, కాంచనద్వీపం, కథాగేయ సుధానిధి, చిలక చెప్పిన రహస్యం, మయూర కన్య, బాలరాజు వంటి అనేక రచనలు ఆయన చేశారు.

లేని భూములను బంజరు భూములంటారు. ఈ బంజరు భూములను బాగుచేసుకొని సాగు చేసుకోవడానికి ప్రభుత్వం వద్ద నుండి 'సనద్' పొందిన వారిని 'బంజరుదారులు' అంటారు. ఈ బంజరు భూములను సాగులోకి తీసుకురావాలంటే ప్రజలు ఆ భూముల దగ్గరే స్థిరపడాల్సిన అవసరం ఉండేది. ఇలా ఒక బంజరుదారుకు కేటాయించిన భూమిలో ఎక్కువ భాగం వ్యవసాయం యోగ్యం చేసి, కనీసం నలభై గృహాలలో వ్యవసాయదారులు అక్కడ నివాసమేర్పరచుకుంటే ఆ బంజరుదారును పటేల్‌గా ఆ భూమికి నియమించి పటేల్‌గిరికి వారసత్వంగా సంక్రమించే హక్కులు ఇచ్చే ఆనవాయితీ ఉండేది. దీంతోపాటు ఇలాంటి భూములకు 1/4 వంతు భూమి శిస్తు శాశ్వతంగా రద్దు చేసే పద్ధతి అమలులో ఉండేది. 1937 సంవత్సరానికంతా మెట్ట భూములకు ఇలాంటి రాయితీని రద్దు చేసి కేవలం తరి భూములకు మాత్రమే 1/4 వంతు భూమి శిస్తు రద్దు చేసే విధానం కొనసాగించారు. ఈ బంజరు భూములకు 'సనద్' పొందడానికి చాలా పోటీ ఉండేది. అందుకు ఉదాహరణ చీఫ్ సెక్రటరీ అయిన అహ్మదుల్లా ఖాన్ నవాబ్ సాహెబ్ వరంగల్ జిల్లా దోర్నకల్‌కు బంజరు దారుగా ఉన్నాడు. ఇక ఫస్ట్ తాలూకాదారైన సయ్యద్ నయీముద్దీన్ వరంగల్ తాలూకాలోని హబీబ్‌నగర్‌కు బంజరుదారుగా ఉన్నాడు.

1866కి ముందు ఒక నిర్ధారిత ప్రాంతానికి ప్రభుత్వం నిర్ణయించిన పన్నును ముందుగానే జమచేసి ఆ ప్రాంతంలో అన్ని రకాల పన్నులను వసూలు చేసుకొనే అధికారం పొందిన వాళ్లను 'తాహుద్‌దారులు' అంటారు. వీరు సాధారణంగా బాగా పలుకుబడి కలిగిన దేశ్‌ముఖ్‌లు, దేశ్‌పాండ్యాలు లాంటివారే ఉండేవారు. 1854లో సర్ సాలార్‌జంగ్-1 ఈ విధానాన్ని రద్దుచేసి సాగు చేసుకొనే వాళ్లే పన్ను ప్రభుత్వానికి కట్టే విధానం ప్రవేశపెట్టాడు. కాని ఈ తాహుద్‌దారుల స్వాధీనంలో భూమి ఉండే పరిస్థితిలో పెద్దమార్పు రాకపోగా వీరు సారవంతమైన భూములను తమ ఆధీనంలో ఉంచుకొని ఇంకా లాభ పడ్డారు. పైగా వ్యవసాయ యోగ్యం కాని భూములను ప్రభుత్వానికి అప్పగించి వసూలైన పన్నులలో వీరికి పెన్షన్ (రుసుం-ఇ-జమీందారీ) రూపంలో ఐదు శాతం దేశ్‌ముఖ్‌లు, రెండున్నర శాతం దేశ్‌పాండ్యాలు వాటాగా కూడా పొంది బాగా లాభపడ్డారు. 1912లో ఒక్క వరంగల్ సుబాలోనే రుసుం-ఇ-జమీందారీ రూపంలో వీరు ప్రభుత్వానికి ఎలాంటి సేవ చేయకపోయినా రు. 1,60,671 చెల్లింపులు చేసింది.

ఇంతకు ముందు సాగులో ఉన్న భూములనే తరువాత ఏదో ఒక కారణంతో వ్యవసాయం చేయకుండా ఖాళీగా వదిలేసిన పెద్ద పెద్ద కమతాలను ఐదు నుంచి ముప్పై ఏళ్ల కాలంలో సాగుచేసి అభివృద్ధి పరిచే షరతు మీద ప్రభుత్వం భూస్వాములకు కౌలుకు ఇచ్చేది. ఈ భూములను సాగు చేయడానికి తీసుకొనే వాళ్లను **'ఇజారాదారులు'** అనేవారు. కేవలం ఈ భూమిని అభివృద్ధి చేయడానికే సాలార్‌జంగ్-1 ఈ ఇజారా పద్ధతిని 1878లో ప్రవేశపెట్టాడు. ఈ భూములను సామాన్యంగా వేరేచోట ఉండి భూములను సాగుచేయించే భూస్వాములే (ఆబ్‌సెంట్ ల్యాండ్ లార్డ్స్) తీసుకొనేవారు. ఇలా ఉచితంగా భూమి తీసుకోవ డానికి పోటీ ఎక్కువడం, భూమిని వ్యవసాయం చేసేదెవరైనా భూస్వాములే తమ ఆధీనంలో ఉంచుకోవడం వలన 1909లో ఈ విధానాన్ని రద్దుచేసి ఈ భూములపై హక్కులను విచారించి నిర్ణయించడానికి 'ఇజారా సెటిల్‌మెంట్' అధికారిని నియమించారు. సెటిల్‌మెంట్‌లో కొద్దిమంది వ్యవసాయ దారులకు మాత్రమే హక్కు ఉత్తర్వులిచ్చారు. చాలామంది ఇజారాదారులు ఈ భూములకు కొద్దిపాటి శిస్తును విధింపచేయించుకొని మక్తా భూములుగా మార్పించుకొని మక్తాదారులుగా కొనసాగారు. దీని వలన సాగుచేసే వ్యక్తులకు పెద్దగా

లాభం చేకూరలేదు. ఈ ఇజారా విధానం బ్రిటిష్ ఇండియా పాలనలో ఉన్న మిగతా రాష్ట్ర భూభాగంలో లేదు. ఒక్క హైదరాబాద్ రాష్ట్రంలోని మొత్తం 356 ఇజారా గ్రామాలలో వరంగల్ సుబాలోనే 317 ఇజారా గ్రామాలు ఉన్నాయి.

పూర్వకాలపు హిందూ రాజులు మహమ్మదీయ పాలకులకు లొంగిపోయిన తరువాత వీరికోసం కేటాయించిన భూములను సంస్థానాలు అని అంటారని చెప్పుకున్నాం. ఈ **సంస్థానాధీశులు** వీరి ఆధీనంలోని భూమి మొత్తానికి న్యాయ, పరిపాలనాధికారం కలిగి ఉంటారు. కాని ఈ సంస్థానాధీశులు ఎక్కువగా తమ వారసత్వ హక్కుల కోసం జరిగే సివిల్ తగాదాల్లో కూరుకుపోవడం, విలాసాలలో మునిగి పోవడం వలన పటేల్‌లు, పట్వారీలు వీరి ఆధీనంలో ఉన్న భూములలో వ్యవసాయదారులపై పెత్తనం చలాయించి పన్నుల రూపంలో అధిక మొత్తం వసూలు చేయడం, భూమిపై నుంచి వెళ్లగొట్టడం తరచుగా చేస్తుండే వారు. ముఖ్యంగా అడవిని నమ్ముకొని బతుకుతున్న కొండరెడ్లు, కోయల ఆధీనంలో ఉన్న భూములను తరచుగా స్వాధీనం చేసుకొని, వాటిని ఆక్రమించుకొని అదే భూములలో వారిని కూలీలుగా వీరే మార్చేవారు.

హిందూ దేవాలయాలకు పూజాధికాలు నిర్వహించడానికి పూర్వకాలం నుంచి ఆనవాయితీగా బ్రాహ్మణులకు ఇస్తున్న భూములను, తరువాతకాలంలో మహమ్మదీయ మౌల్వీలకు దర్గాలు నడపడానికి గాను అగ్రహారాలను ఇచ్చే ఆనవాయితీని ప్రభుత్వం కొనసాగించింది. ఈ భూములనే **'ఇనాం భూములు'** అంటారు. ఈ ఇనాందారుల నుండి కొద్దిపాటి భూమి శిస్తును 'క్విట్ రెంట్' రూపంలో వసూలు చేసేవారు. ఈ అగ్రహారీకులకు రెవెన్యూ యంత్రాంగంతో సంబంధం లేకుండా భూమిపై సర్వ హక్కులూ ఉండేవి. ప్రజలు కొలిచే దేవుళ్ల మీద నమ్మకంతో ప్రభుత్వం వీరికి అగ్రహారాలు ఇచ్చినా వీరుకాని, వీరి ఏజంట్లు కాని ప్రజలపై ఎక్కువ పన్నులు వేసి వేధిస్తుండేవారు.

ఇనాం భూములను కేవలం మత సంబంధమైన అవసరాలకే కాకుండా గ్రామాలలో తరతరాల నుంచి కులవృత్తులు చేస్తున్న వారికి, ప్రభుత్వ అధికారులకు సేవ చేసే వారికి, గ్రామపరిపాలనలో పాలు పంచుకొనే వారికి ఇవ్వడం ఆనవాయితీగా ఉండేది. ఈ భూములు పొందిన వారిని **'బలోతా ఇనాందారులు'**గా లేదా **'చౌతాయి ఇనాందారు'** (1/4 వంతు భూమి శిస్తు కట్టాల్సినవారు)లు అని అంటారు. వీరే కాకుండా దేవదాసీలు, జోగినీలు, దేవాలయాలలో నాట్యం చేసేవారికి కూడా భూములిస్తుండేవారు. గ్రామాలకు రకరకాల సేవచేసేవారికి మాత్రమే కాకుండా వేరేవారికి కూడా మంత్రులు తమ ఇష్టం వచ్చిన రీతిలో భూములను ఇనాంగా ఇస్తున్నారని సర్ సాలార్‌జంగ్-1 గ్రహించి 1865లో **ఇనాం కమిషన్‌ను** ఏర్పాటు చేశాడు. ఈ కమిషన్ భూమిపై హక్కులున్న వారి విచారణ చేసి సాగు చేసుకొనే వారికి 'టైటిల్ డీడ్'లు ఇవ్వడం మొదలుపెట్టింది. కొంతమంది ఇనాందారులు తమ ఆక్రమణ కాలాన్ని నిరూపించుకోలేక పోయారు, ఇలాంటి వారికి మొత్తం భూమి శిస్తు విధించో, లేదా కొంతమేర భూమి శిస్తు తగ్గించి వీరి ఆధీనంలోనే భూములుండే విధంగా నిర్ధారించారు. కాని చాలామంది ఇనాందారులు వారి వృత్తి వేరేగా ఉండడం వలన వారికి ఇనాంగా ఇచ్చిన భూమిని సాగులోకి తీసుకు రాలేకపోవడం, చాలాసార్లు పటేల్, పట్వారీ, దేశ్‌ముఖ్, దేశ్‌పాండ్యాలు ఇనాందారులను నీరు పారించుకోనివ్వకపోవడం వలన చాలా ఇనాం భూమి సాగులోకి రాకుండా పోయింది. ఇందుకోసం 1889లో (1298 ఫసలీ) సర్క్యులర్ నంబర్. నాలుగు ద్వారా తమకు 'సనద్' ద్వారా సంక్రమించిన భూమి అప్పటి వరకూ సాగుచేయక పోయినా కొత్తగా పన్ను కట్టే అవసరం లేకుండానే సాగుచేసుకోవచ్చని ప్రభుత్వం ఉత్తర్వులిచ్చింది. దీని వలన ఇనాందారులుగా ఉన్న వాటన్ దారులు, ధనవంతులు మాత్రమే బాగా లాభం పొందారు. 1912 వరకూ ఈ ఇనాం కమిషన్ పనిచేసింది. తరువాత రెవెన్యూ శాఖకే ఇనాందారులకు సంబంధించిన లావాదేవీలను పరిష్కరించే అధికారం తిరిగి అప్పగించారు. అప్పటికి హైదరాబాద్ రాష్ట్రంలో ఉన్న మొత్తం 83,000 ఇనాందారులలో 57,000 మంది దివాని భూములలోను, 26,000 మంది జాగీరు భూములలోను ఉన్నారు.

నిజాం-ఉల్-ముల్క్ తనతోపాటు ముస్లిం, హిందూ కులీనులను తను దక్కన్‌కు సుబేదారుగా ప్రకటించుకోవడానికి సహాయం చేయడానికి తనతోపాటు తీసుకొచ్చాడు. వారికి తన రాజ్యంలోని మూడో వంతు భూమిని పంచాడు. వీరిలో ముస్లింలు సైన్యాన్ని తయారు చేయడానికి, వారి స్వంత ఖర్చుకు ఇచ్చిన భూములను **పాయిగా భూములు** అంటారని ముందే చెప్పుకున్నాం. ఈ పాయిగాదార్లు లేదా జాగీర్దార్లు తమ ఇష్టం వచ్చిన రీతిలో పన్నులు విధించి ప్రజలను వేధింపులకు గురి చేస్తుండే వారు. ఈ పాయిగాదార్లు తమ ఆధీనంలోని గ్రామాలలో విద్య, వైద్యం, ప్రజావసరాలు, సర్వే సెటిల్‌మెంట్లు, పోలీస్, న్యాయ, రెవెన్యూ శాఖలను తామే ఏర్పాటు చేసుకొని స్వంతంగా పరిపాలన సాగించేవారు. పన్నులు కట్టలేని ప్రజలను కొట్టడం, వెట్టి చాకిరీ చేయించడం, వారిని గ్రామాలలో నీళ్లు వాడుకోవడం కాని, దుకాణాల నుంచి సరుకులు తీసుకోవడం గాని చేయకుండా కట్టడి చేస్తుండేవారు. వీళ్లు ప్రభుత్వం చేయించే సర్వే, సెటిల్‌మెంటుకు అంత తొందరగా ఒప్పుకునే వారు కారు. ఏదో విధంగా వాయిదా వేస్తుండేవారు. ఇందుకు ఉదాహరణ మొదటి సర్వే సెటిల్‌మెంట్ వరంగల్ తాలూకాలో 1895లో జరిగినా, 1937 వరకూ ఆదిలాబాద్‌లోని సిర్‌పూర్, ఆసిఫాబాద్ తాలూకాలలో జరగలేదు. ములుగు తాలూకాలోనైతే 1952 వరకూ అసలు సెటిల్‌మెంట్ జరగలేదు. ఈ జాగీర్దార్లు లేదా పాయిగాదార్లు తమ ఆధీనంలో ఉన్న భూభాగాల్లో సెటిల్‌మెంట్ జరగకపోవడం వలన తమ ఇష్టం వచ్చిన రీతిలో పన్ను వేసి ప్రజలను వేధించి వసూలు చేసేవారు. చివరకి వీళ్ల పరిపాలనపై అందులోని లోపాలు, తరువాత కాలంలో యుద్ధాలు జరిపే అవసరం లేకపోవడంతో వీరు సైన్యాన్ని పోషించడం కేవలం చూయించ డానికి పనికి వచ్చే విధంగా తయారవడంపై 1927లో 'రైలీ' కమిషన్ రిపోర్ట్ ఇచ్చినా కూడా 23 ఏప్రిల్ 1929న నిజాం పాయిగాదార్ల, జాగీర్దార్ల అవసరం ఉందని 'ఫర్మానా' జారీ చేసి కమిషన్ రిపోర్ట్‌ను తిరస్కరించాడు.

*(ఇంకావుంది)*

*(రచయిత రాష్ట్ర ప్రభుత్వ రెవెన్యూ అధికారి)*
*saralareddy007@gmail.com*

*సెప్టెంబర్ వీక్షణంలోని మూడు వ్యాసాలపై చర్చిస్తూ దండకారణ్యం చూపిస్తున్న ప్రత్యామ్నాయ అభివృద్ధి నమూనాను ప్రజలే కాపాడుకోవాలని అంటున్నారు* **బి.ఎస్. రాజు**

# సామ్రాజ్యవాద పెట్టుబడి - ఐక్య ప్రజాపోరాట వేదిక

సెప్టెంబర్ వీక్షణంలో వచ్చిన మూడు వ్యాసాలపై చర్చగా ఇది రాస్తున్నాను.

1. ప్రత్యామ్నాయ ప్రజా ఆర్థిక విధానాలు–అనుభవం – సోను; 2. ప్రపంచీకరణ – ఇవాళ్టి స్థితి – ఎన్.వేణుగోపాల్; 3. బతుకును హరిస్తున్న "అభివృద్ధి" – డి.వి.రామకృష్ణా రావు.

వీక్షణం నా చేతికి వచ్చే సరికి పోస్కో ఇండియా ప్రాజెక్ట్ పై ప్రచురించిన, ప్రధానమైన రెండు క్షేత్ర నివేదికలను రెండవ విడత చదువుతున్నాను. అవి :

(1) Iron and Steal : The POSCO- India Story. A field report published by Mining Zone Peoples' Solidarity Group, October 20, 2010 (<http://miningzone.org<)

(2) Tearing Through the Water Landscape - Evaluating the environmental and social consequences of POSCO Project in Odisha, India; May 2011, by Environment Support Group. (www.esgindia.org)

ఈ రెండు నివేదికలలో పొందుపరచిన సమాచారం, సమాచారాన్ని పూస గుచ్చిన పద్ధతి నన్ను రెండవ విడత చదివేందుకు కుతూహల పరచడం ఒక పార్శ్వం అయితే, అందులోని విషయ సమాచారాన్ని అవగాహన చేసుకోవాల్సిన అవసరం రెండవ పార్శ్వం. అంతేగాక నన్ను విస్మయానికి, విచారానికి, కోపానికి గురిచేసిన ఇతర అంశాలు:

– పోస్కో ప్రాజెక్ట్ వ్యవహారంలో మన పాలక వర్గాలు బహుళ జాతి కంపెనీల పట్ల, విదేశీ ద్రవ్య పెట్టుబడి పట్ల ప్రదర్శించిన అప్రజాస్వామ్యమైన , ఏహ్యమైన వైఖరి.

– భారత రాజ్యాంగానికి పూర్తి భిన్నంగా, జాతి విద్రోహంగా చెప్పుకోవలసిన తుచ్ఛ దాసోహ సంస్కృతి.

– కేంద్రం, ఒడిశా రాష్ట్ర ప్రభుత్వాల కుట్ర పూరితమైన, దారుణమైన, ప్రజావ్యతిరేక దళారీ మనస్తత్వం.

పైన ఉదహరించిన నివేదికలు బట్ట బయలు చేసిన ప్రాథమిక, ప్రధాన విషయాలను మీ ముందు ఉంచుతూ, వాటిలో వివరించిన అమూల్యమైన మిగతా సమాచారాన్ని మూల నివేదికల నుండి చదవి అవగాహన చేసుకోమని, పోస్కో ప్రాజెక్ట్ వ్యతిరేక ఉద్యమంలో తలమునకలై ఉన్న ప్రజలతోను, వారికి కొండంత అండగా ఉన్న పోస్కో ప్రతిరోధ్ సంగ్రామ సమితి తదితర ప్రజా పోరాట సంస్థలతో గొంతు, చేయి కలపమని కోరుకొంటున్నాను.

ఇక సెప్టెంబర్ వీక్షణం వ్యాసాలపై చర్చలోకి వస్తే – ఆ మూడు వ్యాసాలను నేను చర్చకు ఎందుకు తీసుకున్నానో చెప్పాలి.

విదేశీ ద్రవ్య పెట్టుబడి లేకుండా, దేశీయ వనరులను కార్పోరేట్ సంస్థలకు అప్పచెప్పకుండా, అభివృద్ధి, ప్రజా శ్రేయస్సు సాధ్యంకాదని, ఈ మార్గం మినహా వేరే ప్రత్యామ్నాయం లేదనే ఓ పచ్చి అబద్ధాన్ని నిజమని నమ్మించే బృహత్ ప్రణాళికను, పాలక మీడియా నిత్య ప్రచార కార్యక్రమంగా పెట్టుకుంది. ఈ ప్రచారమంతా నిజం కాదని, ఈ బాకా అంతా విదేశీ – స్వదేశీ పెట్టుబడికి, గుప్పెడు కార్పోరేట్లకు జాతి సర్వస్వాన్ని అడ్డగోలుగా అమ్మివేసి, శ్రామిక ప్రజా రాశులను దినకూలీలుగా, కాంట్రాక్టు పనివారిగా, విస్తాపితులుగా, మిగులు మనుష్యులుగా, హక్కులే లేని బృందాలుగా పెట్టుబడికి పాదాక్రాంతం చేయడమే అనే విషయం గత రెండు దశాబ్దాల పాలక చరిత్ర ప్రజల ముందు నిలిపిన నగ్న దృశ్యం. దీనికి పోస్కో ఓ నిలువెత్తు ఉదాహరణ.

సోను తన 'ప్రత్యామ్నాయ ప్రజా ఆర్థిక విధానాలు – అనుభవం' అనే వ్యాసంలో పాలకుల దగాకోరు–దివాలాకోరు విధానాలకు ప్రత్యామ్నాయంగా గత 30 సంవత్సరాలలో ఎన్నో ఆటుపోట్లకు గురవుతు దండకారణ్యంలో ఆదివాసీ ప్రజా ఉద్యమం, ఓ ప్రజా ప్రత్యామ్నాయ అభివృద్ధి కార్యక్రమం, స్వావలంబనా దృష్టి తోను, పర్యావరణానికి హాని లేకుండాను ఎలా రూపుదిద్దుకున్నదో వివరించారు. జనతన సర్కార్ల రూపంలో ప్రజా పరిపాలన ఎలా కొనసాగుతున్నదో, ఈ ప్రజా ప్రత్యామ్నాయ నమూనాను, ప్రాథమిక దశలోనే, పూర్తిగా వికసించ కుండానే, పాలకులు తుపాకులతో, హింసతో, హరిత వేట అనే సైనిక దాడులతో తుడిచి వేయాలని ప్రయత్నిస్తున్నారో ఆ దాడులను ప్రజా మిలిషియాలు ఎలా కాపాడుకొంటున్నాయో వివరించారు.

విదేశీ ద్రవ్య పెట్టుబడి, దేశీయ ప్రైవేటు కార్పోరేట్ పెట్టుబడులు, వారి సంపూర్ణ అజమాయిషీ, నియంత్రణ మినహా వేరే మార్గమే లేదనే వాదనకు జవాబుగాను, హైటెక్ – సాంకేతిక పరిజ్ఞానం, సాంకేతిక సలహాదారులు, హైలెవెల్ – ఆర్థిక సలహాదారులు, ఆడిటర్లు, టిప్పు–టాపు ఐ ఏ ఎస్ /ఐ పి ఎస్ అధికార్లు, రాజకీయ బ్రోకర్లు/దళారీలు, కాంట్రాక్టర్లు, ఏ మాత్రం అవసరంలేని ఓ ప్రజా ప్రత్యామ్నాయ రాజకీయ–ఆర్థిక–సామాజిక ఆర్థిక నమూనా నిర్మాణం ఎలా సాధ్యమో, దండకారణ్య ఉద్యమం చూపిస్తోంది. అటువంటి నమూనాను భారత దేశ శ్రామిక ప్రజల ముందు నిలబెట్టింది. ప్రజలు మేల్కొని, చైతన్యంతో

తమ వెనకబాటుకు కారణమైన మూలాలను అర్థం చేసుకొని, స్వచ్ఛందంగాను, ఉత్సాహంగాను తమ సొంత శక్తి యుక్తులను, తమ ప్రాంతీయ పరిస్థితులకు అనుగుణంగాను, క్రమానుగతంగాను, అందుబాటులో ఉన్న వనరులను సజావుగా వినియోగించుకుంటూ స్వచ్ఛంద ప్రజాస్వామ్య విలువలతో కూడిన అభివృద్ధికి పునాదులు వేసుకుంటున్న దృశ్యం జనతన సర్కార్ల రూపంలో వెలుగొందడం ప్రజా ఉద్యమాలలో వచ్చిన ఓ ఆశావహ పరిణామం.

ఇటువంటి ఓ పరిణామానికి ఎన్నో త్యాగాలు చేయాల్సి వచ్చింది. ఎన్నో ఒడుదుడుకులు, ఎత్తు పల్లాలు అధిగమించ వలసి వచ్చింది. అమూల్యమైన నాయకత్వాన్ని, పోరాడే ప్రజలను ఉద్యమాలు కోల్పోవలసి వచ్చింది. కేవలం పెట్టుబడికి కావలికుక్క అయిన ఈ రాజ్యం అలవిమాలిన, దుర్మార్గమైన హింసను అమలు చేయడమే దీనికి కారణం. కపట శాంతి ప్రవచనాలను వల్లించే పాలకులు అన్ని ప్రజా ఉద్యమాలలో సహజ సిద్ధంగా ఉండే శాంతియుత ప్రజాస్వామిక ఆకాంక్షలను కాలరాసి పనిగట్టుకుని అటువంటి ఉద్యమాల నన్నిటిని కుట్రపూరితంగా తామే హింసాత్మకంగా మార్చి వేస్తాయని చెప్పడానికి ఉదాహరణలు కోకొల్లలు. తెలంగాణా రాష్ట్ర సాధనోద్యమం దీనికో తాజా ఉదాహరణ. ఒడిశాలోనే కాక పలు రాష్ట్రాలలో పోసుకోలు ప్రాజెక్టులు వద్దంటూ జరుపుతున్న శాంతియుత ఉద్యమాల నన్నిటినీ ఏదో రకంగా హింసను ప్రయోగించి అణచివేయాలనే మంత్రమే పాలకులు ఎన్నుకొన్న మార్గం. ఇక ముందు పాలక హింస అతి క్రూర రూపం తీసుకోవడం అనే విషయం కూడా తేట తెల్లమే. పోస్కో వంటి అనేక ఇతర ప్రాజెక్టులు అన్ని మౌలిక రంగాలలోను పాలకులే పేరు పెట్టి కొన్న ఎర్ర కారిడార్ పొడవూతా పొంచి ఉన్నాయి. వీటి అమలుకు, ఉద్యమిస్తున్న ప్రజలు, వారి తరఫున గట్టిగా నిలబడ్డ బుద్ధిజీవులలోని ఒక పార్శ్వం ఆటంకంగా ఉన్నారు. ప్రధానంగా మావోయిస్ట్ పార్టీ, తదితర ప్రజా పక్ష సంఘాలు పాలకుల ఆగడాలకు ఆటంకంగా నిలుస్తున్నాయి.

అమెరికా, యూరప్, అరబ్, చైనా, భారత్, లాటిన్ అమెరికా ఇత్యాది దేశాలలో పెట్టుబడి నిజ స్వరూపం మరింతగా బయటపడింది. అన్నిచోట్ల అది శ్రామిక ప్రజల జీవితాలలో బీభత్సాన్ని సృష్టిస్తోంది. అన్నిచోట్లా ప్రజలు లక్షలలో ఈ విధానాలను వ్యతిరేకిస్తున్నారు. అయినప్పటికీ పెట్టుబడి అనే మహమ్మారిని ఎదుర్కొనే ప్రణాళికాబద్ధమైన కార్యాచరణను రూపొందించు కోవడంలో వెనుక ముందవుతున్నారు. మనవరకు చూస్తే ఇప్పుడు పెట్టుబడికి నమ్మిన బంట్లుగా ఉన్న సోనియా–మన్మోహన్–చిదంబరం–ప్రణబ్‌ల ముఠా అమెరికా పెద్దన్నకు పేలవంగా కనిపిస్తోంది. ఇండియాలో తమ పెత్తనాన్ని, గ్రాండ్ కార్యాన్ని వీరు నిర్వర్తించలేరనే ముగింపుకు వచ్చింది. అందుకనే చకచకా పావులు కదిలాయి. ఓ అన్నా హజారే అవినీతి పై యుద్ధంపేర మొదటి సీన్‌గాను, వెంటనే సుప్రీంకోర్ట్ మోడి కేసును కిందికి దించడం రెండో సీన్‌గాను, అమెరికా కాంగ్రెస్ రిపోర్ట్ మోడిని మొనగాడిగా గుర్తించడం మూడో సీన్‌గాను, గాడ్ ఈజ్ గ్రేట్ అని ఓ మాటతో మోడి కాబోయే భారత ప్రధానిగా సద్భావన సీన్‌ను తదుపరి సీన్‌గాను మనం చూడవచ్చు. పెట్టుబడి తన కార్య నిర్వహణకు మోడిని ఎంచుకున్నది. అందుకే అతని మోత మోగటం మొదలైంది. ఇక ముందు ఆ మోత ఏ స్థాయిలో ఉండబోతుందో సులభంగానే ఊహించవచ్చు. అవును ఈ దేశంలో భగవంతుడు పెట్టుబడికి ఎప్పుడో అమ్ముడు పోయాడు. పాపుల రక్షకుడుగా మారి పోయాడు. తన నీతిని తిరగేసి రాసుకున్నాడు. ఇపుడతను 'దుష్ట శిక్షణ –శిష్ట రక్షణ' పాత పద్ధతిగా నిర్ణయించుకుని తన మూల ధర్మాన్ని 'శిష్ట శిక్షణ – దుష్ట రక్షణ' అనే నియో లిబరల్ సూత్రంగా తిరగ రాసుకున్నాడు. అందుకనే పై వారికి నేల–నీరు–నిప్పు–గాలి, మడులు–మాన్యాలు–గనులు, కిందివారికి కష్టాలు–కడగండ్లు–తూటాలు ప్రసాదాలుగా పంచుతున్నాడు. అటువంటి దేముడినే మోడి 'గాడ్ ఈస్ గ్రేట్' అని అనకుండా ఎలా ఉంటాడు?

దండకారణ్య ఉద్యమం ఈ దేశంలో శ్రామిక ప్రజల కిచ్చిన కానుక జనతనా సర్కార్. ఇది పసిబిడ్డ. దీనిని నంజుకు తినడానికి పులులు, తోడేళ్లు పొంచి ఉన్నాయి. ఈ బిడ్డ ఎట్టి పరిస్థితులలోను ఎదగ కూడదు. ఎదిగితే పాలకులకు ప్రమాదం. పెట్టుబడికి ప్రమాదం. ఈబిడ్డ పులుల తోడేళ్ల బారిన పడితే ప్రజలకు నష్టం. ప్రజల ప్రత్యామ్నాయ మనుగడకు జీవన విధానానికి ప్రమాదం. తప్పదు, ప్రజలు పులులబారి నుండి బిడ్డను కాపాడు కోవాలి. పులులు బిడ్డను భక్షించాలి, వాటి మనుగడకు అది తప్పదు. అందుకే హరిత వేట. ఈ వేట నుండి బిడ్డను కాపాడుకోవడమంటే, పులుల ఆయువు పట్లన్నటిపై ప్రజా సంఘటిత ఉద్యమాల విస్తృతి పెరగాలి. కొత్త రూపాలు సంతరించు కోవాలి. అన్ని సెక్షన్ల ప్రజారాశులలో పెట్టుబడి పై పోరాడవలసిన అగత్యాన్ని, స్పృహను పెంచవలసి ఉంది.

పెట్టుబడి పై చెయ్యాల్సి ఉన్న పోరాటాన్ని వివిధ సెక్షన్ల ప్రజలు సొంతం చేసుకునేలా ఉద్యమాలు ఎదగవలసి ఉన్నది. దీనికి కావాల్సిన ఓ ఐక్య వేదికను, నాయకత్వాన్ని తీర్చిదిద్దు కోవాల్సిన సమయమిది. పోస్కో వ్యతిరేక ప్రజా ఉద్యమాన్ని కేంద్ర బిందువుగా చేసుకుని ఇటువంటి ఎన్నో అన్యాయమైన ప్రాజెక్టులను ఎదుర్కొనే ఉద్యమం దేశం నలు మూలలా వ్యాపింప చేయవలిసి ఉన్నది. మన దేశ ప్రధాని మన్మోహన్ సింగ్ పోస్కో వంటి జాతి వ్యతిరేక పద్ధతినే గొప్ప అభివృద్ధి నమూనాగా శ్లాఘిస్తూ ప్రజలపై హింసాత్మకంగా రుద్దుతున్నాడు. ఈ ప్రమాదకర దాసోహాన్ని ఎదుర్కోక పోతే మున్ముందు యావత్ భారత సమాజంలోని మెజార్టీ ప్రజా రాశులు దుర్భరమైన పరిస్థితులకు తమకు తాముగా బలి చేసుకోవడమే అవుతుంది.

ఇక ప్రజా వ్యతిరేక పోస్కో ప్రాజెక్ట్‌పై రామకృష్ణరావు రాసిన వ్యాసం గురించి చర్చిద్దాం. ఒడిశాలోని జగత్సింగపుర ప్రాంతంలో రాబోయే పోస్కో ప్రాజెక్ట్ అక్కడ ప్రశాంతంగా నివసిస్తున్న ప్రజల బతుకును ఎలా హరించి వేయగలదో ఈ వ్యాసంలో వివరించారు. ప్రజలపై హింస తిరిగి మొదలవ్వడాన్ని ఎత్తి చూపారు. ఇక్కడ చిన్న పిల్లలు కూడా పెద్దలతోపాటు పోస్కో వ్యతిరేక పోరాటంలో పాల్గొంటూ యువకులుగా ఎదగడం వారి పోరాట పటిమ గురించి తెలియ చెప్పడమే కాకుండా ప్రాజెక్ట్ సంబంధిత లెక్కలు, ప్రాజెక్టు వల్ల ప్రజలకు జరిగే నష్టాలను వివరించారు. నేను పోస్కో వ్యవహారంలో దాగి ఉన్న మరికొన్ని విషయాలను విశదీకరిస్తాను. ఎన్విరాన్మెంట్ సపోర్ట్ గ్రూప్ (ఇ.ఎస్.జి.) ఈ జగత్సింగ్పూర్ ప్రాంతపు ప్రకృతి సౌందర్య వర్ణన చదివితే తెలుస్తుంది మనం ఎంతటి సుందరమైన, వైవిధ్య భరితమైన, చారిత్రాత్మకమైన,

సమతుల్యమైన, ప్రజల జీవితాలతో పెనవేసుకుని ఉన్న పచ్చని ప్రకృతిని, పర్యావరణాన్ని ఈ పోస్కో ప్రాజెక్ట్ వల్ల పోగొట్టుకుంటామో! అంతేగాక అసలు ఈ ప్రాజెక్టును ప్రజలపై రుద్దాలనుకునే పాలకుల అభివృద్ధి నమూనా వెనుక దాగి ఉన్న రాక్షసత్వం తెలిసివస్తుంది. నివేదిక రాసిన వారి కవితాత్మను తెలుగులో అనువదించే సత్తా నాకులేదు కాబట్టి, ఆ వర్ణనను ఇంగ్లిష్‌లోనే చదవవమని కోరుతున్నాను.

ప్రజలు-పర్యావరణం కేంద్రంగా ఆలోచించడం మొదలు పెడితే గానీ తెలవదు ఇప్పుడు మనమందరం గొప్ప అభివృద్ధి అని డప్పు కొట్టుకొంటున్న శ్వేతజాతి అభివృద్ధి నమూనా ఎంతటి అమానుషమైనదో, పైశాచికమైనదో. ఇక ఈ పోస్కో ప్రాజెక్ట్‌లో ఇమిడి ఉన్న ఆర్థికపరమైన మోసం ఎంతో లెక్కల వివరాలలోనికి వెడితే గానీ తెలియదు. అదేమిటో కొంచం తెలుసుకుందాం.

మైనింగ్ జోన్ ప్రజా మద్దతు సంస్థ తన నివేదికలో ఏమి చెపుతోందో చూద్దాం. అసలు ఈ ప్రాజెక్ట్ వెనుక అప్పనంగా భోజనం చేయడానికి వేసుకున్న ప్లాన్ - స్టీల్ ప్లాంట్ పేరు చెప్పి, ఉద్యోగాల దొంగ లెక్కలు చెప్పి, పన్నుల వల్ల ప్రభుత్వానికొచ్చే కాకి లెక్కలు చూపి, ప్రపంచంలోనే ప్రసస్తమైన, నాణ్యత కలిగిన, ప్రపంచ మార్కెట్లో మెట్టు రేటు పలికే ఖాందార్ కొండలలోని ఇనుప ఖనిజపు కుప్పలు రాయించుకు దొబ్బడం. ప్రపంచ మార్కెట్లో ఇనుప ఖనిజానికి పెరిగే గిరాకీని దృష్టిలో పెట్టుకుని రచించుకున్న కుట్ర ఇదంతా. ఒప్పదం నాటికి మన మూర్ఖ దళారీ పాలకులు మన ఇనుప ఖనిజాన్ని టన్ను 270-300 రూపాయలకు అమ్ముకుంటున్నారు. 2002-2003 నాటికి 300 రూపాయలుగా ఉన్నధర 2005-2006 నాటికి 5000కి ఇప్పుడు 10,000 /12,000 రూపాయలకి చేరింది. ఖాందార్ ఇనప ఖనిజానికి పలికే ధర ఎక్కువ. ఈ నివేదికలో ఇచ్చిన లెక్కల ప్రకారం ప్రభుత్వానికి పోస్కో ఇచ్చే 10 శాతం రాయల్టీ , తదితర అన్ని ఖర్చులూ పోను తను పొందే వార్షిక నికర లాభం అధమ పక్షం 6500 కోట్ల రూపాయలు. ఇది కూడా టన్నుకు 4250 రూపాయలుగా లెక్కకడితే. పోనీ ఇలాగె చూసినా 30 సంవత్సరాల ఒప్పంద కాలానికి 1,25,000 కోట్లు. తను చూపిన ప్రాజెక్ట్ పెట్టుబడి 30 ఏళ్లల్లో 52,000 కోట్లు. పోనీ ఇదంతా ఒకే విడత పెడుతుంది అని లెక్క కట్టినా మొదటి ఎనిమిది ఏళ్లల్లో ఇది వెనక్కి రాబట్టుకొంటుంది.

ఇంకొక వింత ఏమిటంటే- పైన ఇచ్చిన గణాంకాలు పోస్కో ఉక్కు ఫ్యాక్టరీకి ఉపయోగించబోయే ఇనుప ఖనిజంపై అది సంపాదించే డబ్బు వరకే. ఒప్పందం ద్వారా పోస్కోకి మన తుచ్ఛ పాలకులు ప్రసాదించిన వరం ఏమంటే, పోస్కో సంవత్సరానికి నాలుగు వందల మిల్లియన్ టన్నుల చొప్పున 30 సంవత్సరాలపాటు ఖాందార్ గనుల నుండి ఇనుప ఖనిజపు ఎగుమతి చేసుకునే హక్కు. దీనికోసం వారికి ప్రత్యేకంగా ఓ ఓడరేవు కట్టుకుని సొంతం చేసుకునే హక్కు. గాలి రెడ్డి సోదరుల భాగోతం ఇప్పుడు అంతా చూస్తున్నారు. ఇక పోస్కో భాగోతం చూడ బోతారు. అయితే ఇది పైకి కనిపించని విధంగా యుక్తిగా అల్లిన బహుళజాతి కంపెనీల మాయ. రిలయెన్స్ గ్రూప్ చమురు బావుల దోపిడీ చిట్టా విప్పితే కళ్లు చెదిరి పోతాయ్. ఇది చెయ్యాల్సిన పని.

ఇప్పటి విషాద మేమంటే - ఏ కొద్ది మందో తప్పిస్తే, ఆలోచించే, చదివే, రాసే, విశ్లేషించే శక్తి ఉన్న చాలా మంది క్షేత్ర స్థాయిలో కార్మిక-కర్షక, శ్రామిక ప్రజా రాశులకు దూరంగానే ఉండి పోవడం. వీరిలో ఏ కొద్ది మందో తప్ప, అధిక శాతం తెలిసో- తెలియకో, అవసర రీత్యానో, బతుకు తెరవుకో, భయాందోళనల వలనో, ఇప్పుడు దేశంలో జరుగుతున్న ప్రజా వనరుల నిలువు దోపిడీని అడ్డుకోవడానికి ముందుకు రావడం లేదు. భహుసా, ఈ పరిస్థికి ఇంకొక ప్రధానమైన కారణం, ఓ బలీయమైన ఐక్య ప్రజా ఉద్యమ నిర్మాణాల ఆవశ్యకత ఎడల ఏర్పడి ఉన్న ఆలోచనలలోని గందరగోళం, ఆచరణలో చిన్న చూపు, అలసత్వం. అంతేగాక విడివిడి సమస్యలపై విడివిడి గాను, దేనికి దానికే ఆ సమస్య పరిధిని కుదించి పోరాడే పద్ధతిలో వివిధ ప్రజా రాశులు ఉండిపోవడం వల్ల కూడా కార్పొరేట్లు దూకుడుగా ప్రజా వనరులను సొంతం చేసుకోవడానికి దోహద పడుతోంది. ఇందు మూలంగా ప్రజల అత్యంత ప్రధానమైన, కీలకమైన , మిగతా అన్ని సమస్యలకు కేంద్ర బిందువైన వనరుల దోపిడీని ఎదుర్కొనే సత్తా ఎదగడం లేదు. అన్ని వర్గాలు ఐక్యమై ఎదుర్కొని నిలువరించ వలసిన అంశం వెనుకబడిపోయి మొత్తంగా దేశ ప్రజలకు ఎంతో హాని జరుగుతోంది. ఈ పరిస్థితి నుండి బయట పడి ఐక్య ప్రతిఘటన నిర్మాణం కావాలి.

ఈ సందర్భంలోనే 'ప్రపంచీకరణ - ఇవాళ్టి స్థితి' వ్యాసకర్త ప్రపంచీకరణ ఎడల సమాజం నుండి వెలువడుతున్న అయిదు రకాల అభిప్రాయాలను శాస్త్రీయ పద్ధతిలో క్రోడీకరించారు. తరువాత మొదటి నాలుగు రకాల అభిప్రాయాలు ఏ ఏ సెక్షన్లనుండి వెలువడు తున్నాయో , అవి ఏ రకంగా వాస్తవ పరిస్థితులకు దూరంగా ఉన్నాయో చాలా చక్కగా విశ్లేషించారు. 'సామ్రాజ్యవాద బహుళ జాతి సంస్థల లాభాలలోని ప్రతి డాలర్ మీద మనం వాడే సరుకుల ద్వారా ప్రవహిస్తున్న మన నెత్తురూ, చెమట అంటి ఉందని చెప్పడం వాస్తవాన్ని సూటిగా చెప్పడమే. వొలటైల్ కాపిటల్ (ఎఫ్.డి.ఐ.) అనే ఇంగ్లిష్ పదానికి 'కాలు నిలవని పెట్టుబడి' అనే తెలుగు పదాన్ని చక్కగా ప్రయోగించడమే కాక దాని దోపిడీ మూలాన్ని, లాభాల వేటలో ఉన్న దాని సారాన్ని చెబుతూ 'నిజానికి భారత ప్రజలకు ప్రపంచీకరణ అవసరం కన్న ఎక్కువగా ప్రపంచీకరణ శక్తులకే భారత దేశ అవసరం ఉంది' అనే పచ్చి నిజాన్ని ఎత్తి చూపారు. సరళీకరణ, నయాఉదారవాదం అనే కొత్త పేర్లతో చలామణీ అవుతున్న ఇప్పటి సామ్రాజ్యవాద పెట్టుబడి లో పాతకాలపు ఉదారవాద దారే లేదని, నిజానికి అది సుద్ధ సామ్రాజ్యవాదపు ప్రపించీకరణ అని నిగ్గు తేల్చారు. ఇక్కడ నేను మరికొన్ని విషయాలు చెప్పాలను కుంటున్నాను. చంద్రబాబు ఈ రాష్ట్రాన్ని పాలిస్తున్నప్పుడు, వందలలో కరీంనగర్ జిల్లాలో చేనేతకారులు ఆత్మహత్యలు చేసుకుంటున్నప్పుడు చలించి నేను ఓ 20 పేజీల రిపోర్ట్ తయారుచేసి చంద్రబాబు పేషీలో ఇచ్చాను. రెండు రోజులు తంటాలు పడితే గానీ పోలీసులు ఆ రిపోర్ట్‌ను సెక్రటేరియాట్ లోపలికి తీసుకు వెళ్ల నివ్వలేదు. ఆ రిపోర్టులో ప్రతిపాదించిన విషయాలు ఏమంటే - చేనేతలో సంక్షోభానికి మూలం మన దేశంలోని వస్త్ర రంగంలోకి దొడ్డి దారిని ప్రవేశించిన పోలీయెస్టర్, దాని మూలపురుషుడయిన అంబానికి ఢిల్లీ ప్రభువులు ఇస్తున్న వల్లమాలిన రాయతీలు, పన్ను ఎగవేతలకు దొంగ ప్రోత్సాహకాలు, యాంత్రీకరణకు ఒక్క సారే గేట్లు తెరవడం. పోలీయెస్టర్‌కున్న గొప్పలక్షణం తక్కువ సబ్బుతోను, నీటితోను

*కొన్ని కోర్టు తీర్పులు ఆయా సందర్భాలలో బాగానే అనిపించినా సారంలో ఉండే ప్రజాస్వామ్య వ్యతిరేక అంశాల పట్ల అంచనా లేకపోతే అసలు ఉద్దేశం దెబ్బతింటుందని అంటున్నారు* **చెరుకూరి సత్యనారాయణ**

# మంచి తీర్పు - చెడు ఫలితాలు

'**ఆ**దివాసులదే ఈ దేశం' శీర్షికతో వీక్షణం ఫిబ్రవరి 2011 సంచికలో, 'నిషిద్ధ సంస్థలో సభ్యుడవ్వడం నేరం కాదని' వీక్షణం మార్చి 2011 సంచికలోనూ వచ్చిన సుప్రీంకోర్టు తీర్పులు పాఠకులకు గుర్తుండే ఉంటాయి.

జస్టిస్ మార్కండేయకట్జూ, జస్టిస్ జ్ఞానసుధా మిశ్రాలు ఆ తీర్పులు ఇచ్చారు. ఆ న్యాయమూర్తులే మే9న మరో సంచలన తీర్పు ఇచ్చారు.

ప్రేమికుల పట్ల, కులాలకు, మతాలకు అతీతంగా వివాహాలు చేసుకొనే యువతీ యువకుల పట్ల వారు తమ కుటుంబ పరువు తీస్తున్నారనో, తమ కులం పరువు తీస్తున్నారనో, తమ మతం పరువు తీస్తున్నారనో సాగిస్తున్న అమానుష దాడులు, హత్యలు దేశవ్యాప్తంగా జరుగుతున్నాయి. అందులో ముఖ్యంగా హర్యానా, రాజస్థాన్, ఉత్తర్‌ప్రదేశ్ లలో చాలా ఎక్కువగా జరుగుతున్నాయి.

స్థానిక అధికారులు, పోలీసులు వీటిపట్ల నిర్లిప్తంగా వ్యవహరిస్తున్నా, ఉన్నత న్యాయస్థానాలు మాత్రం తీవ్రంగా స్పందిస్తున్నాయి. ఈ విషయంలో మనదేశ సర్వోన్నత న్యాయస్థానం కొన్ని మంచి తీర్పులిచ్చింది.

ఇటీవల ఢిల్లీకి చెందిన ఒక కేసులో పైన పేర్కొన్న న్యాయమూర్తులతో కూడిన ధర్మాసనమే ఒక తీర్పు చెప్పింది. భర్తని వదిలేసి తనకు పినతండ్రి వరసయ్యే వ్యక్తితో అక్రమ సంబంధం సాగిస్తున్న తన కూతురు సీమా తమ కుటుంబ పరువు తీస్తుందనే కోపంతో భగవాన్‌దాస్ కూతుర్ని ప్లాస్టిక్ వైరుతో ఉరివేసి చంపుతాడు.

ప్రాసిక్యూషన్ చేసిన ఈ అభియోగాన్ని విచారించిన ట్రయల్ కోర్టు భగవాన్‌దాస్‌కి మరణశిక్ష విధించింది. ఈ శిక్షని ఢిల్లీ హైకోర్టు కూడా ఖరారు చేయగా దానిపై నిందితుడు చేసుకున్న అప్పీల్‌పై ఈ తీర్పు వెలువడింది. 15 మే 2006 తెల్లవారుజామున జరిగిన ఈ హత్య గురించి మధ్యాహ్నం రెండు గంటల ప్రాంతంలో ఎవరో అజ్ఞాత వ్యక్తి ఫోన్‌లో తెలియజేయగా పోలీసులకు తెలిసింది. లేకపోతే శవాన్ని దహనం చేసేవాడని భగవాన్ దాస్‌పై పోలీసులు ఆరోపించారు. ఈ ఆరోపణలపై కింది కోర్టులు విధించిన శిక్షని నిర్ధారిస్తూ సుప్రీంకోర్టు చేసిన వ్యాఖ్యలు కొన్ని ఆహ్వానించదగినవి – 'పరువు హత్యలు చాలా సాధారణమవుతున్నాయి. ముఖ్యంగా హర్యానా, పశ్చిమ ఉత్తర్ ప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాలలో చాలా ఎక్కువగా జరుగుతున్నాయి. యువ జంటలు ప్రేమ

---

సులువుగా బట్టల ఉతకగలిగే, తొందరగా ఆరబెట్టే సౌలభ్యం. అయితే పోలీయెస్టర్ చెడులు ఎన్నో ఇక్కడ చెప్పడం కుదరదు. పోలాయెస్టర్‌ను ఎక్కడ పెట్టాలో అక్కడ పెట్టి, చేనేతలోని వెనకబాటు అంశాలను తొలగించి, చేనేత కుటుంబాలలోని వారి నేత అవసరాలకి మించి ఉన్న మానవ వనరులను ఆధునీకరించబడ్డ వస్త్ర రంగంలోనికి బదిలీ చేయడం. ఆరకంగా ప్రతి చేనేత కుటుంబానికి సాలు పొడుగునా ఆదాయ వనరు కల్పించడం. ఎక్కడికక్కడే, చేనేత కేంద్రీకరించబడ్డ ప్రాంతాలలోనే నూలు ఉత్పతి నుండి రెడీమేడ్ దుస్తుల వరకూ తయారు చేసే ఇంటిగ్రేటెడ్ ఉత్పత్తి కేంద్రాలను స్థాపించడం. ఇది అమలు చేయడానికి ప్రభుత్వం ఇప్పుడు ఖర్చు పెడుతున్న లంచాల మయమైన కుట్టు మెషిన్ల స్కీం బదులు, ఆ డబ్బును లబ్దిదార్ల పేరన మూలధనంగా పెట్టి, బ్యాంకుల రుణ సహాయంతో కలిసి నిర్వహించుకునే పద్ధతిన ఇంటిగ్రేటెడ్ ఉత్పత్తి కేంద్రాలను చిత్తశుద్ధితో రూపిందిస్తే చేనేత రంగంలో సంక్షోభమే ఉండదు. చేనేత గౌరవంగా మనుగడ సాగించవచ్చు.

మా రిపోర్టులో ఇది ఎలా సాధ్యమో వివరంగా ప్రతిపాదించాం. మాకు అవకాశమిస్తే వచ్చి చర్చిస్తాం అని చెప్పాం. అది ఏ చెత్త బుట్టలోకో అప్పుడే విసిరి వేయబడి ఉంటుంది. ఈనాటికీ చేనత అసలు సమస్యలు గుర్తించి, వాటిని తొలగించి సరైయన దారి పట్టించే ప్రణాళికా పాలకుల వద్ద లేదు. ఏమో తెలంగాణ రాష్ట్రంలో నయినా ఓ కొత్త చూపు వస్తుందేమో చూడాలి. అధికజనాభా మూలవనురుగా ఉన్న భారతదేశంలో ప్రజలకు ఉపాధి, గౌరవప్రద జీవనం ఒనకురాలంటే వ్యవసాయం–చేతి వృత్తులు–ఆధునిక పరిశ్రమల యెడల మన దృకృథం సామ్రాజ్య వాద పెట్టుబడికి పూర్తిగా వ్యతిరేక మైనదిగా ఉండి తీరాలి. ఇది ప్రజలు ఏర్పరుచుకునే ప్రజా కమిటీల వల్లే సాధ్యం. అటువంటి కమిటీలు రూపు దిద్దు కోవాలంటే సామ్రాజ్యవాద పెట్టుబడితో పోరాడి గెలవక తప్పదు. వేరే మార్గం లేదు. అయిదు శాతంగా ఉన్న పులుల పెత్తనాన్ని అడ్డుకోవాలంటే, పోస్కో లాంటి వందలాది అన్యాయమైన ప్రాజెక్టులను ఆపాలంటే, దండకారణ్యంలో ఉదయించిన బాలభానుని రక్షించుకోవాలంటే, 95 శాతం ప్రజలను కూడగట్టాలి. ఎలా కూడగట్టాలో నడుస్తున్న చరిత్ర నుండి, గత చరిత్ర నుండి నేర్చుకోవాలి. తెలంగాణ ఉద్యమాన్ని మెలుకవతో చిత్తశుద్ధితో చదవాలి.

*(రచయిత 'ఆందోళన్ ఇండియా' నిర్వాహకులు)* వీ

వివాహాలు చేసకొని పోలీసుల ద్వారా, సంరక్షణ కేంద్రాల ద్వారా రక్షణ కోరుకుంటున్నారు. తమ కుటుంబం పరువుకు, తమ కులం పరువుకు విఘాతం కలుగజేస్తున్నారనే కక్షతో వారిని హత్య చేయడానికి కుటుంబ సభ్యులు, కులపెద్దలు పూనుకోవడం ఈ ప్రాంతాల్లో సాధారణమై పోయింది. ఈ హత్య అసాధారణ మైనదిగా భావిస్తున్నాం. ఈ హత్యలకు పూనుకున్న వారికోసం ఉరి కొయ్యలు ఎదురు చూస్తుంటాయని అర్థం కావాలని' న్యాయమూర్తులు వ్యాఖ్యానించారు.

అంతటితో ఆగకుండా ఈ తీర్పు ప్రతిని దేశంలోని అన్ని హైకోర్టులకూ, జిల్లా కోర్టులకూ, ప్రభుత్వ కార్యదర్శులకూ, డి.జి.పి.లకూ, జిల్లా పోలీసు అధికారులకూ సర్క్యులేట్ చేయాలని ఆదేశించారు.

అయితే 'పరువు హత్య'లకు పాల్పడే అనాగరికులపై చర్యలు తీసుకోవాలనే సత్సంకల్పంలో ప్రజాస్వామ్య భావనలతో కూడుకున్న న్యాయవ్యవస్థ విలువల్ని చిన్నాభిన్నం చేయగల దారుణస్థితికి దారితీసే పరిణామానికి ఈ తీర్పు తెరలేపింది. తక్కువగా ఉండి, ప్రజా వ్యతిరేక ధోరణి ఎక్కువగాగల న్యాయాధిపతులతో, అంటువ్యాధిలా వ్యాపిస్తున్న అవినీతితోనూ కునారిల్లుతున్న కిందిస్థాయి న్యాయాధికారులు, పోలీసు అధికారులతోనూ నిండి ఉన్న కిందిస్థాయి పెచ్చరిల్లిపోయే అవకాశం ఈ తీర్పు కలిగిస్తుంది.

భారత సాక్ష్యాధారాల చట్టంలోని 27వ సెక్షన్‌లో పోలీసుల ముందు చేసినట్లుగా చెప్పబడే నేరాంగీకారం ఒకనాడు చెల్లుబాటు అయింది. చట్టంలో ఉన్న ఈ చిన్న లొసుగును ఆధారం చేసుకొని కొన్ని లక్షల మంది భారతీయులు వలసపాలన కాలంలో ఉరి తీయబడ్డారు. స్వాతంత్ర్యం తరువాత గుంటూరు జిల్లా పల్నాడు తాలూకాలోని పులిపాడు గ్రామానికి చెందిన పులుకూరి కోటయ్య అనే రైతు ఈ రాక్షస చట్టాన్ని సవాల్ చేస్తూ లండన్‌లోని ప్రివి కౌన్సిల్‌కి వెళ్లాడు. (మన దేశంలో సుప్రీంకోర్టు ఏర్పడిన దాకా లండన్‌లోని ప్రీవికౌన్సిలే మన దేశానికి కూడా సర్వోన్నత న్యాయస్థానంగా పనిచేసింది.) ప్రీవికౌన్సిల్ ఈ సెక్షన్ చెల్లదని చెబుతూనే ఈ 'ఒప్పుదల' ద్వారా నేరానికి ఉపయో గించిన వస్తువులు ఆయుధాలు స్వాధీనం చేసుకుంటే ఆ మేరకు ఒప్పుదల చెల్లుబాటు అవుతుందని పేర్కొంది. (ఎ.ఐ.ఆర్. 1947, పి.సి. 67)

అలాగే ప్రతిసాక్షిని పోలీసులు విచారించినట్లు, వాళ్లు పోలీసులకు నేరాన్ని గురించి వివరించినట్లు స్టేట్‌మెంట్లు రాసుకుంటారు. నేర విచారణ చట్టంలోని 161, 162 సెక్షన్‌ల ప్రకారం ఇవి రికార్డు చేస్తారు. సాక్షుల సంతకాలు ఉండవు. విచారణ సమయంలో సాక్షుల వాంగ్మూలా న్ని కాంట్రడిక్ట్ చేయడానికి తప్ప ఈ స్టేట్‌మెంట్లు దేనికీ పనికిరావు. నూటికి నూరు కేసుల్లోనూ సాక్షులు చెప్పకుండానే పోలీసులు ఈ స్టేట్‌మెంట్లు రాసుకుంటారని, నేర విచారణ ప్రక్రియతో సంబంధమున్న సమస్త జనానికి తెలుసు. ఇలాగే ఈ కేసులో ముద్దాయి భగవాన్ తల్లి ధిల్లోదేవి స్టేట్‌మెంట్ కూడా రికార్డు చేశారు. హత్య చేసినట్లు తన కొడుకు తనతో చెప్పాడని ధిల్లోదేవి ఆ స్టేట్‌మెంట్‌లో చెప్పినట్లు రాయబడింది. అయితే తాను అలా చెప్పలేదని ఆమె కోర్టులో చెప్పింది. పోలీసులు 162 సెక్షన్ కింద రాసుకున్న ధిల్లోదేవి స్టేట్‌మెంట్‌ని విశ్వసించవచ్చని ఈ తీర్పులో న్యాయమూర్తులు అభిప్రాయపడ్డారు.

నేరం ఆపాదించబడ్డ ముద్దాయిపై ఆ నేరాన్ని ఆపాదించిన పోలీసు అధికారికి వ్యక్తిగత శత్రుత్వం లేదు కనుక ఆ అధికారి సాక్ష్యాన్ని ఎందుకు నమ్మకూడదు అని ఎక్కువ మంది కిందిస్థాయి న్యాయమూర్తులు ఉటంకించే పాత చింతకాయ తొక్కునే సుప్రీం ధర్మాసనం కూడా నెత్తికెత్తు కోవడం దారుణం.

ఇటీవల మన రాష్ట్రంలోని కృష్ణా జిల్లా ఇబ్రహింపట్నంలో జరిగిన ఆయేషామీరా హత్య కేసులో సత్యంబాబు అనే నిందితుడి పట్ల పోలీసులు, న్యాయస్థానాలు ఎలా స్పందించాయో ప్రజలంతా గమనించారు. వారు నేరస్తులు కాదని హతురాలి కుటుంబ సభ్యులు గగ్గోలు పెడుతున్నా ఒకరి తర్వాత ఒకర్ని నిందితునిగా చూపుతూ చివరకు సత్యంబాబు అనే చిల్లర దొంగని నిందితునిగా నిర్ధారించారు. అడుగు తీసి అడుగు వేయలేని నరాల జబ్బుతో బాధపడే ఆ వ్యక్తి పారిపోయాడని కథ చెప్పి, 'ఎన్‌కౌంటర్' చేయడానికి ప్రయత్నించారు. ప్రజలు, మీడియా సకాలంలో స్పందించడంతో అతను దొరికాడని బుకాయించారు. డి.ఎన్.ఎ. టెస్ట్ ఫలితాన్ని మార్చడం లాంటి సునాయసమైన పనితో అతన్ని 'నేరస్తుడిగా నిరూపించారు'. ఇందులో పోలీసు అధికారులెవ్వరికీ సత్యంబాబుపై వ్యక్తిగతమైన పగలేదు.

దేశంలోనూ, ప్రత్యేకించి మన రాష్ట్రంలోనూ నకిలీ ఎన్‌కౌంటర్‌లు జరిపి వేలాది మంది విప్లవకారుల్ని హతమార్చిన పోలీసులెవ్వరికీ వారిపై వ్యక్తిగతమైన పగలేదు. ఎంతోమంది దేశభక్తుల్ని ఉరికంబం ఎక్కించిన తెల్లదొరలకూ ఆయా భారతీయులపై వ్యక్తిగతమైన పగలేదు.

ఒక్క దొంగతనం చేసిన పాపానికి తమతమ స్టేషన్లలోని మొత్తం చోరీ కేసుల్ని అతడికి అంటగట్టే పోలీసు అధికారులకు కూడా ఆ దొంగ పట్ల ఏ రకమైన శత్రూత్వమూ ఉండదు.

పై అధికారులకు లెక్కలు చెప్పడానికి తమ దగ్గరున్న గంజాయిని రోడ్డుపక్క ఫుట్‌పాత్‌లపై నిద్రించే వ్యక్తుల దగ్గర పట్టుకున్నట్లు చెప్పి వారిపై కేసులు బనాయించే ఎక్సైజ్ అధికారులకు కూడా ఆ అభాగ్యులపై ఏ రకమైన వ్యక్తిగత శత్రుత్వం ఉండదు.

తమ ఉద్యోగంలో అవకాశాల కోసమో, తమ పై అధికారుల మెప్పుకోసమో, రాజకీయ నాయకులైన తమ బాసుల్ని రక్షించడం కోసమో ఈ తప్పుడు పనులు చేసే పోలీసు అధికారులు రాసుకునే స్టేట్‌మెంట్లకి అంతటి విలువ ఇవ్వడం ఎంతటి విపరీత పరిణామాలకు దారి తీస్తుందో, ఎంతో ప్రతిభావంతమైన తీర్పులిచ్చిన న్యాయమూర్తులు మార్కండేయ కట్జూ, జ్ఞానసుధా మిశ్రాలు ఆలోచించకపోవడం అన్యాయం.

కార్గిల్ యుద్ధ సమయంలో ప్రమోషన్లకోసం అమాయకుల్ని 'టెర్రరిస్టు'ల పేరుతో కాల్చి చంపిన మిలిటరీ అధికారులున్న దేశం మనది. (కోర్టు మార్షల్ చేయబడ్డ ఆ అధికారులపై తీసుకున్న చర్యల వివరాలు బహిరంగ పరచలేదు.)

కనుక 'పరువు హత్య'లకు సంబంధించినంత వరకు ఈ తీర్పు ఆహ్వానించదగినదైనా, ఇందులో ఉన్న ప్రజా వ్యతిరేక ప్రజాస్వామ్య వ్యతిరేక అంశాల్ని పునఃపరిశీలించుకోవాల్సిన అవసరం గౌరవ న్యాయ మూర్తులకుంది.

*(రచయిత న్యాయవాది, ఇండియన్ అసోసియేషన్ ఆఫ్ లాయర్స్, గుంటూరు జిల్లా కమిటీ అధ్యక్షులు)* వీ

*అణు బాంబు విస్ఫోటన తీవ్రత, ఆ క్రమంలో దాన్నుంచి విడుదలయ్యే శక్తి గురించి వివరిస్తున్నారు*

**డా. కొడవటిగంటి రోహిణీప్రసాద్**

# అణు బాంబుల ప్రయోగాలు

అణువిచ్ఛిత్తి ప్రాతిపదికగా పేలగలిగే అణుబాంబుల్లో యురేనియం-235, లేదా ప్లూటోనియం-239 ఇంధనంగా ఉపయోగిస్తారు. ఏటం బాంబులుగా పేరుపొందిన వీటితో పోలిస్తే అణుసంయోగప్రక్రియమీద ఆధారపడే హైడ్రొజన్ బాంబులు చాలా శక్తివంతమైనవి. అణుబాంబులు, అణువిచ్ఛిత్తి, అణుసంయోగం అని మనం అంటున్నప్పటికీ నిజానికి విచ్ఛిత్తి, లేదా సంయోగం చెందుతున్నది అణుకేంద్రకం. అందుచేత శాస్త్రవేత్తల లెక్కన ఏటంబాంబులను న్యూక్లియర్ బాంబులనీ, హైడ్రొజన్ బాంబులను థర్మోన్యూక్లియర్ బాంబులనీ అనడమే సమంజసం.

యురేనియం వగైరాల్లో ప్రతి కేంద్రకవిచ్ఛిత్తిలోనూ విడుదలఅయే రెండు మూడు న్యూట్రాన్లలో కనీసం ఒకటైనా మరొక విచ్ఛిత్తికి కారణమయే పరిస్థితి ఏర్పడితే గొలుసుప్రక్రియ కొనసాగి ఒకటి రెండై, రెండు నాలుగై ఇలా ఒక సెకండులో లక్షవవంతు గడిచే లోపునే వెయ్యిరెట్లు న్యూట్రాన్లు ఉత్పత్తి కాగలవు. ఈ లెక్కన నూరు అంచెలలోనే వందలకొద్దీ టన్నుల ఇంధనం ఖర్చయిపోవచ్చు. కాని నిజానికి బాంబులలో అంత ఇంధనం ఉండదు. పైగా కొన్ని కిలోల ఇంధనం ఈ ప్రక్రియకు లోనవడంతో బాంబు పేలిపోతుంది.

కేంద్రకవిచ్ఛిత్తితో ఏటంబాంబు పేలుడులో ఎంత శక్తి వెలువడుతుందనేది అది పేలే లోపల అందులోని ఇంధనం ఎంతగా ఖర్చవుతుందనే విషయంపై ఆధారపడుతుంది. పిండికొద్దీ రొట్టె అన్న పద్ధతిలో ఏటంబాంబులో ఎంత ఎక్కువ ఇంధనం ఉపయోగిస్తే అంత ఎక్కువ శక్తివంతమైన పేలుడు సంభవిస్తుంది. వీటి శక్తి సామాన్యంగా ఒకటినుంచి 50 వేల టన్నుల టీఎన్‌టీ అనే మందుగుండు సామగ్రికి సమానంగా ఉంటుంది. వీటిలో యురేనియం-235 ఇంధనంగా ఉపయోగిస్తే దాన్ని రెండు విడి భాగాలుగా అమర్చి, అవి రెండూ అకస్మాత్తుగా దగ్గరై కీలకద్రవ్యరాశిని (క్రిటికల్ మాస్) అధిగమించే పరిమాణానికి తెస్తారు. లెక్కకు యురేనియం-235 అయితే సుమారు కీలకద్రవ్యరాశి 50 కిలోలు కాగా ప్లూటోనియం-239 అయితే సుమారు 35 కిలోలకు సమానం. కీలకద్రవ్యరాశిని మించిన పరిమాణంలో ఇంధనం ఏర్పాటు చెయ్యడం వీలవదు కనక అణువిచ్ఛిత్తి ప్రాతిపదికగా పేలే బాంబుల పరిమాణానికి హద్దు ఉంటుంది. ఇవి 50 కిలో టన్నులకు మించవు. హైడ్రొజన్ బాంబులకు ఈ పరిమితి ఉండదు.

యురేనియం బాంబు ఏర్పాటులో ఒకభాగాన్ని తుపాకీగుండు రూపంలో తయారుచేసి, దాన్ని రెండోభాగంలోని కంతలో దూరి ఇమిడిపోయేట్టు పేలుస్తారు. అవి రెండూ కలవగానే కీలక ద్రవ్యరాశి ఏర్పడి అణువిచ్ఛిత్తి గొలుసుప్రక్రియలో సాగుతుంది. హిరొషిమా బాంబు ఇటువంటిదే (పటం). అందులో 80 శాతం యురేనియం-235 ఉపయోగించారు. ఇందులో వాడిన 51 కిలోల యురేనియంలో ఒక శాతం మాత్రమే పేలిందట. తక్కినదంతా వృథాగా చెల్లచెదురయింది. బాంబు పేలుతున్నప్పుడు యురేనియం త్వరగా వ్యాకోచించి సాంద్రత తగ్గడంతో అది కీలకద్రవ్యరాశి కన్నా తగ్గిందట. మొదట్లో ఇటువంటి యురేనియం బాంబులను అమెరికా ఎక్కువ సంఖ్యలో తయారు చేసినప్పటికీ, 1992లో జరిగిన ఒడంబడిక తరవాత వీటిలో ఎక్కువ భాగం ఉపసంహరించబడ్డాయి. ఇందులో బైటికొచ్చే న్యూట్రాన్లను మళ్ళీ లోపలికి ప్రతిఫలనం చెందేట్టు మళ్ళించడానికి ఇంధనం చుట్టూతా ఒక సాంద్రమైన కవచం అమరుస్తారు. దీన్ని టాంపర్ అంటారు. హిరొషిమా బాంబులో దీన్ని టంగ్‌స్టన్ కార్బైడ్‌తో తయారుచేశారట. ఇంధనం మరీ త్వరగా వ్యాకోచించకుండా ఇది నిరోధిస్తుంది. తొలి బాంబులలో న్యూట్రాన్లను వెలువరించే పదార్థాన్ని కూడా లోపలే అమర్చేవారు. ఇది గొలుసుప్రక్రియకు తొలి ప్రేరకంగా పనిచేస్తుంది. యురేనియం బాంబు పనిచేస్తుందని శాస్త్రవేత్తలకు ఖచ్చితంగా తెలుసు కనక దాన్ని పరీక్షించలేదు. మొదటగా హిరొషిమామీద ప్రయోగించి నప్పుడు అది అనుకున్నట్టుగానే పేలింది.

ప్లూటోనియం ప్రకృతిలో సహజంగా దొరికే మూలకం కాదు. యురేనియం-238ను న్యూట్రాన్ల చేత ఢీకొట్టిస్తే అది ముందు నెప్ట్యూనియం-239గా రూపొంది ఆ తరవాత ప్లూటోనియం-239గా తయారవుతుంది. కేంద్రకవిచ్ఛిత్తి విషయంలో ఇది యురేనియం-235లాగే పనిచేస్తుంది. ప్లూటోనియం-239 ఇంధనంగా ఉపయోగిస్తే అందులో త్వరగా పేలిపోయే ప్లూటోనియం-240 కూడా తప్పనిసరిగా కూడా ఉంటుంది కనక బాంబు రూపకల్పన తుపాకీగుండు పద్ధతిలో వీలవదు. అందుకని దాని గోళాన్ని అనేక భాగాలుగా విడగొట్టి గోళం చుట్టూ పేలిన మందుగుండు ప్రభావంతో దాన్ని కేంద్రంకేసి కుంచించుకుపోయేట్టు చేస్తారు. దీన్ని అంతస్స్ఫోటనం, లేదా ఇంప్లోషన్ అంటారు. సామాన్యంగా యురేనియం బాంబుతో పోలిస్తే ప్లూటోనియం బాంబు చిన్నదిగా ఉంటుంది.

ప్లూటోనియం కొత్త పదార్థం కనక 1945 జూలైలో అమెరికాలోని న్యూమెక్సికో రాష్ట్రంలో జరిపిన తొలి అణ్వస్త్రపరీక్షలో దాన్ని



*న్యూమెక్సికోలోని తొలి అణ్వస్త్ర పరీక్ష (ఎడమ), హిరోషిమా (మధ్య), నాగసాకి నగరాలపై అణుబాంబుల ప్రయోగంవల్ల 18 కి.మీ.ఎత్తుకు లేచిన పొగమేఘం*

ప్రయోగించారు. రెండోదాన్ని నాగసాకిమీద వేశారు (పటం). అందులో 6.2 కిలోల ఇంధనాన్నీ, యురేనియం-238తో తయారుచేసిన టాంపర్‌నూ వాడారట. ఇందులో 20 శాతం ప్లుటోనియం విచ్ఛిత్తికి లోనవగా తక్కినది వృథా అయిందట. వాటికిగల సైనికసామర్థ్యం దృష్ట్యా అణుబాంబుల నిర్మాణవిశేషాలను సామాన్యంగా గోప్యంగా ఉంచుతారు. వివరాలను బాహాటంగా ప్రకటించకపోయినా, మనదేశం 1974లో జరిపిన తొలి అణుపరీక్షలో నాగసాకిమీద ప్రయోగించినదాన్ని పోలినదే పేల్చినట్టుగా చెపుతారు.

కేంద్రకవిచ్ఛిత్తి జరిగాక ఏమవుతుంది? యురేనియం-235 విషయంలో అందులో ఒక న్యూట్రాన్ చేరగానే యురేనియం-236 తయారై అది రెండుగా చీలుతుంది. ఈ చీలిక ప్రతిసారీ ఒకేలా జరగకపోవచ్చు. యురేనియం-235 చీలినప్పుడు బేరియం, క్రిప్టాన్ శకలాలుగా విడిపోవచ్చు. అలాగే ప్లుటోనియం-239 విచ్ఛిత్తి చెందినప్పుడు నియోడీమియం, సీరియంవంటివి శకలాలుగా ఏర్పడవచ్చు. ఈ ప్రక్రియల్లో శకలాల వివరాలు ముఖ్యంకాదు. ఒక్కొక్క చీలిక జరిగినప్పుడల్లా సుమారు 20 కోట్ల ఎలక్ట్రాన్ వోల్ట్‌ల శక్తి విడుదల అవుతుంది. దీనివల్ల శకలాలు రెండూ సెకండుకు 12 వేల కి.మీ. వేగంతో ప్రయాణిస్తాయి. బాంబు నిర్మాణం కారణంగా ఇవన్నీ ఎక్కువ దూరం పోనప్పటికీ వాటి శక్తి చివరికి వేడిమి రూపంలో విడుదల అవుతుంది. ఎక్స్‌రేలూ, గామాకిరణాలూకూడా ప్రసరిస్తాయి. అణువులు చాలా చిన్నవి కనక ఒక కిలో యురేనియం-235 విచ్ఛిత్తి చెందితే 80 లక్షల కోట్ల జూల్‌ల శక్తి విడుదల అవుతుంది. గంటకు 23 కి.మీ. వేగంతో కదిలే టెన్నిస్ బంతి యొక్క శక్తి ఒక జూల్‌కు సమానం. దీన్నిబట్టి అణ్వస్త్ర ప్రయోగం ఎంత శక్తివంతమైనదో అర్థం చేసుకోవచ్చు.

ఈ రోజుల్లో యుద్ధసమయంలో అణ్వస్త్రప్రయోగాలకు రాకెట్లనో, క్షిపణులనో ఉపయోగించాలనే ప్రతిపాదన సామాన్యమయింది. 1945లో అమెరికా జపాన్‌మీద వేసిన బాంబులను మాత్రం విమానాలనుంచి జారవిడిచారు. హిరోషిమా బాంబును జారవిడిచిన ఒక నిమిషం లోపల అది 600 మీటర్ల ఎత్తున పేలింది. దాదాపు 80 వేలమంది వెంటనే మరణించారు. మరొక 70 వేలమంది గాయపడ్డారు. రెండోది కొకురా అనే నగరంమీద వెయ్యాలనుకున్నప్పటికీ దాని ఎగువన మేఘాలు కమ్మి ఉన్నందున దానికి బదులుగా నాగసాకిని ఎంపిక చేశారట. దీన్ని విమానంనుంచి వదిలిన 43 సెకండ్లకు 469 మీటర్ల ఎత్తున పేలిందట. వెంటనే చనిపోయినవారి సంఖ్య 40 వేలమంది కాగా 1945 చివరకు మరొక 40 వేలమంది చనిపోయారని అంచనా.

*(రచయిత అణుధార్మిక శాస్త్రవేత్త)* వీ

# ఆలోచనల గూటికి పుల్లా పుడకా

సమాజంలోనూ, పుస్తకాలలోనూ, పత్రికలలోనూ, ఇతర ప్రచార సాధనాలలోనూ ఎన్నెన్నో తెలుసుకోవలసిన, ఆలోచించవలసిన విషయాలు ఉన్నప్పటికీ, వెలువడుతున్నప్పటికీ ప్రత్యేకంగా ఎత్తిచూపక పోవడం వల్ల వెలుగులోకి రాకుండా, ఆలోచనాపరుల దృష్టికి రాకుండా పోతున్నాయి. అటువంటి తెలుసుకోవలసిన విషయాలను మా దృష్టికి వచ్చినంతవరకు సేకరించి అందించడం ఈ శీర్షిక లక్ష్యం. ప్రజల అవగాహనల గూడును సుస్థిరంగా నిర్మించడానికే ఈ పుల్లా పుడకా.

❊ ❊ ❊ ❊ ❊

దేశంలో బడా సంపన్నులకూ, పేదలకూ మధ్య వ్యత్యాసం గురించి వ్యవస్థా విమర్శకులూ, ప్రగతిశీల ఆర్థికవేత్తలూ చెప్పే మాటలు అతిశయోక్తులని ఖండించేవారు, హాంగ్ కాంగ్ నుంచి పనిచేసే ప్రఖ్యాత బహుళజాతి పెట్టుబడుల సలహా సంస్థ సి ఎల్ ఎస్ ఎ (క్రెడిట్ లయానెస్ సెక్యూరిటీస్ ఆసియా) సెప్టెంబర్ 8న విడుదల చేసిన 'ఆసియా సంపన్నులు' నివేదిక చూడడం అవసరం. ఆ నివేదిక ఆసియా దేశాలన్నిటిలోనూ బడా సంపన్నుల గురించి, 2015 నాటికి వారి పెరుగుదల అవకాశాల గురించి వివరంగా చెప్పింది. వాటిలో భారత దేశానికి సంబంధించిన వివరాలు చూస్తే: దేశంలో 2010 చివరినాటికి కోటీశ్వరులు ఒకలక్షా డెబ్బైమూడు వేల మంది ఉన్నారు. వారి మొత్తం సంపద నలభై రెండు లక్షల కోట్ల రూపాయలు. మరో మాటల్లో చెప్పాలంటే, కుటుంబ సభ్యులందరినీ లెక్కవేసినా ఈ సంపన్నుల సంఖ్య మొత్తం దేశ జనాభాలో 0.0006 శాతం. అంటే పదివేల మందికి ఆరుగురు. కాని వారిదగ్గర ఉన్న సంపద ఆ సంవత్సరపు మొత్తం దేశ జాతీయాదాయంతో దాదాపు సమానం (2009-10 సంవత్సరానికి భారత జాతీయాదాయం రు. 44,64,081 కోట్లు అని ప్రభుత్వ గణాంకాలు). దేశంలో అసమానతలు అతి భయంకరమైన స్థితిలో ఉన్నాయనడానికి ఇంతకన్న మరొక నిదర్శనం అవసరం లేదు. ఇందులో మరొక అంశం కూడ ఉంది. 'ఐదుకోట్ల రూపాయలు మదుపు పెట్టగల స్తోమత ఉన్నవారు' అనే నిర్వచనం ప్రకారం ఈ లక్షా డెబ్బై మూడు వేల మందిని 'సంపన్నులు'గా గుర్తించారు. కాని అలా కనీసంగా లెక్కవేస్తే వారి ఆస్తి తొమ్మిది లక్షల కోట్ల రూపాయలు మాత్రమే కావాలి. అది నలభై రెండు లక్షల కోట్ల రూపాయలుగా ఉందంటే వారిలో కొందరి దగ్గరైనా ఆ కనీస మొత్తాన్ని మించి, వందల కోట్లో, వేల కోట్లో మూలుగుతున్నాయన్నమాట. 2015 నాటికి వీరి సంఖ్య 4.03,000 అయి వారి దగ్గర సంపద ఒక కోటి కోట్ల రూపాయలకు చేరుతుందని కూడ ఆ నివేదిక అంచనా వేసింది.

❊ ❊ ❊ ❊ ❊

దేశంలో పిడికెడుమంది (పిడికెడు కూడ కాదు, పదివేల మందికి ఆరుగురు!) సంపన్నుల సంపద అలా వికృతంగా పెరిగిపోతుండగా, అత్యంత భయంకరమైన అసమానతలు స్పష్టంగా కనబడుతుండగా, ప్రభుత్వం కొత్తగా పేదరికం అంటే ఏమిటో నిర్వచించి, పేదల లెక్కలు తేల్చడానికి ప్రయత్నిస్తోంది. దారిద్ర్యరేఖ నిర్వచనాన్ని మార్చి, ఆ రేఖను కిందికి దించి, దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నవారి సంఖ్య తగ్గించడానికి ప్రయత్నిస్తోంది. ఈ విషయంలో ఎప్పటినుంచో సుప్రీం కోర్టులో సాగుతున్న ఒక వ్యాజ్యంలో దారిద్ర్యరేఖ నిర్వచనం గురించి స్పష్టంగా చెప్పమని న్యాయమూర్తులు ప్రణాళికా సంఘాన్ని కోరారు. సుప్రీంకోర్టు ఆదేశాల ప్రకారం ప్రణాళికా సంఘం తన కొత్త అంచనాలను ప్రకటించింది. సెప్టెంబర్ 20న దాఖలయిన ఈ అంచనా ప్రకారం నెలకు పట్టణ ప్రాంతాలలో రు. 965 కన్న ఎక్కువ, గ్రామీణ ప్రాంతాలలో రు. 781 కన్న ఎక్కువ ఖర్చుపెట్టగలిగే స్తోమత ఉన్నవారందరూ దారిద్ర్యరేఖ పైన ఉన్నట్టే. అంటే రోజుకు తలసరి వినియోగం పట్టణ ప్రాంతాలలో రు. 32, గ్రామీణ ప్రాంతాలలో రు. 26 ఉన్నట్టయితే వారు పేదలు కానట్టే. ఈ అంకెలకు ఆధారం అర్థ గణాంక శాస్త్రవేత్త సురేష్ టెండూల్కర్ నివేదిక అని ప్రణాళికా సంఘం సుప్రీం కోర్టుకు చెప్పింది. దేశంలో పేదల సంఖ్య 70 శాతం అని అర్థశాస్త్రవేత్త అర్జున్ సేన్ గుప్తా, ప్రపంచ బ్యాంకు నిపుణులు చెపుతుండగా, 50 శాతం అని జాతీయ సలహా మండలి సభ్యుడు ఎన్ సి సక్సేనా అన్నారు. ఇప్పుడు ఆ రెండు అంకెలనూ కాదంటూ పేదలు 37.5 శాతం మాత్రమే అని సురేష్ టెండూల్కర్ అంచనాలను ప్రణాళికా సంఘం సుప్రీం కోర్టుకు చెప్పింది. ఇంతకాలం మనిషికి రోజుకు 2400 కాలరీల ఆహారం అవసరమని, అది అందని వారందరూ దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నట్టే అని చెప్పిన ప్రణాళికా సంఘం ఆ ఆహారలభ్యతను పక్కనపెట్టి, రోజువారీ ఖర్చును మాత్రం లెక్కపెట్టదలచింది. ఆ ఖర్చుతో రెండు పూటల భోజనం కాదుగదా, ఒక్కపూట మామూలు తిండి అయినా రాదని ఎందరో పరిశీలకులు లెక్కలు చెపుతున్నారు. ప్రత్యేకించి ఎకనమిక్ టైమ్స్ విలేకరి ప్రభుత్వం చెప్పిన రు. 32 తో ముంబైలో ఒక రోజు గడిపి, దానితో 738 కాలరీల ఆహారం కన్న ఎక్కువ రాదని నిరూపించారు. అంటే ప్రభుత్వం, ప్రణాళికా సంఘం తామే ఒకప్పుడు ప్రమాణంగా నిర్ణయించిన ఆహారంలో మూడో వంతు తినగలిగినా పేదలు కారని ఇప్పుడు అంటున్నారన్నమాట.

❊ ❊ ❊ ❊ ❊

అలా సముద్రంలో కాకిరెట్ట లాంటి సంపన్నులను పెంచిపోషిస్తూ, పేదల గురించీ పేదరికం గురించీ అటువంటి తప్పుడు లెక్కలు తయారు చేస్తున్న పాలకులు అత్యాధునిక, అతి ఖరీదైన ఆయుధాల కొనుగోలు మీద మాత్రం నానాటికీ ప్రత్యేక శ్రద్ధ చూపుతున్నారు. ప్రజలకు అన్నవస్త్రాలు లేకపోయినా అణ్వస్త్రాల, యుద్ధపరికరాల కొనుగోలులో భారత ప్రభుత్వం అగ్రభాగాన నిలిచి ఉంది. ప్రపంచ దేశాలన్నిటిలో అతి ఎక్కువ ఆయుధాలు కొంటున్న

దేశం భారతదేశమే. రక్షణ రంగానికి అతి ఎక్కువ కేటాయింపులను ఇస్తున్న దేశం భారతదేశమే. 2006 నుంచి 2010 వరకు ప్రపంచ ఆయుధాల వాణిజ్యంలో భారత ప్రభుత్వమే 9 శాతం కొనుగోలు చేసి ప్రథమ స్థానంలో నిలిచింది. విదేశీ ఆయుధాలను దిగుమతి చేసుకునే దేశాల జాబితాలో అప్పటిదాకా ప్రథమ స్థానంలో ఉన్న చైనాను భారతదేశం 2009లో అధిగమించింది. 2010లో అంతర్జాతీయంగా ఆయుధాల అమ్మకాలు అంతకు ముందరి సంవత్సరం కన్న 38 శాతం పడిపోగా, భారతదేశపు కొనుగోళ్లు మాత్రం 57 శాతం పెరిగి 2.1 బిలియన్ డాలర్ల (ఒక లక్షా మూడు వేల కోట్ల రూపాయల) నుంచి 3.3 బిలియన్ డాలర్ల (ఒక లక్షా అరవై వేల కోట్ల రూపాయల)కు చేరాయి. ఇంతకూ ఈ ఆయుధాల కొనుగోళ్లకు కారణం బహుళజాతి సంస్థల ఒత్తిళ్లు, నిర్ణయాధికారంలో ఉన్నవారికి ముడుపులూ మాత్రమే గాని దేశ రక్షణ అవసరాలు కాదు. ఈ ఆయుధాల కొనుగోళ్లకు కారణంగా, బూచిగా భారత ప్రభుత్వం చూపెడుతున్న చైనా ఆయుధాలు కొనుగోలు/దిగుమతి చేసుకున్న దేశాల జాబితాలో 13వ స్థానంలో, పాకిస్తాన్ ఆరవ స్థానంలో ఉండగా భారత్ మాత్రం మొదటి స్థానంలో ఉంది. ఆయుధ దిగుమతులకు పాకిస్తాన్, చైనాలు పెట్టిన ఖర్చు కన్న భారత్ పెట్టిన ఖర్చు ఏడు రెట్లు ఎక్కువ.

* * * * *

ఇబ్బడి ముబ్బడిగా పెరిగిపోతున్న భారత రక్షణ వ్యయం మీద అరుంధతీ రాయ్ వ్యాఖ్యానించినట్టు ఇంతింత ఖర్చు పెట్టి కొన్న ఆయుధాలు ఏడాదికొకసారి రిపబ్లిక్ డే కవాతులో చూపుకోవడానికో, లేదా భారత ప్రజల మీద యుద్ధం కొనసాగించడానికో తప్ప ఇతర దేశాల మీద యుద్ధానికి కాదు. ఐక్య రాజ్య సమితి విడుదల చేసిన తాజా నివేదిక 'భారతదేశంలో సాయుధ హింస అంచనా' కూడ ఇదే మాటను నిర్ధారిస్తోంది. ఆ నివేదిక ప్రకారం కాశ్మీర్ లో భారత ప్రభుత్వం నియోగించిన సాయుధ బలగాల సంఖ్య ఒక లక్షా డెబ్బై వేల మంది నుంచి ఐదు లక్షల వరకూ ఎంతయినా కావచ్చు. ఈ అంకెలలో అతి తక్కువ అంకె నిజమని అనుకున్నా, అది ప్రపంచం మొత్తం మీదనే ఒక ప్రాంతంలో నియోగించిన అతి పెద్ద సైనిక బలగం అవుతుంది. ఆ బలగం బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ మూడు దేశాల సైనిక బలగాల కన్న ఎక్కువ మంది. అఫ్ఘనిస్తాన్‌లో ఉన్న మొత్తం అంతర్జాతీయ సైనిక బలగాలకన్న ఎక్కువ. దేశ వ్యాప్తంగా ప్రజా ఉద్యమాలను అణచి వేయడానికి వాడుతున్న సైనిక, అర్ధసైనిక, పోలీసు బలగాల చేతుల్లో నానాటికీ ఆధునిక, మారణాయుధాలను పెట్టడానికే భారత ప్రభుత్వం రక్షణ వ్యయాన్ని పెంచుకుంటూ పోతోంది. అలాగే ఐక్య రాజ్య సమితి విడుదల చేసిన మరొక నివేదిక ప్రకారం ప్రపంచం మొత్తం మీద సాధారణ పౌరుల దగ్గర ఉన్న మారణాయుధాల సంఖ్య అరవై ఐదు కోట్లు కాగా, భారత దేశంలో పౌరుల దగ్గర ఉన్న మారణాయుధాలు నాలుగు కోట్లు. ఆసక్తికరమైన విషయమేమంటే ఈ నాలుగు కోట్ల ఆయుధాలలో కేవలం 15 శాతం – ఆరు లక్షల ఆయుధాలు – మాత్రమే లైసెన్సులు ఉన్నవి. మిగిలిన లైసెన్సు లేని ఆయుధాలలో అత్యధిక భాగం రాజకీయ నాయకుల దగ్గర, మాఫియాల దగ్గర, భూస్వాముల దగ్గర, సంపన్నుల దగ్గర ఉన్నాయని అందరికీ తెలిసిందే.

* * * * *

ఇరాక్‌లో సద్దాం హుసేన్ ప్రభుత్వం జనవిధ్వంసక ఆయుధాలను తయారు చేస్తున్నదనే తప్పుడు ఆరోపణతో ప్రారంభించిన జార్జి బుష్ ప్రభుత్వం, ఆ ఆరోపణ అబద్ధమని తేలిన తర్వాత కూడ ఇరాక్ మీద దాడి చేసింది. లక్షలాది మంది ఇరాక్ పౌరులను ఊచకోత కోసింది. ఇప్పటికీ ఆక్రమణ సైన్యంగా అక్కడ తిష్టవేసి కోట్లాది డాలర్లు వ్యయం చేస్తోంది. చమురు బావుల మీద అధికారం కోసం కోట్ల డాలర్ల ఆస్తులను భస్మీపటలం చేస్తోంది. ఇన్ఫర్మేషన్ క్లియరింగ్ హౌజ్ అనే వెబ్‌సైట్ ఈ బీభత్సాన్ని ఎప్పటికప్పుడు నమోదు చేస్తోంది. అధికారిక ప్రధాన స్రవంతి ప్రచారసాధనాల మీద ఆగ్రహంతో ఈ వెబ్‌సైట్ ను ప్రారంభించాననీ, ఇతరులకు సాధారణంగా అందని, తక్కువగా అందేవార్తలు, వ్యాఖ్యలు ఇవ్వడమే తన ఉద్దేశమనీ ఈ వెబ్‌సైట్ నిర్వాహకుడు చెపుతున్నారు. అమెరికాలో దక్షిణ కాలిఫోర్నియాకు చెందిన ఆ స్వతంత్ర పరిశీలకుడు ఈ వెబ్‌సైట్ ను ఒంటి చేతి మీద, పాఠకుల విరాళాలతో నడుపుతున్నారు. ఆ వెబ్‌సైట్ మీద వార్తలు, వ్యాఖ్యలు, వ్యాసాలతో పాటు, ఇరాక్ మీద అమెరికా ఆక్రమణ యుద్ధం ప్రారంభించినప్పటినుంచీ మరణించిన ఇరాకీ పౌరుల సంఖ్య, ఈ యుద్ధంలో మరణించిన అమెరికా సైనిక సిబ్బంది సంఖ్య, ఈ యుద్ధంలో మరణించిన అంతర్జాతీయ ఆక్రమణ దళాల సిబ్బంది సంఖ్య, ఇరాక్, ఆఫ్ఘనిస్తాన్ లలో యుద్ధానికి ఇప్పటివరకూ అయిన ఖర్చు అనే నాలుగు అంకెలు ఎప్పటికప్పుడు తాజాగా ప్రకటిస్తుంటారు. సెప్టెంబర్ చివరి వారానికి ఈ అంకెలు చూస్తే అమెరికా దుర్మార్గం కళ్లకు కట్టినట్టు తెలుస్తుంది: మరణించిన ఇరాకీ పౌరుల సంఖ్య 14,55,590. మరణించిన అమెరికన్ సైనికుల సంఖ్య 4,792. మరణించిన అంతర్జాతీయ బలగాల సంఖ్య 2,735. ఇప్పటికి ఖర్చయిన మొత్తం 1,254,566,897,296 డాలర్లు (అరవై ఒక్క కోటి కోట్ల రూపాయలు)!

---

*(.. 4వ పేజీ తరువాయి)*

బ్యాలెన్స్ లోపించినట్లు భావించడానికి ఎలాంటి ఆధారమూ లేదు. సామ్రాజ్యవాదులు, భారత ప్రభుత్వమూ, మీడియా అనుసరిస్తున్న కుటిల వైఖరిని, ద్వంద్వ నీతిని విమర్శలో బయటపెట్టారు. సంపాదకీయంపై విమర్శగానే కాక, ఈ మౌలిక విషయాన్ని గుర్తించాల్సిన అవసరం ఉంది. జాన్సన్ గారి స్పందనలో సహేతుకత కన్నా సెంటిమెంటు పాలు ఎక్కువగా ఉంది. ఇలాటి అంతర్జాతీయ వ్యవహారాల్లో ఇది అసలై సరైన వైఖరి కాదు. శ్రీలంక తమిళుల ప్రశ్నలను, ఆకాంక్షలను, ప్రయోజనాలను నిరాకరించే రీతిలో విమర్శ లేదని గమనించవచ్చును. శ్రీలంకలోని ఇరుపక్షాలూ తమ తమ దురహంకారాన్ని వదులుకొని, సామ్రాజ్యవాద జోక్యాన్ని కాదని, పరస్పరం చర్చల ద్వారా రాజీకి రావాల్సిన అవసరాన్ని విమర్శలో పాజిటివ్‌గా సూచించారు. అదే శ్రీలంక తమిళుల ప్రయోజనాలకు శ్రీరామరక్ష. అంతేకానీ, సామ్రాజ్యవాదుల వ్యూహంలో భాగంగా వివిధ పాశ్చాత్య దేశాలు, విస్తరణవాద దృష్టితో భారత ప్రభుత్వం, ఆయా మీడియాలు చూపించే కపట ప్రేమకి వారు లోనవడం వల్ల తమిళులకు ఒరిగేదేమీ లేదు. తమిళ మాతృభూమి, తమిళ జాతీయ. స్వయం నిర్ణయ ఆకాంక్షలకు పోరాడాల్సిన క్షేత్రం భారత్‌లోనే ఉంది, శ్రీలంకలో కాదు. చిన్న పొరుగుదేశమైన శ్రీలంకలో జోక్యం చేసుకునే ఎలాటి ధోరణి అయినా, శ్రీలంకలోనూ, ఈ ప్రాంతంలోనూ శాంతికి, అక్కడి తమిళుల ప్రయోజనాలకు భంగకరంగా ఉంటుంది. ఇప్పటికీ అలాటి ధోరణులు అంతర్జాతీయంగానూ, మన దేశంలోనూ కూడా ఉన్నందువల్ల ఈ అంశానికి ప్రాముఖ్యత ఉంది. మరోసారి రెండూ లోతుగా చదివాక పాండిత్య ప్రకర్షగా దీన్ని భావించడం సరికాదని అనిపించింది. ఏమైనా ఇటువంటి చర్చకు, మీడియా విలువలకు దోహదం చేసిన వీక్షణంకు మరోసారి అభినందనలు.

**– మరింగంటి బాపూజీ**

*హైదరాబాద్ (ఇ-మెయిల్ ద్వారా)*

## ఉరిశిక్ష వాయిదా

రాజీవ్‌గాంధీ హత్యకేసులో సెప్టెంబర్ 9న విధిందాల్సిన ఉరిశిక్షను రెండు నెలల పాటు వాయిదా వేస్తూ మద్రాస్ హైకోర్టు స్టే ఇచ్చింది. నిందితులకు క్షమాభిక్ష పెట్టాలంటూ తమిళనాడు అసెంబ్లీ ఏకగ్రీవ తీర్మానం ద్వారా విజ్ఞప్తి చేసింది. నిందితులకు ఉరితీస్తే 2047కల్లా తమిళనాడు ప్రత్యేక దేశంగా అవతరించడం తథ్యమని మరుమలర్చి ద్రవిడ మున్నేట్ర కళగం (ఎండిఎంకె) నేత వై. గోపాలస్వామి (వైగో) కేంద్రాన్ని హెచ్చరించారు. ఈలోపే హైకోర్టు ఈ ఉత్తర్వులను వెల్లడించింది.

## ఉల్ఫాతో శాంతి చర్చలు

అస్సాంలోని నిషేధిత ఉల్ఫా సంస్థతో శాంతి చర్చలు జరిపేందుకు కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఒప్పందం కుదుర్చుకున్నాయి. కాల్పుల విరమణ ఒప్పందంపై ఇరు పక్షాలు సెప్టెంబర్ 3న సంతకాలు చేశాయి. ఈ సమస్యకు రాజకీయ పరిష్కారం కనుగొనేంత వరకు, చర్చల సమయంలో తుది ఒప్పందం కుదిరే వరకు కాల్పుల విరమణ ఒప్పందం అమలులో ఉంటుందని హోం శాఖ సంయుక్త కార్యదర్శి శుభూసింగ్ తెలిపారు. అసోమీల ఉనికి, హక్కుల పరిరక్షణకు అర్థవంతమైన మార్గాలను కనుగోనేందుకు రాజ్యాంగ సవరణ చేయాలని కోరుతూ ఆగస్టులో ఉల్ఫా తన డిమాండ్స్‌ని కేంద్ర ప్రభుత్వం ముందుంచింది. ఉల్ఫా 32 ఏళ్ల తన ఉద్యమ చరిత్రలో ప్రభుత్వంతో చర్చలకు అంగీకరించడం ఇదే మొదటిసారి.

## మైనింగ్ మాఫియా అరెస్ట్

ఓబుళాపురం, బల్లారిలోని గనుల్లో అక్రమ తవ్వకాలకు పాల్పడినందుకు ఓబుళాపురం మైనింగ్ కంపెనీ డైరెక్టర్ శ్రీనివాసరెడ్డిని, గాలి జనార్దనరెడ్డితో పాటు సిబిఐ సెప్టెంబర్ 5న అరెస్ట్ చేసింది. గనుల్లో అక్రమంగా సంపాదించిన 55 కోట్ల రూపాయలను, కిలోల కొద్ది బంగారంను, నాలుగు హెలికాప్టర్లను, విదేశీ కార్లను, గనులకు సంబంధించిన కీలక పత్రాలను సిబిఐ స్వాధీనం చేసుకుంది. సిబిఐ ప్రత్యేక న్యాయస్థానం వారిద్దరికి 14 రోజుల రిమాండ్ విధించింది. ఇనుప ఖనిజం అక్రమ తవ్వకాల్లో సుమారు 174 మంది అధికారుల సహకారం ఉన్నట్లు సిబిఐ నివేదికలో పేర్కొంది.

## దేశ రాజధానిలో పేలుడు

దేశ రాజధాని ఢిల్లీలోని హైకోర్టు వద్ద సెప్టెంబర్ 7న బాంబు పేలి 15 మంది మరణించగా 60 మందికి పైగా తీవ్రంగా గాయపడ్డారు. ఈ ఘటనకు పాల్పడింది తామేనని, అఫ్జల్‌గురు ఉరిశిక్షను రద్దుచేయకపోతే మరిన్ని దాడులు చేస్తామని 'హుజీ' పేరుతో మీడియాకు లేఖ పంపారు.

## ఉత్తరాఖండ్ కొత్త సిఎంగా ఖండూరి

ఉత్తరాఖండ్‌లో బిజెపి ప్రభుత్వం అవినీతి ఆరోపణల కారణంగా సిఎం పోఖ్రియాల్‌ను తప్పించింది. పోఖ్రియాల్ స్థానంలో కొత్త ముఖ్యమంత్రిగా భువన్ చంద్ర ఖండూరిని నియమించింది. పాత మంత్రి మండలిలోని 10 మంది ఖండూరితో పాటు సెప్టెంబర్ 11న ప్రమాణ స్వీకారం చేసి పదవి బాధ్యతలు చేపట్టారు. గత లోక్‌సభ ఎన్నికల్లో రాష్ట్రంలోని 5 ఎంపి సీట్లనూ కోల్పోవడంతో, బిజెపి 2009లో ఖండూరిని ముఖ్యమంత్రి పదవి నుంచి తప్పించి రెండు సంవత్సరాల తరువాత మళ్లీ ఖండూరిని ముఖ్యమంత్రిగా నియమించింది.

## భారత్‌లో శిశు మరణాలు

మన దేశంలో ఏడాదికి 9 లక్షల మంది శిశువులు సరైన వైద్యం అందక, పోషకాహారం లేక మరణిస్తున్నారు. ప్రపంచం మొత్తం మీద సంభవిస్తున్న మరణాల్లో ఇది మూడోవంతని ప్రపంచ ఆరోగ్య సంస్థ వెల్లడించింది. వివిధ సంస్థల ఆధ్వర్యంలో 20 ఏళ్లపాటు 193 దేశాల్లో ఈ అంశంపై సర్వే చేశారు. ఈ సర్వే ప్రకారం దేశంలో నెల రోజుల లోపు వయస్సున్న శిశువులు 2009లో 9,07,820 మంది మరణించారు.

## భయంగొల్పుతున్న భూకంపాలు

భూకంప తీవ్రత వల్ల ఒక్క సిక్కింలోనే భవనాలు కూలి 41 మంది మరణించారు. సెప్టెంబర్ 18న సంభవించిన భూకంపంతో రోడ్లు, భవనాలు ధ్వంసమయ్యాయి. మొబైల్ టవర్లు, విద్యుత్ టవర్లు పడిపోవడంతో సమాచార వ్యవస్థ, విద్యుత్ సరఫరా పూర్తిగా నిలిచిపోయింది. భూకంపం వల్ల పశ్చిమ బెంగాల్‌లో 10 మంది. బీహార్, నేపాల్, టిబెట్‌లలో ఏడుగురి చొప్పున 21 మంది ప్రాణాలు కోల్పోయారు. పునరావాస కార్యక్రమాలను చేపట్టేందుకు ఆయా రాష్ట్రాల ప్రభుత్వాలు, కేంద్ర ప్రభుత్వం చర్యలు తీసుకుంటున్నాయి.

## గోవాలో గనుల కుంభకోణం

గోవాలో రాష్ట్ర ప్రభుత్వానికి రాయల్టీ చెల్లించకుండా, రు. 3500 కోట్ల ఇనుప ఖనిజాన్ని విదేశాలకు ఎగుమతి చేసినట్లు గోవా ప్రజా పద్దుల సంఘం (పిఎసి) అంచనావేసింది. లీజు సమయం దాటి పోయినా తవ్వకాలు కొనసాగిస్తున్న 48 మైనింగ్ కంపెనీలకు ముంబై హైకోర్టు ఆగస్టు 26న నోటీసులిచ్చింది. గత ఐదేళ్లలో ప్రభుత్వానికి రాయల్టీ చెల్లించకుండా 1.52 కోట్ల టన్నుల ఇనుప ఖనిజం ఎగుమతి అయినట్లు పిఏసి పరిశీలన ద్వారా వెల్లడించింది.

## మత హింస బిల్లు

దేశంలో మత, వర్ణ, కుల, ప్రాంత, జాతి వేర్పాటు ఉద్యమాలు వివిధ రూపాల్లో వ్యక్తమవుతున్న నిరసనలను నిరోధించేందుకు యుపిఏ ప్రభుత్వం 2011 మతతత్వం లక్ష్య హింసల (న్యాయం, పరిహారాల లభ్యత) నిరోధక బిల్లును రూపొందించింది. రాజ్యాంగ విరుద్ధంగా దేశ సమాఖ్య (ఫెడరల్) వ్యవస్థకు ఈ బిల్లు ద్వారా విఘాతం కులగుతుందని అనేక రాష్ట్రాలు ఆందోళన వ్యక్తం చేశాయి.

## తమిళనాడులో ఏడుగురు దళితుల కాల్చివేత

దక్షిణ తమిళనాడు రామనాథపురం జిల్లా పరమకుడిలో దళితులపై పోలీసులు కాల్పులు జరిపి ఏడుగురిని కాల్చిచంపారు. దళిత ఉద్యమ నేత ఇమాన్యుయేల్ శేఖరన్ వర్ధంతి సందర్భంగా సెప్టెంబర్ 11న శ్రద్ధాంజలి ఘటించేందుకు వెళ్లిన దళితులపై పోలీసులు కాల్పులు జరిపారు. కాల్పుల్లో వంద మంది వరకు గాయపడ్డారు. ఈ సంఘటనపై న్యాయవిచారణ జరిపించి బాధ్యులైన వారిని కఠినంగా శిక్షించాలని ప్రజలు, ప్రజాస్వామిక వాదులు, ప్రతిపక్ష నేతలు డిమాండ్ చేశారు. దీంతో హైకోర్టు రిటైర్డ్ జడ్జీతో ఈ ఘటనపై విచారణ జరిపించేందుకు జయలలిత ప్రభుత్వం ఒప్పుకుంది. వీ

## శ్రీలంకలో ఎమర్జెన్సీ ఎత్తివేత

శ్రీలంకలో దాదాపు ముప్పై ఏళ్లుగా కొనసాగుతున్న ఎమర్జెన్సీని రద్దు చేస్తున్నట్లు అధ్యక్షుడు మహేంద్ర రాజపక్సే ఆగస్టు 25న ప్రకటించారు. ఇక దేశంలో ఎమర్జెన్సీని కొనసాగించాల్సిన పరిస్థితి లేదని పార్లమెంట్‌లో తెలిపారు. ప్రత్యేకమైన చట్టాలను రద్దుచేసి ప్రజాస్వామ్య పద్ధతికి అనుగుణంగా చట్టాలను అమలులోకి తీసుకు రావాలని అసెంబ్లీకి ఆదేశాలు జారీచేస్తున్నట్లు రాజపక్సే తెలిపారు. ఎల్‌టిటిఇ నుంచి ప్రభుత్వానికి ముప్పు పొంచి ఉందని 1983లో శ్రీలంక ప్రభుత్వం ఎమర్జెన్సీ విధించింది.

## అఫ్ఘాన్ మాజీ అధ్యక్షుడి హత్య

అఫ్ఘాన్ మాజీ అధ్యక్షుడు బుర్హనుద్దీన్ రబ్బానీ (71) ని తాలిబన్లు ఆత్మాహుతి దాడితో చంపివేశారు. తాలిబన్లతో శాంతి చర్చలకు ప్రభుత్వం తరఫున ఏర్పాటు చేసిన శాంతి మండలికి రబ్బానీ సారథ్యం వహిస్తున్నారు. సెప్టెంబర్ 20న తాలిబన్ల తరఫున చర్చలకోసం ఇద్దరు వ్యక్తులు రబ్బాని ఇంటికి వచ్చారు. రబ్బాని వచ్చిన ఇద్దరు వ్యక్తులతో మాట్లాడుతుండగా ఒక వ్యక్తి తన తలపాగాలోని పేలుడు పదార్థాలను పేల్చుకోవడంతో రబ్బానీ అక్కడికక్కడే మృతిచెందారు. ఈ దాడిలో ఆత్మాహుతి సభ్యుడు, రబ్బానీ అంగరక్షకులు ముగ్గురు అక్కడికక్కడే మరణించారు. రబ్బానీ అనుచరుడు గాయపడ్డాడు.

## క్యూబాపై ప్రతీకార దాడులు

క్యూబాపై అమెరికా ప్రతీకార చర్యలకు పాల్పడింది. క్యూబా, ఇరాన్, సూడాన్‌లతో వాణిజ్య ఒప్పందాలపై అమెరికా విధించిన ఆకాంక్షలను ఉల్లంఘించినందుకు 8.83 కోట్ల డాలర్ల జరిమానాను చెల్లించినట్లు జెపి మోర్గాన్ ఛేజ్ ధ్రువీకరించింది. ఇతర బ్యాంకింగ్ సంస్థలు కూడా ఈ దిగ్బంధానికి సంబంధించి జరిమానాలు చెల్లించాయి. 50 సంవత్సరాలుగా క్యూబాపై ఉన్న ఆర్థిక దిగ్బంధన కొనసాగుతోంది.

## నేల రాలిన నాసా ఉపగ్రహం

అమెరికా అంతరిక్ష సంస్థ నాసా 1991లో ఈ ఆర్స్ ఉపగ్రహాన్ని ప్రయోగించింది. దీని నిర్మాణానికి 750 మిలియన్ డాలర్లు ఖర్చు అయ్యాయి. మొదట దీని సేవలను మూడు ఏళ్లపాటు ఉపయోగించుకోవాలని భావించినా, 14 ఏళ్ల అనంతరం 2005లో నాసా దీని సేవలను వాడుకోవడం ఆపివేసింది. ఆర్స్ ఉపగ్రహం హూస్టన్ కాలంమానం ప్రకారం సెప్టెంబర్ 23 రాత్రి11:23 గంటల నుంచి శనివారం తెల్లవారుజామున 1:09 గంటల మధ్య దాని శిథిలాలు హిందూమహా సముద్రం నడుమ, ఆఫ్రికాలను దాటి పసిఫిక్ మహాసముద్రంలో మారుమూల ప్రాంతంలో 500 మైళ్ల పరిధిలో పడిపోయాయని నాసా అధికారులు తెలిపారు.

## మార్పును కోరుతున్న చిలీ ప్రజలు

చిలీలో నయా ఉదారవాద విధానాలకు వ్యతిరేకంగా, ప్రభుత్వ విద్య కోసం డిమాండ్ చేస్తూ ఆగస్టు 24, 25 తేదీల్లో రెండు రోజుల జాతీయ సమ్మెతో లక్షలాది మంది చిలియన్లు రోడ్లమీదకొచ్చారు. దేశ వ్యాప్తంగా 6 లక్షల మంది సమ్మెలో పాల్గొన్నట్లు యూనియన్ నేతలు పేర్కొన్నారు. ఈ సందర్భంగా జరిగిన ఘర్షణలో కనీసం రెండు వందల మంది గాయపడినట్లు ప్రభుత్వ అధికారులు తెలిపారు.

## నేపాల్ ప్రధానిగా భట్టారాయ్

నేపాల్ ప్రధానిగా మావోయిస్టు పార్టీ ఉపాధ్యక్షుడు బాబురామ్ భట్టారాయ్ ఎన్నికయ్యారు. రాష్ట్రపతి భవన్‌లో దేశాధ్యక్షుడు రామ్‌బరణ్ యాదవ్ భట్టారాయ్‌తో ఆగస్టు 29న ప్రమాణ స్వీకారం చేయించారు. ఉప ప్రధానిగా, హోం మంత్రిగా ఎన్నికైన మదేశీ పార్టీల కూటమి నేత బిజయ్‌కుమార్ గచ్చాదర్ కూడా ప్రమాణ స్వీకారం చేశారు. శాంతి ప్రక్రియను పూర్తిచేయడానికి, జాతీయ సమైక్యతతో కూడిన ప్రభుత్వాన్ని ఏర్పాటు చేయడానికి కృషి చేస్తానని భట్టారాయ్ ప్రజలకు హామీ ఇచ్చారు.

## అమెరికాను కుదిపేసిన 'ఐరీన్'

అమెరికాను పెనుగాలులు, వర్షాలతో అతలాకుతలం చేసిన 'ఐరీన్' హరికేన్ వల్ల రు. 32 వేల కోట్ల (700 కోట్ల డాలర్లు) నష్టం సంభవించింది. దీని వల్ల న్యూయార్క్, న్యూజెర్సీలో ఎక్కువ ఆస్తి నష్టం జరిగినట్లు కెనెటిక్ అనాలసిస్ కార్పొరేషన్ అనే కన్సల్టింగ్ సంస్థ అ మేరకు ప్రాథమికంగా ఒక అంచనా వేసింది. హరికేన్ వచ్చిన బహమాస్, ప్యూయర్టోరికో, డొమికన్ రిపబ్లిక్ తదితర దేశాల్లో కూడా వేల కోట్ల ఆస్తి నష్టం జరిగిందని ఎఐఆర్ వరల్డ్‌వైడ్ కన్సల్టింగ్ కంపెనీ అంచనా వేసింది. ఐరీన్ కారణంగా 21 మంది చనిపోయారు. వీ

# అసహజ మరణాల సూచి

సంకలనం : రాంకి, వై. రామచంద్రం

మరణం ఎప్పుడయినా విషాద సూచకమే. మృతుల బంధువులకూ, మిత్రులకూ విచారకరమే కాని అందులోనూ మరణించిన మనిషి నిండు జీవితం గడిపి వయోభారంతోనే మరణిస్తే దాన్ని సహజ మరణంగా అంగీకరించి ఊరట పడవచ్చు. సగటు ఆయు ప్రమాణంలో సగం కూడా అనుభవించక ముందే మరణిస్తున్నారు. ఈ అసహజ మరణాలకు లెక్కలేనన్ని ఆర్థిక, సామాజిక, రాజకీయ కారణాలున్నాయి. మన పక్కనే మనతోనే ఉండే మనుషులు అర్ధాంతరంగా అసహజంగా అకాలంగా అదృశ్యమైపోతున్నారు. ఇటువంటి అసహజ మరణాలు ఇటీవలి కాలంలో విపరీతంగా పెరిగిపోతున్నాయి. ఇవి సామాజిక సంక్షోభానికి, సమాజం దిగజారుడుకు ఒక చిహ్నం. మన రాష్ట్రంలో సాలీనా ఈ రకంగా చనిపోతున్న వారి సంఖ్య వేలల్లోనే ఉంటుందని అంచనా. నిజానికి అసహజ మరణాలన్నీ అసహజ మరణాలుగా నమోదు కావడం లేదు గనుక ఈ సంఖ్య వాస్తవంలో ఒక భాగం మాత్రమే కావచ్చు. పత్రికలలో అచ్చయిన ఇటువంటి ఘటనలన్నిటినీ ఒక్కచోట నమోదు చేయాలని భావిస్తున్నాం. ఈ శీర్షిక ప్రతి నెల ఉంటుంది. అయితే రాష్ట్రంలో ప్రతి గ్రామంలో జరుగుతున్న సంఘటనలన్నీ ఇక్కడ రిపోర్ట్ కాకపోవచ్చు. కొన్నయినా మనల్ని ఆలోచింపజేస్తే, మనం మనచుట్టూ ఉన్న మనుషులకోసం ఇంకాస్త బాధ్యతగానూ, జాగ్రత్తగాను వ్యవహరిస్తూ మొత్తంగా పరిష్కారాలవైపు వెళ్లడానికి ఏమయినా తోడ్పడితే ఈ శీర్షిక విజయవంతమైనట్లే.

**(21 ఆగస్ట్ 2011 నుండి సెప్టెంబర్ 20 2011 వరకు 16 జిల్లాలలో అసహజ మరణాల పాలైన వారి సంఖ్య – 1974)**

| జిల్లా | ఆకలి | ఆత్మహత్యలు | | | | చికిత్స అందక, అనారోగ్యం | | | గుర్తు తెలియని | | హత్యలు | | ప్రమాదాలు | | | | పోలీసు కాల్పుల్లో | | పోలీసులు, సైన్యం | మిస్సింగ్/ లాకప్ మరణాలు | ప్రకృతి వైపరీత్యాలు |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | వ్యవసాయ రంగం | చేనేత రంగం | ఇతరాలు | | | | | | | | | పనిచేసే స్థలంలో | కరెంట్ | రహదారి | ఇతరాలు | ఉద్యమ కారులు | ఇతరులు | | | |
| | | | | స్త్రీ | పు. | స్త్రీ | పు. | పి. | స్త్రీ | పు. | స్త్రీ | పు. | | | | | | | | | |
| (1) | (2) | (3) | (4) | (5) | (6) | (7) | (8) | (9) | (10) | (11) | (12) | (13) | (14) | (15) | (16) | (17) | (18) | (19) | (20) | (21) | (22) |
| ఆదిలాబాద్ | 1 | 3 | – | 24 | 22 | 16 | 22 | 15 | 3 | 3 | 1 | 1 | 2 | 1 | 23 | 30 | – | – | – | 2 | 2 |
| హైదరాబాద్ | – | – | – | 12 | 17 | – | – | – | – | 5 | 9 | 7 | – | 6 | 23 | 18 | – | – | – | 3 | |
| కరీంనగర్ | – | 9 | 1 | 24 | 37 | 14 | 23 | 6 | 1 | 14 | 3 | – | 2 | 8 | 12 | 25 | – | – | – | 12 | – |
| ఖమ్మం | – | – | – | 6 | 13 | 6 | 8 | 4 | 1 | 8 | 6 | 8 | 2 | 2 | 17 | 31 | – | – | – | – | 4 |
| మహబూబ్‌నగర్ | – | 11 | – | 15 | 9 | 4 | 15 | 6 | 1 | 19 | 7 | 11 | 40 | 13 | 27 | 11 | – | – | – | 3 | – |
| మెదక్ | – | 4 | – | 17 | 17 | 3 | 6 | 5 | 4 | 3 | 7 | 2 | 2 | 14 | 36 | 31 | – | – | – | – | – |
| నల్గొండ | – | 4 | – | 12 | 10 | 11 | 6 | 1 | – | 6 | 3 | 4 | 4 | 10 | 44 | 33 | – | – | – | 2 | – |
| నిజామాబాద్ | – | – | – | 7 | 11 | 4 | 2 | 2 | – | 1 | 2 | 5 | 1 | 3 | 7 | 29 | – | – | – | – | – |
| రంగారెడ్డి | – | 3 | – | 7 | 23 | 6 | 10 | 3 | 2 | 11 | 8 | 9 | 3 | 8 | 44 | 19 | – | – | – | – | – |
| వరంగల్ | – | 2 | – | 8 | 7 | 12 | 9 | 3 | 2 | 3 | – | – | – | 16 | 20 | 8 | – | – | – | – | 6 |
| అనంతపూర్ | – | 13 | 2 | 21 | 21 | 11 | 9 | 5 | 5 | 10 | 10 | 10 | 9 | 12 | 59 | 13 | – | 1 | – | – | – |
| చిత్తూరు | – | – | – | 8 | 5 | 4 | 7 | – | 2 | 5 | 8 | 4 | 15 | 2 | 23 | 2 | – | – | – | – | – |
| గుంటూరు | – | – | – | 3 | 5 | – | 3 | – | 1 | 2 | 4 | 2 | 1 | 1 | 11 | 11 | – | – | – | – | – |
| నెల్లూరు | – | – | – | 3 | 1 | – | – | – | 1 | – | – | 1 | – | 5 | 26 | 10 | – | – | – | – | – |
| కర్నూలు | – | 6 | – | 11 | 13 | 4 | 6 | 15 | 8 | 6 | 2 | 5 | 7 | 5 | 35 | 27 | – | – | – | – | |
| విజయనగరం | – | 1 | – | 4 | 6 | 3 | 2 | 5 | 3 | 4 | – | – | – | – | 28 | 9 | – | – | – | – | 4 |
| మొత్తం | 1 | 56 | 3 | 182 | 217 | 70 | 128 | 70 | 34 | 100 | 70 | 69 | 88 | 106 | 429 | 307 | – | 1 | – | 22 | 21 |

అందిస్తున్నవారు : ఆదిలాబాద్ – సి.ఎచ్. శ్రీమన్నారాయణ మూర్తి; హైదరాబాద్ – డి. విజయభాస్కర్; కరీంనగర్ – ఎల్. సంతోష్; ఖమ్మం – సి.ఎచ్. గిరిజ; మెదక్ – ఎన్. భగవాన్‌రెడ్డి; మహబూబ్‌నగర్ – మహమ్మద్ ఎక్బాల్; నల్గొండ – గౌడిశాల వెంకటేశ్వర్లు; నిజామాబాద్ – ఎం. నర్సయ్య; రంగారెడ్డి – ఎస్. శంకరయ్య; వరంగల్ – ఎ.కుమార్; అనంతపూర్ – కె. నాగేశ్వరచారి; చిత్తూరు – పలమనేరు బాలాజి; కడప – దస్తగిరి; కర్నూలు – జి.వి. సుధాకర్ రెడ్డి; తూర్పు గోదావరి – మహమ్మద్ ఇబ్రహీమ్ సాహెబ్; గుంటూరు – బి. అంజమ్మ ; నెల్లూరు – బాలగురువయ్య; శ్రీకాకుళం – జి. సుధీర్; ప్రకాశం – ఎల్. సాంబశివరావు, విజయనగరం – డి. సుధాకర్

# మీ గ్రంథాలయానికి వీక్షణం వస్తోందా!

**వీక్షణం మిత్రులకు, శ్రేయోభిలాషులకు విజ్ఞప్తి!**

*మీ గ్రామంలో, మండలంలో, జిల్లా కేంద్రంలో,*
*మీకు తెలిసిన విద్యా సంస్థలలో ఉన్న*
*గ్రంథాలయాలలో వీక్షణం పత్రిక వస్తోందా?*
*రాకపోతే అక్కడి పాఠకులకు వీక్షణం అందించే బాధ్యత మీదే.*

*మీ వంతుగా ఇటు వీక్షణం మనుగడకు,*
*అటు సామాన్య పాఠకులకు అందుబాటులోకి*
*తీసుకువెళ్లడానికి సహకారం అందించండి.*

*ఇప్పటికే ఇలా గ్రంథాలయాలకు వీక్షణం చందా కానుకగా ఇస్తూ*
*సహకారం అందిస్తున్న మిత్రులలో మీరూ ఉంటారని ఆశిస్తున్నాం!*

**చందా వివరాలు**

| | సంస్థలకు/లైబ్రరీలకు | వ్యక్తులకు | విద్యార్థులకు |
|---|---|---|---|
| విడి ప్రతి | రు. 15 | రు. 15 | రు. 15 |
| సంవత్సరం | రు. 180 | రు. 150 | రు. 120 |
| మూడు సంవత్సరాలు | రు. 500 | రు. 400 | రు. 350 |
| ఐదు సంవత్సరాలు | రు. 800 | రు. 650 | - |
| పది సంవత్సరాలు | రు. 1500 | రు. 1300 | - |

వీక్షణం అకౌంట్ నెంబర్ - 013911011002175, ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్
'వీక్షణం' పేరిట ఎం.ఓ.లు, డి.డి లు పంపాల్సిన చిరునామా


**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : veekshanam2003@gmail.com


వీక్షణంను ఈ సైట్‌లో చూడొచ్చు, చదవవచ్చు **www.veekshanam.wordpress.com**

VEEKSHANAM Telugu Monthly Journal of Political Economy and Society - 123 -October 2011 • ISSN 2231-6892
• RNI Regn.No.APTEL/2003/11482• Published on 29/09/2011 • Postal Regn. No. L II/RNP/HD/1100/2011-13

# వీక్షణంకు చేయూతనివ్వండి...

మీ ఆదరాభిమానాలతో త్వరలో పదో సంవత్సరంలో అడుగుపెడుతున్న వీక్షణం మీరు మరింత సహాయం అందించకపోతే ఎక్కువకాలం నడవడం కష్టం...

ఔను, వీక్షణం నష్టాలతో నడుస్తున్నదని, ఉత్పత్తి వ్యయం కూడ తిరిగి రావడం లేదని, ఆర్థిక పరిస్థితి నానాటికీ క్షీణిస్తున్నదని గత కొంతకాలంగా చెపుతూనే ఉన్నాం. అది ఇంకా విషమించింది. వీక్షణం నాలుగు కాలాల పాటు సజావుగా నడవడానికి ఇప్పటికే వందలాది మంది అభిమానులు తమ శాయశక్తులా ప్రయత్నిస్తున్నప్పటికీ, ఆ సహాయం చాలడం లేదు. సహాయం ఇతోధికంగా పెరగకపోతే వీక్షణం ఎక్కువకాలం మనగలగడం కష్టం.

వీక్షణం మీ పత్రిక. ప్రజల పత్రిక. ప్రజలకు అవసరమైన పత్రిక. ఇది ఆగిపోకుండా కాపాడండి.

- ❖ ప్రతి పాఠకుడూ/పాఠకురాలూ కనీసం మరొకరికి వీక్షణాన్ని పరిచయం చేయండి.
- ❖ ప్రతి చందాదారూ కనీసం మరొకరిని చందాదారుగా చేర్పించండి.
- ❖ మీకు తెలిసిన కళాశాలలు, కార్యాలయాలు, గ్రంథాలయాలు, ప్రజా సంస్థలు వీక్షణంను తెప్పించేలా చూడండి.
- ❖ మీ గ్రామంలో, పట్టణంలో న్యూస్ ఏజెంట్ దగ్గర వీక్షణం అమ్మేలా చూడండి

**ఇవన్నీ వీక్షణం ప్రచురిస్తున్న భావాలు ప్రచారం చేయడానికి. కాని వీక్షణం ఆర్థిక పరిపుష్టికి అవి మాత్రమే సరిపోవు. వ్యాపార, ప్రచార ప్రకటనలు లేకుండా పత్రికలేవీ మనుగడ సాగించలేవు. వీక్షణంకు మీకు తెలిసిన వ్యక్తులనుంచీ, సంస్థల నుంచీ ప్రకటనలు సంపాదించండి. కళాశాలలు, వైద్యశాలలు, ఆస్పత్రులు, దుకాణాలు, వ్యాపార, పారిశ్రామిక సంస్థలు, గ్రామ స్థాయి నుంచి రాష్ట్ర స్థాయి దాకా పాలక సంస్థలు, దాతలు... సంస్థల బాధ్యులు, వ్యక్తులు ఎవరి నుంచి ఐనా సరే...**

- ❖ జీవిత చందాలు, కానుకగా చందాలు, విరాళాలు సేకరించండి.
- ❖ ప్రకటనలు సేకరించండి.

**ప్రతినెలా కనీసం మూడు పేజీల ప్రకటనలు ఉంటేనే వీక్షణం ఆర్థిక స్థితి ఏనెలకానెల అన్నట్టు సాగుతుంది. తెలుగు సమాజం తనతో తాను జరుపుకుంటున్న సంభాషణ ఆగిపోకుండా మీ వంతు సాయం చేయండి.**

మీ సహకారం అందించాల్సిన చిరునామా :

**వీక్షణం**

మైత్రి రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3 హిమాయత్‌నగర్
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
ఇమెయిల్ : veekshanam2003@gmail.com, www.veekshanam.wordpress.com

Edited, printed, published and owned by N. Venugopal Rao, Printed at Deccan Press for Charitha Impressions, Azamabad, Hyderabad - 500 020
and Published at 3-6-394, Mythri Residency, Street No. 3, Himayatnagar, Hyderabad 500 029. Editor : N. Venugopal Rao